# ఆంధ్రపత్రిక

## పరాభవ సంవత్సరాది సంచిక

[ఏబది ఆఱవ సంచిక]

[1966 - 67]

★

సంపాదకులు:
శివలెంక శంభుప్రసాద్

★

వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Suppliment to Andhra Patrika issue dated 23-3-1966 (Regd. No M 1118.)

| సంచిక 56 | # పరాభవ సంవత్సరాది సంచిక | సంవత్సరము 1966–67 |
|---|---|---|

## విషయానుక్రమణిక



## త్రివర్ణ చిత్రములు :

# INDEX TO ADVERTISERS



భీష్ముని కౌరవసేనకు అధిపతిని చేయుట

'మొగలు చిత్రము —అక్బరు చక్రవర్తి యొక్క సొంత రాజంనామా లోని యొక త్రివర్ణ చిత్రమునుండి

[''ఆంధ్రపత్రిక'' విభవ సంవత్సరాది సంచికనుంచి,]

# ఓమ్

# ప్రస్తావన

"ప్రజానీకానికి సాంఘిక ఆర్థిక న్యాయాన్ని ప్రాప్తింప చేయాలన్నప్పుడు, రాజకీయ నాయకులకు సాంఘికతత్త్వవేత్తలకు మధ్య నిర్మాణాత్మకమైన చర్చలు " జరగడం అనేది అవసరం. మనదేశంలో నేడు అలాంటి చర్చలు జరగడంలేదు. సాంఘిక తత్త్వవేత్తలు విడిగా, దూరంగావుంటూ వ్యవహరించడం జరుగుతున్నది సాంఘికతత్త్వ విచారణ, రాజకీయ కార్యకలాపముల ఏకీకరణ జరిగినప్పుడే, సాంఘిక పరివర్తనలు అనేవి ప్రాప్తిస్తాయి. అంతేగాని కేవలం శాసనాలు చేయడంవలన అవిరావు అందుకని సంఘ సౌశీల్యము అనేదానిని ఉద్దీపింపచేయాలి. సాంఘిక పరివర్తనలు రావడానికి ప్రజలు ప్రభుత్వంమీద, శాసనాలమీద ఎక్కువగా ఆధారపడుతున్నారు. ప్రజానీకాన్ని ప్రబోధించే బాధ్యతను సాంఘిక తత్త్వవేత్తలు వహించాలి. ప్రజలలో ధర్మ జిజ్ఞాసను మేల్కొల్పాలి. ప్రజాస్వామ్య ప్రసాదితమైన విలువలు, సెక్యులరిజము నిలువవలెనంటే ప్రజలలో ఇది అవసరము" సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవీ విరమణ సందర్భంలో ఇచ్చిన వీడ్కోలుసభలో ఉపన్యసిస్తూ శ్రీ గజేంద్రగడ్కర్ చెప్పిన మాటలు ఇవి.

శ్రీ గజేంద్రగడ్కర్ నేటి స్థితిని ఛాయాచిత్రంలాగచిత్రించారు. ప్రస్తుతం మనదేశంలో రాజకీయ నాయకులు అనగానే కాంగ్రెస్ నాయకులు స్ఫురణకు వస్తారు. ఎందుకనంటే, గత ఏభై ఏండ్లుగా భారత రాజకీయాలనువారే రూపొందించడం, నడపడం జరుగుతూంది. స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి, అంటే పద్దెనిమిది సంవత్సరాలుగా ఎదురు, అదుపు లేకుండా రాజ్యాధికారాన్ని వీరు చలాయిస్తున్నారు. ప్రజా జీవితంలో ప్రభుత్వాధికారం పరిమితి లేకుండా పరివ్యాప్తమైపోయింది.

ఈ కాంగ్రెసువారికి, ఈ సాంఘిక తత్త్వవేత్తలకు శ్రీ గజేంద్ర గడ్కర్ చెప్పినటువంటి నిర్మాణాత్మకమైన సంభాషణలు జరుగుతున్నాయా? లేదనే వారి ఉపన్యాసం స్పష్టం చేస్తున్నది అసలు సంఘతత్త్వవేత్త అనే అతను వీరికి దూరమై ఎందుకు వుండవలసి వస్తున్నది. ఈ ప్రశ్నలకు సమాధానం ఒకటే అనిపిస్తోంది అది ఇది.

కాంగ్రెసు రాజకీయ నాయకులలో అధికారంలోవున్న మంత్రులకుగాని, పార్టీ అధిష్ఠానవర్గంలోవుండే పెద్దలకుగాని ఈ సాంఘికతత్త్వ విచారణం అనేది శూన్యం దీనికి కారణం ఏమిటి అనేదే విచారించడం అవసరం. పూర్వం కాంగ్రెసు పెద్దలు ఉన్నారంటే, పెద్ద విశేషమైన సాంఘికతత్త్వవేత్తలు కాకపోయినా కనీసం తమ వృత్తులలో విద్యావంతులైనవారుగా ప్రతిభావంతులైన వారుగా ఉండేవారు. దేశభక్తి, త్యాగనిరతి ప్రధానంగా ఉండేవి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నానాటికి వారివంటివారు తగ్గిపోయి కేవలం నీతిబాహ్యులైనవారు వస్తున్నారు. ఇందుకు కూడా కారణం తెలుసుకోవలసివుంది.

ప్రజా ప్రభుత్వంలో న్యాయానికి ఉత్తమశ్రేణికి చెందిన వారు అధికారంలోకి రావలసివుంది. అంటే ప్రజలు స్వాభావికంగా అలాంటివారినే ప్రతినిధులుగ ఎన్నుకోటం జరుగుతుందని నమ్మకం. కాని అలా జరగటంలేదు. ఇందుకు కారణం కాంగ్రెసు వారు చేసే అభ్యర్థుల నిర్ణయం. అధిష్ఠానవర్గంపెద్దలు తమకు అనుకూలంగా ఉండేవారినే తెచ్చుకుంటున్నారు. అధిష్ఠానవర్గంలోని పెద్దలే కనుక ఉత్తమశ్రేణికి చెందినవారైతే అభ్యర్థులను కూడా అటువంటివారినే తెచ్చుకొనేవారు కాని ఇప్పుడు నాయకులు అటువంటివారు కాకపోవడంవలన ఈ తెచ్చుకొనడం ఒకసూత్రాన్ని బట్టి, ఒక సిద్ధాంతాన్నిబట్టికాక తమని అధికారంలో ఉంచేవారిని, తమ చెప్పుచేతలలోవుండేవారిని మాత్రమే తెచ్చుకుంటున్నారు. ఇది పూర్తిగా కులతత్త్వంమీద ఆధారపడి, సాంఘికతత్త్వ విచారణా దృక్పథంలేక, అధికారంకోసం, అధికారాన్ని పంచుకొనేందుకు చేసే స్థితికి దిగజారిపోయింది.

"This trend lies in the gradual displacement of highly educated, intellectual and the talented persons from the leadership of the congress and the other political parties and the rise of a 'plebeian leadership Social distance between different caste groups has generated unbridled group rivalry and group competetion in the political field . Politics in Southern India is largely conditioned by this characteristic feature of caste rivalry. Some Political leaders have emerged in recent times from that part of India who merely represent certain castes and caste was the only factor behind their rise to political power Likewise different pressure groups have been successful in making headway for their representatives to rise to the status of political leaders Obviously the importance of these leaders remains limited to a certain field or interest and can hardly go up to the national level. (Sri Ranjith Chaudhuri on "Indian Democracy and the crisis of Leadership." Quest. Issue 48)

మంత్రివర్గాల నిర్మాణంకూడా కుల ప్రాతినిధ్యసూత్రాలమీదే జరుగుతోంది.కాంగ్రెసుకుపూర్వం ప్రబలశత్రువులైనవారిని కాంగ్రెసు

లోనికి తీసుకొనిరావడం, వారికికాంగ్రెసులో ప్రముఖపాత్రఇవ్వడము, అధికారం వారే చలాయించడమూ జరుగుతోంది. పార్టీలో నిజంగా సాంఘికతత్వ విచారణా దృక్పథంకలవారు వున్నా, లేదా, అటు వంటివారి సహకార సామర్థ్యాలు సాధించుకున్నా నేటి ఈ పరిస్థితి ఉండేదికాదు. అందుకనే వీరు ప్రజలను మభ్యపెట్టడానికి, అవి ఇప్పటి సంఘం అనే క్షేత్రంలో పాదుకొనజాలవని తెలిసి కూడా, వివాదాలనే తీర్మానాలుగా పెడుతూ, ఆ తీర్మానాలను శాసనాలుగా మారుస్తున్నారు. దేశంలో నిజమైన సాంఘిక పరివర్తనలు రావడం లేదంటే, అందుకు ఇదే కారణం. ప్రజలలోసాంఘిక సౌశీల్యాన్ని ఈ నాయకత్వం ప్రవేశపెట్టలేకపోతున్నది. తమ ప్రమాణాలనుకూడా న్యూనపరచుకొనడమేకాక, ప్రజల సాంఘిక ప్రమాణాలనుకూడా న్యూనపరుస్తున్నారు సామాన్య ప్రజానీకానికి ఈ మంత్రులు నాయకులు ఆదర్శస్థానీయులు కాలేకపోతున్నారు ఆధునిక ప్రజాస్వామ్య ప్రభుత్వంలో నాయకులయొక్క నడవడికను బట్టే ఆదర్శాలు ఏర్పడుతూ వుంటాయి నడవడికలో ఎప్పుడైనా, ఎక్కడైనా సత్ప్రవర్తన ప్రధానమైన విషయం ఈ రెంటియందు గౌరవం తగ్గినప్పుడు, అన్నీ తగ్గుముఖంపడుతున్నాయి ఈ స్థితిని చూసే శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి మహాత్మాగాంధీ సమాధిని చూచి నప్పుడల్లా తనకు కళ్లనీళ్లు వచ్చేవి అన్నారు శ్రీ శాస్త్రి అన్న ఈ మాటలలో పూర్వపు పెద్దల నాయకత్వానికిన్ని, ఇప్పటి నాయకత్వానికిన్నీవున్న తారతమ్యం తెలుస్తూవుంది. శ్రీ ఎం. ఎన్ రాయ్ ఎప్పుడో ఈ విషయాన్ని చెప్పారు. "Good institutions cannot succeed in an atmosphere where man cannot be good or have to suffer for being good"

రాజకీయవేత్తలకు ఒక్క సాంఘికతత్వ విచారణ అన్నదే లేకపోతున్నది. కాని మన రచయితలకు సాంఘికతత్వ విచారణ ఒక్కటే **కాక, రాజకీయతత్వ విచారణ కూడాలేదు. ఈ మాట** అనటం సాహసమే కావచ్చు. కాని వాస్తవ పరిస్థితి ఇది. నేడు దేశంలోవస్తున్న రచనలే ఈ స్థితికి నిదర్శనం. దేశంలో స్వాతంత్ర్యంకోసం పెద్ద ఉద్యమం నడిచింది. దేశం విభక్తమైనప్పుడు ప్రజలు యమ యాతనలు పడ్డారు దేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. వీనిని అన్నింటినీ సాహిత్యంలో సమగ్రంగా ప్రదర్శించిన గ్రంథంఅంటూ ఏదన్నా వచ్చిందా? రాజకీయరంగంలో ఏ రకమైన కృత్రిమస్థితి **ఏర్పడిపోయిందో, సాహిత్యంలోకూడా ఆ రకమైన పరిస్థితే** ఏర్పడిపోయింది ఆ రంగంలో ఎట్లాగో ఈ రంగంలో **కూడా** అట్లాగే పెద్దలు సత్ప్రమాణాలను పెట్టలేక పోతున్నారు. రాజకీయరంగంలో అధికారం అంటే వ్యామోహం అధికమైతే, సాహిత్యరంగంలో అధికారంలో వున్నవారి ప్రాపు సంపాదించాలనే వ్యామోహం ఎక్కువైంది. దేశంలో ఇప్పుడు సాహిత్య కార్యకలాపం అంటే అకాడమీఅవార్డుల సంపాదనకు వ్యూహాలు పన్నడం, అంకితాలకు రాజకీయ నాయకులను "వర్యు"గా ఎంచడం, ఆవిష్కరణోత్సవాలకు ఆహ్వాన సన్మాన సంఘాలను నిర్మించుకొనడం పద్ధతిలో కొనసాగుతున్నది. ఏ కొద్దిమందో నిజమైన సాహిత్య కృషి చేస్తున్నా, సాంఘిక తత్వవేత్తలను రాజకీయవేత్తలు దరికి రానీయనివిధంగానే, ఈ నవసాహితీపరులు నిజమైన సాహితీపరులను తమదరికి రానీయడంలేదు. రాజకీయ వేత్తలు, సాహితీపరులమనుకొనేవారు, సినిమా "స్టారులు", తారలు వెంట పడుతున్నారు. పూర్వం రాజులు కవిత్వపోషణం చేసిన తీరుగ ఇప్పుడు ఇది అంతా కూడా కవిత్వ పోషణ, కళాపోషణ అనే రాచరికపుభావం మంత్రులలో, నాయకులలో పాతుకుపోతున్నది. ఈ స్థితి తొలగితేనేకాని మన సాహిత్యం బాగుపడదు. అభివృద్ధి చెందదు. రచయిత స్వతంత్రుడై, స్వతంత్రంగా వూహ చేయగల స్థితిలోనికిరాడు. స్వాతంత్ర్యానికిపూర్వం దేశంలో నాయకులు ఎట్లా ఉన్నత ప్రవర్తన కలిగివుండేవారో, అట్లాగే రచయితలు కూడావున్నారు. ఉత్తమ రచనలు చేశారు. స్వాతంత్ర్యం తర్వాత నాయకత్వం ఏ తీరులోవున్నదో సాహిత్యంకూడా ఆ తీరులోనే వున్నది స్వాతంత్ర్యం రాని రోజుల్లో, రాజకీయవేత్తలు సాహిత్యం జోలికిపోలేదు. ఇట్లా రాయాలి, అట్లా రాయాలి అని చెప్పలేదు. అప్పుడు అట్టహాసాలతో కూడిన అంకితాలు, ఆవిష్కరణలు లేవు. ఇప్పుడు ఇవన్నీ వచ్చాయి. రాజకీయవేత్త, విమర్శకుడు—ఆలంకారికుడు—సాహిత్య సిద్ధాంత నిర్మాత—పోషకుడూ—బహుమతులు ఇప్పించేవాడూ అయిపోయినాడు. పూర్వం రాజులకాలంలో మన సాహిత్యం పతనావస్థ ఇదేవిధంగా ప్రారంభమైంది. తిరిగి దేశంలో క్రొత్త పరిస్థితి ఏర్పడినప్పుడు క్రొత్త సాహిత్యం పుట్టింది. ఇప్పుడు తిరిగి ఆ రాజులను పోలిన, రాజకీయవేత్తలురాగా, సాహిత్యం పతనం చెందింది. ఈ పతనంనుంచి, సాహిత్యం తిరిగి బయటపడి ఉద్దీప్తిని పొందాలంటే, రాజకీయవేత్తలకు, సాహితీపరులు దూరంగా వుండాలి. సాహిత్యంలో అనభిజ్ఞులైన రాజకీయవేత్తలు జోక్యం పెట్టుకోకూడదు. మంత్రి అయినంతమాత్రాన మనిషి కాడు. ఆ స్థితిని చేకూర్చుకోగలిగినప్పుడే తిరిగి మన సాహిత్యంలో వసంతోదయము అవుతుంది. కొత్త ఉగాది వస్తుంది.

# శ్రీ సుభగోదయ స్తుతిః

## శ్రీ గౌడపాదాచార్య కృతమ్

[శంకరుని గురువు గోవిందభగవత్పాదుడు ఆయనకు గౌడపాదుడు గురువు గౌడపాదుడు మాండూక్యకారికలేగాక, 'శ్రీసు భగోదయస్తుతిః' యను గ్రంథమును గూడ రచించెను మాకు తెలిసినంతలో ఇంతదనుక నది ప్రకటితమైనజాడ కన్పించదు కాని ఇందలి శ్లోకములు 'కామకళావిలాస' వ్యాఖ్యానమునందును, శంకరుని 'సౌందర్యలహరి' పై రచింపబడిన వ్యాఖ్యానములందును అటనట ఉదహరింపబడియున్నవి ఇట్లుదహరింపబడిన శ్లోకములు గూడ పదిపండ్రెంటికిమించి లేవు కాని యీ స్తుతి 52 శ్లోకముల గ్రంథము మరియు సంస్కృతమున "లహరు"లకు ఇదియే ఆదిమ గ్రంథమేమో యని కూడ యనిపించుచున్నది ఆ గ్రంథమును సర్వమును ఇప్పుడు ఆంధ్రలోకమునకు అందజేయుచున్నాము ]

—సం ]

భవానీ త్వాం వన్దే భవమహిషి సచ్చిత్సుఖవపుః
పరాకారాం దేవీ మమృతలహరీ మైన్దవకలామ్।
మహాకాలాతీతాం కలితసరణీకల్పితతనుం
సుధాసిన్ధో రన్తర్వసతి మనిశం వాసరమయీమ్॥

మనస్తత్త్వం జిత్వా నయన మథ నాసాగ్రఘటితం
పునర్వ్యావృత్తాక్ష స్స్వయమపి యదా పశ్యతి పరామ్।
తదానీ మేవాస్య స్ఫురతి బహిరన్త ర్భగవతీ
పరానందాకారా పరశివపరా కాచి దపరా॥

మనోమార్గం జిత్వా మరుత ఇహ నాడీగణజుషో
నిరుధ్యార్కం సేందుం దహనమపి సంజ్వాల్య శిఖయా
సుషుమ్ణాం సంయోజ్య శ్లథయతి చ షడ్గ్రంథి శశినం
తవాజ్ఞా చక్రస్థం విలయతి మహాయోగి సమయీ ॥

యదా తౌ చంద్రార్కౌ నిజసదన సంరోధనవశా
దశక్తౌ పీయూష స్రవణహరణే సాచ భుజగీ ।
ప్రబుద్ధాతుక్రుద్ధా దశతి శశినం బైన్దవగతం
సుధాధారాసారైః స్నపయసి తనుం బైన్దవకలే॥

పృథివ్యాపస్తేజః పవనగగనే తత్ప్రకృతయః
స్థితా స్తన్మాత్రాస్తా విషయదశకం మానసమితి।
తతోమాయా విద్యా తదనుచ మహేశః శివ ఇతః
పరం తత్త్వాతీతం మిళితవపు రిందోః పరకళా॥

కుమారీ యన్మంద్రం ధ్వనతి చ తతోయోషిదపరా
కులం త్యక్త్వా రౌతి స్ఫుటతి చ మహాకాల భుజగీ।
తతః పాతివ్రత్యం భజతి దహరాకాశకమలే
సుఖాసీనా యోషా భవసి భవసీత్కారరసికా॥

త్రికోణం తే కౌలాః కుల గృహ మితి ప్రాహు రపరే
చతుష్కోణం ప్రాహుః సమయిన ఇమే బైందవమితి!
సుధాసింధౌ తస్మి న్సురమణిగృహే సూర్యశశినో
రగమ్యే రశ్మీనాం సమయసహితే త్వాం విహరసే!!

త్రిఖండం తే చక్రం శుచిరవిశశాంకాత్మకతయా
మయూఖైః షట్త్రింశద్దశయుతతయా ఖండకలితైః!
పృథివ్యాదౌ తత్త్వైః పృథగుదితవద్భిః పరివృతం
భవే న్మూలాధారా త్ప్రభవతి తవ షట్చక్ర సదనమ్!!

శతంచాష్టౌ వహ్నేః శతమపి కలాః షోడశ రవేః
శతంషట్ చ త్రింశ త్త్రితమయమయూఖా శ్చరణజాః!
య ఏతే షష్టిశ్చ త్రిశత మభవం స్త్వచ్చరణజా
మహాకాలై స్తస్మాన్నహి తవ శివే కాలకలనా!!

త్రికోణేచాధారం త్రిపురతనుతేఽ ష్టారమనఘే
భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్!
దశారం తే సంవిత్కమల మథ మన్వశ్రక ముమే
విశుద్ధం స్యా దాజ్ఞా శివఇతి తతో బైందవగృహమ్!!

త్రికోణే తే వృత్త త్రితయ మిభకోణే వసుదళం
కలాశ్ర మిశ్రౌ రే భవతి భువనాశ్రేచ భువనమ్!
చతుశ్చక్రం శైవం నివసతి భగే శక్తికముమే
ప్రధానైక్యం బోధా భవతి చ తయోః శక్తిశివయోః!!

కలాయాం బిందైక్యం తదను చ తయో ర్నాదవిభవే
తయో ర్నాదేనైక్యం తదను చ కలాయా మపి తయోః
తయోర్బిందావైక్యం త్రితయమపి భవైక్యం పరశివే
తదేవం షోఢైక్యం భవతి హి సపర్యాసమయినామ్!!

కళానాదో బిందుః క్రమశ ఇహ వర్ణాశ్చ చరణం
షడబ్జంచాధార ప్రభృతిక మమీషాం చ మిలనమ్!
తదేవం షోఢైక్యం భవతి ఖలు యోషాం సమయినాం
చతుర్ధైక్యం తేషాం భవతి హి సపర్యా సమయినామ్!!

తటిల్లేఖామధ్యే స్ఫురతి మణిపూరే భగవతీ
చతుర్ధైక్యం తేషాం భవతిచ చతుర్బాహు రుదితా!
ధనుర్బాణా నిక్షూద్భవ కుసుమజా నంకుశవరం
తథా పాశం బిభ్రత్యుదిత రవి బింబాకృతిరుచిః!!

## శ్రీ సుభగోదయస్తుతిః



భవత్యైక్యం షోఢా భవతి భగవత్యాః సమయినాం
మరుత్వత్కోదండద్యుతినియుత భాసాసమరుచి ।
భవత్యాణేర్వాతో దశవిధ ఇతీదం మణిపురే
భవాని ప్రత్యక్షం తవ వపు రుపాస్తే నహి పరమ్॥
(ఇ త్యై క్య ని రూ ప ణ మ్)

భవాని శ్రీ హస్తైర్వహసి ఫణిపాశం సృణి మథో
ధనుః పౌండ్రం పౌష్పం శర మథ జపస్రక్పుస్తకవరౌ ।
అథ ద్వాభ్యాం ముద్రా మభయవరదానైకరసికాం
క్వణద్వీణాం ద్వాభ్యాం త్వ మురసి కరాభ్యాం చ బిభృషే॥

త్రికోణై రష్టారం త్రిభిరపి దశారం సముదభూ
ద్దశారం భూగేహా దపి చ భువనాశ్రం సమభవత్ !
తతోఽభూన్నాగారం నృపతిదళ మస్మాత్ త్రివలయం
చతుర్ద్వాః ప్రాకార త్రితయ మిద మేవాంబ శరణమ్॥

చతుః షష్టి స్తంత్రాణ్యపి కులమతం నిందిత మభూ
ద్యదేత న్మిశ్రాఖ్యం మతమపి భవేన్నిందిత మిహ ।
శుభాఖ్యాః పంచైతాః శ్రుతి సరణిసిద్ధాః ప్రకృతయో
మహావిద్యా స్తాసాం భవతి పరమార్థా భగవతి॥

స్మరో మారో మారః స్మరఇతిపరో మారమదన
స్మరానాంగశ్చేతి స్మరమదనమారాః స్మర ఇతి!
త్రిఖండః ఖండాంతే కలితభువనే శ్యక్షరయుత
శ్చతుః పంచార్ణా స్త్రితయ ఇతి పంచాక్షరమనుః॥

త్రిఖండే త్వన్మంత్రే శశిసవితృ వహ్న్యాత్మకతయా
స్వరాశ్చంద్రే లీనాః సవితరి కలాః కాదయ ఇహ!
యకారాద్యా వహ్నావథ క్షయుగం బైందవగృహే
విలీనం సాదాఖ్యే శివయువతి నిత్యైందవకలే॥

కకారాకారాభ్యాం స్వరగణమవష్టభ్య నిఖిలం
కలా ప్రత్యాహారా త్సకల మభవత్ జ్ఞానగణః!
త్రిఖండే స్యాత్ప్రత్యాహరణ మిద మన్వక్షయుగం
కకారశ్చాకారోఽక్షరతనుతయా చాక్షర మితి॥

విదేహాన్వాపత్యం శ్రుతి ఇహ ఋషి ర్యస్యచ మనో
రయం చార్థః సమ్యక్ శ్రుతిశిరసి తైత్తిర్యక ఋచి!
ఋషిం హిత్వా చాస్యా హృదయ కమలేనైత మృషిమి
త్యచాభ్యుక్తః పూజావిధిరిహ భవత్యాః సమయినామ్॥

త్రిఖండ స్త్వన్మంత్ర స్తవ చ పరధాయాం నివిశతే
శ్రియా దేవ్యాః శేషా యత ఇహ సమస్తాః శశికలాః।
త్రిఖండే త్రైఖండ్యం నివసతి సమంత్రే చ సుభగే
షడబ్జారణ్యాని త్రితయయుతఖండే నివసతి!!

త్రయం చైతత్స్వాంతే పరమశివపర్యంకనిలయే
పరే సాదాఖ్యా స్మి న్నివసతి చతుర్ద్వైక్య కలనాత్।
స్వరాస్తే లీనాస్తే భగవతి కలాశ్చేచ సకలాః
కకారాద్యావృత్తే తదనుచతురశ్రే చయముఖా !!

హళ్లో బిందుర్వర్గాష్టక మిభదళం శాంభవవపు
శ్చతుశ్చక్రం శక్ర స్థిత మనుభయం శక్తిశివయోః।
నిశాద్యాదర్శాద్యాః శ్రుతినిగదితాః పంచదశధా
భవేయు ర్నిత్యాస్తా స్తవ జనని మంత్రాక్షర గణాః!!

ఇమాస్తాః షోడశ్యా స్తవ చ పరధాయాం శశికలా
స్వరూపాయాం లీనా నివసతి తవశ్రీ శశికలా।
అయం ప్రత్యాహారః శ్రుత ఇహ కలావ్యంజనగణః
కకారేణాకారః స్వరగణమశేషం కథయతి!!

క్షకారః పంచాశత్కల ఇతి హళ్లో బైందవ గృహం
కకారా దూర్ధ్వ స్యా జ్జనని తవ నామాక్షరమితి।
భవే త్పూజాకాలే మణిఖచితభూషాభి రభిత
ప్రభాభి ర్వ్యాలీఢం భవతి మణిపూరం సరసిజమ్!!

పదం త్యేకే వృద్ధా మణిరితి జలం తేన నిబిడం
పరే తు త్వద్రూపం మణిధనురితీదం సమయినః।
అనాహత్యానాదః ప్రభవతి సుషుమ్నా ధ్వజనితం
స్తదా వాయో స్తత్ర ప్రభవ ఇద మాహుః సమయినః!!

త దేత త్తే సంవిత్కమలమితి సంజ్ఞాంతర ముమే
భవే త్సంవిత్పూజా భవతి కమలేస్మి న్సమయినామ్।
విశుద్ధాఖ్యే చక్రే వియదుదిత మాహుః సమయినః
సదా పూర్వో దేవః శివఇతి హిమానీసమతనుః!!

త్వదీయై రుద్యోతై ర్భవతి చ విశుద్ధాఖ్య సదనం
భవే త్పూజా దేవ్యా హిమకరకలాభిః సమయినామ్।
సహస్రారే చక్రే నివసతి కలా పంచదశకం
తదేత న్నిత్యాఖ్యం భ్రమతి సితపక్షే సమయినామ్!!

అతః శుక్లేపక్షే ప్రతిదిన మిహ త్వాం భగవతీం
విశాయాం సేవంతే నిశి చరమభాగే సమయినః।
శుచిః స్వాధిష్ఠానే రవి రుపరి సంవిత్సరసిజే
శశీచాజ్ఞాచక్రే హరిహరవిధిగ్రంథయ ఇమే॥

కలాయాః షోడశ్యాః ప్రతి ఫలిత బింబేన సహితం
తదీయైః పీయూషైః పునరధిక మాప్లావిత తనుః।
సితే పక్షే సర్వా స్తిథయ ఇహ కృష్ణేఽపి చ సమా
యదా చామావాస్యా భవతి నహిపూజా సమయినామ్॥

ఇడాయాం పింగళ్యాం చరత ఇహ తౌ సూర్యశశినౌ
తమస్యాధారే తౌ యదితు మిళితౌ సా తిథి రమా।
తదాజ్ఞా చక్రస్థం శిశిరకరబింబే రవినిభం
దృశా వ్యాలీఢం సద్విగళిత సుధాసార విసరమ్॥

మహావ్యోమస్థేందో రమృతలహరీ ప్లావిత తనుః
ప్రశుష్య ద్వైనాడీ ప్రకర మనిశం ప్లావయతి తత్।
యదాజ్ఞాయాం విద్యున్నియుతనియుతాక్షరమయీ
స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంథి మభినత్॥

తతో గత్వా జ్యోత్స్నామయ సమయలోకం సమయినాం
పరాఖ్యా సాదాఖ్యా జయతి శివతత్త్వేన మిళితా
సహస్రారే పద్మే శిశిరమహసాం బింబ మపరం
తదేవ శ్రీ చక్రం సరధభితి తద్బైందవ మితి॥

వదన్త్యేకే సంతః పరశివపదే తత్త్వమిళితే
తత స్త్వం షట్వింశీ భవసి శివయో ర్మేళనవపుః।
త్రిఖండేఽస్మి న్స్వాన్తే పరమపదపర్యంకసదనే
పరే సాదాఖ్యేస్మి న్నివసతి చతుర్థైక్య కలనాత్॥

క్షితౌ వహ్ని ర్వహ్నౌ వసుదళ జలే దిఙ్మరుతి ది
క్కలాశ్రే మన్వశ్రం దృశి వసు రథో రాజకమలే।
ప్రతిద్వైతగ్రంథి స్తదుపరి చతుర్ద్వార సహితం
మహీచక్రం చైకం భవతి భగకోణైక్య కలనాత్॥

(ఇతి మంత్ర చక్రైక్యమ్)

షడబ్జారణ్యోత్థాం సమయిన ఇమే పంచక సమాం
యదా సంవిద్రూపాం విదధతి చ షోఢైక్య కలితామ్।
మనో జిత్వా చాజ్ఞా సరసిజ ఇహ ప్రాదురభవ
త్తటిల్లేఖా నిత్యా భగవతి తవాధారసదనాత్॥

భవత్యాస్సామ్యం కేచి త్త్రితయ మితి కౌలప్రభృతయః
పరం తత్త్వాఖ్యం చే త్యపర మిద మాహుః సమయినః ।
క్రియావస్థారూపం ప్రకృతి రభిధా పంచక సమం
తదేషాం సామ్యం స్యా దవనిసుచ యో వేత్తి స మునిః॥
(ఇ త్యై క్య ని రూ ప ణ మ్)

వశిన్యాద్యా అష్టావకచటతపాద్యాః ప్రకృతయః
స్స్వవర్గస్థాః స్వస్యాయుధకలితహస్తాః స్వవిషయాః।
యథావర్గం వర్ణప్రచురతనవో యాభి రభవం
స్తవ ప్రస్తారా స్తే త్రయ ఇతి జగుస్తే సమయినః॥

ఇమా నిత్యా వర్ణా స్తవ చరణసమ్మేళనవశా
న్మహామేరుఖ్యాః స్యు ర్మనుమిళన కైలాసవపుషః ।
వశిన్యాద్యా ఏతా అపి తవ స బిందాత్మకతయా
మహీ ప్రస్తారోఽయం క్రమ ఇతి రహస్యం సమయినామ్॥
(ఇ తి ప్ర స్తా ర త్ర య ని రూ ప ణ మ్)

భువే న్మూలాధారం తదుపరితనం చక్రమపి త
ద్వయం తామిస్రాఖ్యం శిఖికిరణసమ్మేళనవశాత్ ।
తదేతత్కౌలానాం ప్రతిదిన మనుష్ఠేయ ముదితం
భవత్యా వామాఖ్యం మతమపి పరిత్యాజ్య ముభయమ్॥

అమీషాం కౌలానాం భగవతి భవే త్పూజన విధి
స్తవ స్వాధిష్ఠానే తదనుచ భవే న్మూలసదనే ।
అతో బాహ్యే పూజా భవతి భగరూపేణ చ తతో
నిషిద్ధాచారోఽయం నిగమ విరహా న్నింద్యచరితమ్॥

నవ వ్యూహం కౌల ప్రభృతిక మతం తేన స విభు
ర్నవాత్మా దేవోఽయం జగదుదకృదే భైరవ వపుః ।
నవాత్మా వామాది ప్రభృతిభి రిదం భైరవవపు
ర్మహాదేవీ తాభ్యాం జనక జననీమ జ్జగ దిదమ్॥

భవే దేత చ్చక్ర ద్వితయ మతిదూరం సమయినాం
విసృజ్యైతద్యుగ్మంతదనుమణిపూరాఖ్యసదనే ।
త్వయా స్పృష్టే ర్వారి ప్రతిఫలిత సూర్యేందుకిరణై
ర్విధాలోకే పూజాం విదధతి భవత్యాః సమయినః॥

అధిష్ఠానాధార ద్వితయ మిద మేవం దశదళం
మహాస్వారాజ్ఞాతం మణిపురసతోఽభూద్దశదళమ్ ।
హృదంభోజా న్మూలా న్నృపదళ మభూత్త్వాంతకమలం
తదే వైకో బిందు ర్భవతి జగదుత్పత్తికృ దయమ్॥

## శ్రీసుభగోదయస్తుతిః

సహస్రారం బిందు ర్భవతి చ తతో బైందవగృహం
త దేతస్మాద్ జ్ఞాతం జగదిద మశేషం సకరణం ।
తతో మూలాధార ద్వితయ మభవ త్తద్దశదళం
సహస్రారాజ్జాతం తదితి దశధా బిందు రభవత్ ॥

త దేత ద్బిందో ర్య ద్దశక మభవ త్త్రప్రకృతికం
దశారం సూర్యారం నృపదళ మభూ త్స్వాంత కమలమ్ ।
రహస్యం కౌలానాం ద్వితయ మభవ న్మూల సదనం
తథాధిష్ఠానం చ ప్రకృతి మిహ సేవంత ఇహ తే ॥

అతస్తే కౌలా స్తే భగవతి దృఢ ప్రాకృత జనా
ఇతి ప్రాహుః ప్రాజ్ఞా కుల సమయ మార్గద్వయ విదః ।
మహాంతః సేవంతే సకల జననీం బైందవగృహే
శివాకారాం నిత్యా మమృతఝరికా మైన్దవకళామ్ ॥

ఇదం కాలోత్పత్తి స్థితిలయకరం పద్మనికరం
త్రిఖండశ్రీచక్రం మనురపి చ తేషాంచ మిళనమ్ ।
తదైక్యం షోఢా వా భవతి చ చతుర్థేతిచ తథా
తయో సామ్యం పంచప్రకృతిక మిదం శాస్త్ర ముదితమ్ ॥

ఉపాస్తే రేతస్యాః ఫల మపి చ సర్వాధిక మభూ
త్తదేత త్కౌళానాం ఫలమిహహి చే త్తత్సమయినామ్ ।
సహస్రారే పద్మే సుభగశుభమోదేతిసుభగే
పరం సౌభాగ్యం య త్తదిహ తవ సాయుజ్య పదవీ ॥

అతోస్యాః సంసిద్ధ్యా సుభగసుభగాఖ్యా గురుకృపా
కటాక్ష వ్యాసంగా త్స్రవదమృత నిష్యంది సులభా ।
తయా విద్వా న్యోగీ విచరతి నిశాయా మపి దివా
దివా భానూ రాత్రౌ విధు రివ కృతార్థీకృతమతిః ॥

# స్నేహ సేతువు

శ్రీ కె. వి. రమణారెడ్డి

"If art and truth cannot live together, then let art disappear Truth is life Lies are death."

—Romain Rolland: Jean Christophe.

గొప్ప సాహిత్య సృష్టికర్త, అంతకంటే గొప్ప మానవ వ్యక్తి రోమే రోలాఁ జన్మించి మొన్నటి జనవరి 29 వ తేదికి నూరేళ్లయింది. గతించి ఇరవై రెండేళ్లు కావస్తోంది. ఎనభై ఏళ్ల బ్రతుకులో ఆయన గడించిన అనుభవాలు, పొందిన అనుభూతులు యావత్తూ అక్షర రూపం ధరించి, ఒక సుకుమారమైన మానవాత్మ పొందిన క్రమ వికాసాన్నీ వికసనాన్నీ ప్రదర్శిస్తూ, విశ్వ సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని చేకూర్చుకొన్నవి.

ఆత్మపరులైన రచయితలను ఎన్నిక చేయవలసి వస్తే ఇటీవలి కాలాన రష్యన్ నవలాకారుడు లియో టాల్‌స్టాయి, ఫ్రెంచి నవలాకారుడు రోమే రోలాఁ, భారతీయ మహాకవి రవీంద్రనాథ్ టాకూర్ ఒక శ్రేణికి చెందినవా రనవచ్చును. భిన్నభిన్న పథాలైనప్పటికీ, 'సత్యం, శివం, సుందరం' వా రందరికీ సంభావ్యమైన తత్వ మనవలసి ఉంటుంది. అందుచేతనే వారి రచనల కంత సువాసన, వారి వ్యక్తిత్వాల కంత శోభ. క్షుద్ర ప్రయోజనాల కొరకు గాక, చిత్త వికాసం కొరకు జీవన నైర్మల్యం కొరకు వారిచేత కళ ప్రయుక్తమైంది. వారు వ్యక్తిమాత్రులు కారు.—ఒక్కొక్కరు ఒక్కొక్క మహా మనశ్శక్తి సంభృతులు. వారికి బ్రతుకే సాధన.

రోలాఁకు "నిశ్చల నిశ్చితా" లంటూ లేవు. ఆక్రోశిస్తూ సత్యాన్వేషణ గావించే ఆత్మ ఒక్కటే అతని మూలధన మనాలి. అందులో నిరంతర సంఘర్షణ. పాత కొత్తల కీచులాటకు తానే నిలయ మయ్యాడు. అడుగు తీసి అడుగు ముందుకు వేసేందుకు గూడా ఎంతో సంతాపమూ ఎంతో వైక్లబ్యమూ అనుభవించాకనే సాధ్యమయ్యేది; తన అభిప్రాయాలు ఎప్పటికప్పుడు మార్పు చెందడం గురించి లోకు లేమనుకొని పోతారోనని తనకు కించిత్తయినా భయమూ, సంశయమూ లేవు. విశ్వాసాల పేరిట పెంకు గట్టుకొనిపోయిన మూర్ఖపు పట్లు అసలు లేవు ఒక స్థానం వదలి మరొక పురోస్థానం .. ఇలా రోమే రోలాఁ ఐహిక ప్రయాణం ఒక నిరంతర ప్రస్థానమై పోయింది.

కొందరి దృష్టికి రోలాఁ చెప్పుకోదగిన సాహిత్య స్రష్ట కాదు, నీతి విషయబోద్ధ మాత్రమే. మరికొందరి దృష్టికి రోలా హృదయం సంగీత సాహిత్యాలకు వశంవర్తి. ఇక కొందరు రోలాఁ మహారచన జాఁ క్రిస్టోఫ్ (Jean Chrıstophe) మాత్రమే. ఆపిమ్మట రాజకీయాలు చొరబారి అతని కళ అపభ్రంశమైపోయింది, అంటారు. ఇవన్నీ సరిపడనివారి అక్కసులు మట్టుకే. నిజానికి ఈ విడివిడి అంశాలన్నీ కలగలిసిపోయిన గొప్ప వ్యక్తిత్వం రోలాఁది. యూరపు దేశాల మేధావుల భావ పరిణామాని కంతటికీ రోలాఁ సాక్షి మాత్రమే గాక, దాదాపుగా ఆద్యుడనదగిన అనుభవశాలి.

ఐదేళ్ల ప్రాయానికే ఇరుగు పొరుగు దేశాలైన ఫ్రాన్సు, జర్మనీ చరిత్రలు అస్తవ్యస్తమైపోయాయి. మూడవ నెపోలియన్ రాజరికంతోబాటు ఫ్రాన్సు దేశపు ప్రతిష్ఠ మన్ను గరువగా, బిస్మార్కు నాయకత్వాన జర్మనీ సామ్రాజ్యమైంది. అంతస్సంక్షోభమూ, అమిత రక్తపాతమూ, దాస్య పరాభవమూ ఫ్రాన్సు హృదయానికి శూలపు పోట్లయ్యాయి. బర్గండీ రాష్ట్రంలో జన్మించిన రోలాఁ యువకుడై పేరిస్ మహానగరంలోని సొర్బోన్‌లో ఉన్నతవిద్య ముగించేనాటికి, జర్మనీ ఫ్రాన్సు దేశాలు కత్తులు నూరసాగాయి. పరస్పర విద్వేషమూ, విస్రంభమూ యూరపుదేశాలను రెండు సాయుధ శిబిరాలుగా చేర్చి శాంతిని పోకార్చి, ఆలోచనాపరులైన వ్యక్తులను ఉన్మత్తులుగ మార్చివేయసాగిన దుర్దినాలవి. ఫ్రెంచి సేనలో పూరుపేరు లేని ఒక యూదు జాతీయుడైన డ్రేఫస్ (Dreyfus) అనే ఉద్యోగిని జర్మన్ గూఢచారిగా భ్రమించి భ్రమను విశ్వాసంగా మార్చుకొని అతని బ్రతుకున నిప్పులు పోయజూచిన ఫ్రెంచి ప్రభుత్వాన్ని ఎదర్కొని ప్రఖ్యాత నవలాకారుడైన ఎమిలీ జోలా, కళాకారుల హృదయాలను తట్టి లేపాడు. రోమే రోలాఁ అప్పుడప్పుడే జీవిత ప్రాంగణాన కాలు మోపుతున్నాడు.

ఆదిలో రోలాఁకు సంగీతంపై గురి ఎక్కువగా ఉండేది. జీవితాంతం వరకూ అతని మనస్సును అది విడిచిపెట్టలేదు. అయితే విద్యార్థిగా ఉండిన రోజులలో, రోలాఁ తన సహాధ్యాయులతోబాటు షేక్‌స్పియరు, వేగ్నర్, టాల్‌స్టాయిల వైపు మోరలు విగిడ్చేవారు. కాని, వారి భావ శృంఖలలను తెగ గొట్టినవాడు స్పి

బెర్గ్‌సన్. ఆత్మ ప్రత్యయం (Intuition) మూలాధార భూతమైన బెర్గ్‌సన్ తాత్విక వైఖరి ప్రాణశక్తికి (Elanivitol) మకుటం తొడిగింది. రోలాఁ తరానికి చెందిన యువకులకు ఇది ప్రాణసంజీవని వంటిదైంది. ఫ్రాన్సుదేశం పొందిన పరాజయం కారణం కాగా యువకుల మనస్సులలో వ్యాప్తించిన నిర్వీర్య విస్తేజాలకు బెర్గ్‌సన్ తత్వం పరశుధారగా ఉపకరించింది.

మృత్యువాంఛనుండి విడివడి జీవిత సార్థక్యానికి పయనించ గోరుతూ ఈ తొలి దశలో రష్యన్ నవలాకారుడైన టాల్‌స్టాయికి రోలా ఒక లేఖ రాశాడు. శరీర కష్టం ద్వారా జీవిత ఖిన్నతను మరచిపోవచ్చునని టాల్‌స్టాయి సూచన. ఇది రోలాఁకు సరిపడ లేదు. కళాసృష్టి కూడా ఈ మైమరపును కలిగిస్తుందని రోలాఁ వూహ. తనకు పథి ప్రదర్శకుడు కావాలి. పూజారులవలె కళాకారులు ఒక కులం కట్టడం టాల్‌స్టాయికి సమ్మతంకాదు. కళాకారుడు ఒక ప్రవక్త కావాలి. చిత్తశుద్ధినీ, ఆదర్శబలాన్నీ సమకూర్చుకుని, సామాన్య మానవుల జీవితాలను సుఖవంతాలూ శుచిమంతాలూ చేసేందుకే తన కళను వినియోగించాలి. రోలాఁ మనస్సును పరిణత మొనర్చిన ముఖ్య శక్తులలో టాల్‌స్టాయి చేసిన ప్రబోధం అవశ్య స్మరణీయమైనది. కాని, రోలాఁ టాల్‌స్టాయి చెప్పినదానినెల్ల వేదవాక్యమని తలదాల్చలేదు. కాలక్రమాన టాల్‌స్టాయిని గూడా తప్పులెన్నబూనిన ధీరుడు రోలాఁ. ప్రస్తుతానికి మాత్రం, టాల్‌స్టాయి ద్వారా రోలాఁ మనస్సు విస్తరించిం దనాలి. తన సమకాలికులు సంప్రదాయాన్ని పరిత్యజించారు. గతాన్ని విస్మరించి అనిశ్చిత భవిష్యత్తుకు అభిముఖులై పోతున్నారు. అది పొరబాటు. సంప్రదాయ బలాన్ని గుర్తించి, వృక్షమూలాలకు క్రొత్త సత్తువ పట్టించి క్రొంజివుళ్లను తొడిగించడమే తన కర్తవ్యమని భావించాడు. ఇటలీ దేశంలో రెండేళ్లుండి ఫ్రాన్సుకు మరలివచ్చి సంగీతం గురించి అనేక గ్రంథాలు రచించి సంగీత చరిత్రాచార్యుడుగా నియుక్తుడైన (1903) పిమ్మట ఈ భావాంకురాలకు ద్రఢిమ చేకూరింది.

కాలాన్నీ స్థలాన్నీ మీరి మానవచరిత్ర క్రమమంతా అభిన్నమైన ఏకపదార్థం క్రమోన్మీలనం పొందిన విధంగా రోలాఁకు అనిపించసాగింది. ఆ పదార్థం పేరు మానవాత్మ. అది ప్రాచ్య ప్రతీచులకూ భూత వర్తమానాలకూ సామాన్యమైనట్టిది. పైకి ఎన్ని భేదాలు కనిపించినప్పటికీ, మూలంలో అది ఒకే ఒక్కటి. యౌవ్వనకాలంలో త న్నావేశించిన ఉత్సాహతరంగం మాత్రమే కాదు ఈ మహానుభూతి. మరి ఇరవైఏళ్ల పిమ్మట భారతీయ సంగీత వేత్త, సాధకుడు దిలీపకుమార్‌రాయ్ రోలాఁను దర్శించి భాషించినప్పుడు కూడా, ఇది పునర్దర్శన మిస్తుంది. మన కన్నడ రాగాలాపనను విని భారతీయ సంగీతం యూరపియన్ సంగీతానికి నవ్య మార్గాలను నిర్దేశించగలదని ఆశాభావం ప్రకటించాడు. భారతీయ సంగీతం యూరపియన్ల చెవి కెక్కేదేమో అని రాయ్ సందేహించినప్పుడు, ఆయనను వారించి గొప్ప సంగీతం పండిత పామరుల నుభయులనూ మెప్పించగలదని వాదించాడు.[1]

సాహిత్యాన్ని నిర్మలిన మొనర్చే తలంపుతో రోలాఁ మరి కొందరు సహభావులతో కలిసి (Quimzaine) అనే పక్ష పత్రికను నెలకొల్పి అందులో పదిహేనేళ్ల కాలం తన రచనలను పరంపరగా ప్రకటింప బూనుకొన్నాడు. నాగరికత పేరిటి బూటకాలనూ దుశ్చర్యలనూ, రాజకీయాల పేరిటి అబద్ధాలనూ, అక్రమాలనూ ఎదుర్కొని ఉన్నత ఉజ్జ్వలాదర్శాంకితమైన జీవితపథాన్ని నిర్దేశించేందుకు పూనుకొన్నాడు.

## 2

"A Hero is one who does what he can."
—Romain Rolland Jean christophe.

వీరు డనదగినవా డెవడు? కర్మవీరుడా, లేక భావశూరుడా? జయాపజయాలలో కోరుకొన దగిన దేది? ఈ ప్రశ్నలకు సమాధానాలుగా వెలువడినవే రోమే రోలాఁ విరచితాలైన నాటకాలు. ఫ్రెంచి రంగస్థలం వ్యాపారదృష్టికి అంకితమై ప్రేక్షకులకు క్షుద్ర వినోద కల్పన కొరకై నాటక వాఙ్మయం పతనమైన రోజులలో, రోలాఁ నాటకకర్తగా ప్రయోక్తగా అవతరించాడు. కాని, ప్రజాభిమానాన్ని చూరగొనలేక పోయాడనాలి. అతని నాటక సిద్ధాంతాలు కూడా పరిస్థితుల ప్రాబల్యాన్ని గుర్తించలేదు. నాటకం వినోదాన్ని కలిగించవచ్చు గాక, హృదయాలను కూడా సంస్కరించాలి. పరిసరాలను మానవు డెలా లొంగదీసుకో గలిగాడో ప్రదర్శించినప్పుడు, రంగస్థలం మీది వ్యక్తి మానవజాతి కంతటికీ ప్రాతినిధ్యం వహించి ఒక మహాశక్తికి సంకేతప్రాయు డవుతాడు. ఈ క్రొత్త సిద్ధాంతాలు The People's Theatre అనే గ్రంథంలో రోలాఁ స్థాపించాడు. కాని, అలాంటి నాటక కర్తలూ అలాంటి ప్రేక్షకులూ కరవయ్యారు.

రోలాఁ రచించిన నాటకాలు మొదట గ్రీక్, రోమన్ చరిత్రల నుండి ఇతివృత్తాన్ని గ్రహించినప్పటికీ షేక్స్‌పియర్ రచనాధోరణిని అనుసరించ జూచాయి. త్వరలో రోలాఁ స్వదేశమైన ఫ్రాన్సు చరిత్ర నుండి ఇతివృత్తాలను త్రవ్వి పైకెత్త బూనాడు. అందులోనూ మధ్య యుగాల చరిత్ర. యావజ్జాతినీ ఆవేశించి నడిపించగల భావాల రహస్య శక్తిని నిరూపించడమే

1. "...a great creation in art must contain in its rich granary aliment enough wherewith to satisfy the spiritual hunger of all."

ఈ తొలి నాటక రచనలను కలిపి కట్టే సూత్రం. ఒక మహా భావంపైన గురి (Faith) కుదిరినప్పుడు, ఎన్ని బాధ లెదురైనా అది చెదరదు. తాత్కాలికంగా, లోకపరంగా అది పరాజయం పొందవచ్చుగాక, ఓటమిలో గూడా అది కుప్ప గూలి పడదు. అలాంటి స్థిర ప్రజ్ఞకు పర్యాయపదమే గొప్పదనం. అదే వీరధర్మం. ఉదాహరణకు, రోలాఁ నాటక నాయకుడైన పద కొండవ లూయీ (Louis XI) అలాంటి మహాపురుషుడు. అతని సాధు ప్రకృతిముందు పాషాణాలు కూడా మెత్తబడక తప్పదు. అతడు నడిపిన మత యుద్ధ యాత్ర ఫలించదు గాని, అతని అనుచరులు విశ్వాసం ద్వారా సఫలత పొందుతారు. ఇలాంటి నాయకులు అక్షరాలా అగ్రేసరులు (Forerunners). పరాజయం నుండి విశ్వాస విజయాన్ని సాధించగలగడమే వారి గొప్ప దనానికి తార్కాణ. ఓటమివల్ల తాలు ఎగిరిపోయి గట్టి పంట మిగులుతుంది. పోయినవారు పోగా మిగిలిన కొద్దిమంది మును సాగుతారు. కష్టాలు తమకు తప్పవని వారికి తెలుసు. తమ దౌర్బల్యం వారిని ఖిన్నులను చేస్తుంది గాని సంకల్పం మట్టుకు చెక్కు చెదరదు. వారు స్థితప్రజ్ఞులు.

ఫ్రెంచి విప్లవకాలంలో ఒకరి వెంబడి ఒకరై దూకి పడిన మహాపురుషుల చరిత్రలను గ్రహించి రోలాఁ ఒక నాటక చక్రాన్ని సృష్టించాడు! వీనిలో గూడా నైతిక ప్రయోజనమే బల వత్తరంగా భాసిస్తుంది. మానవాతీతమైన ఒక అలౌకికశక్తి చేతి బొమ్మలై, కాలాన్ని గణింపని విధంగా దౌర్బల్యాలకు వెలిగా, ఆదర్శ వ్యక్తులుగా ఈ నాటకీయ వ్యక్తులు సహజత్వానికి దూరమౌతారు. ఒక నాటకంలో (The Fourteenth of July నాయకపాత్ర ఒక్కటీ లేదు. ప్రజాసమూహమే ఆ అవసరాన్ని తీరుస్తుంది. "Individuals are merged in the ocean of the people."

ఈ నాటకాలలో సర్వే సర్వత్ర రోమే రోలాఁ కొన్ని సిద్ధాంతాలను చాట బూనుకొన్నాడు. సామాన్య ప్రజల దూరుబడుతూ, మానవ కళ్యాణం కొరకు ఆత్మార్పణకైనా సిద్ధమైన శిష్ట జనులు—అగ్రేసరులు భౌతికంగా ఓటమిపాలై కూడా నైతిక విజయాన్ని సాధించి మానవజాతికి ప్రగతిని చేకూరుస్తారు. ఇలాంటి మహాపురుషులే చరిత్రను నిర్మించగలరు గాని ప్రజలు నిర్మించజాలరు. ప్రజలు భావ దరిద్రులు. వారు విధ్వంసనకే సాధన ప్రాయులు కాగలరు. వారికి నీతి యెడల గురి లేదు. వారు మహాపురుషులకు అనుచరులుగనే రాణించగలరు గాని తామే నాయకులు కాలేరు. ఈ అభిప్రాయాలకు బాధ్యుడు రోలాఁయే గాని, ఆ కాలపు అభిప్రాయాలకు అతడు వారసుడని విస్మరించ గూడదు. వ్యక్తి విశిష్టవాదం (Individualism) భావు

తుల మనస్సులను బలీయంగా శాసించే రోజులవి. దానిని మరింత విస్తరింపజేసి శిష్టులతోబాటు సామాన్యులకు గూడ రాజకీయ జీవితంలో భాగస్వామ్యం కొద్దిగానైన కల్పించబూనిన ఉదార వాదం (Liberalism) ఇంకా పితూరీగానే ప్రమాద కరమైన భావజాలంగా ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలలో భావింప బడే రోజులు కాబట్టి రోలాఁ వంటి మేధావికి భావ సంకోచం తప్పలేదు. ఆయన గొప్పతనమంతా, ఈ భావ శృంఖలలను తెగ గొట్టుకొని విశాలతరమైన భావలోకంవైపు పయనించడమే. క్రొత్తగాలి వీవసాగింది. 1897 లోనే ఒక లేఖలో రోలాఁ ఇలా గన్నాడు : "పాత సమాజం కూలిపోతున్నది—ఇది ఎంతో హాయి."[2]

ఈ కాలానికి ఇంకా రోలాఁ భావాలు స్పష్టాకృతి దాల్చ లేదు. సమాజవాదమంటే ఒకవిధమైన మెప్పుతోబాటు జంకు. ప్రజాస్వామ్యమంటే ఒక విధమైన నమ్మకంతోబాటు అదురు. నిజజీవితంలో ప్రత్యక్ష కార్యాచరణం గురించి అనిష్టంతోబాటు ఉదాత్త నైతిక స్వాత ప్రవణత్వంమీద మోజు. ఆలోచనకూ ఆచరణకూ నడుమ పూడని గండి. ఇది యావత్తూ రోలాఁ మనస్సు పడిన ప్రసవవేదన వంటిది

ఈ ద్వంద్వభావన నుండి తప్పుకోవడంలో, రోలాఁ చేసిన తొలి ప్రయత్నం, ఆలోచననూ ఆచరణనూ సమన్వయపరచిన మహా పురుషుల జీవిత చరిత్ర గ్రథన మనాలి. ఒక విమర్శకు డన్నట్లు ఈ అనేక జీవిత చరిత్రల ద్వారా రోలాఁ తన జీవిత చరిత్రనే రచించుకొన్నాడు. రచయిత రచనతో ఐక్యభావం భజిస్తున్నాడు. తానే మైకేల్ ఏంజెలో, బెథోవెన్, టాల్‌స్టాయి అవుతున్నాడు. తన సందేహాలకు వారిద్వారా నివృత్తిని ఆపేక్షిస్తున్నాడు. తన అభిప్రాయాలకు వారి ద్వారా సమర్థనను అభిలషిస్తున్నాడు. మరి ఈ మహాపురుషులు తమ ప్రయత్నాలద్వారా పనుల ద్వారా నవ్యాను భవాలకు తలుపులుతీసి, నవ్యప్రమాణాలను స్థాపించి, అభినవ జీవన ధోరణులను ప్రపంచించిన 'అగ్రేసరులు'—"పురావ్యవస్థ అడుగంటసాగిన నిశాకాలంలో బయల్వెడలి, వైతాళికులై, సూర్యో దయాత్పూర్వమే కనుమరు గౌతారు."[3] నిజానికి తమ కాలపు జనుల బాధలన్నీ వీరిలో తీవ్రతర రూపం ధరిస్తాయి, కేంద్రీకృత మవుతాయి. సమకాలం వారికి ఎడారివంటిదౌతుంది. సమకాలికులు ఈ మహాపురుషుల కంటె కొన్ని దశాబ్దాలు వెనుక బడి ఉంటారు. ఈసడించి పరిహసించి సాధించి వేధించి తమ అల్పత్వాన్ని నిరూపించుకొంటారు. కాని, మహాపురుషులు శిఖరాల నధిరోహించి క్రిందికి చూపులు సారించినప్పుడు అగణ్యమానవ వ్యక్తులకు మందహాస కాంతులనూ వివేకపూరితమైన కటాక్షా లనూ ప్రసాదిస్తారు—వారు దిగువ, వీరు ఎగువ.

నిజమైన కళాకారునికి బాధలే పరీక్షలని టాల్‌స్టాయి చెప్పిన మాటలను రోలాఁ విస్తరించి చెబుతాడు. అతనికి సింహ వక్షస్సు కావాలి వీరుడై నిలిచి, లోకుల కాకిపోట్లను గణించక, చిత్తశుద్ధితో ఉన్నత ప్రమాణాలు గల కళను తనకు తానై సృష్టించుకొంటాడు. జీసస్ క్రీస్తువలె ఈ మహాపురుషు లందరూ శోకమూర్తులు కాకతప్పదు. వీరి బాధ ప్రజలకు శాశ్వ తంగా లాభించే సత్య, సౌందర్య,, సౌజన్యబోధ అవుతుంది. రోలాఁయే ఇలాదీనిని వివరించాడు.:

'. . all my favourite heroes in my TRAGEDIES OF FAITH AND LIVES HEROIC have been, from the point of view of the worldly-wise the vanquished; but the vanquished who yet claim.

"Jai devanc'e la victoire, mas je vaincrai' Victory shall come after my death, it kills not when it comes, for I know that my faith is true "[4]

విరుద్ధశక్తుల నిరంతర సంఘర్షణలో కళాసృష్టి జరుగు తుందనే భావం ఈ జీవిత చరిత్ర లన్నిటా రోలాఁ వెల్ల డిస్తాడు. కళాకారుడు ఆత్మ వ్యక్తీకరణ కోసం అటుమట వెందు తూనే, కళా రూపాన్ని వశపరచుకొనేందుకు దానితో కుస్తీ పడు తాడు. చివరకు దాని స్త్రీత్వాన్ని తన పురుషత్వం లోగొంటుంది: సృష్టి జరుగుతుంది ఇది మానవాత్మకు సామ్రాజ్య పట్టాభి షేకం ! "మహాపురుషుడైనవాడు మందకాపరి వలె తాను వెనక ఉండిపోక మందకు మొనగాడై ముందు దూకుతాడు." 5 మంద అనుస రించి పోతుంది—అదీ అడుగుమీద అడుగుగా, మెల్లగా, మంద గతితోటి. కాని తనో ? శిఖరం నుండి మరొక శిఖరానికి చంక్ర మిస్తాడు.

బెథోవెన్ అలాంటి 'ఆత్మవీరుడు' రోలాఁకు మొదటి నుండి అభిమానపాత్రుడు. సమకాలికులకు నీచమైన సంగీతాభి రుచి ఏర్పడిఉండిన రోజులలో, బెథోవెన్‌కు మన్ననలేని సమ యంలో, తిరిగి ఈ జీవిత చరిత్ర ద్వారా ఆ లయ బ్రహ్మను ఫ్రెంచివారికి పరిచయం చేశాడు రోలాఁ. ఈ గ్రంథాదిలో ఆయన మాటలు మైకాన్ని విరిచేవి : "ఊపిరి సలపకుండా ఉంది. కిటి

---

2 "The old society is crumbling-that is a great happiness "

3 Romain Rolland. Alex Aronson, P. 38

4. Romain Rolland. Among the Great; Dilip kumar Roy, P. 44—45.

5 Beethoven the Creator Romain Rolland: "He is not the shepherd driving his flock before him, he is the bull marching at the head of his herd."

కీలు తెరవండి, స్వర్గపు స్వచ్ఛంద పవనాన్ని ప్రవేశించనివ్వండి. వీరుల ఆత్మలను మనం పీల్చుకోవాలి.'' నిజంగా బెథోవెన్ ఈ గ్రంథంలోవలె జీవించాడో లేదో తెలియదనిపించేంతగా రోలాఁ వాస్తవ కథనాన్నీ, కల్పననూ కలగలిపివేసి, లేని విషయాలను వూహించాడని విమర్శకులు ఆక్షేపించారు. బెథోవెన్ పనిజేసిన పరిసరాలను చిత్రింపక, అతని 'ఆత్మ'ను పునర్నిర్మించే పనికి పూనుకొన్నాడని తప్పు బట్టారు.

ఇటాలియన్ చిత్రకారుడు, శిల్పి మైకేల్ ఏంజెలో, తన కళా సృజనలో గాక, నిత్య జీవితంలో అనుభవించిన చిత్తతాపం మరొక జీవిత చరిత్రకు వస్తువును సమకూర్చిపెట్టింది. అతి లోకమైన ప్రశాంత వదనాలతో దైవతుల్య మనిపించే ప్రసన్నతతో కనిపించే మైకేల్ ఏంజెలో విగ్రహాలు ఒక ఎత్తు; వాటిని రాతినుండి నిర్మించిన శిల్పి హృదయాంతరంలోని తుఫాను మరొక ఎత్తు. ఈ పరిసరాల అల్పశక్తులను మీరి కళా సృజనలో చిత్తశాంతిని సాధించుకొన్నాడు గనుకనే ఏంజెలో మహా పురుషుడు కాగలిగాడు. పైగా స్వభావసిద్ధమైన అతని దిగులు కూడా ఈ సృజనానందంలో మాటుమణిగిపోయింది. స్వభావాన్నీ పరిసర ప్రభావాన్నీ అతను గెలిచివేశాడు.

టాల్‌స్టాయి జీవిత చరిత్రలో రోలాఁ మరొక కోణం నుండి మహాపురుషుని మనస్తత్వాన్ని నిరూపింప బూనుకొన్నాడు. టాల్‌స్టాయి మనస్సులో సత్యానికీ ప్రేమకూ నడుమ ఉప్పతిల్లిన సంగ్రామం అతని వ్యక్తి జీవితాన్ని దుఃఖభరితం చేసింది. ఎదురుతిరిగి అంతరాత్మ వేసిన ఒక్కొక్క సవాలూ అతనిని క్రుంగదీసింది. నిజం నగ్నంగా చిత్రితమైనప్పుడు పరిత బాధపడుతాడు—దానికి అందమైన కళాచ్ఛాదనం తొడగడమా, మానడమా? తొడిగితే సత్యం ఆమేరకు అసత్యం కాదూ? సత్యాన్ని గుర్తించినప్పుడు తదనుగుణంగా మన కార్యా లుండాలి. ఇలాంటి ప్రతి పనీ సామూహిక కార్యం కాక తప్పదు. అయినా రచయిత అయినవాడు ఈ మార్గాన్ని నిర్దేశించడం నైతిక విధి అవుతుంది. నమ్మిన దానిని ఆచరించాలి, అని టాల్‌స్టాయి అంటాడు. లేక నిష్క్రియయే శరణ్యమా? ఈవిధంగా మథనపడ్డాడు టాల్‌స్టాయి. ఇదమిత్థమని ఒక మార్గాన్ని ఏర్పాటు చేయలేక పోయాడని తదనంతర కాలంలో దిలీప్‌కుమార్‌రాయ్‌కి పంపిన లేఖలో, టాల్‌స్టాయిని రోలాఁ విమర్శిస్తాడు. టాల్‌స్టాయి జీవితమూ, సాహిత్యమూ ఉత్తర దక్షిణ ధ్రువాలవలె ఎడపెడలైనవంటాడు. తన హృదయం ప్రబోధించిన దానిని కాదని మరొక దానినే సత్యమనుకొన్నాడు కనుకనే టాల్‌స్టాయి అవస్థకు

బాధ్యత పూర్తిగా టాల్‌స్టాయిదే. వివిధమూ సంపన్నమూ అందు చేతనే సుందరమూ అయిన మానవ ప్రకృతి నంతటినీ ఏకైకమైన ఏ సూత్రానికో లోబరచినప్పుడు ఖేదమే మిగులుతుంది.[6]

## 3

"By its truth and absolute integrity–since Tolstoy I know of no writing so crystal clear–'Jonn christopher' is the first great book of the twentieth Century. It bridges transition and shows us where we stand It reveals the past and the present, and leaves the future open to us."

—Gilbert Cannan : Introduction to 'John christopher'(English Translation)—

మొదలుపెట్టి ముగించేనాటికి ఎనిమిదేళ్ళు (1904—1912) పట్టిన ఈ మేటి నవల—జాం క్రిస్టోఫ్—రోలాంకు అఖండ ప్రఖ్యాతిని సముపార్జించింది. ముగించిన మూడేళ్ళకు నోబెల్ బహుమానం అందింది. ఫ్రాన్సు, జర్మనీ దేశాలు కాళ్ళకు కత్తులు గట్టిన పోటుకోళ్ళయి పరస్పర మారణోద్యోగానికి సన్నాహాలు చేస్తున్న రోజులలో, జర్మన్ సంగీతవేత్త క్రిస్టఫర్ ఫ్రాన్సులో స్థిరపడినట్లు చిత్రించి ఎంతో తెగువనూ తెకువనూ ప్రదర్శించి యుద్ధప్రవాహంమీద రోలాం ఒక స్నేహసేతువయ్యాడు. దేశభక్తికి గల హద్దులను వెనుకటి రోజులలో గోథె (Goethe) మహాకవి విస్తరించి చూపినట్లు ప్రభుత్వాల కోపోద్వేగాలు ప్రజలకూ జాతులకూ సంక్రమించగూడదని మానవ సౌభ్రాత్ర గీతంగా ఈ నవలను రోలాం తీర్చిదిద్దాడు. ఒకవైపు ధనస్వామ్య సమాజ వ్యవస్థకు పట్టిన దుర్దశను వర్ణిస్తూ గూడా, నాయకుడైన క్రిస్టఫర్‌ను సామాజిక వాస్తవం నుండి మరలించి, వ్యక్తి వాదాన్ని మరొకసారి బలపరిచాడు. ఆ వ్యక్తి సమాజం నుండి విడిపోయినవాడు కాబట్టి శక్తిహీనుడు. అతని ధిక్కారం చివరకు లొంగుబాటుగా పరిణమించక తప్పదు. అయినప్పటికీ ఫ్రెంచి ప్రజలకు ఇది ఒక నిలువుటద్దమైంది. వారు హర్షించారు. కాని విమర్శకులు శ్లాఘించలేదు. ఫ్రెంచి రచనా సంప్రదాయం విచ్ఛిత్తి పొందిం దన్నారు. ఫ్రెంచి భాషయొక్క కాకువును రోలాం మన్నించలే దన్నారు. స్పష్టత కొరవడిం దన్నారు. విమర్శకు లేమన్నప్పటికీ దీని విలువ దీనిది. ఎమిలీ జోలా మరణానంతరం, యుద్ధానంతర కాలంలో మరొక రచనా సంప్రదాయం మొదలుగాక మునుపు, సంధి కాలంలో రెండు యుగాలను కలిపే వంతెన వలె ఈ నవల నిలుస్తుంది.

గత కాలంలో వేళ్ళూనిన సంప్రదాయాన్ని తనలో కొనసాగిస్తూ పునరుజ్జీవింపజేసి నవోదయ కాలానికి ఫలోన్ముఖమయ్యే సమయానికి భవిష్యత్తును ఆహ్వానిస్తూ తాను తప్పుకొనే వ్యక్తివలె కనిపించే వర్తమాన కాలానికి క్రిస్టఫర్ సంకేతమవుతాడు. రోలాం హృదయమే అతనిలో స్పందిస్తుంది. ఈ నవల రోలాం ఆత్మ చరిత్ర కూడా. వ్యక్తులూ వ్యక్తి సమూహాలూ జాతులూ నైతిక పరివర్తన పొందడమే కథావస్తువు. "తరం వెంబడి ఇంకొకతరం దౌడు తీస్తుంది. ముదికారును క్రొత్తకారు వెనక పడవేసి ముందు సాగుతుంది" అని రోలాంయే అంటాడు. ఈ తరాల పోటాపోటీ వ్యక్తులలో కనిపిస్తుంది. యూరపియన్ సంగీత సంప్రదాయమంతా క్రిస్టఫర్‌లో మూర్తీభవిస్తుంది. ముఖ్యంగా జర్మన్ సంగీతవేత్తల జీవితాలకూ, మనస్తత్వాలకూ సంబంధించిన అనేక వైయక్తిక విశేషాల నన్నిటిని క్రిస్టఫర్‌లో రోలాం పొదివి పెట్టాడని విమర్శకు లంటారు. అలాగే గోథె మహాకవి, టాల్‌స్టాయి, నీట్చే మొదలైనవారి జీవితాల లోని సన్నివేశాలు కూడా ఈ నవలలో క్రిస్టఫర్ నెపాన ప్రసక్తాను ప్రసక్తాలయ్యాయుట.[7] ఒలివియర్ (olivier) పాత్రతో క్రిస్టఫర్ మనస్తత్వానికి భిన్నమైన ప్రకృతిని సృష్టించాడట. ఒలివియర్ ఫ్రెంచి యువకుడు. క్రిస్టఫర్ మిత్రుడు. ఒకరికి స్వప్నలోక సంచారమూ మరొకటి యదార్థ దృక్పథమూ పెట్టి, ఉభయులనూ కలిపి ఉదాత్తమైన సమ్మేళనను సాధించాడు రోలాం. అలాగే ఫ్రెంచి సమాజాన్ని దుయ్యబడుతూ కొందరు యదార్థ వ్యక్తులనే మనస్సులో అనుకొని Market-place అనే ప్రకరణంలో కొన్ని పాత్రలనూ సన్నివేశాలనూ కల్పించాడు.

సంగీతమూ, దానికి ఆస్కారం కల్పిస్తూ ప్రణయమూ—వీటిని ప్రధానంగా ఈ నవలలో చిత్రించడం జరిగింది. క్రిస్టఫర్ ప్రణయానుభవాలన్నీ సంగీతానుభూతిగా సృజనోత్సాహంగా వెనువెంటనే పరివర్తనం చెందుతూ బాహ్యాభ్యంతర జీవితాలు పరస్పరాశ్రితా లయాయి. అగ్రస్థానాలలో ఉన్న ఫ్రెంచివారు జర్మన్ అని క్రిస్టఫర్‌ను ఈసడించి ఛీ కొడితే, ఒలివియర్ లాంటి ఫ్రెంచి యువకులూ సామాన్య ఫ్రెంచి జనులూ అతనిని ఆదరించి అలరిస్తారు. ఈవిధంగా మొదటితూరి సామాన్య మనుషుల భావౌదార్యం రోలాంచేత ప్రస్తుతింపబడుతుంది. నిజానికి ప్రజలే శిష్టులు; శిష్టుల మనుకొనేవారు కుహనా సంస్కారులు మాత్రమే. అట్టడుగున పడి నిరాదరణకు లోనై ఉన్న యూదులలో కూడా ఈ సౌజన్యమే క్రిస్టఫర్‌కు కనిపిస్తుంది. మానవ

---

6. "The Serious error of Tolstoy (and of many another) lies in wanting to simplify human nature too much ..

". none of the great salutary forces of being should be maimed or thwarted"—AMOG THE GREAT, PP 47—48

7. Romain Rolland ; Alex Aronson. PP75—77

జాతిలో అతనికి—రోలాఁకు గూడా—నమ్మిక, సామాన్యుల మంచి తనం పట్ల గురి ఏర్పడుతుంది.

దేశాల పొలిమేరలను దాటిపోయే ఈ హృదయ సౌరభంలో మరొక పిచిక, తలవనితలంపుగా 1913 లో స్విట్జర్లాండులో. ఉండగా రోలాఁ Colas Breugnon అనే మరొక కళాకారుడు ప్రధాన పాత్రగా రచించిన నవల. ఇది పుస్తక రూపాన్ని ధరించే లోపల యుద్ధం వచ్చిపడింది. అప్పటికే రోలాఁ దేశదేశాంతరాలలో ప్రఖ్యాతి పొందాడు. యుద్ధం సాగినంతసేపు స్విట్జర్లాండును వదిలిపోలేదు. అక్కడ ఉన్నప్పుడే 1915 లో Above the Battle, 1919 లో The Precursors అనే యుద్ధ వ్యతిరేక రచనలను చేశాడు.వీనిలోరోలాఁఅంతర్జాతీయవాదిగనూ ప్రశాంతివాది(Pacifist) గానూ దర్శన మిస్తాడు. అప్పటికే ఫ్రెంచి మేధావుల ఆగ్రహానికి పాత్రుడై ఇప్పుడు ఫ్రెంచి, జర్మన్ యుద్ధప్రియు లందరికి కంటక ప్రాయు డయ్యాడు. కాని, శాంతి నభిలషించే వివిధ దేశాల మేధావుల పక్షాన "ఆత్మస్వేచ్ఛా ప్రకటన" (Declaration of the Independence of the Mind) అనే పత్రంమీద సంతకాలు సేకరించాడు. భారతదేశం నుండి రవీంద్రుడు తన సంతకం ద్వారా దానికి పూర్ణామోదం తెలిపాడు. మేధావులు సంస్కృతిని రక్షించాలి అనే భావం ఇందులో ప్రస్ఫుటమైంది. సంఘర్షణకు అతీతంగా నిలిచి మందనుండి వేర్పడి సామూహికోద్రేకాలను ప్రతిఘటించి ఆత్మసంపదను నిలబెట్టుకొనే వారే ప్రపంచానికి శాంతిని ప్రసాదించగలవారని రోలాఁ భావించాడు. ఇలాంటివారే అంతర్జాతీయ మహాసౌధ నిర్మాతలు కాగలరు. అలాంటి సౌధమే దేవుని ఆలయం కాగలదు. ఇది దేశాల సమ్మేళన కాదు, సురుచిరాత్మ సంపన్నుల సమవాయ మవుతుంది.నాగరికతపేరిటి దౌర్జన్య విధ్వంస వాలనుండి ఇది ప్రాకార కుడ్యమై రక్షాకవచమై ఏకైక శరణ్య మవుతుంది.ప్రజలుగాక ప్రభుత్వ నాయకు లెట్లాగూగాక విమల మనస్కులే ఈపనికి తగినవారని భావించినందుచేత రోలాఁ నిరాశపాలుగాక తప్పలేదు. జాతీయవాదం ఇంకా అనేక దేశాల మేధావుల మనస్సులను శాసిస్తున్నప్పుడు, రోలాఁకు దూషణ తిరస్కారాలు ఎదురు కావడం ఆశ్చర్యకరం కాదు.

మాతృదేశం నుండి తనకుతానై దూరమై స్విట్జర్లాండులో ప్రవాస జీవితం గడుపుతున్న రోజులలోనే, ఫ్రెంచి, రష్యన్ సోషలిస్టుల భావాలు నెమ్మదిగా రోలాఁను సమీపించాయి. స్విట్జర్లాండులో అప్పుడు లెనిన్‌తోబాటు రష్యన్ మార్క్సిస్టులనేకు లుండేవారు.. అలాగే ఫ్రాన్సులో కమ్యూనిస్టు సంఘటన మొదలు రెండవ అంతర్జాతీయ సోషలిస్టుసంస్థ (Second International) జాతీయ వాదానికి లోనై కార్మిక వర్గ ప్రయోజనాలనూ అంతర్జాతీయ శాంతిని వెన్నుపోటు పొడిచి యుద్ధానికి బలాన్ని చేకూర్చిందని రోలాఁ కూడా గ్రహించాడు. లెనిన్ గాని, ఫ్రెంచి కమ్యూనిస్టులు గాని ప్రచారంచేసే భావాలకూ, రెండవ ఇంటర్నేషనల్‌లోని సోషలిస్టు పార్టీల భావాలకూ మౌలికమైన భేదా లున్నట్లు గుర్తించాడు. కాని, ఈ నవ్య భావాలు అప్పటికింకా రోలాఁ హృదయాంతరంలోకి చొరబారలేదు. పార్టీలకూ పక్షాలకూ అతీతమైన విశ్వవిశాలమైన సంస్కృతి, ప్రాథమిక విద్య నిర్బంధ అంతర్జాతీయ భాష—వీటి గురించే రోలాఁ పదే పదే వాదించసాగాడు. రష్యన్ బోల్షివిక్ విప్లవం అయనకు రుచించలేదు. బలప్రయోగమూ, రక్తపాతమూ రోలాఁ నైతిక మూల్యాలనే సవాలు చేశాయి. జార్ చక్రవర్తి పరిపాలన నుండి రష్యా విముక్తిని సాధించినందుకు సంతోషమే ప్రకటించాడు గాని కమ్యూనిస్టు విప్లవ స్వభావాన్ని హర్షించలేకపోయాడు.

దీనికి ఉన్న కారణ మొకే ఒకటి. నీతి విషయాలలో రోలాఁ ఇంకా తనలో తాను మథనపడుతూ తనతో తాను కుస్తీ పడుతూ ఎటూ తేల్చుకోలేని అనిశ్చిత భావాలతో సతమత మవుతున్నాడు. గోర్కీ అన్నట్లు, రెండు లోకాల పొలిమేరలలో తచ్చట్లాడుతున్నాడు[8] చెడుగును సహించి పూరుకోవడమా, లేక ప్రతిఘటించడమా ? ఇది నైతికమైన సందేహం. టాల్‌స్టాయి భావాలకు వారసు డనదగిన గాంధీమహాత్ముడు భారతదేశంలో బ్రిటిష్ పాలకులపై సత్యాగ్రహాయుధాన్ని ప్రయోగిస్తున్నాడని రోలాఁ విని చదివి తెలుసుకో సాగాడు. రక్తపాతంలేని ఈ శాంతియుత ధిక్కారంమీద ఆసక్తి హెచ్చింది. మొదటినుండీ ప్రాచ్య దేశాల మత సంస్కృతి పట్ల రోలాఁకు అశేష గౌరవభావం ఉండేది. ఫ్రెంచి అనువాదాల ద్వారా ఉపనిషత్తులనే గాక భగవద్గీతను బౌద్ధమత సూత్రాలను చదివి వాటి భావాలకు సుముఖత కనబరుస్తూ వచ్చాడు. ఇప్పుడు గాంధిజీ పత్రిక "యంగ్ ఇండియా" ను చదవడమే గాక, మహాత్ముని యూరపియన్ మిత్రులైన సి. ఎఫ్. యాండ్రూస్, పియర్సన్ ప్రభృతులకు ఉత్తరాలు రాసి కూడా, గాంధిజీ గురించి తెలుసుకోసాగాడు. రవీంద్రుడు కూడా లేఖా ముఖంగానూ సముఖంలోనూ మరింత సమాచారాన్ని ఇచ్చాడు. అందుచేతనే 1924 లో రోలాఁ గాంధిజీ జీవిత చరిత్ర రచించగలిగాడు. రెండవ రౌండ్ టేబిల్ సమావేశానంతరమే ఈ మహా పురుషులు స్విట్జర్లాండులో మొదట కలియ గలిగారు. ఈలోపల కాళిదాస్ నాగ్, దిలీపకుమార్ రాయ్ మొదలైన భారతీయ యువకులు రోలాఁకు భారతదేశ పరిస్థితుల గురించి మరింత ఎక్కువ అవగాహనను కలిగించారు.

చాలకాలంనుండి రోలాఁ మనస్సును క్షుభితం చేస్తూ వచ్చిన నైతిక సందేహాలను గాంధిజీ పటాపంచలు చేయగలి

8. Romain Rolland and Maxim Gorky : Jean Perus.

గాడు. టాల్‌స్టాయి సమకూర్చని సంతృప్తి గాంధిజీ ద్వారా లభించింది. చెడుగును ప్రతిఘటించకుండా చేతులు కట్టుకొని కూర్చున్నంత మాత్రాన చెడుగును బలపరచినట్లే అవుతుంది. ఒక చెడుగును మరొక చెడుగు ద్వారా నిర్మూలించుకోవడం భ్రమ అవుతుంది. చెడును మంచి ద్వారా, దౌర్జన్యాన్ని సౌజన్యం ద్వారా, బలప్రయోగాన్ని అహింస ద్వారా ప్రతిఘటించ బూనుకొని గాంధిజీ భారతదేశాన్ని జగద్విఖ్యాతి గావించాడని రోలాం గ్రహించాడు. కాని, అహింస దౌర్బల్యానికి పర్యాయపదం కాగూడదు. నమ్మినదాని కొరకు కష్టనష్టాలోర్చి బాధలు కుడిచి జీసస్ వలె ఆత్మాహుతి ద్వారా నైతిక విజయాన్ని గాంధిజీ సాధిస్తున్నాడని రోలాం అన్నాడు.[9]

గాంధిజీ బోధించిన ప్రతి విషయమూ రోలాం మది కెక్కిన దనలేము ఆనాళ్లలో విదేశవస్త్ర దహనం గురించి, స్వదేశీ ఉద్యమం వేస్తున్న వెర్రితలలు గురించి రవీంద్రుడూ మహాత్ముడూ ఘర్షణ పడినారు. రోలాం రచనలోకెల్ల ఈ అంశం చాలా ఆసక్తికరమైన దనిపిస్తుంది పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని విడిచి సరళ జీవనాన్ని అలవరచుకొమ్మని భారతీయులకు గాంధిజీ చెప్పిన హితవు వరకైతే, రవీంద్రునికి గాని రోలాంకు గాని పేచీ లేదు. సంప్రదాయాన్ని నిరసించమని వారిద్దరూ అనలేదు. విజ్ఞానశాస్త్రాన్ని, పరిశ్రమలను, యంత్ర భూయిష్ఠమైన ఆర్థిక వ్యవస్థను నిరసించి, గ్రామ స్వరాజ్యం పేరిట కుటీర పరిశ్రమలను, చేతిపనులను, చర్ఖాను, ఖద్దరును అతిగా సమర్థించడమే వారికి కష్టమనిపించింది

సహాయ నిరాకరణోద్యమం పోనుపోను పాశ్చాత్య నాగరికతనే నిరాకరించే ఉన్మాద స్థితికి చేరుకొంటున్నదని, ఇది ఆత్మహత్యా సదృశమని రవీంద్రుడు ఆక్రోశిస్తాడు ప్రాక్పశ్చిమల సమ్మేళనమే జగచ్ఛ్రేయస్కారిఅని రవీంద్రుని మతం గాంధిజీకూడాదీనిని కాదనడు జగత్కుటుంబభావన కూడా ఆయనకు విహితమే.దేశాభిమానం దేశభక్తిగా దేశభక్తి విదేశద్వేషంగా పరిణమించడం ఆయనకు గూడా రుచించదు.[10] ఇంటిచుట్టూ ప్రాకారాలు నిర్మించుకుని గవాక్షాలను మూసుకుని ఇంటిలో తానొక బందీగాక, అన్ని సీమలనుండి

---

9 "Gandhi is a Tolstoi in a more gentle appeased, and if I dared, I would say in a more christian sense, for Tolstoi is not so much a chris-tian by nature as by force of will "—Mahatma Gandhi—PP 32—33.

10 "For, Patriotism is the same as humanity I am Patriotic because I am human and humane My patriotism is not exclusive A patriot is so much less a patriot if he is a lukewarm humanitarian " —Mahatma Gandhi, March 16, 1921

సంస్కృతి సుగంధిలపవన వీచికలుగా తన ఇంటిని చొచ్చుకొని పోవాలి అయితే "అందులో దేనిమూలంగానైనా గాని కాలి పట్టు తప్పి తూలిపోవడానికి నే నంగీకరించను. నాది ఖైదు—కొట్టు మతం కాదు ఈశ్వర సృష్టిలోని కడగొట్టువానికి గూడా అందులో తావున్నది. కాని, జాతి, మత వర్ణాహంకారాలకు అది రక్ష." రవీంద్రునికి గాంధిజీ మాట పట్ల అంతఃకరణ శుద్ధి పట్ల దొడ్డ గురి ఉంది గాని గాంధేయుల గురించి మాత్రమే జంకు నైతికశక్తి నిరంకుశమైపోయి మనుష్యుల మనస్సుల స్వేచ్ఛను కాలరాచి వేస్తుందేమోనని భయం. పైగా యంత్ర నాగరికత పూర్తిగా చెడ్డదని, మన దేశానికి ఉపయుక్తం కాదని తాను భావించలేడు. దేశ ప్రజల తిండి, గుడ్డ కొరతలు తీరేందుకు పరిశ్రమలు తప్పనిసరి. "భారీ యంత్రాలు పాశ్చాత్య దేశాలకు ప్రమాదకరాలైతే, చిట్టి పొట్టి యంత్రాలు మనకు అంతకుమించిన ప్రమాదకరాలు కావూ ?" ఈ విషయం గురించి మహాత్మునికీ రవీంద్రునికీ చాలా పెద్ద గ్రంథమే నడిచింది ఎవరి వాదాన్ని వారు గట్టిగా బలపరచుకొన్నారు. రోలాఁకు రెండు వాదాలూ కొంత మేరకు నచ్చాయి. కాని, గాంధేయుల వలన గాంధీ తత్త్వానికి ప్రమాద మున్నదని భావించాడు తాము అసలు సిసలు శిష్యుల మనుకొనేవారే, మరింత ప్రమాదకారులు. మొత్తానికి ఈ వివాదంలో రోలాఁ రవీంద్రునివైపే ఎక్కువగా మొగ్గు చూపాడు అంతర్జాతీయ భావానికి ఏవిధమైన విద్రోహాన్ని రోలాఁ సమర్థించలేడు ప్రాచ్య పాశ్చాత్యాలు పరస్పరలోపపూరకాలనే సిద్ధాంతానికి ఎప్పుడూ వెంద్రుకవాసి దూరమైనా పోనొల్లడు.

గాంధిజీ ఆధ్యాత్మిక జాతీయ వాదానికి రోలాఁ తన అంతర్జాతీయ వాదాన్ని పోటీగా నిలిపాడు. గాంధిజీలో రోలాఁకు బాగా నచ్చినది త్రికరణశుద్ధి— నమ్మినదానిని దృఢ ధైర్యాన ఆచరింప గలగడమే ! పైగా, నాయకుడైన మహా పురుషుడు అనుచరులతో అభేద స్థితిని పొందుతున్నాడు. తాను అందరిలాంటివాడౌతున్నాడు టాల్‌స్టాయిల్‌లో ఉన్నట్లుగా గాంధిజీలో అంతఃకలహం లేదని రోలాఁ అన్నాడు గాని టాల్‌స్టాయిలో కూడా ఇలాంటి చీలిక ఏదీ లేదని రోలాఁతో గోర్కీ వాదించాడు గాంధిజీకి రవీంద్రుడు జత. ఒకరికి విశ్వాసబలం, మరొకరికి ఆత్మస్వేచ్ఛ మూలకందాలు ఒక్కొక్కసారి ఈ విశ్వాసం మానవాత్మలను శృంఖలాబద్ధం చేయువచ్చును. అందుచేత గాంధిజీని మధ్యయుగీన వసుధైక భావుకుడని (Mediaeval universalist) అని వర్ణించి, "With all veneration to the Mahatma, I am with Tagore" అని కుండ బద్దలుగొట్టి చెప్పాడు

మార్మికవాదం గురించి (Mysticism) ఆధ్యాత్మికానుభూతి గురించి రోలాఁకు సదభిప్రాయం ఉంటూవచ్చింది. డాక్టర్ ఆనంద కుమారస్వామి రచనలను చదవడంవల్ల ఇది మరింత ధ్రువపడింది. కొందరికి మార్మికవాద మంటే చిన్నచూపు. మానవబుద్ధిని మీరిన అనుభవం అబద్ధమంటారు. కాని, యోగులు, సాధకులు, ఆత్మప్రత్యయం ద్వారా (Intuition) సేకరించుకొన్న అనుభవాలు ఇంద్రియాల ద్వారా సేకరించిన అనుభూతుల కంటె భిన్నమైనవి, శాశ్వతమైనవని భావించేవారు లేకపోలేదు. అలాంటి వారిలో రోలాఁ ఒకడు. అందుచేతనే రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి జీవిత చరిత్రలను గ్రంథస్థం చేయ బూనుకొన్నాడు. రామకృష్ణుని జీవితంలో రోలాఁకు బాగా మదికెక్కిన విషయం, ఆత్మైక్యత.[11] పాశ్చాత్య దేశాలలో హేతువాద పరత్వము ప్రాచ్యదేశాలలో మతవిశ్వాస పరత్వము ప్రముఖ లక్షణాలనే ద్వైధీకరణమే తప్పని రోలాఁ అంటాడు వేర్వేరు రూపాలలో అవి ఉభయ సామాన్యాలే ఆత్మానుభూతికి సీమాభేదాలు లేవు.

మత విశ్వాసముతోబాటు కార్యాచరణకు గూడా రోలాఁ సమాన ప్రాశస్త్యం ఇచ్చాడు. ఆగొన్నవారికి మత మొందుకన్న రామకృష్ణుడు రోలాఁకు కార్యవాదిగా, ఫ్రాన్సిస్ ఆఫ్ అసీసీ వంటి సేవాపరాయణుడుగా దర్శనమిస్తే, దరిద్రుడే తనకు నారాయణుడని పలికిన వివేకానందుడు సెయింట్‌పాల్ వలె కనిపించాడు. కాబట్టి మత విశ్వాసమూ ఆత్మానుభూతీ కార్యరూపం తాల్చనప్పుడు, ఉండి కూడా లేనట్లే నిష్కామకర్మను గురించి గీతా ప్రబోధాన్ని కూడా రోలాఁ గుర్తించాడు స్వప్నానుభూతి నుండి శక్తినీ, కార్యోత్సాహాన్ని పొందగోరినందుచేతనే భారతదేశానికి ఆధ్యాత్మిక యాత్ర చేసి వచ్చానని చెప్పాడు. భగవద్ధ్యానమూ, సంకీర్తనమూ, తపోనిష్ఠ వంటి సాధారణ విషయాలు గాక, సాంఘిక కార్యాచరణమే మతానికి గల పర్యవసానమై ఉండవలె నన్నాడు సాధన దేనికొరకు ? సత్కర్మానుష్ఠానానికని జవాబు. మరలా బెథోవెన్ గురించి రచించినప్పుడు, ఈ అభిప్రాయాన్నే రోలాఁ ప్రకటించాడు. సంగీత సాధన కూడా ధ్యాన సమానమని, సమాధి స్థితి వంటిదని సిద్ధాంతం చేశాడు కూడా. వేదాంత తత్త్వం ఒక్క భారత దేశానికేగల సకల లోకానికి సనాతనమైన సామాన్యానుభూతి అని అన్నాడు కానట్లయితే, వివేకానందస్వామి అమెరికాకు పయనించక మునుపే, ఎమర్సన్ గాని, థోరో గాని, విట్మన్ గాని, షోపెనార్‌గాని ఇలాంటి తత్త్వాన్నే ఎలా ప్రకటించగలిగారని ప్రశ్నిస్తాడు. ఆ ప్రశ్నకు జవా బిక్కడ అప్ర

---

11 "And it is because Ramakrishna more fully than any other man not only conceived, but realised in himself the total unity of this river of God, open to all rivers and all streams, that I have given him my love "

—THE LIFE OF RAMAKRISHNA.

స్తుతం. గమనించవలసిన విషయం ఇది. రోమేఁ రోలాఁ మనస్సు అనేకమైన రంగుదారాలు దూరిన వస్త్రం వంటిది. ఎప్పటికప్పుడే కొత్త పోగులు వచ్చి కలిసేవి. మనస్సు నిత్య నూతనానుభవాలకూ అభిరుచులకూ ఆకర మయ్యేది. రోలాఁ చేసినట్టిది నిజంగా యాత్రవంటి భావప్రస్థానం. అందులో ఒక పెద్ద మజిలీ భారతదేశ మత విశ్వాసాలపట్ల అతని కేర్పడిన జిజ్ఞాస.[12]

## 4

"A man worthy of his name must learn to be solitary for all, to think alone for all." It epitomized the life of Romain Rolland."

—Dilip Kumar Roy AMONG THE GREAT

రోమేఁ రోలాఁ ఏకాంత సాను స్థితి ననుభవించినంతగా ఏకాకితనాన్ని తత్ఫలితమైన ఆత్మనిర్వేదాన్ని అనుభవించాడని నే ననుకోను. మొదటి ప్రపంచయుద్ధం, తదనంతర రాజ్య సంక్షోభ సమయము రోలాఁ మనస్సును బాధాసంతప్తంగావించి మాత్రమే పోలేదు. ఈ అగ్నిపరీక్ష నుండి వన్నె హెచ్చి క్రమంగా అతని మనస్సు అపరంజిగా బయల్పడింది.

యుద్ధకాలంలో De profundis (లోలోతులనుండి)— పేరిట తన సంతాపాన్ని కావ్యరూపంలో వెలువరిస్తూ శాంతి దేవతను ఆవాహనం చేశాడు "ఇంతింత లనరాని ఈసురోసీల ముంపైన మానవాధోసీమనుండి"[13] చేయెత్తి శాంతిని చేరబిలిచాడు. ఇది ఒక ఆత్మాక్రోశమైంది. కాని, యుద్ధమగ్నులైన ఫ్రెంచి జర్మన్ దేశాల కవులు, ఇతర కళాకారులు ఈ అవబోధాన్ని ఇంత గాఢంగా పొందలేక పోయారు. రోలాఁ వలె సంఘర్షణకు అతీతంగా నిలిచి నిష్పాక్షికతను అలవరచుకొని సమకాలిక ఘటనలను తటస్థులై చూడలేకపోయారు. తప్పు వారిది కాదు. వారి మనస్సులను చీకటి కోనలుగా, ద్వేషకూపాలుగా చేసిన జాతీయ వాదభావానిది ఆ తప్పు. అది వారిచేత రోలాఁను వెలివేసి కసితో నిందలుమోపే పనిని చేయించింది. రోలాఁ తయారుచేసిన ఆత్మస్వేచ్ఛా ప్రకటన మీద మొదట ఫ్రాన్సు, జర్మనీ, బెల్జియం, ఇంగ్లాండు మొదలైన యూరపు దేశాల మేధావులు వందల మంది సంతకాలు చేయనైతే చేశారు. రష్యా దేశానికి గోర్కీ, భారతదేశానికి రవీంద్రుడూ ప్రాతినిధ్యం వహించారు. అమెరికా నుండి అప్టన్ సింక్లేర్, షెర్వుడ్ ఆండర్సన్లు జత కలిశారు. కాని సంతకాలు చేయనివారిలో బెర్నార్డ్షా, వెల్స్, గాల్స్వర్దీ, మదాంక్యూరీ, అనటోల్ ఫ్రాన్స్ వంటి సుప్రసిద్ధ వ్యక్తు లుండిపోయారు.

ఈ సమయానికే నేరుగా రోలాఁ మీద రాళ్ళు రువ్వ బూనినవారూ తయారయ్యారు. భావ పరాజయవాదానికి రోలాఁ ఆదిపురుషుడనే దూరు మొదలైంది. దేశద్రోహ నేరాన్ని కూడా మెడకు తగిలించారు. రోలాఁకు ఒక తత్త్వమేదీ లేదని, అస్థిర చిత్తుడని, మానవ సౌజన్యంలో విశ్వాసం కోల్పోయి బరి తెగించిన భావాలు కలవాడని నిందించారు. ఈ 'విమర్శకులు' అనేకులు తదనంతర కాలంలో హిట్లర్ అభిమానులు అయిన సంగతి గుర్తించదగింది. మరికొందరు రోలాఁతోబాటు రష్యా, జర్మనీ, భారతదేశాలను కలియగట్టి తిట్టారు. ఈ నిందలూ నిష్ఠూరాలూ రోలాఁను పదిమందికీ ఎరుకపరిచాయి తప్ప అతని ప్రతిష్ఠను కూల్చివేయజాలక పోయాయి. సరిగా యీ కాలంలోనే రోలాఁ నాటకాలు పేరిస్ నగర ప్రేక్షకుల నాకర్షించాయి. అది రోలాఁకు తృప్తి నివ్వలేదు. సాహచర్యాన్నీ సమరస్యాన్నీ తాను బోధించిన ఫ్రాన్సు, జర్మనీ దేశాల మేధావులలో ఎక్కువమందికి తాను కంటకప్రాయు డయ్యాడు. ఫ్రెంచివారి దృష్టిలో రోలాఁ మాతృదేశద్రోహి, జర్మన్ గూఢచారి కాగా, జర్మన్ల దృష్టిలో నాగరికతాశైథిల్యానికి ఆత్మదారిద్ర్యానికి రక్తనైచ్యానికి రోలాఁ ఉదాహరణప్రాయు డయ్యాడు. ఈ 'విమర్శ' ల కన్నిటికీ రోలాఁ సమాధాన మిచ్చాడు. ఉద్రేకాలు కళ్ళను కప్పివేయగా, ద్వేషం మనస్సును బండ్రాయి చేయగా, గుడ్డి యుద్ధం సాగించిన మందమతుల నుండి తప్పుకొని దూరంగా ఏకాంతంగా ఉండిపోవలెనని నిస్పృహతోటి తన మనస్సంకల్పాన్ని ప్రకటిస్తూ, "I withdraw into Art, an inviolate refuge" అన్నాడు.

యుద్ధ ప్రారంభానికి ముందే రచించి పత్రికలలో ప్రకటించినా, Colas Breugnon అనే నవల యుద్ధానంతరమే పుస్తకరూపం ధరించ గలిగింది. రోలాఁ రచనలలో ఇది మణిపూస వంటిదని విజ్ఞు లన్నారు. రష్యన్ నవలాకారుడు గోర్కీ అభిప్రాయం ప్రకారం, అకాలపు రచనలలో ఇది పరమో

---

12. "I infer therefore that there is some direct family affinity between an Aryan of the occident and an Aryan of the orient. And I am persuaded, my dear friend Roy, that I must have descended down the slopes of the Himalayas along with those Victorious Aryans...."

—AMONG THE GREAT, P. 53

13. తెలుగు అనువాదం నాది ; "భువనఘోష" లో "శాంతిగీత".



## ఇదీ దోమ

ప్రపంచమంతటా వున్నదీ దోమ. ఇందులో మగవి నిరపాయకర మయినా, ఆడవి మాత్రం రక్తం మీదనే జీవిస్తాయి. రక్తాన్ని పీల్చే ముందు ప్రతిదోమా అదోరకమయిన ద్రవ పదార్థాన్ని మనిషి శరీరంలోకి పంపి, స్పర్శజ్ఞానం నశించేలా చేస్తాయి ఈ ద్రవపదా ర్థంలో ఎంతో హానికరమయిన క్రిములుంటాయి. మలేరియా, తలి జ్వరం, డింగీ, ఫైలేరియా వ్యాధులు వీటిఫలితమే.




## ఇదే దోమల సంహారిణి–యర్రని టిన్నులోని ఫ్లిట్

దోమలను సంహరించేందుకు ఫ్లిట్‌ను చల్లాలి. తలుపులు, కిటికీలు మూసివేసి ఇల్లంతా మరియు ఇంటి వుపరితలాన యీ ఫ్లిట్‌ను చల్లటం లాభదాయకం. పది నిమిషాల తరువాతనే తలుపులు తెరవాలి.

యర్రని టిన్నులలోని ఫ్లిట్ దోమలను, యీగలను, ఇతర సంచార కీటకాలను చంపుతుంది. ఐదు శక్తి వంతమయిన రసాయనిక పదార్థాల సమ్మేళనమే ఫ్లిట్ ఇది రెండు విధాల పనిచేస్తుంది: తక్షణం కీటకా లను కొట్టి త్వరలో వాటిని చంపును. ఇంటివుపరితలాన, మూలల్లోను కూడా చల్లండి. మరొక్కమారు గుర్తుంచు కోండి – యర్రని టిన్నులలో ఫ్లిట్ ఎగిరే కీటకాలకు ప్రాణాంతకం!

## *మీ గృహ సంరక్షణకు*

# ఫ్లిట్

యర్రని టిన్నులలోని ఫ్లిట్, ఈగలు, దోమలు మొదలయిన సంచార కీటకాలకు బద్ధ విరోధి!
"పఫర్ పాక్"లోని ఫ్లిట్ పొడి నల్లులు, బొద్దింకలు మొదలయిన పారాడే జీవాలను రుదిముట్టిస్తుంది.

ESSO

ఎస్సో స్టాండర్డ్ యీస్టరన్, ఇంక్.
(పరిమితమైన బాధ్యతతో అమెరికాలో నిర్వహింపబడుతున్నది)

CMEF-2A

తృప్తిప్రదమైనది 14 యుద్ధకాలంలోనే రోలాఁ మరి మూడు రచనలు గావించాడు అందులో Liluli అనేది అపహాసాత్మకమైన ప్రహసనం. జీవిత సంక్షోభం నుండి రాజకీయ సంఘర్షణ నుండి తాను తప్పుకొన్న తర్వాత లోకుల మతిమాంద్యాన్ని అపహసిస్తూ సాగిందీ రచన. లియులి అనే దేవత అసలు పేరు, 'భ్రమ'. ఈ భ్రమ మూలంగానే, స్నేహసేతువుమీద నిలిచిన నాయక వ్యక్తు లిద్దరూ కుమ్ములాడుకొంటారు. రోలాఁ అనుభవించిన బాధామయమైన నిస్పృహ ఇందులో కనిపిస్తుంది. ఉన్మత్తుని ప్రలాపమేమో అనిపిస్తుంది. ఏదీ శ్లాఘ్యం కాదు. అయినా రోలాఁ భావన క్రమం తప్పదు. మానవ మహా సమస్యల గురించి అతని మనస్సు పరిపరివిధా లవుతున్నది. ఈ కథలోని వ్యక్తులు పరమ సామాన్యులే గాని మహాపురుషులు గాదు. ఊరు పేరు కోల్పోయేవిధంగా మందలో కలసిపోయినవారు. ఉద్రేకాలకు మనస్సుల నప్పగించినవారు. అందమైన అబద్ధాల కొరకు, నినాదాల కొరకు, జీవితాలను కోల్పోయేవారు. భ్రమకు లోనై సత్యాన్ని చూడనేరనివారు అందుచేత ఈ రచనలో, Colas Breugnon లో ఉన్నట్లుగా, హాసరేఖకూ, ఆశావికాసానికీ తావులేదు. కన్నీళ్లు, కోపమూ, బాధ—ఇవి సర్వేసర్వత్రా 'లియులి' లో దర్శన మిస్తున్నది ఇందుచేతనే.

దాని తర్వాత రోలాఁ రచించిన నవల పేరు pierre and luce. ఇందులోనూ యుద్ధ బీభత్సమే వర్ణితమైంది అయినా బీభత్సం నట్టనడుమ ప్రేమైకజీవులిద్దరు—పియరీ, లూస్—పరమ అమాయకంగా సంచరిస్తారు పియరీకి ఈ యుద్ధ మెందుకు జరుగుతున్నదీ కొంచెమైనా తెలియదు. తెలుసుకో గోరుతాడు ఈ ఎరుక పూర్తిగాకమునుపే, తన ప్రణయం ఫలసిద్ధిని పొందకమునుపే, ప్రేయసి లూస్‌తో కూడ బాంబు పాటువల్ల ఆకస్మికంగా మరణిస్తాడు. బాంబుకు ఒక మతి అంటూ లేదు. యుద్ధానికీ మతిలేదు. మతిగల మనిషి మతిలేనట్లు వ్యవహరించే సామూహికోన్మాదానికి మారుపేరే యుద్ధం. **అది ప్రశాంత జీవన సౌఖ్యానికి భంగపాటు. ఈ కథలోని సంకేతాలకు అర్థ మిదే.** ఇందులో మళ్లీ వ్యక్తి మనస్సు, రోలాఁ ఆదరణకు నోచుకుంటుంది.

యుద్ధం గురించి రోలాఁ మరొక నవల రచించాడు. దాని పేరు Cheramboult. **దాని ఉపశీర్షిక ఇతివృత్తాన్ని సూచి**స్తుంది. "యుద్ధకాలంలో ఒక స్వచ్ఛంద మనస్సుయొక్క కథ." సమూహాన్ని ధిక్కరించిన వ్యక్తి ఇందులో నాయకుడు. అతను ఒక భావాన్ని గర్భీకరించుకొన్నాడు. అతను చేసే యుద్ధం భావవీధిలో చేసే పోరాటమే. యుద్ధం మానవాత్మను ఏవిధంగా హింసించి నాశనం చేసేదీ రోలాఁ వర్ణించ బూనుకున్నాడు. ఆ ఉక్కుపట్టునుండి వ్యక్తి మనస్సు ఏవిధంగా స్వతంత్రమయ్యేది, ఫలశ్రుతి వంటిది. కన్న కొడుకు యుద్ధమూలంగా చనిపోయాక షెరాంబాల్ట్ బుద్ధివ్యాపారం ప్రారంభమవుతుంది. అది కార్యంగా పరిణమిస్తుంది. అబద్ధాల చుట్టూ ఉన్న పొరలను ఒక్కొక్క పొరను ఒలిచి నిజాన్ని సమీపించే కొద్దికీ, అతని కష్టా లెక్కువవుతాయి. అతను ఇతరుల నుండి వేరుపడి ఒంటరిగాడవుతూ పోతాడు. 'సమాజం' అతన్ని హింసిస్తుంది. కోర్టు శిక్ష, జైలు వగైరాలు దానిచేతి ఆయుధా లౌతాయి. అతను నిజాన్ని కనుగొన్నాడు. అది అపరాధ మవుతుంది. దాని ప్రతిఫలమే అతని ప్రాణత్యాగం. కాబట్టి సత్యసాధన కొరకు అతనొక త్యాగి కాగలుగుతాడు దౌర్జన్యం బట్టబయ లౌతుంది దేశభక్తి, వర్ణాధిక్యం, వర్గ ప్రాబల్యం వగైరాల నిజస్వరూపం దర్శనమిస్తుంది ఒక పనిని సాధించేందుకు ఏ మార్గమైనా పనికి వస్తుందా? మంచిపని కోసమైనా సరే, చెడుదారి త్రొక్క వచ్చునా? ఈ నైతిక ప్రశ్నలకు రోలాఁకు సమాధానం లభిస్తుంది యుద్ధమనేది నిజానికి ధనదాహంగల వ్యాపార ప్రయోజనపరుల కుట్రకు ఫలితమేనని, యుద్ధాన్ని నిర్మూలించవలెనంటే మొదట ఆ స్వార్థ జీవుల అధికారాన్ని కూలద్రోయవలెనని రోలాఁ కనుగొన గలిగాడు

రోలాఁ రచించిన మరొక నవల L'ame Enchantee (The Soul Enchanted)—అనేక భాగాలతో కూడిన పెద్ద రచన తొలి భాగాలలో నాయిక అయిన అన్నెట్ట్ రైవీరీ (Annette Riviere) జాన్ క్రిస్టఫర్‌కు మానసికంగా వారసురా లనిపిస్తుంది అరణ్యరాజ్యంగా పరిణమించిన మానవ సంఘంలో తన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవలెనని అన్నెట్ట్ శతధా ప్రయత్నిస్తుంది సంఘ విషయాలకు ఎడంగా ఉంటుంది. తన సొంత ప్రేమ వ్యవహారం, పెళ్లి, కుటుంబం—ఈ పరిధిలోనే స్వేచ్ఛకై పోరాటం సల్పుతుంది. కాని, ఈ నవల చివరి భాగాలలో కథాగత పాత్రలకు గల పరిధి విస్తరించి వైయక్తిక **సమస్యలు వెనుకబడి సంఘ విషయాలకు అధికతర ప్రాముఖ్యం** లభిస్తుంది. ఈ పాత్రలు రోలాఁ అన్నట్లుగా "మానవ మహా సముద్రంలో బిందువులు" గా పరిణమిస్తాయి. కాని ఈ ఒక్కొక్క బిందువులోనూ యావత్ సముద్రమూ నిబిడీకృతమై ఉంది. **జరాగ్రస్తమైన ఒక వ్యవస్థ మరణాక్రోశమూ, వర్ధిష్ణువైన** నూతన వ్యవస్థ యొక్క శిశువిలాపమూ వినిపిస్తాయి. అన్నెట్ట్

14 "Its inimitable national flavour, its optimism and philosophy, the warm human feeling and the beauty of language and style.... make this book one of the greatest attainments of French literary art."

—Artist, Humanist, Fighter: Trushchenko.

పూర్తిగా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఉద్ఘోషిస్తే ఆమె కుమారుడైన మార్క్ ఈ ఇరుకు తొడుగును విసరికొట్టి, సంఘ వ్యవస్థను పునర్నవీకరించ గోరుతున్న జనసామాన్యంతోటి సానుభూతి ప్రదర్శించి తానూ వారిలో ఒకడౌతాడు. సామాజిక పరిస్థితులు ఈ మార్పును సాధ్యం చేస్తాయి. ఈవిధంగా "ఆత్మయొక్క గతి తర్కం" (Dialectic of the Soul) ఈ బృహద్రచనలో ప్రత్యక్ష మవుతుంది. మహా పురుషులు మరుగున పడిపోయారు. వ్యక్తి పితూరీలు నిష్ఫలాలయ్యాయి. ఒక మహా సాంఘిక శక్తి చరిత్రను నిర్మించ సాగింది. ఈ నవలలోని పరమార్థ మిదే ఇలాంటి సందేశంగల రచనను గోర్కీ, కారల్ రేడెక్ వంటి సోవియట్ మేధావులు ప్రశంసించడం ఆశ్చర్య మనిపించదు. రోలాఁ ఎట్టకేలకు సమాజవాదిగా పరివర్తనం చెందుతున్నాడని వారు సంతోషించారు ఈ పరివర్తనలో గోర్కీ ప్రభావం బలీయమైన అంశమేగాని, ఇది ఎక్కువగా రోలాఁ మనస్సులో కలిగిన స్వతంత్రమైన మార్పు. లోనుండి వచ్చినదే గాని అరువు తెచ్చుకొన్నది కాదు సమాజ వాస్తవంతోటి అమరికలేని వ్యక్తివాదపు భావజాలాన్ని విసర్జిస్తూ వస్తున్న రోలాఁ, చివరకు వ్యక్తిని తనీగా సంఘవిద్రోహిగా నిలుపక, సంఘంతోటి సామరస్యాన్ని సాధించుకొని సాఫల్యాన్ని పొందినట్లుగా భావించే స్థితికి వచ్చాడు. రోలాఁ భావప్రస్థానంలో ఇది చివరి మజిలీ.

మానవవ్యక్తి మనస్సు ఏవిధమైన సాంఘిక క్రియనూ ఆచరింపనొల్లని వితండ వ్యక్తివాదిగా మొదలై, మహాపురుషుడైన విరాట్ వ్యక్తి క్రియాశీలమై, సామాన్య వ్యక్తియొక్క సంకుచిత క్రియగా మారి, చివరకు సామాన్య వ్యక్తుల చైతన్యయుతమైన నిర్మాణపరమైన సాంఘిక క్రియాశక్తిగా పర్యవసించిన క్రమపరిణామానికి రోమేఁ రోలాఁ హృదయమూ, తజ్జన్య రచనా సముదాయమూ సాక్షీభూత మవుతున్నాయి. రోలాఁను స్మరణీయుడుగా చేసేది ఈ వివర్ధనశీలమైన, నవనవోన్మిషితమైన, భావ వికసనమే ననాలి అందుచేతనే డెస్మండ్ మెకార్థీ వంటి విమర్శకుల దృష్టిలో ఈనాడు రోలాఁకు గల ప్రాముఖ్యం, నైతిక భావ పరమైనదే గాని సాహిత్యపరమైనది గాదు ఈ దృక్పథం రోలాఁ కళాసృజనకు అపచారం కావిస్తున్నదని చెప్ప నక్కరలేదు.

మేధావిని జనసముదాయం మధ్య నిలిపి, మునుపు వారి నడుమ ఉండిన భావాఖాతాన్ని పూడ్పించివేసినంత మాత్రానో, రష్యా వంటి దేశాన జరుగుతున్న సంఘ పునస్సృష్టిని శ్లాఘించినంత మాత్రాననో, రోలాఁ కమ్యూనిస్టు కాలేదు. 1917 మార్చిలో లెనిన్ స్విట్జర్లాండు వదిలి రష్యాకు ప్రయాణం కట్టినప్పుడు రోలాఁను వెంట రమ్మని పిలిచాడు. రోలాఁ నిరాకరించాడు. ఇంకా రోలాఁ మనస్సులో వ్యక్తి విశిష్టతను గురించి విశ్వాసం నిలిచిఉంది.. ఆ విశ్వాసమే 1924 లోనూ తదనంతరమూ అతనిచేత గాంధి, రామకృష్ణ, వివేకానందుల జీవిత చరిత్రలను రచింపజేసింది. మత విశ్వాసమంటే సాంప్రదాయికమైన దృక్పథాన్ని విడిచి, క్రియాశీలమైన జనోద్ధరణగా దీన మానవ సేవగా సంభావించేటట్లు చేసింది. జనసమూహ మంటేనూ, సామూహికమైన క్రియ అంటేనూ అపనమ్మకమూ, భయ సంశయాలూ ఇంకా రోలాఁను వెన్నాడుతూనే ఉన్నాయి. తన మిత్రుడైన పి జె జ్యూవ్‌తో ఈ భావాలను ఒకసారి ఆయన వెల్లడించాడు. సమిష్టి శక్తులను శ్లాఘించవలసిందే గాని వాటిని ఎదుర్కొనడం కూడా ఆవశ్యకమే. ఆత్మశక్తితో వీటిని ప్రతిఘటించాలి. అంటాడు. ప్రజలు అనుచరులుగా ఉండవలసినవారే గాని నాయకులు కాగూడదని భావించినాడు.[15]

రవీంద్రనాథఠాగూరును సవరించ సాహసించిందీ కాలంలోనే. ఠాగూరు 1924 లో ఇటలీ దేశాన్ని సందర్శించి రోలాఁను స్విట్జర్లాండులో కలిశాడు. ఇటలీలో విశ్వకవికి బ్రహ్మరథం పట్టారు. ముస్సోలినీ స్వయంగా రవీంద్రుని శ్లాఘించాడు. ఇది సరస్వతీ పూజ కాదు. రాజకీయపు ఎత్తుగడ అని రోలాఁ చెవి నిల్లు కట్టుకుని ఎంత చెప్పినా, రవీంద్రుడు విశ్వసించకపోగా ముస్సోలినీ పట్ల దాక్షిణ్య భావాన్ని ప్రకటించసాగాడు. రోలాఁకు మతిపోయినట్లయింది. ముస్సోలినీ నిరంకుశ పాలన నుండి తప్పుకొని పరపంచలలో బ్రతుకు వెళ్లబోసుకుంటూ ఉండిన ఇటాలియన్ మేధావులు కూడా, రోలాఁకు జత కలిసి, ఫాసిజపు దారుణ స్వరూపాన్ని రవీంద్రుని కళ్లకు కట్టించారు. కవి పూర్తిగా మెత్తబడలేదు. కొన్నేళ్లవరకు ఈ విషయం గురించి రోలాఁ రవీంద్రునితో ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించి, పూర్తిగా హృదయ పరివర్తనం కలిగించి గాని విడువలేదు. కాని, ఈ అనుభవంవల్ల రోలాఁ భారతీయులను గురించి ఒక వింత అభిప్రాయాన్ని సాధించుకొన్నాడు. తాను కలిసి మాట్లాడిన భారతీయులు యూరపు ఖండపు విషయాలపట్ల "చిత్రమైన తటస్థ వైఖరిని, ఉపేక్షను, వ్యంగ్య ధోరణిని" ప్రదర్శించడం తనకు బాధ కలిగించిందని డాక్టరు కాళిదాస్‌నాగ్‌కు ఒక లేఖలో తెలియపరిచాడు.[16]

సమకాలిక సాంఘిక పోరాటాలకు పోను పోను రోలాఁ కట్టుబడి (Committed) పోక తప్పలేదు. మానవ విమోచ

---

15, "... he would be an indifferent leader of the people who would constrain its vanguard to march with the bulk of the army"

—AMONG THE GREAT, P 54.

16. Tagor's Meeting with Romain Rolland— Girija K. Mookherjee.

వోద్యమంలో తానూ ఒక పోటుబంటు అయ్యాడు. అందుకే తనకు తెలిసిన భారతీయులలో కనిపించిన "తటస్థ" వైఖరిని ఆమోదించజాలక పోయాడు. సాంఘిక విప్లవం ద్వారానే లోకశాంతి సాధ్యమవుతుందని (Peace through Revolution) భావించేంత వరకు వచ్చింది రోలాఁ భావ పరిణతి. ఈ పరిణతిని శీఘ్రతరం చేసిన శక్తులలో గోర్కీ వ్యక్తిత్వం ప్రధానమైనది. విప్లవానంతరం రష్యాను తాత్కాలికంగా వదలి వచ్చిన గోర్కీ తన విప్లవ భావ జాలాన్ని డెబ్బయ్యేళ్ళ పైబడిన రోలాఁ మెదటిలో చొప్పించగలిగాడు. బోల్షివిక్ ప్రభుత్వ తీవ్రతకు జడిసి రోసి స్విట్జర్లాండులో ఆశ్రయం సంపాదించుకున్న రష్యన్ ప్రవాసి మేధావులు, ఐవాన్ బునిన్ ప్రభృతులు, రోలాఁను సమీపించి బోల్షివిక్ వ్యతిరేకతను కలిగించినప్పుడు, గోర్కీ ఉత్తరాలలోని వివరణ విరుగుడుగా పనిచేసింది. రోలాఁలో తత్కాలానికైనా బయల్పడిన కమ్యూనిస్టు వ్యతిరేకతను ఫ్రెంచి నవలాకారుడూ కమ్యూనిస్టూ అయిన హెన్రీ బార్బ్యూజ్ తీవ్రంగా ఎదుర్కోవలసి వచ్చింది. కాని రోలాఁ సులువుగా లొంగలేదు. పార్టీ ప్రయోజనాలను నైతిక మూల్యాలకు బదులు ఎన్నిక చేసి స్థాపించే వైఖరికి రోలాఁ ఆమోదం లభించలేదు. విమర్శను సహించకపోవడమో, విమర్శకులను దమించడమో నిరంకుశత్వమని బాహాటంగా ఖండించాడు.[17] విప్లవ సౌధంలో అన్ని అభిప్రాయాలకు జాగా ఉండవలె నన్నాడు. సాంఘిక ఆర్థిక విప్లవం తన అవసరాల కొరకై మానసిక స్వేచ్ఛను అరికట్టక దానితో సామరస్యాన్ని సాధించవలసి ఉంటుందని రోలాఁ భావం భారతదేశపు భావాలను రష్యా భావాలతో అంటు గట్టించడమంటే ఇదేనేమో ! నిప్పును నీటికిచ్చి పెళ్ళి చేయించడమని దీనిని రోలాఁయే వర్ణించాడు. ఇది విఫలం కాక తప్పదు. అందుచేత రోలాఁ భావాలు మరొకమలుపు తిరిగాయి. కమ్యూనిస్టు పోలీసు విధానాల క్రౌర్య కాఠిన్యాలను విమర్శిస్తూనే, "నవ రష్యా సమస్త మానవజాతికి పురోగామి శ్రేణి" అని, ఆ కాలపు అనేక మేధావుల వలెనే, రోలాఁ కూడా కీర్తించాడు. వెబ్ దంపతులు, జవహర్లాల్ నెహ్రూ ప్రభృతులు, రవీంద్రనాథ్ ఠాగూర్ ఈ కాలానికి చేసిన పని ఇలాంటిదే.

ద్వితీయ ప్రపంచ యుద్ధానికి జర్మనీ, ఇటలీ దేశాలు సమాయత్త మవుతున్న రోజులలో, యుద్ధ వ్యతిరేకోద్యమానికి రోమేఁ రోలాఁ నాయకత్వం వహించి మేధావులకు తలలోని నాలుకగా వ్యవహరించ సాగాడు. అందుచేతనే హిట్లర్ పాలనలో రోలాఁ గ్రంథాలు, ముఖ్యంగా Jean Christophe జర్మన్ నగర వీధులలో అగ్నికి ఆహుతైనవి. మొదటి ప్రపంచ యుద్ధానంతరం రోలాఁను ఈసడించిన జర్మన్ మేధావులు, థామస్ మేన్ (Thomas Mann) వంటివా రిప్పుడు జర్మనీని వదలి రోలాఁను తమ వక్తగా భావించారు. అలాగే ఫ్రెంచి నవలాకారులైన అనటోల్ ఫ్రాన్స్, హెన్రీ బార్బ్యూజ్ ప్రభృతులు రోలాఁతో సమాధాన పడ్డారు. అంతర్జాతీయ మానవవాదోద్యమానికి రోలాఁ మహా నాయకు డయ్యాడు. కాని యుద్ధం రాకుండా పోలేదు. మాతృదేశమైన ఫ్రాన్సు మళ్ళీ జర్మనీకి పాదాక్రాంతమైంది. 1866 లో తాను జన్మించాడు. ఐదేళ్ళ ప్రాయానికి బిస్మార్కు ఉక్కు సేనలు పేరిస్ నగరాన్ని ఆక్రమించినట్లే, డెబ్బై ఎనిమిదేళ్ళ ప్రాయానికి హిట్లర్ సేనలు ఆక్రమించాయి. రోలాఁ జీవితం మొదటికి వచ్చినట్లయింది. కాని, అది వోడిపోలేదు. ఓడిపోయే ప్రమాదం నుండి రోలాఁ జీవితం ఎన్నడో తప్పుకున్నది. వ్యక్తికీ సమాజానికీ బాంధవ్యం, స్వేచ్ఛకూ కట్టుబాట్లకూ సఖ్యం, మానవవాదానికీ సమాజవాదానికీ సామరస్యం — ఇవి డెబ్బైఎనిమిదేళ్ళ నిరంతర చింతనలో రోలాఁకు లభించిన భావ రత్నాలు. చిత్తశుద్ధి రోలాఁకు పెట్టని వరం. ఆత్మపరత్వం రోలాఁ సాధించిన జీవిత, సాహిత్య తత్త్వం.

17. "..... So long, as the spirit of the servant of the Revolution remains narrowly political, despising.. the claim of the free conscience, I shall hold myself aloof. .."

—ROMAIN ROLLAND P. 191

నాటకం

# ఇది ఆత్మహత్య!

## శ్రీ ఆదివిష్ణు

—ఇందులో వచ్చే పాత్రలు—

| | |
|---|---|
| వర్ధనమ్మ | రాజశేఖరం |
| శ్రీదేవి | గోపి |
| వరదరాజులు | సుబ్బారావు |
| రంగనాయకులు | ఆరోగ్యవిందరావు |

## మొదటి రంగము

వర్ధనమ్మ ఇల్లు

[వరదరాజులొక్కడూ కుర్చీలముందు కూర్చున్నాడు. ఖాళీగావున్న సోఫావేపూ, కుర్చీలవేపూ—ఇంగ్లీషు ట్యూన్‌తో మోగుతున్న రేడియోవేపూ చూసేడు. క్షణమాగి లేచి నించున్నాడు. తలమీద జుత్తుని అందంగా సవరించుకున్నాడు. ఓమాటు పక్కగదివేపు చూపు సారించేడు. మళ్ళా వీధివేపు చూసేడు. ఆనక రేడియోలోంచి వచ్చే ఇంగ్లీషు ట్యూన్‌కి సరిపడేలా నాట్యం కొంతవరకూచేసి ఇక కుదరక మానుకున్నాడు. విసుగుపుట్టి రేడియో ఆఫ్ చేసేడు. మళ్ళా సోఫామీద కూచుని కాళ్ళూపుతూ, సిగరెట్టు దమ్ము ఒకటి పీల్చి పొగ వదిలేడు. అకస్మాత్తుగా అనేశాడు.]

వరద వర్ధనీ విలాస్! చక్కటిపేరు. అందమైన పేరు. వర్ధనమ్మ భవంతి! బాగుంది. ఈ వర్ధనీవిలాస్‌లో ఒకగొప్ప ఫెస్టివల్! వండర్‌ఫుల్. ఆహ్వానితుడైన అతిధి దేవుళ్ళకి మా కృతజ్ఞతలు బి. ఎ. పరీక్ష పాసవడం మీకు అతి సామాన్యమైన విషయమని చెప్పి కొట్టిపారేస్తే నేనొప్పుకోక తప్పదు. కానీ వర్ధనమ్మ వూరుకోదు. ఇంతకీ ఆపరీక్ష పాసయింది వర్ధనమ్మత్తయ్య కాదండోయ్! వెధవగోల—పాయింటుని కొంచెం తిరకాసులో వొదిలెట్టేను. అత్తయ్య కూతురు శ్రీదేవి ఆపరీక్ష పాసైంది. శ్రీదేవి తరఫున అత్తయ్య ఈ పార్టీ ఏర్పాటు చేసింది. అయ్యా! సార్! అర్ధమైందాండి? (లేచి నించున్నాడు) ఏడాది క్రితం వరదరాజులనబడే నేను బి. ఎ పరీక్ష పాసైనప్పుడు నేనుగానీ, నా తరఫున మరే యితరులుగానీ యిలాంటి ఘనమైన పార్టీలు ఏర్పాటు చేయలేదని చెప్పేందుకు చింతిస్తున్నాను. ఎందుచేత? అవున్సార్! ఎంచేతంటె మై నేమ్ ఈజ్ వరదరాజులు గనుక. మానాన్న కీ. శే రామనాధయ్యగారు సంఘసేవకులు కాదుగనుక. కానీ, ఇప్పుడిక్కడి సంగతలాకాదే? మీరు పొరపడుతున్నారు మరి! వర్ధనమ్మత్తయ్య సంఘసేవకురాలు. కీ. శే. గౌరీపతిగారి ధర్మపత్ని! గౌరీపతిగారు దేశోద్ధారకులు. ఆరకంగా వర్ధనమ్మత్తయ్యకి మంచి పలుకుబడి వుంది అంతో యింతో పంపాయించిన ఇల్లాలు! (కొంచెం ఆగేడు) శ్రీమంతుల పిల్లలు తుమ్మినా ఘనకార్యమని చెప్పుకుంటున్న మీకు శ్రీదేవి బి ఎ పరీక్ష పాసయిందంటె గొప్ప! (గబగబా సోఫా వెనక్కొచ్చి నించున్నాడు) అందుచేత వర్ధనమ్మత్తయ్య స్థాయికి తగ్గ విధంగా యీ యొక్క పార్టీని ఏర్పాటు చేసింది. నౌ. (సోఫాకి ఎడంవేపునున్న రెండు కుర్చీల నుద్దేశించి అన్నాడు) ఆమొదటి కుర్చీలో వర్ధనమ్మత్తయ్య కుడిభుజం కూర్చుంది. కుడిభుజం పేరు భుజంగరావు. ఆయన పక్క శ్రీవారి పెర్సనల్ సెక్రటరీ. శ్రీవారంటె భుజంగరావు గారన్నమాట. అదయ్యిందాండి. (కుడివేపు నున్న రెండు కుర్చీల నుద్దేశించి అన్నాడు) ఎడంగా వున్న ఆకుర్చీలో శ్రీదేవి క్లాసుమేటు వెంకట్రావ్ కూచున్నాడు. అతని పక్కన భుజంగరావు గారబ్బాయి చిన్న. రైటో. కాఫీ లొచ్చేయి కాఫీలు మా అత్తయ్య వర్ధనమ్మ తీసుకొచ్చింది. (నటించేడు. నాలుగు కుర్చీలకూ పంచబోతూ, మధ్యనున్న సోఫాని చూచి ఆగిపోయేడు. గబగబా సోఫా కుడి అంచున కూచుని తన ఎడంవేపు చూచి అన్నాడు) నేనిక్కడ నాకిటువేపు ఎడం పక్కగా శ్రీదేవి కూచున్నాం. అవునాండి! (సడన్‌గా ఆగిపోయేడు శ్రీదేవికి కొంచెం దూరంలో భుజంగరావు సెక్రటరీ కూచున్న మాట గుర్తుకొచ్చింది.) నాన్‌సన్స్. అక్కడ శ్రీవారి సెక్రటరీ కూచుంటాడు. ఆయనికి శ్రీదేవి మీద ఆశ లెక్కువని వెంకట్రావ్ చెప్పేడు. కాబట్టి సెక్రటరీని అక్కడుంచటంలో సుఖాల్లేవు. (క్షణం ఆలోచించేడు) పోనీ శ్రీదేవి నాకుడివేపు కూచుంటుందాంటె ఈ పక్క శనిలాగా చిన్నా! ఈ చిన్నాగాడికి స్కూటరెక్కి వూరేగడం తప్పించి వేరే పన్లేదు. గనక ఇక్కడా సుఖాల్లేవు ఏంచేయాలి? ఐడియా—వెంకట్రా వొరేయ్! నువ్విలా వొచ్చేయ్‌నాన్నా! చిన్నాని అవతలకి తోసేయ్ ఇట్ విల్‌బి ఆల్‌రైట్‌నా! కానీ, వెంకట్రావ్! శ్రీదేవి మీద నువ్వేమైనా కలలు కంటున్నావా గాడిదా! చంపేస్తానొరేయ్! శ్రీదేవి నా సొత్తు. నాప్రాణం. జాగ్రత్త ఊ ..ఇప్పుడిక పార్టీ, వర్ధనమ్మత్తయ్య తెచ్చిన కాఫీతో ప్రారంభమవుతుంది

(నిజంగా ఆవేళకి వర్ధనమ్మ అక్కడికి రానే వొచ్చింది. ఆమె రాక వరదరాజులు గమనించనేలేదు. తన ధోరణి ఆపనూలేదు.)

అత్తయ్య అమృతంలాంటి కాఫీ తీసుకొచ్చింది. మొహమాటమొద్దు. కొంచెం మెల్లిగా తాగండి.

(అప్పటిగ్గాని వర్ధనమ్మని చూళ్లేదు. చూచి సిగ్గు పడి అనేశాడు.)

వరద వొచ్చేవా అత్తయ్యా!

వర్ధ నీపార్టీ ఎంతవరకూ వొచ్చిందేమిటి ?

వరద ఇంతవరకూ రావలసినమనుషులే రాలేదు. అంతెందుకు ఉదయం వెళ్లిన శ్రీదేవి ఇప్పటి కొచ్చింకా రాలేదు. అప్పుడే పార్టీ ఏమిటి నాబొంద! తోచక రిహార్సిలు వేసుకుంటున్నానంతే! అవునూ! నువ్విప్పుడే నిద్రలేచేవా?

వర్ధ· (మాటాళ్లేదు)

వరద ఆరోగ్యమెలా వుందత్తయ్యా! నిన్నటి కంటె ఇవాళ కొంచెం బాగున్నట్టున్నావ్ అంతెందుకు రాత్రి మీరు చేసిన హంగామాతో హడిలి చచ్చాననుకో. ఒకపక్క నువ్వు. రెండో పక్క నిన్ను చూచి శ్రీదేవి నేనే సమయానికి లేపోతే శ్రీదేవి ఒక్కర్తీ ఎంత భయపడిపోయేదో గదా 'నీకేం ఫర్లేదు. శ్రీదేవీ! నువ్వేం ఖంగారుపడకు. అత్తయ్యకున్న జబ్బు లక్షణమే యింత' అవటాని ధైర్యం చెప్పేను. (కొంచెమాగి అన్నాడు) రాముడూ—రాము డోరేయ్!

వర్ధ· ఇప్పుడు వాడెందుకు?

వరద మరేంలేదు. నీక్కొంచెం టీ గ్లటా పట్టుకొస్తాడేమోనని. (ఇప్పుడు నెమ్మదిగా పిలిచేడు) రాముడూ. డొక్క చీల్చేయాలి వెధవని నోరు చించుకున్నా మాటాడ్డేమిటి? ఖర్మ!

వర్ధ· వాడులేడు. ఈరోజు సెలవిచ్చేను.

వరద· చంపావ్! ఆ సంగతి నాకు చెప్పందే ఎలా తెలుస్తుంది. కనక-నే తెచ్చిచ్చే దేమిటి టీ.

వర : నీ కెందుకు నాయునా అవస్థ?

వరద అవస్థా! వండ్రఫుల్. నా కవస్తేమిటి బొత్తిగా. ఇటీజ ప్లెజర్ టూ మి.

వర్ధ భట్రాజువై పోతున్నావ్ రాజా!

వరద. కాను. కాలేను. అది రూలంతే!

వర్ధ· శ్రీదేవి నీచేత ఎంత పనైనా చేయించగలదు. (ఫోను వున్న వేపు నడిచింది)

వరద ఫోన్ చేస్తావేమిటి? నాకు చెప్పు. ఎవరికి చేయాలి?

వర్ధ (రిసీవరు తీసుకుంది) టూ సెవన్ త్రీ ప్లీజ్. .యస్.

వరద. రైటో భుజంగరావ్‌గారి కన్నమాట. తొందరగా పిలువ్ లంకంత ఈ ఇంట్లో నాకేం తో చ్చావడంలేదు.

వర్ధ· నేను వర్ధనిని మాటాడుతూంట. ఏమిటి విషయాలు? ఆహా కులాసాగానే వున్నాను. అంత తొరగా చావన్నేను. అవునూ నేచెప్పిన విషయం ఏం చేశారు? అదే ఉద్యోగ విషయం. ఆలిస్యమైనా మంచి ఉద్యోగం చూడండి అసలే మా అల్లుడు ఉత్త అర్భకుడు. మంచిదండి...వుంటాను...నమస్కారం.

వరద థేంక్సత్తయ్యా థేంక్స్ సమయానికి రాముడు లేడు. ఇప్పుడా పెద్ద మనుషులంతా వొచ్చేస్తే వాళ్లకన్ని ఏర్పాట్లూ చూసేందుకు మనుషు లేరి? మీరొచ్చేస్తే జబ్బు వ.న.షులు

వర్ధ (కూర్చుంది) డబ్బు మనిషిని కాదా రాజా!

వరద అఫ్‌కోర్స్.

వర్ధ ఇవాళ నీవనుకుంటున్నట్టు మేము పార్టీ ఏర్పాటు చేయడంలేదు.

వరద అదేమిటత్తయ్యా! నన్ను గొప్ప ఇరకాటంలో పెట్టేశారే?

వర్ధ· మా మనసులు బాగోలేదు అది సరేగాని రాజా నేనో మాట అడుగుతాను నిజం చెప్తావా?

వరద చదువుకునే రోజుల్లోనే నాకు గొప్ప పేరుండేది. ఒకసారి సిక్స్‌టీవన్‌లో అనుకుంటాను మాక్లాసు వాళ్లంతా—

వర్ధ· అతిగా వాగడవూ ఒక జబ్బే!

వరద: అఫ్‌కోర్స్.

వర్ధ చెప్పు రాజా! నువ్వెందు కొచ్చేవ్ ఈవూరు?

వరద వండ్రఫుల్. నెలరోజుల తర్వాత అడుగుతున్నావా అత్తయ్యా! ఎందు కొచ్చేనో చెప్పేందుకు నాకేం అభ్యంతరం లేదు. కానీ వొచ్చిన్నాడే చెప్పేను— ఉద్యోగం కావాలత్తయ్యా అని.

వర్ధ కేవలం ఉద్యోగం కోసమే వొచ్చేవా?

వరద· ఆహా

వర్ధ నువ్వు నిజం చెప్పడంలేదు. శ్రీదేవి ...

వరద అఫ్‌కోర్స్. అఫ్‌కోర్స్. ఉద్యోగం వేయించిన దానివి, శ్రీదేవినీ ఇవ్వకపోతావా? ఎంతైనా నీ మేనల్లుడిని.

వర్ధ. కానీ, అది వీల్లేదంటున్నారు.

వరద ఏది? ఉద్యోగమా? శ్రీదేవా?

వర్ధ· భుజంగరావు గారుండగా నీ ఉద్యోగానికేం భయంలేదు. శ్రీదేవిమీద మాత్రం ఆశలు పెంచుకోవద్దు.

వరద అత్తయ్యా!

వర్ధ నువ్వేం చెప్పినా నేను వినదలుచుకోలేదు.

వరద అవుతే మామీద నీకోపం యింకా తగ్గలేదన్నమాట కానీ, నువ్వో విషయం మరిచిపోతున్నావ్. పెద్దవాళ్ల పంతాలకి మేం చిన్నవాళ్లం ఏమాత్రం బాధ్యులం గాము. మానాన్న రామనాథయ్యగారు కీర్తిశేషులైయ్యారు. వారితో పాటు వారి అభిప్రాయాలూ పరలోకంలో కాపురం పెట్టేశాయి. ఇంత జరిగినా నన్ను అవమానించడం ఏంబాగోలేదు ఎవరైన్నా అడుగు. అన్యాయమని చెప్తారు.

వర్ధ అదికాదు రాజా! ఒకే గూట్లోని పక్షివి నీవు

వరద అఫ్‌కోర్స్. నేన్దానికి వొప్పుకుంటాననుకో. కానీ, ఈ పక్షి ఆ గూట్లో ఎక్కువ కాలంలేదు చదువంతా హాస్టల్లో వుండి చదివేను అంటే ఏమిటి చాలాకాలం నాగూడొదిలి తిరిగేనన్నమాట.

వర్ధ: సమర్ధించుకోడానికి ప్రయత్నించకు రాజా! ఒకనాడు నేను మీ అందరికీ పరాయిదాన్ని. నాపేరు తలుచుకుంటేనే పాపం వొచ్చేస్తుందని మీ అందరి నమ్మకం నన్ను వెలివేశారు. నిజమేగా ఇదంతా!

వరద నిజమే. నేనూ వొప్పుకుంటాను. ఈ చరిత్ర యావత్తూ నేను పుట్టక ముందు జరిగింది. అలాంటప్పుడు దాంతో నాకు సంబంధమేమిటి? మిమ్మల్ని నేను రెండు తడవలు చూసేను. మొదటిది సిక్స్‌టీ త్రీ—వాల్తేర్ స్టేషన్లో. రెండు ఇక్కడ. మొదటి మాటు మూడుగంటలు రెండో తడవ నెలరోజులు మొత్తం ఎన్నిగంటల పరిచయమంటారు? ఎన్నో కొన్ని గంటలు! అవునా—ఈ కొన్నిగంటల్లోనూ పరోక్షంగాగానీ, ప్రత్యక్షంగా గానీ మిమ్మల్ని నిర్లక్ష్యం చేయలేదు నేను. ఇప్పుడిక్కడ మీక్కావల్సింది నేనూ, నా కెరీర్ ను. నేను చాలా మంచివాడినని పేరుంది. దానికోరకంగా నాగూడొదిలి తిరగడమే కారణం కావచ్చు.

వర్ధ· మాటల్లో మాపెద్దన్నయ్యని మరిపిస్తున్నావ్ నువ్వు

వరద మీ పెద్దన్నయ్య మానాన్నగారు కావచ్చు. నేను మీ మేనల్లుడ్ని మేనత్త పోలికలని చెప్పి కొన్ని తప్పుని సరిగా వొచ్చేస్తూంటాయి. మరి దానికి మనమేమి చేయలేం

వర్ధ రాజా! నేనేం తెలిని దాన్ననుకుంటున్నావేమో! అవులిస్తే పేగులెక్కెట్ట గలను నాయింటి కొచ్చి నన్ను ఉద్యోగం అడిగింది, శ్రీదేవిని కోరుకుంటు న్నదీ వేరే ప న్లేక్కాదు నీ గుండెల్లో అతిభయంకరమైన ఆలోచన లున్నాయి. వాటిని దాచుకోడం నీ చాతగాదు. నీ జాతకం నాకు తెలుసు. ఆడదాన్నని చెప్పి నిర్లక్ష్యం చేయకు. వారెక్కల్తో నేనింత ప్రయోజకత్వం సాధించేనంటె నీకు భయం కలగాలి అయినా నటిస్తున్నావ్

వరద వండ్రఫుల్! మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నమాట నూటికి నూరు పాళ్ళు నిజం.

వర్ధ ఈ వర్ధనీ విలాస్‌లో డబ్బుంది. అందమైన అమ్మాయి వుంది. గౌరీపతి గారి భార్య వర్ధనమ్మ వుంది. వర్ధనమ్మకి గుండె జబ్బుంది. ఇవన్నీ నీకు బాగా తెలుసు సమయం చూచి వాలేవ్ ఉత్తరమ్మకైనా లేకుండా వొచ్చి చేరేవ్. ఉద్యోగం కావాలనే నెపంతో శ్రీదేవి కావాలని అడగగల నీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను. కానీ రాజా, నువ్వు నా మేనల్లుడివేగానీ, అల్లుడివి కాలేవు దయతలచి ఉద్యోగం వేయించిన నాకు నువ్వు అల్లుడవంటె ఎంత చిన్నతనమో ఆలోచించు. అంతేగాదు ఒకనాడు నన్ను దూరం చేసిన మనుషులు నిన్ను నాదగ్గరికి పంపేరు ఏమిటీ తిరకాసు? ఆనాడు నేను వాళ్ల కంట్లో నలుసుని. ఎవరో ముక్కుమొహం తెలీని మనిషిని పెళ్లి చేసుకుని పరాయి రాష్ట్రంలో బతికేను. అన్నయ్య వాళ్ళు తెచ్చిన సంబంధాన్ని కాదని వాళ్లకి దూరమయ్యేను. (ఆయాసం వొచ్చింది. గుండె పట్టుకుని సోఫా మీధ తలవాల్చింది. వరదరాజులు గబగబా ఫోన్ దగ్గిరి కెళ్లేడు ఫోన్ ఎత్తబోయేడు.)

వర్ధ· ఫోనెవరికి.

వరద అర్జంటుగా భుజంగరావుగారికి ఫోన్‌చేసి మంచి డాక్టర్ని వెంటనే పంపవలసిందిగా—

వర్ధ: నేనంత తొరగా చావనుగానీ, ఫోన్ పెట్టేసేయ్.

వరద: (ఫోన్ కింద పెట్టి అన్నాడు) అత్తయ్యా! నన్ను నిజంగా, చాలా బాధ పెట్టేస్తూన్నావ్.

వర్ధ: నేను చెప్పిందానికే నువ్వింత బాధపడిపోతే, ఇరవై ఏళ్ల నిరాదరణని ఈ గుండెల్లో దాచుకున్న నేనేమైపోవాలి?

వరద. నేనైతే చచ్చి వూరుకుందును.

వర్ధ శ్రీదేవి కోసం బ్రతకాలనుకున్నాను. బతికేను శ్రీదేవి కోసం నేనేమైనా చేయగలను రాజా! శ్రీదేవి నాకూతురు. (కొంచె మాగింది) ఇరవై ఏళ్ల క్రితం గౌరీపతి పరిచయమయ్యేరు. నా జీవితానికో వెలుగు ప్రసాదించేరు ఆయన నీడలో నేను పవిత్రురాలనయ్యేను ఉద్యోగానికి రాజీనామా యిచ్చేను. ఆయన ప్రాణంలా ఆయన వెంట తిరిగేను నా అంతరంలో దాగిన రంగుల కలలకి ఆయన కధానాయకుడు. ఇవన్నీ మీకర్థంగావు చెప్పినా అర్థం చేసుకోలేని దౌర్భాగ్యం మీది. ఆ మహనీయుడు కన్నుమూసిన క్షణం నుంచీ నాపట్ల మీ నిర్లక్ష్యం మరింత ఎక్కువైంది కానీ రాజా—దేవుడు నన్ను కరుణించేడు. మీకళ్ళు కుట్టేంత హోదాకి నేను వారసురాలనైయ్యేను—ఇప్పుడు చెప్పు—మీరంతా నన్నిప్పుడు గౌరవిస్తూన్నారంటే ఏమిటి కారణం? ఏం చూచి నన్ను మెచ్చుకుంటున్నారు. వెళ్లిపో రాజా, వెళ్లిపో మీరంతా నాకు దూరంగా వుండాలి. దూరంగా వుండాలి. (రివ్వున పక్కగదిలోకి వెళ్లిపోయింది. ఆ క్షణాన్న ఫోన్ మోగింది. కానీ, ఆమె తిరిగిరాలేదు.)

వరద. (క్షణం, రాయిలా నించుండిపోయేడు. ఆనక ఫోన్ తీసుకున్నాడు) హలో. . యస్ .నేను ఆవిడ నెవ్వ్యూని మీకేం కావాలో చెప్పండి. నే నావిడ్తో చెప్తాను . వీల్లేదు ఆవిడ పరిస్థితి అధ్వాన్నంగా వుందిప్పుడు మీ పేరేమిటో చెప్పండిపోనీ . రాజశేఖరం థాంక్స్‌జెంటిల్మేన్! (ఫోన్ పెట్టేడు) రాజశేఖరం డిగ్రేట్ అర్జంట్ మేటర్. (సోఫా వెనగ్గా వొచ్చినించున్నాడు. చేతులు సోఫా మీద ఆనించి అందంగా నించున్నాడు) లవ్ అనే సబ్జెక్టు పాతికేళ్ల నుంచీ వర్ధిల్లుతూనే వుందన్నమాట. వర్ధనమ్మ దృష్టిలో ప్రేమ తారకమంత్రం. జపించి ఆవిడ జన్మ సార్థకం చేసుకుంది అదే ప్రేమ మా ఫాద రెటసెట్రా దృష్టిలో పెద్దసిన్! ఒకే పదార్థం అనేకమంది కనేక రకాలుగా కనిపించడం తమాషా! ఫిలసాఫికల్‌గా ఆలోచిస్తే ఆ పదార్థం దేవుడని చెప్తాం. అత్తయ్య 'లవ్' అంటుంది నేను దేవుడంటాను. ఈ రెంటి రూపాంతరం ప్రేమేదైవం గొప్ప లాజిక్. వేదాంతానికిది కొత్త సంఖ్య. సెహభాష్ వరద్రాజులూ! గొప్పవాడివై పోతున్నావ్ లాభంలేదు నీకు సన్మానం చేయించేయాలి. (కులాసాగా నవ్వేడు. మళ్లా వొచ్చి సోఫాలో కూచున్నాడు) నాకేం తోచడంలేదిక్కడ. ఉద్యోగమ్మాట దేవుడెరుగు. బతికి బాగుంటే అడుక్కుతినైనా బతగ్గలను. కానీ, నాకు శ్రీదేవి కావాలి. ఐ వాంట్ శ్రీదేవి. ఈ జీవితానికి శ్రీదేవి పెద్ద రిలీఫ్.

(శ్రీదేవి గుమ్మం దగ్గిర నించునివుంది. శ్రీదేవిని చూచి మొదట ఖంగారుపడినా తర్వాత సర్దుకున్నాడు.)

వరద వొచ్చేవా శ్రీదేవీ! నీకోసం ఎప్పట్నుంచో ఎదురు చూస్తూన్నాను.

శ్రీదేవి (లోపలికి వొచ్చింది) అమ్మ కెలావుంది బావా?

వరద: రాత్రి కంటె కొంచెం నయం అవునూ—ఈ గుండెనొప్పి ఎప్పట్నుంచి?

శ్రీదేవి· వారంరోజుల్నుంచీ విపరీతంగా వొస్తోంది.

వరద ఈ రోగం వున్నవాళ్లకి (శ్రీదేవి ఈ మాటతో కొంచెం నొచ్చుకున్నట్టు గమనించేడు) అదే ఈ వ్యాధితో బాధపడేవాళ్ళ విశ్రాంతి తీసుకోడం చాలా అవసరమంటాను.

శ్రీదేవి అమ్మకిప్పుడు కావలిసినంత విశ్రాంతి.

వరద. నే నొప్పుకోను.

శ్రీదేవి. ఎంచేత?

వరద· నేనొప్పుకోనంతే!

శ్రీదేవి· (మాటాళ్లేదు)

వరద ఎందుచేత అని అడగవే?

శ్రీదేవి అడిగేను.

వరద ఏమంటె ఇక్కడ 'విశ్రాంతి' అంటె రాళ్ళూ రప్పలూ మోయకపోడం గానీ, పొగలస్తమానూ తెగతిరక్కపోడమనీ కాదు ఇంట్లో ఎంచక్కా కూర్చున్న శ్రీమంతులకి విశ్రాంతి లేదు అంటె అర్థం ఏమిటి? మనసు. దానికి సంబంధించిన గందరగోళమూను. కాబట్టి మనసుకి సంబంధించినంతవరకూ పూర్తి విశ్రాంతి అవసరమని నా ఉద్దేశం.

శ్రీదేవి. బాగా చెప్పేవ్.

వరద థేంక్స్. నాకో అనుమానం వుంది.

శ్రీదేవి (అనుమానంగానే అడిగింది) అనుమానమా?

వరద: ఎక్జాక్ట్లీ. ఏమంటె ఇంట్లో ఈడొచ్చిన ఆడపిల్ల గోళ్ళుగిల్లుకుంటూ కూచుంటె ఆ ఇంటి బాధ, ఆయింటి పెద్దల బాధ అదే మనసుకి సంబంధించినంతవరకూ మహా పెద్ద గందరగోళం.

శ్రీదేవి (కుదుట పడింది) బలేవాడివి బావా!

వరద థేంక్స్ దీనికి నా సలహా ఏమిటంటె, ఈడొచ్చిన నిన్ను, నీ మనసుకి నచ్చిన మనిషి కిచ్చేసి పెళ్లి జేసేస్తే అత్తయ్య గుండెజబ్బు రక్కున కుదుటపడి పోతుంది. ఆనక మరింకో సమస్యంటూ వేరే ఏమీ వుండదు.

శ్రీదేవి పోనీలే బావా! ఇప్పుడా విషయాలెందుకు?

వరద. వండ్రఫుల్! ఇప్పుడు కావలసిన ముఖ్యమైన పనుల్లో అదొకటి. నన్నడుగుతే 'అదొక్కటే' అని చెప్తాను.

శ్రీదేవి బావా!

వరద యస్ స్పీక్.

శ్రీదేవి ఏం లేదు.

వరద నాకు తెలుసు. ఏమీ వుండదు ఈ ఇంట్లో నేను చేరి వుంటె అత్తయ్యకి అవస్థ వుండేదికాదు కానీ నాపనులూ, నా కర్తవ్యం నన్ను తినేశాయి శ్రీదేవి! ఈనాడు మిమ్మల్నిక్కడ ఈ స్థితిలో చూస్తుంటే జాలి వేస్తోంది ఏంచేస్తాం. విధి 'విధి' అంటే జ్ఞాపకం వొచ్చింది—ఒక్కథ చెప్పేదా శ్రీదేవి! (శ్రీదేవి అన్యమనస్కంగా వున్నట్టు గమనించి, ఉస్సురుమన్నాడు. ఉత్సాహం దెబ్బతిన్నది. చప్పున చల్లారిపోయి అన్నాడు) నేను

మాటాడుతూంటే చెవుల్ని కప్పగించేసి వినేవాళ్ళ కాలేజీలో! ఏమిటో వెధవ రోజులన్నీ ఒకేరీతంగా వుండవు, చూడు.

శ్రీదేవి ఇవాళ నా మనసేం బాగోలేదు బావా!

వరద అత్తయ్య న్నూ్జస్తూంటే నాకూ అలాగేవుంది ఎంత ఆశపడి వొచ్చే నను కున్నావ్.

శ్రీదేవి: ఇప్పుడు నీ ఆశకేం దెబ్బ తగిలింది బావా! వారంరోజుల్లో ఘనమైన ఉద్యోగివి కాబోతున్నావ్ గదా!

వరద· నిరుత్సాహంగా అన్నాడు) బో...డి ఉద్యోగం. ఉద్యోగం కోసమేనా నేనింత దూరమొస్త? నాన్‌సెన్స్. కేవలం ఉద్యోగమొక్కటేనా నాక్కావలిసింది, పొరపడ్డావ్ శ్రీదేవి? విచారిస్తున్నాను.

శ్రీదేవి· మరింకేమిటి కావాలి?

వరద అలా తిన్నగా అడిగేస్తే జవాబు చెప్పలేనేమో! నాక్కావలసినవి చాలా వున్నాయి. ఉద్యోగం వేయిస్తాను చేతులు దులుపుకు వెళ్లిపో రాజా! అని అత్తయ్య నన్నంటూంటే నా మనసెంత బాధపడ్డదో, శ్రీదేవి అనే ఆడపిల్లకిగానీ, మా టనేసిన అత్తయ్యగ్గానీ తెలీదు నేను మీకేం గానా? కేవలం ఉద్యోగం కోసం వొచ్చిన పూర్ నిరుద్యోగి వెధవ నేనా? (బాధపడి పోతూ అన్నాడు) చెప్పు శ్రీదేవీ! మీకింకేం కానా?

శ్రీదేవి అదేంమాట? వరదరాజులు నాకు మేనబావ అమ్మకి మేనల్లుడు.

వరద. థేంక్స్. వెరీమెనీ థేంక్స్. చూడు నేనెంత అల్ప సంతోషినో. నా కెప్పు డప్పుడూ మన బంధుత్వం గుర్తు కొస్తూంటే కొండంత ధైర్యంగా వుంటుంది ఆ ధైర్యంతో ఏం చెప్పాలో తోచిందికాదు) అధైర్యంతో. ఇంత ఎండ్రిన్ పుచ్చుకు చావమని చెప్పావనుకో. చెప్పిన మరుక్షణం తా! అంతే మరింక వరదరాజుల్లేడు.

శ్రీదేవి. (పేలవంగా నవ్వేసింది)

వరద· (గబగబా నవ్వేసి, నవ్వు పూర్తయిన తర్వాత అడిగేడు) అవునూ! ఎందుకు నవ్వేవు నువ్వూ?

శ్రీదేవి ఎండ్రిన్ పుచ్చుకోడానికి ధైర్యం కావాలంటేనూ

వరద డోంట్‌బి సిల్లీ! ఎండ్రిన్ అరగాఆరగా తాగేందుకు కూల్‌డ్రింక్ కాదు. ఏ వన్ పాయిజన్ పేగులు మాడి చస్తాడు మనిషి. దానికి మరి ధైర్యం కావద్దూ?

శ్రీదేవి: జీవితమ్మీద రోత పుట్టి చావాలను కున్నప్పుడు గూడా ధైర్యం కావాలా బావా?

వరద వైనాట్? బతకడమనే గొప్ప ఘట్టాన్ని చావుతో ముగించే ప్రయత్నం వెనక అమోఘమైన ధైర్యముంటుందని నేను చెప్తాను. (అప్పటిగ్గాని గుర్తు రాలేదు) ఇప్పు డనవసరంగా ఎండ్రిన్ గురించి మాటాడటం నాకేం బాగోలేదు నేనింతకీ చెప్పదలుచుకున్న దేమిటంటే—యస్—వరదరాజులూ! నువ్వు మా మనిషివోయ్! నీకేం ఫర్లేదు. నీ యిష్టమొచ్చినట్టు ఆశలు పెంచుకో, నీ యిష్టమొచ్చినకోరిక కోరుకో. మేమున్నాం నీకేం ఫర్లేదు. అని చెప్పగల మనుషులు కావాల్నాకు. అవునా శ్రీదేవీ! (అకస్మాత్తుగా అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచేయి.) అమ్మని నే నెరుగనుగానీ, అలాటి మనిషి మానాన్న ఆయ నిప్పుడులేరు. మళ్ళా అలాటి మనుషుల కోసం తిరుగు తున్నా నేను. ఉహూ.. కనిపించలేదు. ఆస్థితిలో, ఆవేటలో అత్తయ్య మనసులో వెలిగింది. వాళ్తేరు స్టేషను. దేవతలాటి అత్తయ్య, అప్పటి ఆమె మాటల తాలూకు అమృతపు జల్లు. ఆమె పక్కన అందాలబొమ్మ. ఆ అందాలబొమ్మ మొహంలో ఓ వెయ్యి దీపాల వెలుగు. నిజం చెప్తు న్నాను శ్రీదేవి! రెక్కలు కట్టుకు వాలేన్నేను. ఇంత ఉబలాటం పడిన్నేను ఇక్కడ కొచ్చి సాధించబోయే దేమిటి? బో...డి...ఉద్యోగం. ఉద్యోగం లేకుండా మా వూళ్లో బతకలేనా నేను? 'వరదరాజులూ! మీరు మేథ్స్‌లో మహామేధావులట మా పిల్లాడికి రెండు ముక్కలొప్పి పుణ్యం కట్టు కోండి, మీ ఋణం మేముంచుకోము'ని నాకాళ్ళవేళ్ళా పడే ఖామందులక్కు డున్నంతకాలమూ—నాన్న పోతూ మిగిల్చిన రెండెకరాల పొలమూ నిక్షే పంగా వున్ననాడు నాకీ ఉద్యోగాలొస్త పన్లేదసలు. కానీ నా క్కావలసింది నన్ను అనుక్షణం కనిపెట్టుకు నుండే మంచి మనుషులు శ్రీదేవీ! మంచి మనుషులు.

(చేతులూపుకుంటూ గోడదగ్గరిసా వెళ్లిపోయి—గోడమీదవున్న వర్ధనమ్మ పెళ్లినాటి ఫోటోవేపు చూస్తుండి పోయాడు.)

శ్రీదేవి· (బాధపడుతూ అన్నది) ఇప్పుడు నీ ఆవేదన చూస్తూంటె అమ్మ కథ జ్ఞాపకం వొస్తోంది బావా! ఆనాడు అమ్మ సరిగ్గా యిదే బాధ ననుభవిం చింది. తన మనుషుల కోసం పలవరించింది. దూరం చేయకండని, ప్రాధేయ పడింది. మావయ్య వాళ్లకిష్టంలేని పెళ్లి చేసుకున్నదన్న చిన్న నెపంతో అమ్మ మీద కత్తిగట్టి సాధించేరు. మళ్లీ ఈనాటికొచ్చి వాళ్లెవరూ అమ్మ మొహం చూళ్లేదు. నాన్న దేశానిక్కావలసిన మనిషి. ఆయన దేశం పట్టుకు తిరిగేరు. దేశాలు పట్టుకు తిరిగే మనిషిని అమ్మ కోరుకోవడం, అమ్మ దౌర్భాగ్యమేనని ఖరారుగా చెప్పేసి పుట్టింటి సౌఖ్యాన్ని దూరం చేసేరు. అప్పుడు అమ్మెంత ఏడ్చింది బావా!

వరద· నాకు తెలుసు. గుండెపగిలేలా ఏడ్చి వుంటుంది. (కళ్ళు తుడుచుకున్నాడు) మా·వాళ్లకి బుద్ధిలేదు. వాళ్లసలు మనుషులు కారు. అలా అన్చెప్పి రాసి స్తాను. ఎంచేతంటె మానాన్న వున్నంత కాలమూ ఒహో, ఆహో అన్న మానాన్న తమ్ముళ్లూ, అప్పలూ వెరశి ఆత్మబంధువు లంతా వొంటరినైన నన్ను చూచి నోరు చప్పరించి వూరుకున్నారే గానీ 'నీకేం ఫర్లేద'ని, చెప్పేరా? కానీ, శ్రీదేవీ—కల్పరున్న అత్తయ్యగూడా నన్ను నిర్లక్ష్యంచేస్తే నేనేమైపోతాను? (క్షణం మౌనం) నువ్వొచ్చే ముందు నన్ను వెళ్లిపొమ్మని గోల పెట్టింది. అప్పుడు నేను వెళ్లలేదు. ఎప్పుడూ వెళ్లన్నేను. ఎందు చేత? ఎంచాతో చెప్పగలవా నువ్వు?

శ్రీదేవి: (బేలగా చూచింది)

వరద: ఇప్పుడు కాపోయినా మరోనాటికైనా చెప్పగలవు. ఆ నమ్మకం నాకుంది.

(శ్రీదేవి లోపలి గదివేపు వెళ్ళబోయింది)

వరద: శ్రీదేవీ! కొంచెం నాకోసం ఆగు. (శ్రీదేవి ఆగిపోయింది) ఇలా వొచ్చి కూర్చో. (కూర్చుంది) నేను చెప్పేది పూర్తిగా విని వెళ్లిపో! (గబగబా సోఫా చివరికి వెళ్లి సోఫా అంచుని చేత్తో తాటిస్తూ అన్నాడు) వాల్తేర్లో మిమ్మల్ని చూచిన రోజునే ఈ యింటికి రావల్సింది నేను. అత్తయ్య నన్ను తక్కు వగా అంచనా వేస్తుందేమోనని కొంచెం భయపడి వూరుకున్నాను. రెండు నెలల్లో నాన్న నాకు దూరమవుతారనగా నా మనసులోని కోరిక ఆయనికి చెప్పేను. నవ్వేసి భుజం తట్టేరు. అప్పుడు కుదుటపడ్డాను. తర్వాత నాన్న పోవడం పెద్ద షాకు. నాలుగైదు నెలలు ఖంగారెత్తి తిరిగేను. నాన్న తయారు చేసిన ప్రపంచం తెలిసింది. భయపడ్డాను. లాస్ట్ రిసార్ట్—మీరు గుర్తు కొచ్చేరు. నాన్న చివరి నవ్వు నాకళ్ల ముందు వెలిగింది. మరంతె వొచ్చి మీముందు వాలేను. ఇప్పుడు చెప్పు శ్రీదేవీ! నే చేసింది తప్పా? ఫ్రాడా?

శ్రీదేవి: నాకలా అనిపించడంలేదు బావా! చాలా సబబుగా కనిపిస్తోంది!

వరద: (పొడిగా నవ్వేడు. నాలికతో పెదాల్ని తడుపుకున్నాడు) థేంక్స్. నువ్వు లేవకు. నే చెప్పేదింకా పూర్తికాలేదు శ్రీదేవీ! నన్ను ఖంగారు పడనివ్వకు. మాటలు వరసలో చెప్పనివ్వు. ఏది ముందు చెప్పాలో, ఏది వెనక చెప్పాలో రైల్లో వొచ్చేప్పుడనుకున్నాను. కొంచెం లేటైనా నేనడిగే దాన్ని సక్రమంగా అడగనివ్వు.

శ్రీదేవి భలే చిత్రంగా మాటాడుతావు బావా!

వరద వరదరాజులుత్త ఫూల్ ఇది మా చిన్నాన్న సర్టిఫికేటు. నువ్వలా అన్లేదు. ఫర్లేదు. నువ్వలా అనవు గూడాను. వొ...వై ఫస్ట్ క్వశ్చన్ (ఆగి అన్నాడు)

వుహు.. అలాకాదు.. నన్ను చెప్పనివ్వు ముందు. ఇందాక అత్తయ్య నన్ను నిలబెట్టి కడిగేసింది. అత్తయ్య మొదటి ప్రశ్న (నటించేడు) నిజం చెప్పు రాజా! నువ్వెందు కొచ్చేవిక్కడికి? అప్పుడు భయమేసింది భయంగానే చెప్పేను ఉద్యోగం కోసరమత్తయ్యా ఉద్యోగం కోసరం. అత్తయ్య నమ్మలేదు. నువ్వు నిజం చెప్పడంలేదు రాజా! నువ్వు (శ్రీదేవికి మొహం చాటుచేసి చెప్పేడు) నీకు శ్రీదేవి కావాలి. అవునా? (శ్రీదేవి తత్తరపాటుతో లేచి నించుంది అటు తిరిగే చెప్పేడు వరదరాజులు) అప్పుడు నేనన్నాను నా మనసూ, నా హృదయమూ, నా మెదడూ అన్నీ అన్నాయి. అవున త్తయ్యా అవును నాకు శ్రీదేవే కావాలి అని అత్తయ్యకి నామనసు చదవగల తెలివితేటలు దేవుడిచ్చేడుగానీ, నన్ను మెచ్చుకునే సహృదయం ఇవ్వడం మరిచిపోయేడుఫూల్! నిజం శ్రీదేవీ! నేనొచ్చింది నీకోసం కేవలం (వెనక్కి తిరిగి చూసేడు శ్రీదేవి బొమ్మలా నించుండిపోయింది)నీకోసం (క్షణాలు మవునంగా గడిచేయి రెండుచేతులూ తాటిస్తూ అటూ ఇటూ తిరిగేడు. ఒకచోట ఆగిపోయి అన్నాడు) సారీ! వెరీమచ్ సారీ శ్రీదేవి!

శ్రీదేవి (తెప్పరిల్లింది) ఎందుకని బావా? ఇప్పుడేం జరిగిందని క్షమాపణలు!

వరద (గబగబా దగ్గిరి కొచ్చేడు) అయితే? అయితే ఏంజరగలేదా? ఏమీ జరగ లేదా? నే చెప్పిందంతా విన్నావుగా శ్రీదేవీ? పూర్తిగా విన్నావుగా? కాబట్టి నా తప్పేంలేదు. ఐయామ్ రైట్ థేంక్స్. అత్తయ్యా!

శ్రీదేవి ఆగు బావా! తొందరపడకు మరి!

వరద. (సర్దుకున్నాడు) పడను...నేనేం తొందరపడనంతే. నీ యిష్టమొచ్చిన టైం తీసుకో. నెల, రెండునెలలు, సంవత్సరం, పది సంవత్సరాలు. మరేం ఫర్లేదు. నేనేం తొందరపడను.

(ఆవేళకి ఫోన్ రింగయింది. వరదరాజులు దర్జాగా ఫోన్ దగ్గిరి కెళ్లేడు. రిసీవరు తీసుకున్నాడు. హొదాగా చెప్పేడు.)

వర యస్ దిసీజ్ వరదరాజులూ హియర్ వాట్‌యూ వాంట్ ప్లీజ్ ఆహ్ గుర్తు పట్టేశాను. మీపేరు రాజశేఖరం అవునా యస్ ఏంకావాలి మీకు నో. అత్తయ్య రావడానికి వీల్లేదు షి ఇజ్ నాట్ వెల్ దెన్.. యస్ (మౌత్‌పీస్ మూసి శ్రీదేవితోఅన్నాడు)ఎవరో రాజశేఖరం డిగ్రేట్, నీకు తెలుస్తే మాట్లాడు.

(శ్రీదేవి రిసీవ రందుకున్నది. వరదరాజులు సిగరెట్టు ముట్టించేడు. వింటూన్న శ్రీదేవి మొహంలోని మార్పుని పసిగట్టేడు. శ్రీదేవి రెండు క్షణాల్లో రిసీవరు పెట్టే సింది. నిట్టూర్పింది.)

వర ఏమిటంటాడు? ఇంతకీ ఈ రాజశేఖరం ఎవరు శ్రీదేవి?

శ్రీదేవి అమ్మ సాయం కావలిసిన మనిషి.

వర పాపం

శ్రీదేవి. జాలి యెందుకులే బావా! ఆయన ప్రయోజకుడు మహామేధావి.

వర వండ్రఫుల్! అలాటి వాళ్లగ్గూడా అత్తయ్య సాయం కావల్సి వొచ్చింది పిటీ!

శ్రీదేవి (సడన్‌గా గొంతు మార్చి అన్నది) బావా! నువ్వింతకుముందు ఎవర్నైనా ప్రేమించేవా?

వరద ఏది నిన్ను చూడకముందేనా? (సిగరెట్టు పారేశాడు) లేదు నాకు ప్రేమ గురించి వాల్తేరు స్టేషను చెప్పిందంతే!

శ్రీదేవి అబ్బ. తిన్నగా మాట్లాడటం నేర్చుకో బావా!

వరద నేను ప్రేమించలేదుగాని, నన్నెవరైనా ప్రేమించారేమో తెలీదు ఏమంటే కనిపించిన ప్రతి ఆడకూతుర్నీ పట్టుకుని 'నన్ను ప్రేమించేవ పాపా!' అని నేనెప్పుడూ అడగలేదు.

శ్రీదేవి నువ్వు మాత్రం ఎవర్నీ ప్రేమించలేదు.

వరద లేదు.

శ్రీదేవి నన్ను గాఢంగా ప్రేమిస్తూన్నావ్.

వరద అవును. వాల్తేరు స్టేషను—

శ్రీదేవి మా ఆస్తి నిగానీ, మాఅమ్మ పరపతినిగానీ ప్రేమించడంలేదు.

వరద కరెక్ట్. ఏమంటే మావూళ్ళో—

శ్రీదేవి అయితే అమ్మతో చెప్పి మన పెళ్ళికి ఒప్పించే బాధ్యత నాది.

వరద శ్రీదేవీ! (ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయేడు) నువ్విదే మాట మీది నించో చా లది వెయ్యేనుగుల బల మొచ్చేసింది నాకు నేనిప్పుడు చిగ్రేట్‌ని వండ్రఫుల్. అత్తయ్య మాటలు వినకు అత్తయ్యకేం తెలీదు పెద్ద వయసు గుండెజబ్బు నీకు నేను, నాకు నువ్వు దట్సాల్ మన మధ్య మనవాళ్ళనుకున్న వాళ్ళెవరి ప్రమేయముూలేదు స్ట్రైట్ డీలింగ్స్. ఓ రియల్లీ ఐ యామ్ హేపీ నౌ!

శ్రీదేవి (పేలవంగా నవ్వింది నవ్వి అన్నది) నువ్వు చాలా మంచివాడివి బావా!

వరద అవును చాలా మంచివాడిని

శ్రీదేవి భోళాశంకరుడివి అందికే నువ్వంటే యిష్టపడుతున్నాను మోసాలూ, కష్టాలూ, తెలిని మనుషులంధరూ నా దృష్టిలో దేవుళ్ళు అందికే నువ్వు దేవుడవని అంటున్నాను (లోపలికి వెళ్ళబోయింది)

వరద (అతన్లో కవిత్వం పెల్లుబికింది వెడుతూన్న శ్రీదేవి వేపు నిశితంగా చూస్తూ అన్నాడు)

"కౌన్ దేఖాహై జాన్ ఆనా జాన్
ఓ దేఖో మేరా జాన్ జారహీహై"

శ్రీదేవి (గబిక్కన ఆగిపోయింది వరదరాజుల వేపు చూచి చిలిపిగా నవ్వింది)

వర "తీర్ క్యా మార్‌హో
తల్వార్తో మారో
హమ్‌తో తుమ్‌పర్ మర్‌చుకే
ఏక్‌బార్ ఆంఖ్ మారో!"

శ్రీదేవి ఇంత చక్కటి కవిత్వం ఎక్కడ నేర్చేవు బావా!

**(ఆవేళకి వర్ధనమ్మ అక్కడి కొచ్చింది. శ్రీదేవి వేపూ, వరదరాజుల వేపూ రుసరుసలాడుతూ చూచింది)**

వర్ధ నువ్వు పైకి వెళ్ళు శ్రీదేవి! (శ్రీదేవి వెళ్ళలేదు) వరదరాజులు అమాయకు డనుకున్న వాళ్ళంతా అమాయకులు! నిజమేనా రాజా!

వరద (తలొంచుకున్నాడు)

వర్ధ కవిత్వం చెప్పి ఆడపిల్లల్ని ఆకట్టుకోడం నీకెంత కాలం నుంచి తెలుసు.

వరద అత్తయ్యా!

శ్రీదేవి. అమ్మా!

వర్ధ శ్రీదేవికి పిచ్చెత్తింది శ్రీదేవి పిచ్చిది నీకు తెలుసా రాజా!

శ్రీదేవి అమ్మా!

వర్ధ: ఉద్యోగం కోసం వొచ్చిన మనిషివి నువ్వు. అంతస్థు తెలుసుకుని మెదులు. నే చెప్పేది వింటున్నావా రాజా!

వరద. వింటున్నానత్తయ్యా! వింటున్నాను. అంతస్థుల్తో కళ్ళు మూసుకుపోయిన వర్ధనమ్మత్తయ్య మాటలెంత కటువుగా వుంటాయో నాకు బాగా తెలుసు. కానీ, అత్తయ్యా ఈ అంతస్థులు శాశ్వతంగావు ఓడిపోతున్నావ్ నువ్వు. మాతో రాజీ కొచ్చేయ్! నువ్వెంత నిష్ఠూరంగా మాటాడినా మరి లాభం లేదంతే!

వర్ధ విన్నావుగా శ్రీదేవీ! రాజు నన్నమ్మకు వాడు మా అన్నయ్య కొడుకు నిలువునా విషం పెట్టుకు బతికిన మనిషికి వారసుడు వాడిక్కడికి మన ల్నుద్ధరించేందుకు రాలేదు మనింటికి చిచ్చు పెట్టేందుకొచ్చిన మాంత్రికుడు.

వరద పొరపాటు నేను మాంత్రికుడ్ని కాదు నాపేరు వరదరాజులు ఒక మంచి మనిషిని మంచిని పెంచుకునే మనుషులకి మంచి నేస్తాన్ని అత్తయ్యా!

వర్ధ నీ బూటకం కట్టిపెట్టు కదులింక. ఇక్కడే నించున్నావే. ఈ గుమ్మం వెంరనే దాటిపో నా కంటికక్కనిపించకు. వెళ్ళిపో రాజా!

వరద వెళ్ళను వింటున్నావ్‌గా శ్రీదేవీ! అత్తయ్య ఇందాకా ఇలాగే మాటాడింది. అప్పుడే వెళ్ళలేదు నువ్వొచ్చి నీ నిర్ణయం చెప్పిం తర్వాత ఇంకేం వెడతాను? వెళ్ళనంతె ఆరు నూరయ్యేది నూరు ఆరయ్యేది నే నీ యింటి అల్లుడ్ని

వర్ధ కాదు పిశాచానివి శనివి మితిమీరిన కుట్రవి దొంగవి.

శ్రీదేవి (గట్టిగా అరిచింది) అమ్మా!

వర్ధ (ఆగిపోయింది) ఏం! నీకు బాధగా వున్నదా శ్రీదేవీ! వీడి సంగతి నీకు తెలీదు.

శ్రీదేవి అందరి సంగతులూ తెలుసు. క్షమించు నీ మనసు బాధపడనాసరె నా మనసు మార్చుకోలేను బావనేమీ అనకు కనీసం నన్ను చూచైనా—

వర్ధ బాగా ఆలోచించే మాట్లాడుతున్నావా?

శ్రీదేవి చాలా ఆలోచించే మాట్లాడుతున్నాను మా కింకేం చెప్పకు ప్లీజ్.

వర్ధ వరదరాజు లెవరో, అతని కథేమిటో నీకు నిన్నటివరకూ తెలీదు నిన్ను నువ్వు మోసం చేసుకుంటున్నావు ఇప్పుడు మించిపోయిందేమీలేదు ఒరో మాటు ఆలోచించు కనిపెంచిన తల్లిని ఎందుకు చెప్తూన్నానో విను.

శ్రీదేవి నాకెవరూ ఏమీ చెప్పక్కర్లేదు బావకి ఈ యింట్లో స్థానం లేనినాడు నేనూ యిక్కడ వుండలేను. ఇది మాత్రం నిజం.

వర్ధ అయితే సరి నీ ఖర్మ అనుభవించు శ్రీదేవి

**(వర్ధనమ్మ వెళ్ళిపోయింతర్వాత కొంచెంసేపు నిశ్శబ్దం)**

వరద అత్తయ్యకి నామీదింత పగెందుకో తెలీడంలేదు పగ వుంటే వుండొచ్చు కానీ అనవసరంగా మాటలనేస్తుంది పాపం! నాగురించి నువ్వూ చెడ్డదానివై పోయేవ్ నాకో నమ్మకం వుంది శ్రీదేవీ! మనం—మనం పెళ్ళి చేసుకున్న తర్వాత అత్తయ్య పూర్తిగా మారిపోతుంది ఆ రోజున నన్నంటుంది 'క్షమించు రాజా! నిన్నపార్థం చేసుకున్నాను సుమీ' అని 'క్షమించేందుకు నువ్వేం నేరం చేశావత్తయ్యా, ఫర్లేదు' అంటాన్నేను. సుఖాంతం. కామెడీ!

శ్రీదేవి తెలుగు సినిమా కథ.

వరద బాగా అన్నావ్

**(ఫోన్ మళ్ళా మోగింది. ఈతడవ శ్రీదేవి ఫోన్ తీసుకుంది. విని అన్నది)**

శ్రీదేవి ఎవరో వసంతరావుగారుట నిన్ను పిలుస్తూన్నారు బావా!

వరద (గెంతేడు ఫోన్ తీసుకున్నాడు) హల్లో! డాంకీ నువ్వుట్రా! ఫోన్ నెంబరెలా తెలిసిందిరా? వెల్ ఎంత సేపైందేమిటి ఊపూరొచ్చి? ఐసీ ఏమిటి విశేషం? ఎక్కడ దిగేవ్? హోటల్ రత్నానా? ఇప్పుడొస్తే అక్కడే వుంటావా? గూడ్ ఏమిటి? కౌంటర్‌ఫీట్ లవ్వా? వాండర్ఫుల్, మంచి సినిమా! నాకేం అభ్యంతరంలేదు నీ వాచీలో టైం చూచుకో పావు గంటలో నీ ముందు వాల్తాను ఈలోగా నిగదిలో ట్విస్ట్‌డాన్స్ చేసుకో వెధవా!

(ఫోన్ పెట్టేసి, చొక్కా సర్దుకుంటూ, తలదువ్వుకుంటూ, అద్దంలో చూచుకుంటూ చెప్పేడు.)

వరద: వసంతరావని నా క్లాసు మేట్. పనిమీద హైదరాబాద్ వెడుతున్నాట్ట—మునుపు పర్ధమ్మగత్తయ్య గురించి చెప్పాన్లే. ఈవూళ్లో అగి ఫోన్ డైరెక్టరీలో నెంబరు వేటాడి నన్ను పట్టుకున్నాడు ఫూల్! తెలుగు సినీమాలు రోత. ఇంగ్లీషు సినిమాలంటే పడిచస్తాడు. కౌంటర్‌ఫీట్ అవ్‌టు. వాడితో సినిమా చూట్టమంటే నరకమనుకో. పాటకా అంటే. .తెలుగు వేలే...ఇష్టం. ఒకసారి కాలేజీలో ఏం జరిగిందంటే (శ్రీదేవి వేపు తిరిగి చూసేడు. ఆమె అతని మాటలు వినడంలేదని గమనించేడు) దట్సాల్ రైట్. వొస్తాను మరి. అత్తయ్యతో చెప్పు సినిమా కెళ్ళేనని.

(ఈలపాట పాడుకుంటూ వెళ్లిపోయేడు. శ్రీదేవి గుమ్మంవరకూ వెళ్లివొచ్చింది. ఫోన్ ఎత్తింది.)

శ్రీదేవి: 497 ప్లీజ్. యస్ (క్షణం సేపటికి) చూడండీ పదమూడో నెంబరు గదిలో వున్న రాజశేఖరంగారు కావాలినాకు. ఒక్కసారి పిలుస్తారా? థేంక్స్. (క్షణం విరామం) యస్..బయట కెళ్లేరా. సరేలెండి. అహ...మరేం లేదులెండి. తర్వాత నేనే ఫోన్ చేస్తాను. థేంక్స్. (ఫోన్ పెట్టేసింది. వొచ్చి సోఫాలో కూచుని తల రుద్దుకున్నది. ఆవేళకి రంగనాయకులు సుడిగాలిలా లోపలి కొచ్చేడు. అతని కళ్లెఱ్ఱబడి వున్నాయి. అతన్ని చూడగానే కలవరపడి లేచి నించుంది)

రంగ: నన్ను చూచి ఆశ్చర్యపడటం లేదనుకుంటాను. ఎప్పుడో ఒకప్పుడు గాలివానలాగా వెలుస్తానని ను వ్వుత్తరం రాసిన్నాడే అనుకుని వుంటావు. అవునా?

శ్రీదేవి. (అతని వేపు అమాయకంగా చూచింది)

రంగ: నీయింటి కొచ్చిన అతిథిని. గౌరవించడం మాట దేవుడెరుగు. కనీసం కూచోమన్నైనా చెప్పడంలేదు.

శ్రీదేవి కూర్చోండి.

రంగ: థేంక్స్. కానీ, కూచోడానికి రాలేదు నేను. కాఫీగ్రటా ప్రయత్నాలేమీ చేయకు. నేనడగవలసిన రెండుముక్కలు అడిగేస్తాను. సరైన జవాబు దాచుకోకుండా చెప్పేయ్.

శ్రీదేవి:అంతా ఉత్తరంలోనే రాసేను.

రంగ: నాకు చాలా ఉత్తరాలు రాసేవు శ్రీదేవీ! నువ్వెందుకలా రాసేవని అడగలేదే నేను. ఎందుచేతంటే అవన్నీ మతి వుండి రాసిన ఉత్తరాలు. కానీ, ఈ ఉత్తరం అలాంటిదికాదు. మతిపోయి రాసిందేమోనని నా అనుమానం.

శ్రీదేవి: కాదని నేను చెప్తున్నాను.

రంగ: బొమ్మలతో ఆడుకుంటే నీ సరదా తీరుతుందేమోగాని శ్రీదేవీ! ఇన్నాళ్లూ ప్రాణమున్న ఒక మనిషితో ఆడుకున్నావ్. అవతల ఆమనిషి, చాలా ఖరీదైన వాడు.

శ్రీదేవి నాకు తెలుసు.

రంగ: తెలుసా? తెలిసే ఆ ఉత్తరం రాసేవా?

శ్రీదేవి: అవును.

రంగ: ఫెంటాస్టిక్! ఈ భూమ్మీద మనిద్దరి పరిచయం విన్నాళ్టిదో గుర్తుందా? రెండు సంవత్సరాలు. ఈ రెండు సంవత్సరాల్లోనూ నీ అభిప్రాయం యింత కటువుగా లేదేనాడు. పైపెచ్చు నన్ను రెచ్చగొట్టింది నువ్వు. కేవలం నువ్వు.

శ్రీదేవి: (లేచి నించుంది) క్షమించాలి. అనవసరమైన మాటలతో కాలయాపన చేయడం నాకిష్టంలేదు. నా ఉత్తరం చదివిన మీదట వేరే ప్రత్యేకంగా నా అభిప్రాయాన్ని విడమర్చి చెప్పవలసిన పన్లేదు. అది వినహా మరేమైనా మాటాడితే వింటాను.

రంగ: రంగనాయకులుగార్కి—నేను మిమ్మల్ని ప్రేమించడంలేదు. మిమ్మల్ని విషయంగా నొప్పిస్తే క్షమించండి. నన్ను మరిచిపోవడానిక్కి ప్రయత్నించండి. సెలవు. శ్రీదేవి. ఇంతకుమించి నీ ఉత్తరంలో మరో అక్షరం లేదు. రెండేళ్ల నుంచీ నీప్రాణం నేను. కొంచెం తొందరపడి వుంటే నువ్వు నా భార్యవై వుండేదానివి. ఇవన్నీ నీకు తెలుసు. తెలిసి గూడా నన్ను మరిచిపొమ్మని రాసేవ్. ఇదేమైనా తమాషివా?

శ్రీదేవి: నామీద మీకేవిధమైన అధికారమూ లేదని మీరు తెలుసుకుంటే శ్రమ తీసుకుని ఈ వూరొచ్చేవారు కాసేకాదు.

రంగ. ఈమాట మొదట్రోజుల్లోనే చెబితే నేనింత పిచ్చివాడినయ్యేవాడిని కాదు. జ్ఞాపకం తెచ్చుకో శ్రీదేవీ! మనకి చాలా కలలున్నాయి.

శ్రీదేవి మరిచిపోయి వారంరోజులైంది. ప్రయత్నిస్తే మీరూ మరిచిపోగలరు.

రంగ: నేనంత తేలికైన మనిషినికాదు శ్రీదేవీ! చెబితినే ఖరీదైనమనిషిని.

శ్రీదేవి మీకు 'అహం' ఎక్కువ.

రంగ: వొప్పుకున్నాను 'అవుతే ఈ రెండేళ్లలో నన్ను చదివిం దింత మాత్రమేనా? పిటీ. ఆ క్వాలిఫికేషనొక్కటేనా నాకున్నది. నీకు నచ్చనిదొక్కటి 'అహం' అంటే వొప్పుకుంటానుగానీ, నీకు నచ్చేవి చాలా వున్నాయి నాలో. ఒకటి అందం, రెండు గుణం, మూడు జీనియస్, నాలుగు—

శ్రీదేవి: అక్కర్లేదు. నేనేం వినదలుచుకోలేదు.

రంగ: పోనీ, నా ప్రశ్నకి జవాబు చెప్పు—నన్నెందుకు దూరం చేస్తున్నావ్?

శ్రీదేవి: అది నాయిష్టం.

రంగ: మరింత కాలమూ నన్ను ఆకాశాని కెత్తేవెందుకు? నాకున్న ప్రేమనంతా నువ్వొక్కర్తివే తిన్నావెందుకు?

శ్రీదేవి తెలీక

రంగ: నాగురించి నీకేం తెలీదని?

శ్రీదేవి: ఇదంతా అనవసరం. నేనిప్పుడు మిమ్మల్ని ప్రేమించడంలేదు. అంతే.

రంగ: ఎవ్వడైనా వింటే నవ్వుతాడు శ్రీదేవి? మొహమ్మీద నవ్వేస్తాడు. నువ్వేనాదేవుడన్న నీ మనసింత సడన్‌గా ఎందుకుమారాలి? కారణముంటుందిగా కారణంలేని నిర్ణయం 'పిచ్చి'ది. నీకు పిచ్చెత్తలేదని నాకు తెలుసు.

శ్రీదేవి. ఇప్పుడు కారణం చెప్పండె వెళ్లరన్నమాట.

రంగ: అంతేకాదు. ఆ కారణం సబబనిపిస్తే మరీ జన్మలో నీ మొహం చూడనని వొట్టేసి వెళ్లిపోతాను.

శ్రీదేవి: అయితే వినండి. నాకు చాలా సంబంధాలొస్తున్నాయి. నిష్పక్షపాతంగా ఆలోచిస్తే అవన్నీ మీమీద వెయ్యిరెట్లు యోగ్యమైనవి. నేను జీవితంలో చాలా అనుభవించాలి. విదేశాలు చూడాలి. కారుల్లో తిరగాలి. పాలరాతి మేడల్లో వుండాలి. ఇవన్నీ సమకూరేదెలా?

రంగ: ఫెంటాస్టిక్. క్వైట్ ఫెంటాస్టిక్. ఇన్ని కోరికలు నీ మనసులో వున్నట్టు మునుపు చెప్పలేదు నువ్వు.

శ్రీదేవి: అప్పట్లో నా కిలాంటి సమ్మంధాలు రాలేదు.

రంగ ఇప్పుడంటున్నమాట నిజమా?

శ్రీదేవి: ఇది అనవసరమైన ప్రశ్న.

రంగ: పోనీ, ఒక పనిచేస్తే బావుంటుందేమో ఆలోచించు.

శ్రీదేవి. ఏమిటో అది.

రంగ మరేంలేదు నీ కోరికలన్నీ భద్రం చేసుకో. నేనేం కాదనను. నన్ను పెళ్లి చేసుకో నీకోసం నేనేమైనా చేయగల మనిషిని. నీ కలలు నిజమయ్యేందుకు నాశక్తివంచన లేకుండా కృషి చేస్తాను. నామీద నాకా నమ్మకం వున్నది. సరేనా?

శ్రీదేవి: నాకా నమ్మకం లేదు

రంగ: (కోపం వొచ్చేసింది) శ్రీదేవీ! మరీ బడాయి పోవద్దు. నేనెప్పుడేది మాట్లాడినా చిత్తశుద్ధితో, ఆత్మవిశ్వాసంతో మాట్లాడుతాను. నీ మెప్పు పొందాలనీ, నిన్ను మోసం చేయాలనీ నాకు లేదు. నిర్లక్ష్యం చేయకు నన్ను. నన్ను నిర్లక్ష్యం చేసినట్టు తెలుస్తే సహించలేను. (కొంచె మాగి అన్నాడు)

నేనిప్పుడు యూనివర్సిటీలో చదువుతున్నాను. ఈ చదువుకి నీ కోసం రంగులు పులుముకుంటాను. పోనీ....ఓ పన్నెండ్య్య. నన్నిప్పుడే పెళ్లాడకు. నేమీ తొందర పెట్టను. నీక్కావల్సిన స్థితికి నే నెదిగిన నాడు, ఆనాడు నన్ను పెళ్లాడు.

శ్రీదేవి: (నిర్లక్ష్యంగానే అన్నది) ఎప్పటికో నిజమయ్యే కలని వాయిదా వేసుకోడం నా చాతకాదు. ఈ క్షణంలో నాకోరిక పండే అవకాశం నాముందున్నది అది మరిచిపోతున్నారు మీరు.

రంగ: నీ ప్రేమా, నీ మనసూ, మన పరిచయమూ—ఇవన్నీ నిన్ను ఆపలేవా?

శ్రీదేవి: కష్టం.

రంగ: అయితే నువ్వు మనిషివి కావు. నీకు హృదయంలేదు. నువ్వు దయ్యానివి నాపాలిటి పెనుభూతానివి. నన్ను మోసం చేశావ్ నువ్వు. నన్ను చంపేశావ్. శ్రీదేవీ—ప్లీజ్ కొంచెం ఆలోచించు.నేనుత్త ఆవేశపరుడ్ని. తర్వాత క్షణంలో నేనెలా మారిపోతానో చెప్పలేను నా గురించైనా ఆలోచించి నీ నిర్ణయం మార్చుకో.

శ్రీదేవి: ఇక మీరు వెళ్లచ్చు.

రంగ: జీవితంలో ఎవర్నీ ఎప్పుడూ ఏ విషయంలోనూ ప్రాధేయపడలేదు నేను. నాకోసం నేను కొన్ని పరిధుల్ని చిన్నప్పుడే ఏర్పాటు చేసుకున్నాను. వాటిని దాటి బయటపడటం నా కేనాడూ ఇష్టంలేదు అలాటి దీరోజు ప్రాధేయ పడుతున్నాను. అకారణంగా నన్ను దూరం చేయొద్దని వేడుకుంటున్నాను. ఒక్కటే మాట, ఒక్కటే బాణం బాపతు మనిషిన్నేను. నాయిష్టమొచ్చినట్టు మార్చుకోడానికి నేనే వొప్పుకోను. ఇవన్నీ నీకు తెలుసు తెలిసి గూడా నన్ను పరీక్షిస్తున్నావా? పోనీ, నా గురించెవరైనా స్కేండల్స్‌ని నీ చెవినేస్తే చెప్పు. వాళ్ల నోటితోనే నా మంచితనాన్ని వొప్పిస్తాను.

శ్రీదేవి: మీ మంచితనం గురించిగానీ, మీ సూటితనం గురించిగానీ నాకు అపనమ్మకంలేదు. ఎవరూ మీగురించి చెడు చెప్పలేదు. నా క్కావలసిన అవసరాలు ప్రస్తుతం మీనుంచి రావు. అందికే మిమ్మల్ని దూరం చేసుకోక తప్పడం లేదు. మీరింత మాటాడినా నే చెప్పే దీమాత్రమే. సెలవు. మీరిక వెళ్లచ్చు.

రంగ: మొడపట్టి గెంటించుకునేందుకు నేనిక్కడికి రాలేదు. వెడతాను. రంగనాయకులు అతి మంచివాడని పేరు నాకు. ఎప్పుడైనా నేను రాక్షసుడిగా కనిపిస్తే (వర్ధనమ్మ రావడంతో కొంచెం తటపటాయించి అన్నాడు) దానికి కారణం మీరే అవుతారు ఇది మాత్రం మరిచిపోవద్దు వొస్తాను.

(రంగనాయకులు వెళ్లిపోయేడు.వర్ధనమ్మ తలొంచుకుని నించున్నది. శ్రీదేవి గబగబా తల్లి దగ్గిరి కొచ్చింది. సానునయంగా అన్నది.)

శ్రీదేవి. నీ జీవితంలో ఇలాంటి తమాషా లెన్నో చూచి వుంటావ్. నాకు ధైర్యం చెప్పమ్మా!

వర్ధ: లేదు శ్రీదేవి! నిన్ను చూస్తుంటే నాకే భయంగా వుంది. నీ నిర్ణయం నీ బతుకునేం చేస్తుందో చెప్పలేకుండా వున్నాను. ఇంకా నీకు ధైర్యం చెప్పగల గుండెనిబ్బరం నాకెక్కడిది తల్లీ!

శ్రీదేవి అమ్మా!

వర్ధ కన్నకూతురు కలకాలం పచ్చగా బతకాలని ప్రతితల్లీ కోరుకుంటుంది. రంగనాయకులతో నువ్వు చెప్పింది విన్నాను. విదేశాలు చూడాలని, నల్లకారులో తిరగాలనీ, పాలరాతి మేడల్లోవుండాలనీ అన్నావ్. కేవలం అతన్ని దూరం చేసుకోడానికి నువ్వలా అన్నావ్. నిజమే. వొప్పుకున్నాను. దేవుడు కరుణించి, తథాస్తు దేవతలు దీవించి నీకా అవకాశమిస్తే నాకు అంతకంటే ఏంకావాలి తల్లీ! కానీ వరదరాజులు నిన్నేం ఉద్ధరించలేడు. నిన్ను నువ్వే మోసం చేసుకుంటున్నావ్. నీకు ఈ విషయం పూర్తిగా తెలుసు. అదే నాబాధ.

శ్రీదేవి నాకింకా ఏం చెప్పకమ్మా! నా నిర్ణయానికిచన్నాదిలేయ్! వీళ్లైతే నాక్కొంచెం ధైర్యం చెప్పు చాలది.

(వర్ధనమ్మ శ్రీదేవిని గుండెలకు హత్తుకున్నది.)

వర్ధ: దయామయుడు ఆ భగవంతుడే నీకు రక్ష!

(ఆవేళకి రాజశేఖరం గారొచ్చేరు. ఆయన్ని చూచి తల్లీ కూతుళ్లిద్దరూ కలవరపాటు చెందేరు. ఒకరి మొఖా లొకరు బిక్కు బిక్కుమంటూ చూచుకున్నారు. తెలుసు! ఆ ముగ్గురి మధ్యా అంత తొందరగా సంభాషణ పొసగదు. అందికే తెఱ.)

## రెండో రంగము

(ఒక ఆఫీసరు బంగళా)

(వరదరాజులు ఫైల్సుతో సహా గబ గబా బైటనుంచి లోపలికొచ్చేడు. గోపీ అనబడే ఆఫీసు బోయ్ అంత హడావిడి తోనూ బైటకు రాబోయేడు. ఒకర్నొకరు చూచుకుని ఇద్దరూ అకస్మాత్తుగా ఆగిపోయేరు. గోపి సర్దుకుని అన్నాడు)

గోపి —గుడ్‌మార్నింగ్ సార్!

వరద —దటీజ్ గుడ్

గోపి —ఏంసార్! ఇంత ఉదయమే వొచ్చేరు?

వరద —(టైం చూచుకున్నాడు) ఉదయ మేమిటోయ్ పద్దై పోతేనూ! అర్జంటు చెక్కులున్నాయిగానీ ఆఫీసరుగారు ఇంకా లేవలేదా?

గోపి:—లాభంలేదు సార్. ఇంతలో లేవరు (మేడమెట్లవేపు చూచి అన్నాడు) తెల్లవారుఝామున నాలుగింటికి వచ్చేరు మరో గంటగ్గాని లేవరు

వర:—ప్రాణాలు తింటున్నారోయి భగవాన్లా!

గోపి —ఎవరుసార్?

వర:—సరిసరి ఈ పురాణానికేమొచ్చెగానీ, ఎందాకా? హడావిడిగా వెళ్లిపోతున్నావ్.

గోపి:—పాలవాడు ఇవాళ ఆబ్సెంట్ పక్కవీధిలో పాలమ్ముతారు వెళ్లిరావాలి. మీరు గూడా ఆఫీసుకి వెళ్లిపోండిసార్

వర:—ఫర్లేదు. నే నిక్కడే కూచుంటాను ఆఫీసుకి వెళ్లనోయ్. అక్కడ పాములున్నాయి

గోపి —మీ యిష్టంసార్! అయితే నే వెళ్లొస్తానండి!

(గోపి గబ గబా వెళ్లిపోయేడు. వరదరాజులొక్కడూ మిగిలిపోయేడు. కాసేపటికి లేచి నుంచున్నాడు. ఓ తడవ మేడ మెట్లవేపు, అటు వీధివేపు చూచి నాలిక తడుపుకుని అన్నాడు.)

వర.—ఇవి చెక్కులు సార్. అయ్యో! ఈ చేతులు వేలూ, లక్షలూ రాసేయి రాస్తున్నాయి ఎంతెంత మందికో మనవసరం మహా గొప్పగా ఒచ్చేస్తుంటుంది పాపం! అయ్యో! నే నింత బిజీగా ఉన్నానా, ఇక్కడ శ్రీవారికి నామీద ఇం.....త కోపం. ఎందుచేత? నాకు తెలీదు అటు మా మేనేజరుకి నేనంటే వల్లమాలిన విరోధం. ఎంచేత అదీ తెలీదు సింపిల్‌గా ఇదంతా సృష్టి రహస్యం ఇదీసార్ నా కథ (సోఫామీద కూచున్నాడు చెక్కు పుస్తకం తెరిచేడు ఓ పేరు చదివేడు.) ఆరోగ్గోవిందరావ్ అండ్ సన్స్ వీళ్ల గురించి మీకొక్కంథం చెప్పాలి ఈ ఆరోగ్గోవిందరావ్ సన్స్‌లో జేష్ఠుడు నాకు తెలుసు వాడుత్త వెధవ ఏమంటే, వాడి పెళ్లాం గాడితప్పిన ఇల్లాలు వూరి జనాభాతోపాటు జేష్ఠుడి గ్గూడా ఈ విషయం తెలుసు అయినా పెద్ద మనిషిలా చెలామణి అవుతున్నాడావటాంటె కారణం ఏమిటి? నొసట రాసిన గీత, చేతిలో మణుగు బెల్లమూను నన్నడుగుతే— నివసిస్తోన్న సగం జనాభా కేవలం చలి చీమలని చెప్తాను దోమలూ ఉన్నారు అది వేరే విషయం ఈ ఆరోగ్గోవిందరావ్ అండ్ సన్స్‌కి పాతికవేల చెక్కు. వాళ్లేం పొడిచేరో ఏవిటో ఇటు శ్రీవారికీ, అటు మానేజరు మహాశయుడికీ తప్పించి నర మానవుడికి తెలీని చిదంబర రహస్యం నాన్‌సెన్స్ ఈ పాపాలబరువుని నేను మోయలేను

(చెక్కు పుస్తకాన్ని సోఫాలో పారేసి చేతులు దులుపుకున్నాడు. ఆవేళకి పాల చెంబుతో గోపి విసురుగా వచ్చేడు. అంత విసురుగా వంట గదిలోకి వెళ్లివచ్చేసి నిటార్చేడు.)

వరద —అనుకోకూడదుగానీ, నువ్వూ బిజీగానే ఉన్నావు న్యూయార్క్‌లో పోలీసాడిలా!

గోపి —బలేవారుసార్! మీరు గమ్మత్తుగా మాటాడేస్తారు సార్!

వరద.—ఈజిట్. పోనీవోయ్. ఎంత చక్కగా మాటాడినా ప్రయోజన మేమిటి. ఏంవాయ్ గోపీ!

గోపి —సార్.

వరద —వెధవధి. మాటకుముందు 'సార' న కోయ్ తల్నొప్పి నాకు ఆ శేషాచలంలేడూ— అదేనోయ్ మనాఫీసు మేనేజరు ఆయన కెంతమంది పెళ్లాలట

గోపి —అదేమిటిసార్! (నవ్వేడు) పెళ్లా లేమిటండి బాబోయ్!

వరద —ఇరవై నాలుగ్గంటలూ రైలింజన్లా మండిపడి పోతా డేమిటోయ్? నా నాలుగేళ్ల సర్వీసులో—ఇదిగో ఇక్కడే చూస్తున్నాను ఇంత చిరాకు మనిషిని

గోపి —(వెల్లిగానే అడిగేడు) మరయితే మ నాఫీసరుగారి సంగతో సార్?

వరద —(ఉలిక్కిపడి నించున్నాడు గోపీ క్కూడా భయమేసింది) ష్ గట్టిగా అరవకోయ్ దేముడా కొంపలారిపోగలవు (కొంచెం ఆగి) అన్నట్టు మనాఫీసునుంచి రెండు నెలల్లో వెళ్లిపోతున్నట్టు వార్తలొస్తున్నాయి నిజమేనా?

గోపి —నాకు తెలీదు సార్!

వరద —కోస్తున్నావ్

గోపి —తల్లితోడు సార్!

వరద —అవునోయ్ గోపీ! ఇంకోటి అడుగుతానుగాని నిజం చెప్తావా?

గోపి —నాకు తెలుస్తే నిజమే చెప్తానుసార్ మీ రడగండి.

వరద —ఆఫీసరు పేకాట పక్షిట నిజమేనా?

గోపి —అయ్యబాబోయ్!

(చాలా సేపటివరకూ వరదరాజులు నోరెత్తలేదు. గోపీ నోరు మూసేసుకున్నాడు. మొట్ట మొదట, వరదరాజులే నోరు మెదిపేడు.)

వరద —ఏయ్ గోపీ! నేను నిన్నేం అడగలేదు ఎందుకలా గాభరాపడిపోతావ్. నేనేమీ అన్లేదుగా. మర్చిపో.

గోపి, అవున్సార్! మీరేం అన్లేదు సార్ శేషాచలంగారి గురించి అడిగేరు.

వరద.—అవునోయ్! ఆయన కెంతమంది పెళ్లాలు?

గోపి:—అది నాకేం తెలీదండి.

వరద —పోన్లే పోన్లే.

(గోపి వీధి తలుపు దగ్గిరికి వెళ్ళొచ్చి అన్నాడు)

గోపి:—మీరంటె నాకు బలే జాలి సార్!

వరద —అదేమిటోయ్. నామీదెందుకు జాలి

గోపి:—ఆఫీసులో కెల్లా గంగిగోవులాటివారు పాపం, బండెడు చాకిరీ మీరే చేయాల్సి వొస్తుంది. పైగా ఖస్సులూ బుస్సులూను

వరద.—(కదిలిపోయేడు) మొన్నాదివారం ఏం జరిగిందో తెలుసా? ఉదయమే ఆఫీసుకి రమ్మన్నాడోయ్ ఆఫీసరు ఏమిటిసార్ ఆదివారంపూట ఇంటి దగ్గిర్లే పోతే నాకేం తోచదుసార్ అన్నానోయ్ నేను కళ్ళెఱ్ఱజేసి 'డ్యాట్ ఫస్టన్నాడు' ఎంతైనా గుమాస్తానిగదా నా బతుకు ఆయన చేతుల్లో ఉన్నాదిగదా వెళ్లేను ఉదయం తొమ్మిదికూర్చున్నా రాత్రి పదింటగ్గాని తలెత్తలేదు అయ్యిందా— అంత ఖంగార్లో ఒక చిన్న తప్పు దొర్లిందే అనుకో, అంతమాత్రాన—తాడిచెట్టులేదూ, అంతెత్తు లేచి నించుని గబగబా తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ వాగేశాడు మళ్లీ సోమవారం ఉదయం 8 గం. హాజరు కావాలని ఆర్డరు జాలి లేదోయ్ ఈ ఆఫీసరుకి నా సర్వీసులో చూచిన ఆసీసర్లో క్లాస్ వన్ యమధర్మరాజు ఇక్కడున్నాడు నే నీ ఆసీసుకి బదిలీ అయ్యి నాలుగు నెలలైందా—ఈ ఆఫీసరొచ్చి రెండు నెలలు అవునా! ఈ రెండు నెల ల్లోనూ ఒక్కరోజు (చేతి వేలితో చూపించేడు) ఒక్క రోజు గూడా ఎర్లీగా ఇంటికి వెళ్లలేదు నేను ఇది ఏనాటి ఖర్మమంటావ్?

గోపి —నిజమేసార్ మీ గురించి నాకు చాలా తెలుసుసార్ అయినా సార్, మెత్తగా ఉన్నవాళ్లమీదే విరుచుకుపడతా రీయన. అదే ఆ మోహనరావుగారి మీద ఎగరమనండి, రెండు నిమిషాల్లో నోరు మూసేయాల్సిందే మోహనరావుగారి వెనక హంగు అలాటిది

వరద.—ఇదిగో గోపి వెయ్యేల! (నొసటి చూపించేడు) గీత ఉంది చూసేవ్. దాని ప్రకారం అన్నీ జరగాలంతే. ఆ గీతని మనం మానవ మాత్రులం మార్చలేం బ్రహ్మదేవుడు నాకేం చేసేడో తెలుసా? మనిషినంతా తయారు చేసి 'ఇక్కడ దురదృష్టం దొరుకును' అని రాసి పారేశాడు. లేపోతే— ఏంవాయ్ గోపీ! నేను బి. ఏ ఫస్టు క్లాసులో పాసైయ్యానోయ్ నాతో పాటు చదువుకున్న ఎందుకూ పనికిరాని వెధవలు చాలామంది వెలిగి పోతున్నారనుకో ఆ వెలిగే వాళ్లలో నేనూ ఉండరాదు! ఊహు గీతోయ్ గీత చెప్పుకింద మల్లెపూవులా నలిగిపో నరుడా అని రాసుంటే వెలిగి పోడ మెలా సాధ్యం?

గోపి —(చేతులు నలుపుకుంటో చెప్పేడు) నేనూ దౌర్భాగ్యుణ్ణే సార్! ఒక ప్పుడు బాగా బతికిన వాళ్లం. రోజులు బాగోలేక యిలా తయారయ్యేం యసల్సీతో చదువాగిపోయింది. నాన్న పోయాడు అమ్మ, పెళ్లికాని చెల్లెళ్ళూ, అప్పులూ మధ్యవాడిని మంచిరోజులొస్తే నీవల్లనే గోపీ! ఉద్యోగంచేసి సాధించూ అని అమ్మంటుంది నేనేం సాధిస్తున్నానో మీ రూస్తున్నారుగా సార్ ఇంటా బయటా నా నెత్తురు తాగు తున్నారు. సార్. నేను నిజం చెప్పేస్తున్నాను. మన కొత్తాఫీసరు ఒచ్చిం దగ్గర్నుంచీ మరీ యిద్దైపోతున్నాను సార్. పగలూ, రాత్రి వ్యత్యాసం లేదు అస్తమానూ వేటకుక్కలా ఆయనున్నంటి పెట్టుకు తిరగాలి ఆయన తిట్లు తినాలి. నాకు పెళ్లి కాలేదు గనక; నేను మనిషిని కాదుసార్.,

వరద — పోన్లేవోయ్. బాధపడకు ఈ యముడెన్నాళ్ళుంటాడో చూద్దాంగా. రెండు నెలల్లో ఎలాగో వెళ్లిపోతాడు ఓవేళ వెళ్లకండా మన పీక ల్మీద కూచుంటె— ఎన్నాళ్ళు సాధిస్తాడేమిటి! ఒకరోజు, రెండు రోజులు మహా అయితే నెల. అంతే ఒస్ అందరంఒక్కటైతే గోవిందా. గోవింద గాలి తీయడం ప్రారంభమవుతుం దంతే!

గోపి.—(మళ్ళా గుర్తుకొచ్చింది) సార్ సార్ మనం చాలా గట్టిగా మాటా డేస్తున్నాంసార్ ఆయన వసలు పాం చెవులు మొహం చూచి జాత కము చెప్పేస్తారు మొన్నేమైందో తెలుసా సార్! సుబ్బారావుగారు గది బైట నుంచుని భోజనం గూడా చేయకుండా ఈ వెధవ ఉద్యోగ మెన్నాళ్ళు? నే చేయలేను బాబూ? అన్నారండి. ఆ మాటలు గాజ ద్దంలోంచి ఎలా విన్నారో దేవుడికి తెలియాలి లోపలికి పిలిపించి రెండు దులిపి పంపేరు. ఇప్పుడు నిద్రపోతూన్నారనుకుని మన మిలా మాటాడుతున్నామా? ఇవి ఆయన చెవులు వింటే—వొద్దుసార్ మన మీ విషయా లిక్కడ మాటాడకూడదు

వరద —సరిసరి. ప్రాణాలు తింటున్నాడు యముడు!

(సరిగ్గా ఆవేళకి సుబ్బారా వొచ్చేడు. అతని బట్టలు మాసిపోయి ఉన్నాయి. అతనికళ్లు ఎర్రబడిఉన్నాయి. జుత్తు రేగివుంది. మనిషి యావత్తూ నీరసంగా కనిపిస్తూ న్నాడు. సుబ్బారావుని చూడగానే గోపి అన్నాడు.)

గోపి —గుడ్మార్నింగ్సార్. అప్పుడే వొచ్చేశారే రండి రండి

సుబ్బా —గుడ్మార్నింగ్ వరదరాజులుగారూ! మీరూ వొచ్చేరే?

వరద —(చేత్తో విష్చేసి వూరుకున్నాడు )

సుబ్బా:—(గోపీ నుద్దేశించి—మేడమీదికి చూచి) లేవలేదా?

గోపి —లేదు సార్

సుబ్బా —(సోఫాలో కూచున్నాడు సిగరెట్టు ముట్టించేడు )

గోపి —(అదిరి గొంతు చించుకున్నాడు) సుబ్బారావుగారూ! ఏమిటిదిసార్!

సుబ్బా —సిగరెట్టు కాల్చుకుంటున్నానోయ్! (సిగరెట్టు పేకెట్టు వరదరాజులు కిస్తూ అన్నాడు) మీరూ కాల్చండి

వరద —వొద్దు గురూగారూ!

గోపి.—సార్! ఇది అయ్యగారి బంగళాసార్! మీరలా సిగరెట్టు కాలుస్తున్న ట్టాయనచూస్తే కొంపలంటుకుంటాయి సార్ తర్వాత విచారిస్తే మరేం లాభంలేదు అయ్యగారి సంగతి మీకు బాగా తెలును.

సుబ్బా —నాన్సెన్స్ నించునే ఉన్నారే కూచోండి వరదరాజులుగారూ! కూచోండి

వరద —(బిక్కు బిక్కుమంటూ కూచున్నాడు )ఇంతకుముందెప్పుడైనా ఆఫీసరు ముందు ఈ కాగడా వెలిగించేరా సుబ్బారావుగారూ!

సుబ్బా —లేదు వరదరాజులుగారూ! పాత సుబ్బారావు చచ్చిపోయినమాట మీకు తెలీదేమిటి ఖర్మ వీడు సరికొత్త సుబ్బారావ్ గోపీ.

గోపి —సార్.

సుబ్బా —కాఫీ అయిందేమో చూడవోయ్!

గోపి —(భయం వేసింది) ఏమిటిసార్! కాఫీనే అయ్యగారి బంగళాలో కాఫీనే. అయ్యా సుబ్బారావుగారూ!

సుబ్బా.—షటప్ నే నడిగింది కాఫీ నీ వెధవ ఏడుపు వినడానిక్కాదు టైంలేదు. వెళ్ళు కాఫీ పట్రా. (వరదరాజుల్తో) మీకు స్ట్రాంగ్ కాఫీ యిష్టం కదూ! పంచదార జాస్తీగా తగిలించమంటారా? చెప్పండి వరదరాజులూ!

వరధ —(కొంచెం సర్దుకూర్చున్నాడు) వచ్చేముందేమైనా పుచ్చుకొనొచ్చేరా?

సుబ్బా.—అంటె.

వరద.—(నటించి చూపేడు.) మందు. లేపోతే ఏమిటి గురూ నీ బడాయి. వెధవది నువ్చేసే బోడి గుమాస్తాగిరికి ఆఫీసరు బంగళాలో కాఫీ ఏర్పాట్లు గూడాను ఈ బంగళాలో టైగరుందని తెలీదూ?

సుబ్బా —గేస్ హూ యీజ్ టైగర్! ఆఫ్టరాల్ ఏ నాఫీసర్ మనం ఈ ఇంటి కొచ్చి అతిథులమయ్యేం. కాఫీలు పోయించడం ఆయన భాధ్యత

వరద —వొద్దులే గురూ! నా కొద్దు. ఇంట్లో ఇల్లాలుగలవాడిని. ఇంటిదగ్గరే పూర్తి చేసుకుని వొచ్చేను. నువొక్కడివీ లాగించు.

సుబ్బా.—వూ. ఇంకా ఇక్కడే నించున్నా వేమిటోయ్ కదులు. వెళ్లి నా కొక్కడికీ కాఫీ పట్రా. వెళ్లు.

గోపి.—నేను వెళ్లలేనుసార్! నామాట వినండిసార్! అది నాచేతకాదుమరి.

సుబ్బా:—ఫూల్. ఎవడ్ని చూచిరా నీ కింత భయం? నేను సుబ్బారావుని. పెర్సనల్ అసిస్టెంటుని. ఇవతల నాగ్గూడా మానాభిమానాలున్నాయి. వెళ్లు. నే నడిగింది పట్రా అంతే. (వరదరాజులు లేచి నించున్నాడు.) అరే. మీరు కూర్చోండి. మీరెందుకూ అనవసరంగా నించుంటారు?

వరద:—కాదులే గురూ! నేను నించునే ఉంటాను.

సుబ్బా:—సరే మీ ఇష్టం. (గోపీతో) నువ్వెళ్లవేమోయ్?

గోపి:—అయ్యగారింకా నిద్ర లేవలేదుసార్. ఆయన లేస్తేనేగానీ వెంకటస్వామి కాఫీ పెట్టడుసార్.

సుబ్బా:—బ్లడీ హెల్! హూ ఈజ్ వెంకటస్వామి. వాడితో చెప్పు సుబ్బారావ్ గారికి కాఫీ కావాలని (బిక్కు బిక్కుమంటూ గోపి వెళ్లిపోయేడు) చెప్పండి వరదరాజులుగారూ! క్షేమాలు చెప్పండి.



వరద.—చిత్తం. క్షేమమేసార్!

సుబ్బా:—పిటీ. కొత్తగా మెన్షన్ చేస్తూన్నారే?

వరద.—అయ్యో. లేదండీ. తమరిప్పుడు గొప్పవారు. జనాన్ని అదరగొట్టేస్తూన్నారు.

సుబ్బా:—నవ్వకు గురూ! నా జీవితం పతనమైపోయింది నేను నలిగిపోయేను. ఈ పాడు నరకం నన్ను తినేసింది. దీనికి రిజైన్ చేసేస్తాను. మీకు తెలుసా వరదరాజులుగారూ! నా వయసెంతో!

వరద:—(తలూపేడు తెలీదన్నట్టు.)

సుబ్బా.—ఇరవైఏడు. ఎన్ని ఇబ్బందులో గడిచి ఈ ఉద్యోగం సంపాయించేను ఎక్కడ శ్రీకాకుళం, ఎక్కడ హైద్రాబాద్! ఎందు కొచ్చే నిక్కడికి? కడుపుకింత తిండికోసమే. తిండి దొరుకుతుంది వరదరాజులు గారూ! కానీ గౌరవంలేదు. ఆత్మ చచ్చిపోయి రెండ్నెల్లయింది ఈ కొత్తాఫీసరు నామీద స్వారి చేస్తూన్నాడు. వేళకు తిండిలేదు. నోస్లీప్. ఇరవైనాలుగ్గంటలూ కళ్లల్లో నీళ్లు పెట్టుకుని ఈ దొరగారివెంట రోజుకో వూరు తిరగడం. (క్షణ మాగేడు) ఈ గుండెల్లో (చేయివేసి చూపించేడు.) వినండి వరదరాజులుగారూ! వినండి. సీత పిలుస్తోంది. అమ్మ పిలుస్తోంది ఫ్రండ్స్ పిలుస్తూన్నారు సొంతవూరు పిలుస్తోంది. విన్నారా వరదరాజులుగారూ!

వరద:—(లేదన్నట్టు తలూపేడు.)

సుబ్బా:—రోజూ, ప్రతిక్షణమూ, నా కీ పిలుపులు వినిపిస్తాయి. అప్పుడ. ఏడుపొస్తుంది. అప్పుడు నరకంలో ఉన్నాననిపిస్తుంది వరదరాజులు గారూ—ఇదే స్వర్గమైతే నా కవన్నీ వినిపించవు సార్! ఇది నరకం క్వైట్ డేమ్ హెల్. నెల రోజులక్రితం (గొంతు రుద్ధమయ్యింది. ఇదే ఆఫీసర్ని సెలవడిగేను వరదరాజులుగారు. నెలరోజు లడిగేను) ఇవ్వనన్నాడు అప్పుడు సిగ్గువిడిచి నా కొచ్చే పిలుపులు గురించి చెప్పేను. నా సీత కథ చెప్పేను. ఐ టోల్డ్ ఎవిరిథింగ్.

(గోపీ తిరిగి రావడంతో మాటలాపి అడిగేడు)

సుబ్బా:—ఏం చెప్పేవా? కాఫీ చేస్తున్నాడా వెంకటస్వామి.

గోపి:—చేస్తానన్నాడు సార్.

సుబ్బా:—యస్. వరదరాజులుగారూ. నే కెంతవరకూ చెప్పేను?

వరద:—చూడండిమాస్టారూ! మీ వరసేం బాగోలేదు. మీకూ ఆఫీసరుగారికీ మధ్యేం జరిగిందో మాకు తెలీదు. మీ రీ వరసన నా ముందు చెప్పుకుపోతే—ఉరేసుకున్నంత పనవుతుంది.

సుబ్బా:—నో ఫియర్స్. మిమ్మల్నెవరూ ఏమీ అనరు. అంటే నే నూరుకోను. నెల రోజులక్రితం ఆఫీసర్తో నా ప్రేమకథ చెప్పేను. సీత నాకు ప్రాణమన్నాను. ప్రేమించుకున్నాం. (అతని సంక్రాంతి సరదాలు గుర్తుకొచ్చేయి: మేళ తాళాలు అతని మనసులో మోగేయి. అప్పటి ఆనందం అతని కళ్లల్లో నీళ్ల రూపాన నిలిచింది. వాళ్లూర్లో అత నిప్పుడున్నాడు.) వరదరాజులుగారూ! నే నెంత దురదృష్టవంతుడ్నో అంత అదృష్టవంతుడ్ని. (వరదరాజుల్లో మార్పు కలిగింది. సుబ్బారావు చెప్పేది తప్పనిసరిగా వినాలనుకున్నాడు.) సుబ్బారావ్— ప్రేమిస్తూన్నా నన్న అనే అందమైన ఆడపిల్ల పేరు సీత. సీతా! (క్షణం ఆగేడు) సంక్రాంతి పండగ రోజులు. పిల్లా పెద్ద అందరం ఆ రాత్రి తోలుబొమ్మలాట చూస్తున్నాం. (అప్పటి రణ గొణ ధ్వని వరదరాజుల్కూ విన్నట్టే వుంది) ఆట మధ్యలో—నాముందు కూర్చున్న సీత కాలు కావాలనే తాకేను వరదరాజులుగారూ! కావాలనే తాకేను. అప్పుడు సీత నావేపు తిరిగి చూచింది. నవ్వింది. అన్నది—వాళ్లు చూస్తారు అని సీత కళ్లని కవ్వించేను తల తిప్పుకుంది గోముగా బొమ్మలాట చూస్తోంది. కొంచెం సేపు జరిగింది. సీత జడమీద నా చూపు నిలిచింది. జడ పట్టుకు లాగేను. పరాకున మఖంద కేక పెట్టింది. తర్వాత నేనని తెలిసి

హోరుమూసుకుంది. చుట్టుపక్కల జనం లేచి నించున్నారు. అప్పుడు 'సీత వాళ్ళందరితో చెప్పింది వరదరాజులుగారూ!

(అతని కళ్ళల్లో ఆనందం వెల్లి విరిసింది. కన్నీటి బొట్లు జల జలా రాలేయి. చెక్కిలిపై నించున్నాయి)

వరద—మీ కేడుపొస్తోంది గురూగారూ!

సుబ్బా—నో.. ..నే నేడవను ఏడవను సీతా! నే నేడవను. అప్పుడు నించున్న జనంతో సీత మా ప్రేమ గురించి, మా మనసుల గురించీ నిర్భయంగా ఒక్క మాటలో, చెప్పింది సార్. "మీరంతా కూచోండి! క్షమిస్తే మే మిద్దరం ఇక్కడ్నుంచి వెళ్ళిపోతామని."

వరద—లవ్ లీ. వండ్రఫుల్. హంబుల్ లవ్!

సుబ్బా—థేంక్స్. వరదరాజులుగారూ! మీరు దేవుళ్ళసార్! అందికే నా ప్రేమనీ నా సీతనీ మెచ్చుకుంటున్నారు మీరు. కానీ,(చేత్తో మేడమెట్లు చూపేడు. ఈ డెవిల్ . ..నా కథ పూర్తిగా విని కడుపు చెక్కలయ్యేలా నవ్వేడు. పేపరు వెయిట్ గాల్లోకి విసిరేడు. సీతని చూచేందుకు సెలవివ్వ నన్నాడుసార్! (ఏడ్చేశాడు)

వరద:—(అతని భుజంమీద చేయివేసి సముదాయించబోయేడు.)

సుబ్బా—డోంట్ టచ్మీ! నేను చావను చావ న్నేను.

వరద—ముందు మీ రలా కూచోండి. కొంచెం రెస్టు తీసుకోండి.

(సుబ్బారావుని కూచోపెట్టేడు గోపి—ఏం మాటా డొద్దని వరదరాజులుకి సైగచేశాడు. సర్లెమ్మన్నట్టు వరద రాజులు తలూపేడు. బైట కారు ఆగిన శబ్దమైంది. గోపి గబ గబా గుమ్మం దగ్గిరికి వెళ్ళి, వచ్చిన కారుని చూసి తిరిగొచ్చి అన్నాడు.)

గోపి—అర్గోవిందరావ్ అండ్ సన్స్.

వరద—పాపం! ఆఫీసర్ని కలుసుకోడాని కొచ్చిందేమో పక్షి!

గోపీ—రానీండి సార్ ! ఇంతవరకు సం దడ్డైనా లేదు.

(ఓ లావుపాటి ఖరీదైన గోవిందరావు లోనికి వచ్చేడు.)

గోపి—నమస్కారంసార్!

గోవింద—అబ్బొ! అబ్బొ! ఆఫీసు, ఆఫీసంతా యిక్కడేవుందే వరదరాజులు గారూ, సుబ్బారావుగారూ—

వరద.—ఆఫీసరుగారేమి పైనున్నారు.

గోవింద—ఆహా...అయితే వార్ని కలుసుకుని ఇప్పుడే వస్తాను (పైకి వెళ్ళ బోయాడు)

గోపి—ఆగండిసార్! వీరు పాతాఫీసరుకాదు. కొత్త ఆఫీసరు.

గోవింద:—విన్నా! విన్నా! కొత్తవారేనని విన్నాను. చూసొస్తా!

గోపి—కార్డివ్వండి. ఆయన నిద్రలేస్తే నేను చూపిస్తాను.

గోవింద:—అబ్బొ! అబ్బొ! కొత్త రూల్సేమిటి? దీనితో గోపీ పెరిగిపోయే డన్నమాట! (లాల్చీ జేబులోంచి విజిటింగ్కార్డు తీసి గోపీకిచ్చేడు. గోపీ మేడమీది కెళ్ళాడు) ఏమిటిది సుబ్బారావుగారేదో శోకప్పిజిలో కూర్చున్నారేమిటి? సీకాకుళం గుర్తొచ్చిందేటి బాబూ!

వరద—అతని కొంచెం సుస్తీగా ఉందంతే.

గోవింద—సెలవు పెడితే పోలా? పోనీ హో వస్పెయ్యండి. గోపీని మా ఆఫీసుకి పంపుతే మందిచ్చి పంపుతాను.

వరద.—అబ్బే! మరేం ఫర్లేదు. అదే సర్దుకుంటుంది. ఇప్పుడు మీ రిష్వ బోయే మందు పడితే మరింత ఖంగార్లై పోగలడు. మునుపు శేషాచలం గారిలాగే మీ మందుచ్చుగుని మూర్ఛ జాలు లేవలేదు. గుర్తుంతా గోవిందరావుగారూ!

గోవింద:—కొత్త వాళ్ళని మొదట్లో ఖంగారు పెట్టినా, అలవాటైతే చూసేరూ దానికి మించిన దివ్యమైన ఔషధం మరోటి లేదని చెప్పాలి. మునుపు శేషాచలంగారు ఈనాడు శేషాచలంగారు, ఈ రెంటిలో విశేషం కనిపింత లేదా మీకు. చంపారుపొండి—ఆఫీసైన మరుక్షణం వారు మా ఆఫీసులో ప్రత్యక్షం గావాలి. కొంచెమో గొప్పో మందుచ్చుకుని వెళ్ళాలి. అది రివాజై పోయింది. ఇప్పుడు చూడండి—ఏపిల్పండుల్లా ఉన్నారు. దేవతలు పూర్వం దీన్ని అమృతమనేవారు.

వరద.—బాగా చెప్పేరు. నాకీ తిరకాసు తెలిచ్చావదు. ఏమిటో మీరు చెబు తూంటే చెవొగ్గి వినడం తప్పించి ఆ మహత్తరమైన మందు వాడే గట్స్ లేవు సుమండి.

గోవింద—పోదురూ బడాయి!

వరద:—అందరూ క్షేమమాండి!

గోవింద:—ఏదో మీ దయవల్ల ఇలా గున్నాం. చూడండి. మోహన్రావ్గారు ఆఫీసు కొస్తున్నారా?

వరద—ఆ హాఁ! నిక్షేపంగా.

గోవింద.—మరేంలేదు—మొన్నీమధ్య అవసరమొస్తే మా ఆఫీసులో ఓ వంద పట్టుకెళ్ళార్ట—రెండు మూడు రోజుల్లో సర్దుతా నావటాని చెప్పి నెల రోజులు గడిచింది, ఇప్పటి కొచ్చి సర్దుబాటు చేయనేలేదు.

వరద:—ఏమిటి రూపాయిలే. చేస్తాడులెండి.

గోవింద—ఏం చేస్తారో! మీక్కనిపిస్తే ఆయన చెవి నేద్దురూ (ఏదో మాట్లా డబోయేడుగానీ గోపీ రావడంతో టక్కున ఆపేడు.) రమ్మన్నారా గోపీ!

గోపి.—లేదు ఉండమన్నారు. పావుగంటలో వాస్తారంట. డ్రెస్సవుతున్నారు. కూర్చోండి (సుబ్బారావుని చూచి అన్నాడు) సార్! మిమ్మల్ని పైకి రమ్మంటున్నారండి. ఆఫీసార్డరేదో టైపు చేయాలిట. మీరుకూచోండి గోవిందరావుగారు!

(గోవిందరావు బిక్కు బిక్కుమంటూ కూచున్నాడు. సుబ్బారావు విసురుగా మేడ మెట్లెక్కి వెళ్ళిపోయేడు. గోపీని చూచి పరాకుగా అడిగేడు వరదరాజులు)

వర:—ఆఫీసరు నిద్ర లేచారా?

గోపి:—(అవునన్నట్టు తలూపేడు.)ఇలా రండి. మీతో ఒక ముఖ్యమైన విషయం.

(వరదరాజులు దగ్గిరకొచ్చేడు. అతని చెవులో ఏదో చెప్పేడు గోపి. వరదరాజులు గుడ్లు మిటకరించేడు.)

గోవింద:—ఏమిటోయ్ అదీ. పాపం వరదరాజులుగారి చెవిని తినేస్తున్నావ్.

గోపి:—సొంత విషయాలు సార్.

గోవింద:—అబ్బా! గోపి చిత్రంగా మారిపోయేడు సుమీ !

(మేడమీదనుంచి గట్టిగా మాటలు వినిపించేయి)

సుబ్బారావ్.—నే నీ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడాని కొచ్చేను.

ఆఫీసరు:—అది తర్వాత. ముందీ కాగితం టైపు చేయండి. అండర్స్టేండ్.

(గోవిందరావులేచి నించున్నాడు. వరదరాజులు గోపీ వేపు చూసేడు. గోపీ పెదవి విరిచేడు. రెండు క్షణాలు నిశ్శబ్దం!)

గోవింద:—ఆయన కింది కెప్పుడొస్తారయ్యా!

గోపి.—పావుగంటకి సార్! మీరు కూర్చోండి ముందు. ఆయనొచ్చే వేళకి మీరిలా నించుంటే నా కొంప కాల్తుంది. కూర్చోండి బాబూ కూర్చోండి

(గోవిందరావు కూర్చున్నాడు)

గోవింద.—ఏమిటో మాయ.

(మేడమెట్లమీంచి పుస్తకం చదువుకుంటో రంగ నాయకులు దిగొచ్చేడు. అతన్నిచూచి గోవిందరావు లేచి నించున్నాడు. గోపి నవ్వేసేడు. ఏమిటన్నట్టు గోవింద రావు గోపివేపు చూసేడు.)

గోపి.—మీ రుత్త తొందర మనుషులు సార్. వారు ఆఫీసరుగారుకాదు. వారి మేనల్లుడుగారు. మీరు కూర్చోండి.

గోవింద—అబ్బ అదరగొట్టేసూ్తన్నావయ్యా గోపయ్యా!

(సిగరెట్టు పేకెట్టు విప్పి సిగరెట్టు తీసేడు. ముట్టించుకోబోతూండగా రంగనాయకులు మాట అడ్డ పడింది.)

రంగ.—గోవిందరావుగారంటే మీరేనా? మావయ్య మీపేరు వినడంలోనే గబ గబా డ్రెస్సయి పోతూన్నారు. హౌ డూ యూ డూ సార్!

(గోవిందరావు సిగరెట్టు నోట్లో ఉంచుకుని అటు వరదరాజులవేపు ఇటు గోపీవేపు హైరానాగా చూచి పొడిగా నవ్వి అన్నాడు.)

గోవింద.—ఏమిటోలెండి! అభిమానం అలాంటిది. ఈ గోపీ ఉన్నాడే—అఫ్ట రాల్ ఆఫీస్ బోయ్—వీడు—నన్ను మేడమీదికి వెళ్ళనిచ్చేడుకాడు. విజిటింగ్‌కార్డు కావాలని చెప్పి పోరు పెట్టేశాడు పోతే—మును పున్న ఆఫీసరుగారు గూడాను ఆర్గోవిందరావ్ అండ్ సన్సంటే మహాభి మానం చూపించేవారులెండి. ఏమంటారు వరదరాజులుగ్గారూ!

వరద.—అదేమోగానీ అండ్ సన్సంటే కొంచెం మంటగానే ఉండేదండి.

గోవింద—(అఫెండయ్యేడు) ఎవరికి? మీకా?

వరద:—మధ్య నా కెందుకూ? సాక్షాత్తూ ఆఫీసరుకే.

గోవింద.—(నోట్లోంచి కాల్చని సిగరెట్టు కోపంగా తీసేడు. క్షణం సేపు వరద రాజులవేపు గుర్రుగా చూసేడు.) మీ రీయన మాటలు నమ్మకండి మాస్టారూ! వీళ్ళందరికీ మా పెద్దబ్బాయిమీద వల్లమాలిన విరోధం లెండి!

రంగ—(కూచుంటూ అన్నాడు) ఎందుకనిట?

గోవింద.—అల్లా అడగండి చెప్తాను. ఏమైందంటే—(అప్పటిగ్గాని గుర్తు రాలేదు. నొచ్చుకున్నట్టు నటించి ఎబ్బెట్టుగా అన్నాడు.) నా మతి మండిపోనూ చెట్టంతటివారు మిమ్మల్నొదిలి నే నొక్కణ్ణీ కాల్చబోతు న్నాను సిగరెట్టు. మీరూ ఒకటి కాల్చండి.

రంగ.—(తీసుకున్నాడు) రీజెంట్! చాలా ఖరీదైన సిగరెట్టు.

గోవింద:—ఏం ఖరీదులెండి! తగలేసే వస్తువేగా, అందులోనూ హైదా కావాలంటాడు మా పెద్దబ్బాయ్! (రెండు సిగరెట్లనీ ముట్టించేడు)

రంగ—(పొగ వదిలేడు) వరదరాజులుగారూ మీరూ కాల్చండి!

వరద:—ఒద్దులెండి. నే నంత ఎత్తు ఎదగలేదు. నా కెందుకులెండి రీజెంట్ సిగరెట్లు.

గోవింద—ఇదండీ వరస. ఏదో మన అభిమానంకొద్దీ ఏదైనా ఆఫర్ చేస్తే ఈరకంగా ఎత్తి పొడుస్తారు. అయ్యా! మీ క్కోపమొస్తే చెప్ప లేను గానీండి—ఈ గుమాస్తా జాతి యావత్తూ యింతే నండి ఈ ఒక్క కారణంగానే మా పెద్దాడంటే వీళ్ళ కెవరికీ గిట్టదు.

రంగ:—బాగుంది.

గోవింద—ఏమిటి?

రంగ.—సిగరెట్టు.

గోవింద—ఇంకా నయం. నా మాటనుకుని ఇదై పోయేను.

రంగ—మీ కెంత ’మందండి పిల్లలూ!

గోవింద.—మొదటి సంబంధానికి పెద్దాడూను. రెండో సంబంధానికి చిన్నదీను.

రంగ.—గూడ్ . ...(గోపీతో) చూడవోయ్ మావయ్య తయారైయ్యాడేమో.

(గోపి మేడమీదకి వెళ్ళబోయేడు.)

గోవింద—పోనీండి తయారైతే ఆయనే దిగొస్తారుగా. అంతవరకూ మనం కాస్త పిచ్చాపాటీ వేసుకోవచ్చును. (గోపి ఆగిపోయేడు.)

రంగ—ఏం తయారవడమో ఏమిటో. మావయ్యతో మహా చెడ్డ పేచీఅండీ గోవిందరావుగారూ!

గోవింద—ఆఫీసరైన తర్వాత అన్నింట్లోనూ ఆఫీసరుగా ఉండాల్సిందే ఇంతకు ముందాఫీసరు (అటూ ఇటూ చూచి ఆగిపోయేడు)

రంగ—ఫర్వాలేదు చెప్పండి వరదరాజులూ, గోపీ మన మనుష్యులే. మీ కా భయం అక్కర్లేదు

గోవింద—మరేంలేదు. ఆయనకి గుట్టు గుప్పెట్లో పెట్టుకోడం చేతకాదు. మావాడు హస్తం అని మూడు చేతిలో పెట్టేడు అనుకోండి—

రంగ—అంటే

వరద—వేలుసార్ థౌజండ్స్ అండ్ సన్స్.

గోవింద—మీరుండండి మధ్య అయిందాండి అంతమాత్రాన పట్టిగ్గా ఆఫీసులో మావాణ్ణి పట్టుకుని అడిగి అలుసైపోతె ఎవడికా నష్టం? మాకేం డబ్బు నిలా పారేసూ్తన్నాం, పనినలా చేయించుకుంటున్నాం. పరువు పోయేది, బయటపడేదీ ఆఫీసరే ఏమంటారు?

రంగ—మంచి ముక్క చెప్పేరు

వరద.—ఇంకా చెబ్తారుసార్! అండ్ సన్స్‌యొక్క లీలా విలాసాలు వినడానికి మహా తమాషాగా ఉంటాయి వీళ్ళ చిరంజీవి పెద్దబ్బాయిగారికి కారా కిళ్ళీలూ, తెల్లగుర్రాలూ అంటె మహా చెడ్డ మోజు! తన చుట్టూతా ఉన్నవాళ్ళందరికీ అవి అలవాటు చేయనిదే నిద్రస్సలు పట్టనే పట్టదు.

గోవింద—(కోపం వచ్చింది) ఊరుకోండి మహా చెప్పేరు! ఏ అంతస్థులో వున్నవాళ్ళకి ఆ అంతస్థు అలవాట్లు వాటంతటవే వస్తాయిగాని ఒహాళ్ళు చెబితే, ఒహాళ్ళు నేర్పితే వొచ్చేవిగావు. అంతెందుకు మీరు కారాకిళ్ళీ వేయగలరా?

వరద—కళ్ళు తిరిగి చస్తాను.

గోవింద.—మా పెద్దాడు వేయగలడు. వాడి స్నేహితులూ వేయగలరు.

రంగ : అంతే అంతే. మీరన్నది బాగున్నది.

గోవింద.—అవునండి. ఇంతకీ నే చెప్పొచ్చే దేమిటంటె ఆ పాతాఫీసరు ఈ ఆఫీసునుంచి అంత తొరగా లేచి పోడానికి కారణం ఆయన లేకితనమే! లేపోతే బంగారు పిచ్చుకై పోరటండీ!

వరద—ఆర్గోవిందరావ్ అండ్ సన్స్‌కి బంగారు గను లున్నాయిసార్!

గోవింద—అదిగో అతిశయోక్తికూడదు! మీకూ కొత్తాఫీసరుగారికీ ఎంత చనువున్నా అవతల వాళ్ళగురించి అంత తేలిగ్గా మాటాడటం మంచిదికాదు.

రంగ.—కరెక్ట్ (ఒళ్ళంచూచుకున్నాడు) పాపం! మీ కవతల ఎన్ని పనులున్నాయో ఏమో! ఒళ్ళమంతా మావయ్య వేటలోనే వేస్టు చేస్తున్నారు.

గోవింద.—బోడి వేస్టు! నా కవతల కొంప మునిగే పను లేవీ లేవండి. ఏదో కొత్తాఫీసరుగారి దర్శనం చేసుకుపోదామనే వచ్చేను. (కుతూహలంగా) అన్నట్టు సుబ్బారావుగారిమీద యిందాకలా అరిచారేం?

వరద.—ఆయనంతే!

రంగ.—పైగా—వచ్చేవారు కేంప్‌నుంచి తిన్నగా రాకూడదు. క్లబ్బులో పేకాట ఆడి మరీ వచ్చేరు. కొంచెం డబ్బులు పోయాయేమో, చిర్రుబుర్రుమంటున్నారు.

గోవింద.—అలా చెప్పండి. ధోరణి విని అదిరి చచ్చేను. ఏమాత్రం పోయి వుంటాయో!

రంగ.—ఉంటాయి! రెండో మూడో వందలు!

గోవింద.—ఇంతమాత్రానికే ఆ బక్కతన్ని వేధించుకు తినాలటండీ! మా వాడు మా పెద్దబ్బాయి క్లబ్బులో తారసిల్లివుంటే, అక్కడి కక్కడికి సర్ది ఉండేవాడు. ఈ ఇబ్బందులు మాకు తెలీని వాండీ!

వరద.—బాగా చెప్పేరు. అండ్ సన్స్ ఎంతకైనా తగ్గవారు.

గోవింద.—మాటకుముందు అండ్ సన్సంటే మాత్రం నే నొప్పేదిలేదు వరదరాజులుగారూ! అయినా నే నింత సీరియస్‌గా చెబుతూంటే మధ్య మీ వేళాకోళ మేమిటసలు? అవతలా పెద్దమనిషి ఏమనుకుంటారనే భయమైనా లేకుండాను.

రంగ.—జస్టెమినిట్ (మేడ మెట్లెక్కి వెళ్ళిపోయేడు.)

(క్షణం గడిచింది)

గోవింద.—ఏమైనా మరిచిపోయేరా?

వరద.—పోయినట్టేవుంది.

గోవింద.—ఈ అల్లుడుగారేం చేస్తూంటారు.

వరద.—ఉద్యోగమేనా? రెండు పూటలా ఫోం చేయడం, తిరగడం సింపుల్‌గా అది ఆయన ఆనరరీ ఉద్యోగం.

గోవింద.—అదృష్టవంతులు!

వరద.—ఈనగారెంత చెబితే ఆఫీసరంత. కా అంటె కా, కీ అంటె కీ.

గోవింద.—వరదరాజులుగారూ! కొంచె మిలా రండి. (వరదరాజులు దగ్గిరిగా వెళ్ళేడు. గోవిందరావు మెల్లిగా చెప్పేడు) పాతికి వేలకి మా దో బిల్లుంది. అ దివాళేమైనా గిట్టుబాటయితే నే వొచ్చిన పని సానుకూలపడినట్టే. కొంచెం కదిపే దేమిటి?

వరద.—మీ రిలాటి బిజినెస్ నాతో చెప్ప గూడదు.

గోవింద.—మీకూ, ఈ కొత్తాఫీసరుగారికీ—

**వరద.—బాబ్బాబు. మీకు వెయ్యి దండాలు. నన్ను గొంపిలోకి దింపకండి. కావలిస్తే అల్లుడిబాబుని అడిగి చూడండి. ఆయ నెంత చెబితే.....**

గోవింద.—అదెలాగో చెబుతాను. ఈ మనిషిని రెండు క్షణాల్లో చదివేశాను.

వరద.—అయితే యింకేం? మధ్య నన్నిరికించకండి మరి.

[నోట్లో ధర్మామీటరుంచికుని రంగనాయకులు కిందికి దిగొచ్చేడు.]

రంగ.—ఇంకో అయిదు నిమిషాల్లో దిగొచ్చేస్తారు మావయ్య. ఏదో అర్జంటు కాగితాలమీద సంతకాలు చేస్తున్నారు.

గోవింద.—(తేలిగ్గా) ఫర్వాలేదు లేండి ముందు అపనిగానిస్తే మేం తీరుబడిగా మాటాడుకోవచ్చు. (కాస్తాగి) చూడండి.

రంగ.—(ఏమిటన్నట్టు చూసేడు.)

గోవింద.—మరేం లేదు. మీకు మీ మావయ్యగారి దగ్గిర మంచి చనువున్న మాట మాకు తెలిసిందే అనుకోండి. అయితే మావయ్యగారి గురించి నాకు అంతగా తెలీదు. వ్యాపార నిమిత్తం ఒకసారి అంతా గూడా తిరిగొచ్చేను కదండీ! వారి దర్శన మింతవరకూ కాలేదు. పోతే, ఈమధ్య మా బిజినెస్ గూడానూ అంతంతమాత్రంగానే వుంది కొంచెం యిబ్బందిలో పడిపోయేం. అర్జంటు బిల్లొకటి ఆఫీసరుగారి సంతకం నిమిత్తం పదిహేను రోజుల్నుంచీ ఆఫీసులోనె ఉండిపోయింది. అది కాస్తా మా చేతి కొస్తే ఏదో ఒడ్డున పడిన ట్లవుతుంది. ఈ వ్యవహారం— చూసేరూ—వ్యవహారమన్న తర్వాత వ్యవహారమే మరి. నేను దాచుకుని మాట్లాడే మనిషినికాదు. ఈ చెప్పే దేదో మావయ్యగారికే చెప్పచ్చు ననుకోండి. వచ్చీ రావడంతోటే వ్యవహారాన్ని ఆయన ముందు పెడితే ఏం బావుంటుందని చెప్పి మీ చెవి వేస్తూన్నాను. (రంగనాయకులు చెవిలో ఏదో చెప్పి దూరంగా వెళ్ళి నించున్నాడు.)

[రంగనాయకులు ధర్మామీటరుతీసి టెంపరేచరు చూచుకున్నాడు. దాన్ని గోపీ కిచ్చి కడుక్కు రమ్మనట్టు సైగ చేసేడు. గోపి వంట గదివేపు వెళ్ళేడు.]

రంగ.—కాబట్టి ఫైవ్ పర్సెంట్‌కంటె ఎక్కువ యివ్వలేమంటారు?

గోవింద.—(వరదరాజుల వేపొకసారి చూచి అన్నాడు) ఆఫీసు సిబ్బందికి మేం చెప్పుకుంటాం లేండి. మీ రా విషయం మాకు పూర్తిగా వొదిలేయాలి.

రంగ.—విన్నారా వరదరాజులూ! సాక్షాత్తూ గోవిందరావుగారి నోటినుంచి ఒచ్చిన బేరం రేపొద్దున ఏదైనా మాట తేడా రావచ్చు జాగ్రత్తగా వినండి

గోవింద.—అమ్మమ్మ! ఈ బొందిలో ప్రాణముండగా అలా జరగ నిస్తానా నేను. మా వ్యవహారం ఆఫీసంతటికీ తెలిసిందేనండోయ్!

రంగ.—గూడ్ అదే నా క్కావలసింది. ఇక మీరు వెళ్ళచ్చు గోవిందరావుగారూ.

గోవింద.—అదేం మర్యాదలేండి. ఆఫీసరుగార్ని కలుసుకునే వెడతాను.

రంగ.—కలుసుకున్నారుగా. ఇక వెళ్ళండి.

గోవింద.—(ఉలిక్కిపడ్డాడు) అంటె?

వరద.—వీరె మా కొత్తాఫీసరుగారు అర్థమైందా గోవిందరావ్‌గారూ?

గోవింద.—(భయపడ్డాడు) చిత్తం.....అయి.....అర్థమైందిసార్. క్షమించాలి. వెధవది......అస్సలు......ఏమైందంటె.. ...నేను మొదట్లో....అనుమానమేనండి......మీరు.....మీరేం అనుకోవద్దు. ఏమంటె ...

రంగ.—(గట్టిగా అరిచేడు) గోపీ.

[చేతిలో థర్మామీటర్తో సహా గబ గబా వచ్చేడు 'సార'ను కుంటూ. థర్మామీటరు తీసుకుని చెప్పేడు నెమ్మదిగా.]

రంగ.—ఈ గోవిందరావుగార్ని వెళ్ళమని చెప్పు. ఇక్కడ జరిగిన తమాషాని వాళ్ళ జనాభా అంతటితో కట్టుకథగా చెప్పుకోమను క్విక్.

గోవింద.—సార్!

గోపి.—మీ రిక వెళ్ళాలిసార్!

గోవింద.—అసలిదంతా ఎలా జరిగిందంటె!

రంగ.—గోపీ!

గోపి.—మీరు వెళ్ళాలిసార్! తప్పదు. వెళ్ళండి.

[గోవిందరావు బిక్కు బిక్కుమంటూ గుమ్మం దగ్గిరికి వెళ్ళేడు. గుమ్మం దిగుతూ ఏదో చెప్పబోయేడుగానీ—]

గోపి.—లాభం లేద్సార్. మీరు వెళ్ళిపోవాలి. అంతే.

[గోవిందరావు వెళ్ళిపోయేడు]

రంగ.—ఫూల్! (ధర్మామీటరు విదిలించేడు) యస్. మిస్టర్ వరదరాజులూ! మీరెందు కొచ్చినట్టిక్కడికి.

వరద:—చెక్కులున్నాయిసార్!

రంగ ఎవరివి గోవిందరావువేనా? నో నేను సంతకం చేయను.

వరద. ఇంకా చాలామందివి వున్నాయి.

రంగ. ఎవరా చాలామంది ఎలాటి వాళ్ళు వాళ్ళంతా. అవును మిస్టర్ వరదరాజులూ! ఆఫీసులో ఏబిల్లు ఎంతకాలం నుంచీ వుంది, ఏబిల్లు సంతకమైందీ మొదలైన విషయాలు బయట వాళ్ళకెందుకు తెలుస్తాయి? వాళ్ళు మిమ్మల్నందర్నీ కొనేశారా? ఎంతకొన్నారు?

వరద: సార్ (ఆగిపోతాడు)

రంగ నాకు జవాబు కావాలి (బయట గోవిందరావుగారు కదిలిన శబ్దమైంది. గబగబాఫోన్‌దగ్గిరికెళ్ళేడు డైల్ చేసేడు) యస్ హా ....యూజ్ స్పీకింగ్ రంగనాయకులు . గుడ్‌మార్నింగ్. చూడండి మిస్టర్ శేషాచలం ఇంకో పదినిమిషాల్లో మీదగ్గిరికి ఆర్గోవిందరా వొస్తాడు. ఓ స్టోరీ నేరేట్ చేస్తాడు వింటున్నారా? అతన్తో చెప్పండి. అరిచిగీ పెట్టినా అతని బిల్లు ఇంతలో పాస్ చేయనని. అలా మాటిమాటికి సార్‌సార్ అని నా కెందుకు అడ్డుపడతారు కీప్ యువర్ ప్రెస్టేజ్! నే చెప్పేది పూర్తిగా వినండి మళ్ళా మనాఫీసు మొహం చూడొద్దని అతన్ని హెచ్చరించండి. అలాంటి మనుషుల్ని చూడటం నా కిష్టంలేదు అండర్‌స్టాండ్. నెక్స్ట్, మీరాఫీసు కెంత సేపయిందొచ్చి. ఐసీ. అంత ఉదయమే రావలసిన అవసరం నో నో కథలు చెప్పకండి నాకు చిరాకు. చెక్కులు ఆఫీసులోనే సంతకాలు చేస్తాను. ఇది నా రెసిడెన్స్. ఇక ముందిలా మనుషుల్ని పంపకండి జస్టేమినిట్.. మీ పక్కనున్నుంచుని గట్టిగా నవ్వేస్తున్నదెవరు? మోహన్రావా? ..అతన్తో చెప్పండి. అతని పనేదో చూచుకోమని. అంతే. గాని ఆఫీ సవర్సు నవ్వుకోడాని క్కాదు. అంతలా నవ్వొచ్చే విషయమైతే పర్మిషన్ పుచ్చుకుని బైటకుపోయి నవ్వమనండి. నెక్స్ట్..నే నివాళ సెలవు పెడుతున్నాను. నావొంట్లో బాగోలేదు అర్జంటు పేపర్లు సోమయ్య కిచ్చి పంపండి. సరిగ్గా నాలుగ్గంటలకి సోమయ్య ఇక్కడ వుండాలి. యస్. ఇక ఫోన్ పెట్టేయండి. దటీజ్ ఆల్‌రైట్. (ఫోన్ పెట్టేడు. గబగబా వొచ్చి సోఫా మీద కూచున్నాడు) గోపీ. .కాఫీ ప్రట్టా (గోపి కదలబోయేడు) ఆగు బాలన్ ఫైనున్నాడు. అతను కాఫీ అడిగేడు కదూ!

గోపి (భయపడ్డాడు) సార్!

రంగ: నాకేం చెప్పకు. అతనికో కాఫీ ఇవ్వు. వరదరాజులుగారు ఇంటి దగ్గిరే తాగొచ్చేరు గనుక ఆయన కక్కర్లేదు. (గోపీ వెళ్ళాడు)

వరద: (భయంగా అన్నాడు) అవున్సార్. ఇంటి దగ్గిరే తాగొచ్చేను.

రంగ చూడండి నేనీ ఆఫీసు నుంచి రెండునెలలు క్కాదు రెండేళ్ళ గ్గాడా కదల్ను. భయమేస్తోందా? ఫెంటాస్టిక్. పిరికి వాళ్ళంటే నాకు చెడ్డ అసహ్యం. అవునూ! ఆఫీసులో మీనెత్తు రెంత మ్మాత్రం తాగేను.

వరద లే లేదుసార్! కాదుసార్ సార్. క్షమించండి సార్.

రంగ నో సాంగ్ ప్లీజు నేను పాటలు వినను. మీ సర్వీసెంత.

వరద నాలుగు సంవత్సరాలు సార్!

రంగ ఇంతవరకూ ప్రమోషను లేదు.

వరద లేదుసార్ రెండుసార్లు పరీక్ష—.

రంగ: తప్పేరు. కాపీ కొట్టకపోయేరూ! పాసయ్యేవారు. యూ ఆర్ బి. ఎ.

వరద: యస్సార్. ఫస్ట్‌క్లాస్.

రంగ అదెలా పాసైయ్యారు.

వరద చదివి కష్టపడి చదివి పాసయ్యేను సార్!

రంగ. అప్పుడు చదువు తప్ప మరో వ్యాపకంలేదు మీకు. బిజినెస్ తెలీదు. మాయ చేయడం తెలీదు. మోసం తెలీదు, అమ్మడు పోలేదు. మీధ్యాసంతా చదువు మీద పెట్టి పాసయ్యేరు ఇప్పుడలా కాదు.ఆర్గోవిందరావు తెలుసు. అండ్ సన్స్ తెలుసు వాళ్ళకి లొంగిపోడం తెలుసు. వాళ్ళ బిజినెస్ తెలుసు. ఇన్ని వ్యాపకాల్లో మీ బాగుని మరిచిపోయేరు.

వరద: (ఏడుపొచ్చినంత పనయింది)

రంగ. ఫెంటాస్టిక్! (థర్మామీటరు నోట్లో వుంచుకున్నాడు)

వరద. నన్ను మీరు చాలాసార్లు అపార్థం చేసుకున్నారు సార్! నేను చాలామంచి వాడిని. కొత్తగా ఈ ఆఫీసుకి బదిలీ అయి వొచ్చేను నా గురించెవర్నైనా అడగండి. అనవసరంగా నేనెవర్తోనూ మాట్లాడను మా పాతాఫీసులో గూడాను నాకు మంచి పేరుంది సార్. అందరూ నన్నభిమానించేవారు సార్! నాపని నాసీటు అంతె ఇవాళైనా నేనిక్కడికి వొచ్చేవాడినికాదు. అర్జంటు చెక్కులున్నాయి గనక నువ్వెళ్ళు వరదరాజులూ అన్చెప్పి శేషాచలం గారు నన్నిక్కడికి పంపేరు.

(రంగ నాయకులు థర్మామీటరుతీసి టెంపరేచరు చూచుకున్నాడు. ఫోన్ దగ్గిరికి వెళ్ళి డైల్ చేసేడు.)

రంగ: గుడ్‌మార్నింగ్ డాక్టర్! రంగనాయకులు స్పీకింగ్ ఇప్పుడు మాటమూడుంది ఉదయం కంటె కొంచెం నయం. తల తిరగడం తప్పిందిలెండి! అ మందే వాడమంటారా? ఒ. కె—థేంక్యూ డాక్టర్! వీలైతే ఈ సాయంత్రం వొచ్చి కలుసుకుంటాను.

(ఫోన్ పెట్టేసేడు. గోపీ కాఫీలు తెచ్చేడు. ఒకటి టీపాయ్‌మీదుంచి రెండోది సుబ్బారావు నిమిత్తం మేడ మీదికి తీసుకెళ్ళేడు.)

రంగ: (వరదరాజుల్నుద్దేశించి అన్నాడు) కాఫీ తీసుకోండి!

వరద: (సిగ్గుపడిపోయేడు. భయంగా అన్నాడు) వొద్దండి!

రంగ: నిజానికి నేనిప్పుడు కాఫీ తాగను. అది మీ కోసమే తెప్పించేను. తాగండి.

వరద: (కొంచెం తటపటాయించేడు)

రంగ: నేనేమీ అనుకోను. తాగండి.

వరద: (కాఫీ కప్పుని చేతుల్తో తీసుకున్నాడు)

రంగ: మనసులోని కోరికని చంపుకోడం నేర్చుకోవద్దు. ఒక మనిషికి భయపడి మిమ్మల్ని మీరు మోసం చేసుకోడం వద్దు. ఇది నా సలహా! తలెత్తి ధీమాగా తిరగాలని వుంటే నాసలహా పాటించి తీరాలి

రంగ: అలా బొమ్మలా చూడకండి నిర్భయంగా కాఫీ తాగేయండి. దాన్లో విషం కలపలేదు. కాఫీ తీసుకొచ్చింది గోపి. చేసింది వెంకటస్వామి. కొంచెం తేడాలో మీరంతా ఒకేజాతి మనుషులు.

[వరదరాజులు గబ గబా కాఫీ తాగేశాడు. రంగ నాయకులు థర్మామీటర్ని డ్రాయరు సొరుగులో పెట్టేడు. ఖాళీ కప్పుని టీపాయ్‌మీదుంచబోతున్న వరదరాజుల్ని చూచి అన్నాడు.]

రంగ: ఇంత హామీ ఇస్తేనేగాని మీరా కాఫీ తాగలేదు. ఫెంటాస్టిక్.

వరద: సార్. (ఏదో చెప్పబోయి ఆగేడు)

రంగ: మాట్లాడండి. ఏం చెప్పాలనుకుంటున్నారు? మీరేం చెప్పినా వింటాను. అవునే చెప్పదలుచుకున్నదంతా నా మొహమ్మీదే చెప్పండి. సంతోషిస్తాను. యస్. యూకెన్ స్పీక్ నౌ!

వరద: నాకు మాటలు సరిగ్గా రావడంలేదు సార్! కానీ—

రంగ: ఫెంటాస్టిక్. ఫర్వాలేదు. నేను మనసులూ చదవగలను. మీయిష్టమొచ్చిన భాషలో మాట్లాడండి అర్థం చేసుకుంటాను. జస్ట్..ట్రై.

వరద: (తల విదిలించేడు) వోడిపోయేను సార్! నేను పూర్తిగా వోడిపోయేన. మీతో నేను చాలా మంచివాడినని చెప్పుకోవాలి. మీరది వినరు. నాకు తెలుసు మీరు వినరు.

రంగ: అది మీరెలా చెప్పగలరు? క్వైట్ ఫెంటాస్టిక్.

వరద: నా నాలుగేళ్ల సర్వీసులో మీలాటి—(మాటలు మింగేడు.)

రంగ: నే నూహించగలను కానీ మీరు చెప్పవలసిందది కాదు. మీ గుండెల్లో మాట నాకు తెలుసు నన్నూ, నా ఆఫీస్నీ కసితీరా తిట్టాలి వెల్. ప్రారంభించండి.

వరద: (తలెత్తి నిజమే చెప్పేడు) మీరు చాలా తెలివిగలవారు సార్! అందుచేతనే నిజం చెప్పించగలుగుతున్నారు.

[గోపీ మేడ దిగి వచ్చేడు. అతన్ని రంగనాయకులు చూసేడు.]

రంగ సుబ్బారావు పని పూర్తయిందా?

గోపీ అయినట్టే వుంది సార్ ఖాళీగా కూచున్నారు.

రంగ నువ్విచ్చిన కాఫీ తాగేరా?

గోపీ మీరు తాగమన్నట్టు చెప్పాను సార్ !

రంగ వెల్ అయితే సుబ్బారావు నిలా పిలు కాఫీ తాగే రమ్మను.

(గోపీ మేడమీదికి వెళ్లిపోయేడు.)

రంగ (సిగరెట్టు వెలిగించుకుంటూ అన్నాడు) వరదరాజులుగారూ!

వరద సార్!

రంగ. మీరెప్పుడైనా ప్రేమించారా? యస్....మీది లవ్‌మారేజి కదూ! ఆర్ యూ హేపీ నౌ!

వరద మునుపే ప్రశ్న గూడా అడిగేరు కానైతే నా సమాధానం మాత్రం విన్లేదు.

రంగ పోనీండి. సుబ్బారావు ప్రేమకథ విన్నారా?

వరద. ఇంతకుముందే విన్నాను సార్!

రంగ హౌ ఈజిట్? కథలు బాగా చెప్తాడు మీలాగా! కదూ?

వరద సీతకథ బాగుంది సార్!

రంగ నాకూ చెప్పేడు నా కప్పుడు కోపమొచ్చింది.

వరద (మెల్లిగా అన్నాడు) మునుపు నా విషయంలోనూ కోపమే వొచ్చింది సార్!

రంగ ప్రేమకోసం సెలవు పెడుతున్నాడు సుబ్బారావ్! కేవలం 'ప్రేమ' కోసం. హౌ సిల్లీ ఇటీజ్?

వరద (బరువుగా అన్నాడు) ప్రేమకోసం ప్రాణాలిచ్చినవాళ్ళూ వున్నారు సార్!

రంగ నేన్నవ్వమ్మను.

వరద: నేన్నవ్వుమ్మతాను సార్!

రంగ. ప్రేమ భగ్నమై గూడా గుండ్రాయిలా బతికే మనుషులు నాకు తెలుసు దీని కేమంటారు?

వరద ఏమీ అన్లేను సార్!

రంగ ఉదాహరణకి ఈ సోకాల్డ్ సుబ్బారావు! సీతని ప్రేమించేడని తెలుసు. నేను సెలవిచ్చి పంపలేదు. కేవలం ఈ కారణంగానే, అంటే ఈ కొద్దికాలంలోనే, సీతకి కారుల మీదా, పారిస్ మీదా, పాలరాతి మేడల మీదా మోజు పెరిగిపోయింది. ఇటీజ్ ఫెంటాస్టిక్ నాన్‌సెన్స్. నాకది తెలుసు. అలా అని అనుకుందాం అందుబాటులో సీత కోరుకున్న కథానాయకుడు మరెవడో కనిపించేడు అప్పుడు (సుబ్బారావు మేడ దిగిరావడం గమనించలేదు) సుబ్బారావు ఏమవుతాడు?

సుబ్బా. అలా అయితే సార్ .మీరన్నట్టే అయితే సంతోషిస్తాడు సార్! సీత సుఖాన్నీ, సీత డ్రీమ్స్‌ని కాపాడమని భగవంతుడికి రెండుచేతులూ జోడిస్తాడు సార్.

రంగ ఫెంటాస్టిక్!

సుబ్బా: కానీ, (ఆవేశం ఉప్పొంగింది) కానీ సార్! మీరలా కాదు. అవతలవాళ్లని అర్థం చేసుకోలేరు. హౌదాకి భంగం చేయకూడనిది చేస్తారు.

వరద (భయపడ్డాడు) సుబ్బారావ్!

రంగ: లెట్‌హిమ్ స్పీక్!

సుబ్బా: నేను మాటాడేందుకు రాలేదు రాజీనామా యిచ్చేందుకొచ్చేను.

రంగ: ఎందుకు? ఇప్పుడేమయిందని?

సుబ్బా ఎవరి కోసం ఇంత దూరమొచ్చేను సార్! ఎవర్నుద్ధరించేందుకని నన్ను కాదు. నన్ను నేనుద్ధరించుకోలేక కాదు సీత! సీత కోసం, ఉద్యోగం చేస్తున్నాను సార్! సీతా! (అతని కళ్లల్లో నీళ్ళు తిరిగేయి.)

రంగ: ఎన్నడూలేనిది ఇవాళ సుబ్బారావు ఏడుస్తున్నాడు. ఒక ప్రేమకోసం ఏడుస్తున్నాడు ప్రేమకోసం ఏడ్చే వాళ్లంటే అసహ్యం నాకు వాళ్లందర్నీ ఫూల్సని అంటాను. కేవలం ఫూల్స్.

సుబ్బా (వెర్రిగా నవ్వేశాడు) సీతా! మనిద్దరం ఫూల్సుట సీతా! అలాఅని మా ఆఫీసరు మనకి ముద్రవేస్తున్నారు ప్రేమ తెలిని మనిషి మనకి ఫూల్సని ముద్ర వేస్తున్నారు విన్నావుగా నిజమే సార్! నేను ఫూల్‌నే. సెలవివ్వనని చెప్పినాడు—ఈ వెట్టిచాకిరికి గుడ్‌బై కొట్టి వెళ్లలేకపోయినందుకు గొప్ప ఫూలునే అప్పుడే వెళ్లినా నేనప్పుడే వొస్తే సీతా, నువ్వు బతికే దానివి. నాకోసం బతికేదానివి సీతా! యముడితో యుద్ధం చేసి నిన్ను తెచ్చుకునేవాడిని రాలేదు గనక నేను ఫూలునే నిజం సార్ ఐ యామె ఫూల్!

వరద (ఖంగారుపడిపోయేడు) సీతకేమైంది. ఏమైంది

సుబ్బా: (అమాయకంగా అనేశాడు) ఏమవుతుంది? ఏం కాలేదు. మీరూ, మనా ఫీసరు, నేను మనందరం ఏమవుతాం! మనందరం క్షేమమే! ఉద్యోగాలకి బానిసలమైన మనందరం క్షేమమే! మన క్కావలసింది డ్యూటీ! ప్రేమ కాదు మనం ప్రేమించకూడదు. మనిషి ప్రేమించకూడదు. ప్రేమసేది వచ్చి బూతు! విన్నాను సార్! అలా అని నేటికి మీనుంచి విన్నాను. నాసీత, చచ్చిపోయింది వరదరాజులుగారు! నా ప్రేమ చచ్చియింది. నేను క్షేమం. నా ఉద్యోగం మహాక్షేమం. నా ప్రేమ సంగ తెవరికావాలి? జబ్బుగా వుంది. నువ్వొక్కసారి వొచ్చి చూచిపో. నీ చిర్నవ్వే నాకు మంచి మందు' అని వేడుకున్న సీతకి నేనిక్కడ గొప్ప ఫూలని తెలీదు. పిటీ.పిటీ..పిటీ (రెండుచేతులూ మొహాన్న కప్పేసుకున్నాడు)

రంగ: (కొంచెం కదిలేడు) ఐయామ్ సో సారీ! ఈ ట్రాజడీ ఎప్పుడు జరిగింది.

సుబ్బా: (ఉత్తరమూ, వైరూ తీసేడు) ఇది సీత ఆఖరి ఉత్తరం. ఇది సీత చావు ఖబురు ఉత్తరం చదివి పదిహేను రోజులైంది. కేంప్‌నుంచి వొచ్చిన నా చేతుల్లో ఈ చావు ఖబురు పడింది. ఈ ఉత్తరంలో సీత ఏంరాసిందో తెలుసా సార్!సీతకి పాలరాతిమేడలుకాదు కావలసింది,పారిస్‌పట్నమూకాదు. ఈ సుబ్బారావు. ఈ సుబ్బారావు సీత క్కావాలి సార్ ఈ సుబ్బారావు రెక్కలు విరక్కొట్టింది మీరు. సీత చావు క్కారణం మీరు. యూ.—

రంగ: గోపీ!

గోపీ: (అక్కడే నించున్నాడు) సార్!

రంగ: వెళ్లిపొమ్మను అందర్నీ వెళ్లిపొమ్మను నువ్వూ వెళ్లిపో ఈ హాలు ఖాళీ చేయండి క్విక్.

[వరదరాజులూ, గోపీ బయటకు కదిలేరు. సుబ్బారావు క్షణం సేపటివరకూ నించొని—దాదాపు పడిపోయినంత పనిచేసి హాలుదాటేడు. క్షణాలు విరామం. గదిలో రంగనాయకులుండిపోయేడు. నెమ్మదిగా ఫోన్‌వేపు వెళ్లి, ఫోన్ తీసుకొని డయిల్ చేసేడు.]

రంగ. రంగనాయకులు స్పీకింగ్. సుబ్బారావు ఆఫీసుకొస్తే అతన్ని మీరేం డిస్టర్బ్ చేయకండి శేషాచలం! వాళ్లూరికి వెళ్లే ఏర్పాటులు చూడండి ముందు. వెళకపోతే రెండునెలలు సెలవు యిచ్చేయండి.


బండెడు బోనం, నంజుడు
కొనరుడు, రెండెనుబోతులు
దినసరి దాణాగా మెక్కిన
బకాసుర సంహారకీలకం!
భాగవత సంగ్రామ సమాప్తానికీ
దానికీ గల సంబంధం తెలియాలంటే
చూడండి!
రామకృష్ణ: ఎన్.ఏ.టి కంబైన్ వారి
శ్రీకృష్ణపాండవీయం
చిత్రానువాదం, దర్శకత్వం: యన్.టి. రామారావు B.A. నిర్మాత: త్రివిక్రమరావు.

[ఫోన్ పెట్టివొచ్చి సోఫామీదకూచున్నాడు. కొత్తసిగరెట్టుపెట్టె తెరిచి వో సిగరెట్టు కాల్చేడు. లైట్స్ ఆఫ్—లైట్స్ ఆన్. వేళ రెండు చిల్లరయింది. సిగరెట్టుపెట్టెలో ఆఖరి సిగరెట్టూ వెలిగించి ఖాళీపెట్టె పారేశాడు. గోపి గుమ్మం దగ్గిరే నించుని అన్నాడు]

గోపి: సార్! ..రెండు దాటింది సార్!

రంగ: (మాటాడలేదు)

గోపి: మందు కూడా తాగలేదు సార్!

రంగ: యూ ఫూల్! నన్ను పలకరించకు. నన్నిలా ఆలోచించుకోనివ్వు.

గోపి: మందు.

రంగ: షటప్.

[రెండు క్షణాలు విరామం.]

రంగ: (సౌమనస్యంగా) గోపీ!

గోపి: (గబగబా దగ్గిరి కొచ్చేశాడు) సార్!

రంగ: (నవ్వుకున్నాడు) ఏంలేదు. నువ్వు పడుక్కో.

గోపి: అలాగే సార్!

[ఫోన్ మోగింది. గోపీ వెళ్లి రిసీవ రందుకున్నాడు.]

గోపి: గోపిని సార్ మాటాడుతున్నాను!...నమస్కారం సార్! అయ..అయ.అలాగే నండి. (మౌత్‌పీస్ మూసి రంగనాయకుల్తో అన్నాడు) సార్! మిమ్మల్ని ఆఫీసు మేనేజరుగారు పిలుస్తున్నారు సార్!

రంగ: నో. నేనిప్పు డెవర్తోనూ మాట్లాడనని చెప్పు.

గోపి: అలాగే సార్! (అదే చెప్పేడు) ఇప్పుడయ్యగారు ఎవర్తోనూ మాట్లాడరంటండి. అయ..అయ.. పొద్దున్నించీ అలాగే వున్నారు సార్. అయ.. చిత్తం. నమస్కారం సార్ (ఫోన్ పెట్టేసి రంగనాయకుల్తో చెప్పేడు) సుబ్బారావుగారు పిచ్చిపిచ్చిగా మాటాడేస్తున్నారంటండి. మీరేమీ అనొద్దన్నారని మేనేజరు గారేమీ అనడం లేదటండి. చివరికి వరదరాజులు గారే సుబ్బారావుగార్ని బైటకు తీసుకెళ్లారంటండి.

రంగ: ముందా ఫోన్ కింద పెట్టేయ్. ఇవాళ ఆఫీసు విషయాలు ఏం తెలీకూడదు నాకు.

[గోపి ఫోన్‌కింద పెట్టేస్తూండగా బైట ఎవరో తచ్చాడుతున్నట్టు గమనించేడు రంగనాయకులు.]

రంగ: ఎవరో వొచ్చేరు చూడు!

(గోపీ బయట వెళ్లొచ్చి అన్నాడు)

గోపి: ఎవరో ఆడంగులు సార్! మీతో మాటాడాలిట.

రంగ: రమ్మను.

[గోపి బైటకువెళ్లి మళ్లీ శ్రీదేవితో లోపలికొచ్చేడు. శ్రీదేవిని చూడగానే, రంగనాయకులు గబిక్కున లేచి నించున్నాడు.]

రంగ: ఫెంటాస్టిక్! మళ్లీ ఎన్నాళ్లకి చూసేను శ్రీదేవీ?

శ్రీదేవి: నన్ను గుర్తు పట్టేరు. చాలాసంతోషం.

రంగ: నిజం చెప్పేవ్! జీవితంలో మరిచిపోలేని మహా గొప్పవ్యక్తివి నువ్వు. గోపీ! నువ్వెళ్లి చక్కటి కాఫీ పట్రా. క్విక్.

గోపి: అలాగే సార్ (గోపి వెళ్లిపోయేడు)

రంగ: కూర్చుంటావా?

శ్రీదేవి. అంత ఖర్మాదానా? గుండె ఆగిపోయి చావగలను.

రంగ: ఫెంటాస్టిక్! నా కారోజు బాగా గుర్తుండిపోయింది శ్రీదేవీ! నాలుగేళ్ళ క్రితం—జూన్‌నెల్లో అనుకుంటాను. నేను మీయింటి కొచ్చి సన్మానం చేయించుకొన్నాను.

శ్రీదేవి అవును. అది నేనూ మరిచిపోలేదు.

రంగ: క్షేమమా!

శ్రీదేవి అమ్మపోయి రెండేళ్లయింది.

రంగ: చాలా తొరగా పోయేరు పోనీలే శ్రీదేవీ! ఎవరికెంత ప్రాప్తమో ఎవరేం చెప్పగలరు. నీ పెళ్లికి మాత్రం నన్ను పిలవలేదు. శుభలేఖ కోసం చాలా కాలం ఎదురుచూచి తర్వాత విసుగుపుట్టి ఎదురు చూడటం మానుకున్నాను.

శ్రీదేవి నేనెవర్నీ పిలవకుండానే పెళ్లి చేసుకున్నాను. అతి సామాన్యంగా జరిగిపోయింది మాపెళ్లి

రంగ. శ్రీదేవి పెళ్లి అతిసామాన్యంగా జరిగిపోయింది రెండేళ్ల క్రితం వర్ధనమ్మ పరగస్థురాలయ్యేరు అనుకోని సంఘటనలు. (క్షణ మాగేడు) ఏది ఏమైనా నీ రాక మాత్రం నన్ను ఆనందపరిచిన మాట వాస్తవం.

శ్రీదేవి: అది తెలుసు నాకు.

రంగ: (ఆమె వేపు నిశితంగా చూచి అన్నాడు) ఇన్నేళ్లూ నువ్వెక్కడున్నావో తెలిసింది కాదు. కాని, నాకో నమ్మకం వుంది శ్రీదేవీ! నేని తనువు చాలించే లోగా నిన్ను తప్పకుండా కలుసుకుంటానని నమ్మకం బాగా వుంది. ఆ దివాళ ఇక్కడ నా బంగళాలో నెరవేరింది హేపీ !

శ్రీదేవి: నేనూ అనుకున్నాను. మిమ్మల్నెప్పుడో ఒకప్పుడు కలుసుకోక తప్పదని.

రంగ. ఫెంటాస్టిక్! నేనిది నమ్మను.

శ్రీదేవి: నా గురించి నేననుకోడంలో మీ నమ్మకాల్తో పనుండదు.

రంగ: (దెబ్బతినక తప్పిందికాదు) ఆ రోజు నీకో మాటిచ్చేను.

శ్రీదేవి: అవును. గుర్తుంది.

రంగ: ఇప్పటి నాహోదా గురించి నేను వేరే చెప్పుకో అక్కర్లేదు నా ట్రైయినింగు పూర్తయిన వెంటనే ఈ వూరు పోస్ట్ చేశారు. నేనొచ్చి నెలరోజుల పైబడ్డది. గమ్మత్తేమిటంటే, ఉద్యోగంలో ఇంత హోదాకి శ్రీకారం చుట్టిన మొదటిరోజుల్లోనే నిన్నుచూడగలభాగ్యం సంపాయించుకున్నాను. అందికే మహదానందంగా వుంది నాకు.

శ్రీదేవి: దేవుడు కరుణామయుడు. ఎంత కరుణామయుడో అంత అర్థంగాని మహాత్ముడు.

రంగ: అందికే దేవుడంటారంతా! నాగురించి నీకీ సరికి అంతా తెలిసే వుంటుంది.

[గోపి కాఫీ తెచ్చి నించున్నాడు.]

రంగ: ముందా కాఫీ తాగు.

శ్రీదేవి: నేను కాఫీ కోసమే రాలేదు.

రంగ: నువ్వు దేనికోసం వొచ్చేవని అడగలేదే నేను? పాత నేస్తురాలివి. నాకు ప్రాణంలాటి దానివి. ముందా కాఫీ తాగుతే నాక్కొంచెం సంతోషంగా వుంటుంది. గోపీ—కాఫీ అమ్మగారి కివ్వు.

[గోపీ, కాఫీ కప్పు శ్రీదేవి కిచ్చి ఖాళీగా నించున్నాడు. అతన్నుద్దేశించి అన్నాడు ]

రంగ: రేపు ఆఫీసర్స్ కాన్ఫరెన్స్ కదూ! మేడ మీద ఫైళ్లు సర్దు. వెళ్లు (గోపి వెళ్లేడు) తాగు శ్రీదేవీ! కాఫీ తాగేసేయ్ ముందు. (క్షణం తర్వాత పేలవంగా నవ్వేసి అన్నాడు) అర్థమైంది. ఈ అంకంత బంగాళాలో మగ వాసన తప్ప మరే విధమైన విశేషం లేదేమోనని ఆలోచిస్తున్నావా? ఈ

జన్మకింక పెళ్ళాడరాదని నిర్ణయించుకున్నాను. కారణాన్ని నువ్వూహించే వుంటావ్.

శ్రీదేవి (కాఫీ తాగింది)

రంగ: (బాగా వెనక్కి వెళ్ళిపోతూ అన్నాడు) ఆడదనే జీవి ఈ భూప్రపంచంలో జన్మెత్తి తోటి జీవుల మీద కొండంత సమస్యలు తెచ్చి పెట్టడమనే విశేషం పురాణాలే కాదు చరిత్రా నిజమే అన్నది. అందుచేత నేను వో పెద్ద ఎక్స్‌పరిమెంట్ చేద్దామని ఉద్దేశించేను. తెలుసుకోవా లనుకుంటె అడుగు చెప్తాను.

శ్రీదేవి (కాఫీ ముగించి అన్నది) నాకా విషయమ్మీద ప్రత్యేకమైన అభిమానం ఏమీలేదు.

రంగ (తక్కున ఆగి శ్రీదేవి వేపు సూటిగా చూచి అన్నాడు) అయితే సరె! పోతె, ఇంత హోదా, ఇంత పరపతినీ పాలు పంచుకునేందుకు నాకు నచ్చే మనిషిని అర్ధాంగిగా పొందాలనుకున్న నిర్ణయం చాలాకాలం క్రితమే మట్టిలో కలిసిపోయింది. ఇప్పుడు నే నొక్కణ్ణీ, ఇంత హోదా, పరపతినీ అనుభవిం చేస్తున్నాను. గొప్ప థ్రిల్‌గా వుంది. ఈ పళంగా మరో స్త్రీ ఎవరైనా వొచ్చి ఈ హోదా, పరపతినీ పంచియ్యమని అడిగినా, ఆ స్త్రీ నాకు అన్ని విధాలా నచ్చినా నేనందుకు ఇష్టపడను. ఎందుచేతంటే ఈమధ్య నేను కొంచెం స్వార్ధపరుడిగా తయారవుతున్నాను.

శ్రీదేవి దాని మూలకంగా చాలా నష్టాలొస్తాయి రంగనాయకులుగారూ!

రంగ: (నవ్వేడు) ఎవరికి? నాకేనా? లాభనష్టాలు బేరీజు వేసుకోడమూ మాను కొన్నాను. తోటి మనుషుల మీద నమ్మకం చచ్చి బతుకుతున్న నేను స్వార్ధరాహిత్యం, త్యాగశీలత మొదలైన పెద్దమాటలకి దూరంగానే వుండాలి మరి!

శ్రీదేవి మీరెంత నిష్ఠూరంగా మాట్లాడినా, నేను అర్ధం చేసుకోలేనంత దుస్థితిలో లేను. నాకూ ఆలోచించగల స్తోమతు వున్నది.

రంగ: బలే నేను నిష్ఠూరా లాడుతున్నానా? కాదు శ్రీదేవీ! నిజాన్ని చెప్తున్నాను. మనం సభ్యప్రపంచంలో బతుకుతూన్న వాళ్లం గనక కొంచెం అందమైన ముసుగు కప్పి మాట్లాడుతున్నాను. అభ్యంతరమైతే చెప్పు ముదురుగా మాట్లాడగల నేర్పునీ ప్రదర్శిస్తాను.

శ్రీదేవి: ప్రేమించిన మనిషిని పొందలేకపోయాననే కసితో తన బతుకునే కాకుండా తన చుట్టూతా వున్న మరికొందరి బతుకుల్నీ హింస పెట్టడం మన సభ్య ప్రపంచంలో జరుగుతూన్న పవిత్ర క్రియకాదు. అది మీకు తెలుసా?

రంగ. (కోపం వొచ్చింది) నన్ను చూచిపోడానికొస్తే నే చెప్పేది పూర్తిగా విని, నా కెదురు చెప్పకుండా వెళ్ళిపోవడం మంచిది వొస్తూ వొస్తూ కూడా మరో అభిప్రాయమేదైనా తెచ్చుకుంటె దాన్ని విడమరచి చెప్పడం మరింత మంచిది.

శ్రీదేవి మీమీద నాకెప్పుడూ సింపతీ నే!

రంగ పిటీ! నామీద నీ సింపతీనా? నాకిప్పుడేం జరిగిందని సింపతీ?

శ్రీదేవి ఆలా అనుకుని మీరు నిబ్బరంగా వుండగలిగితే నేనింత దూరం వొచ్చేదాన్ని కాదు.

రంగ: అలా కాకుండా మరేం చేస్తున్నాన్నేను?

శ్రీదేవి ఒకసారి ఆత్మవిమర్శన చేసుకోండి.

రంగ. (కోపం వొచ్చింది) సిల్లీ సజెషన్! నేనెవరి సలహాలూ విననని నీకు తెలుసు. పైపెచ్చు నన్ను పరిదిద్దుకోమని పరాయివాళ్ళు చెప్పేంత చొరవని నేను భరించలేను అండర్‌స్టాండ్?

శ్రీదేవి. కోపం మనిషిని చాలా దారుణంగా తయారు చేస్తుంది రంగనాయకులు గారూ! మీరు అభివృద్ధిలోకి వొచ్చారంటే విని మహదానందం పొందే వాళ్లలో నేను మొదటిదాన్ని. కానీ—

రంగ నాన్‌సెన్స్! నీ మనసులో ఏదో పెట్టుకొచ్చేవ్ నువ్వు. అనవసరంగా నన్ను సాధిస్తున్నావు అవున్లే—నీ ప్రత్యర్ధిని నేను. నేను బాగుపడి వెలిగిపోడం గిట్టదు నీకు. ఏం చేయడానికీ (రక్కున ఆగేడు) క్షమించు. మనం నాలుగేళ్ల తర్వాత కదూ కలుసుకుంట? గుడ్. నా విషయాలు తర్వాత మాట్లాడుకుందాం. నువ్వు కొంచెం ఆ సోఫా మీద కూచుంటె రెండు ముక్కలడుగుదామని వుంది. కూచుంటావా శ్రీదేవీ?

శ్రీదేవి (హెజిటేట్ చేసింది)

రంగ ప్లీజ్! మనం తర్వాత దెబ్బలాడుకుందాం. ముందు కూర్చో!

శ్రీదేవి: (కూర్చుంది)

రంగ: నా ట్రైయినింగ్ పీరియడ్‌లో వో మారు కాశ్మీర్ ట్రిప్ తగిలింది అక్కడ చలి ఎక్కువగా వుంది. వెచ్చగా వుండేందుకు శాలువా కప్పుకుని సిగరెట్టు కాలుస్తూండగా శివరామారావ్ నా టెంట్లోకి వొచ్చేడు. మనిషి మంచి ట్రిమ్‌గా వున్నాడు. నా వివరాలు కనుక్కుని చాలాసేపు మాట్లాడి వెళ్ళిపోయేడు. శివరామారావ్ ఐ ఏ. ఎస్. అతను వెళ్ళిపోయే ముందు అడుగు దామనుకున్నాను 'మీ వైఫ్ పేరేమిటి? శ్రీదేవియేనా' అని.

శ్రీదేవి: (ఉలిక్కిపడి లేచి నించుంది.)

రంగ: కూచో. నేనలా అడగలేదు. (శ్రీదేవి కూర్చుంది) శ్రీదేవి మాట మీద నాకు నమ్మకం చావడంలేదు. నాలుగేళ్ల క్రితం శ్రీదేవి అన్న ప్రతీమాట గుర్తుంది. పారిస్ ట్రిప్, పాలరాతి మేడ, నల్లకారు ఒహ్!

[శ్రీదేవి కళ్లల్లో నీళ్లు తిరగడం గమనించేడు.]

రంగ: బొంబాయి నుంచి హైదరాబాద్‌కి ప్లెయిన్లో వొచ్చే వొకసారి. నా పక్క సీట్లో తప్పతాగి తెలుగులో ఏదో పాడుకుంటున్నాడు వో తెలుగు కుర్రాఫీసరు. పేరేదో చెప్పేడుగానీ, ఇప్పుడది గుర్తులేదు. అతన్ని చూచినప్పుడు నువ్వే గుర్తుకొచ్చేవ్ నీ మొగుడెంత ఆఫీసరైనా తాగి పడిపోయే ఫూల్ మాత్రం కాదని ఆ ఉద్దేశాన్ని 'కట్' చేసేను.

శ్రీదేవి మీరు చాలా అనవసరమైన విషయాలు మాటాడుతున్నారు.

రంగ ఇక్కడికి ఏమవసర ముండి వొచ్చేవో చెప్పలేదు నువ్వు. అయినా ఏదో (వ్యంగ్యంగా)నాలాటిబక్కమనిషితోఅంతఅవసరం ఏమొచ్చిపడిందో ఊహించ లేకపోతున్నాను. (క్షణమాగేడు) మీ హనీమూన్ ట్రిప్ ఘనంగా జరిగే వుంటుందనుకుంటాను. పారిస్ చూసేవా! నేపుల్స్‌ని చూచి చావమని వెనకటికో పెద్దమనిషి అన్నాడు. మీకారు నెంబరెంత?

శ్రీదేవి: (ఏడ్చేసింది)

రంగ. సారి! నేను కటువుగా మాట్లాడి వుంటాను. పోనీ, మెత్తగా మాట్లా డేందుకు ప్రయత్నించేదా శ్రీదేవీ!

శ్రీదేవి. చాలా తెలివిగా సాధిస్తున్నారు మీరు. మీకు మనుషుల్ని పీడించడం బాగా తెలుసు. మీ రూహించినంత గొప్పదాన్ని కాదు నేను. నేనో సామాన్యమైన, అతిసామాన్యమైన స్త్రీని.

రంగ: గొప్ప పేరుప్రఖ్యాతులు గడించిన సంఘసేవకురాలు గౌరవనీయురాలు వర్ధనమ్మ ఏకైక గారాబు పట్టి నాలుగేళ్ల తర్వాత వో సామాన్యమైన ఇల్లాలు! ఫెంటాస్టిక్!

శ్రీదేవి. (విసురుగా లేచి నించుంది) నా దుస్థితికి మీరేం చింతించ నక్కర్లేదు నేను..నేను చాలా అదృష్టవంతురాలిని, ఆనందంగా వున్నాను నా మనసుకి సౌఖ్యం వుంది. ఎంత హోదాల్లో వున్నా మీ మనసుకిసౌఖ్యంలేదు వుండదు.

రంగ : ఎందుకుంటుంది ? ఓ పవిత్రమైన ఆడకూతురి అకారణ కోపంతో దగ్ధమవుతూన్న దౌర్భాగ్యుడికి మనశ్శాంతి ఎక్కడ ? నిజం చెప్పేవ్ శ్రీదేవీ ? చాలా గట్టి నిజాన్ని చెప్పేవ్ !

శ్రీదేవి · తృప్తి విలువ నాకు తెలుసు.

రంగ : నేను తెలుసుకోలేక పోతున్నాను.

శ్రీదేవి . జీవితంతో రాజీ పడగలను నేను.

రంగ : అదే నా చాత కావడంలేదు.

శ్రీదేవి . నాకు ఓర్పుంది ! ఎదటివాళ్ల మనసుని అర్థం చేసుకునే మనసుంది. అందికే నేను సౌఖ్యంగా ఉన్నాను నాకే చింతా లేదు. నేను అదృష్ట వంతురాలిని.

రంగ : ఆల్‌రైట్. ఆల్‌రైట్. ఆల్‌రైట్. అన్నింటికీ ఒప్పుకుంటున్నా న్నేను. అంతా ఒప్పుకున్నాను. ఈ రెండు ముక్కలూ చెప్పడానికేనా నువ్వొచ్చింది.

శ్రీదేవి : అంతేకాదు. మీ రెంత కాదన్నా నే నివ్వదలుచుకున్న సలహా ఇచ్చే వెడతాను. జీవితంతో రాజీపడి సుఖిస్తున్నాను. రాజీపడటం చాతకాక పిచ్చివాళ్లవుతున్నారు మీరు. ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు ఎవర్నో సాధించితీరాలనే తాపత్రయాన్నీ, కసినీ దూరం చేసుకుని, మనిషిగా మారి ఎదటివారిని ఆదరించడం నేర్చుకోండి. మన మనుకున్న బ్రతుక్కావాలనేది వివేకమైన నిర్ణయం కాదు.

రంగ : (పొడిగా నవ్వేడు) వేదాంతం నేర్చుకునేంత తీరుబడిగా బతుకుతున్నావన్నమాట.

శ్రీదేవి : పాత కథలు నెమరేసుకుంటూ బతకడం నా కిష్టంలేదు మరి.

రంగ : సరే. నువ్వు చెప్పిన గీతా రహస్యం తూ. చ. తప్పకుండా పాటిస్తానే అనుకో. నాకీ గీత బోధించడాని క్కారణ ముండాలిగా. అదీ చెప్పు.

శ్రీదేవి : ప్రత్యేకంగా ఏమీ లేదు మీ రిన్నేళ్లూ ఎక్కడెలా ఉన్నారో నిజానికి నాకు తెలీదు. మీరీ వూరొచ్చిన మరుక్షణం నుంచి మీ గురించి వింటున్నాను. చాలా చిత్రమైన కథలు తెలుస్తున్నాయి.

రంగ : ఎవరు చెప్పేరు.

శ్రీదేవి : మా వారు !

రంగ : మీ వారా ? మీ శ్రీవారా? వారేం చేస్తుంటారు. నేను వారి కెలా తెలుసు?

శ్రీదేవి . నటించకండి. మీ కన్నీ తెలుసు.

రంగ : కోపం తెప్పించకు శ్రీదేవి ! నే నసలే మంచి మనిషిని కాదు.

శ్రీదేవి · మీ ఐశ్వర్యం మిమ్మల్నిలా మాటాడిస్తుంది పొంగిపోకండి. మీ ఐశ్వర్యం వెనక మిమ్మల్ని మింగే నీడలున్నాయి. మా ఇరువురి మధ్య స్నేహ ముంది. వెన్నెల్లాటి స్నేహ మది. హృదయాల్లో అమృతాన్ని నింపుకు బ్రతుకుతున్నాం, మేము ఆయున రైవస్వరూపులు అందికే నేను గర్విస్తుంటాను. ఆ అమృతమూర్తినీ, అలాంటి మరికొందర్నీ మీ చండశాసనాల్తో చంపుకు తింటున్నారు. ఈ మీ కసి వెనక కథ నా కొక్కర్తికే తెలుసు నే నిప్పు డిక్కడికొచ్చిన కారణం గూడా అదే. మీ బ్రతుకు మీరు బ్రతకండి, మా బ్రతుకుల్లో జోక్యం కల్పించుకోవద్దు. అదే పదివేలు !

రంగ : ఫెంటాస్టిక్ ! ఇంతకీ మీ వారెవరో చెప్పనేలేదు నువ్వు.

శ్రీదేవి . ఆయ నెవరో తెలీకుండానే ఆయన్ని సాధిస్తున్నారా మీరు ? నా మీద పగని ఆయన మీపుకి తిప్పలేదా ? నన్నిది నమ్మమంటారా ?

రంగ . నే నతన్ని సాధించడం, నెత్తిమీద పెట్టుకు పూజించడం దేవు డెరుగు? ఇంతకీ అతనెవరు ? ఎవరు శ్రీదేవీ ! చెప్పు. ఆ అదృష్ట జాతకు డెవరో చెప్పు ! అతన్ని అభినందిస్తాను.

శ్రీదేవి : వరదరాజులుగారు మీకు తెలీదా ?

రంగ . (మ్రాన్పడి పోయేడు) వరదరాజులుగారూ !—నా పతనానికి మొదటి కారణమైన శ్రీదేవీ ! నన్ను కాదని చెప్పి నువ్వేం సుఖపడుతున్నావో కొంచెం విడమరిచి చెప్పగలవా. నల్ల కారూ, పాలరాతి మేడా ?—

శ్రీదేవి నేను వాటినెప్పుడూ కోరలేదు.

రంగ . అబద్ధం. అవి కావాలని నువ్వే అన్నావ్.

శ్రీదేవి : మీకోసం అలా అనవలసి వొచ్చింది.

రంగ : నా కోసమా ? కేవలం నా బారి నుంచి తప్పుకునే నిమిత్తమా ? నే నంత భయంకరమైన దుర్మార్గుడినా శ్రీదేవి ? పిటీ వెళ్ళిపో శ్రీదేవి ! మళ్ళా నా కనిపించకు ఈ హోదాతో నా ఆత్మవిశ్వాసాన్ని నీకు పరిచయం చేసుకుని కసి తీర్చుకుందా మనుకున్నాను. కథ అడ్డం తిరిగింది నీ పేద కథ నా గుండెల్ని కోస్తుంది. వెళ్ళింక. వెళ్ళిపో శ్రీదేవి !

[గబగబా మేట మెట్లెక్కాడు—మేడమీదికి వెళ్ళిపోయేడు. అదేవేళకి వరదరాజులు అక్కడికి వొచ్చి నించున్నాడు. అతన్ని చూచి శ్రీదేవి కలవరపాటు చెందింది. వరదరాజులు తాపీగా అడిగేడు.]

వరద : తమాషాగా ఉంది కథ! నా కెప్పుడూ చెప్పనే లేదేం శ్రీమతీ ! దేవుడిలాటి అవతారం మా ఆఫీసరూ, కాని, కొంచెం షాకేదో తగిలి దానవుడై పోయేడావటాని నీకు చెప్పింది నేను. తెలిసి గూడా కారణం చెప్పలేదు. నువ్వు క్లాస్ వన్ ఆడదానివి

శ్రీదేవి : ఏమండీ !

వరద : అరవకండి ఎవరైనా వింటే నవ్వేస్తారు. నా పరువు యావత్తూ మీ చేతుల్లోనే ఉంది కనికరించండి.

[గోపి గబ గబా కిందికి దిగొచ్చి వరదరాజులో అన్నాడు.]

గోపి : సార్ ! మేడపైన ఆఫీసరుగారు ఖంగారుగా ఉన్నారు సార్ !

వరద : ఏం జరిగిందోయ్ !

గోపి : ఏమోసార్ ! ఏం చెప్పడంలేదు.

(బయట కా రాగిన శబ్దం. గోపి గుమ్మం దగ్గరికి వెళ్ళి చూచివచ్చేడు.)

గోపి : సార్ ! ఆఫీసరుగారి నాన్నగా రొచ్చేరు సార్ !

(శ్రీదేవి తత్తరపాటు చెందిది. వెంటనే అడిగ్గాడు వరదరాజులు.)

వరద : ఆయన గూడా మీకు తెలుసా శ్రీదేవిగారూ !

శ్రీదేవి : తెలుసు.

(గోపి మేడమీదికి పరుగెత్తాడు.)

వరద : పాత్ర పరిచయం చేయగలరా ?

శ్రీదేవి : (నిర్లిప్తంగా) పేరు రాజశేఖరంగారు !

వరద : రాజశేఖరం యస్ . . ఆనాడు ఫోన్‌చేసిన రాజశేఖరం ది గ్రేట్. మన పెళ్ళికొచ్చిన అతిధిదేవుడు. వారేనా వీరు (ఆవేళ కొచ్చేడు రాజశేఖరం.) నమస్కారం సార్ ! మేం గుర్తున్నామాండి ! నాపేరు వరదరాజులు. వర్ధనమ్మత్తయ్య అల్లుడ్ని పాపం ! ఆవిడ పోయిందిలెండి శ్రీదేవి భర్తని

రాజ : (ఖంగారు పడిపోయేడు) ఇక్కడికొచ్చేవేమ్మ ! ఏం జరిగింది

వరద : ఏం జరగలేదు సార్ ! ఐయామ్ సారీ ! ఆంతరంగిక విషయాలు అంత తొరగా తెలిసేవికావు. ఆల్‌రైట్. నేను రంగంలోంచి తప్పుకుంటాను.

(విసురుగా వెళ్ళిపోయేడు.)

రాజ : ఏమిటమ్మా ఇదంతా ! రంగనాయకులుకి మీ సంగతి తెలిసిందా ?

శ్రీదేవి : రాజశేఖరంగారూ ! (ఏడ్చింది)

రాజ : ఊరుకోమ్మా ! ఊరుకో ఏం జరిగిందో చెప్పు మరేం ఫర్లేదు. నే నున్నాను. చెప్పు.

శ్రీదేవి : (బేలగా ఆయనవేపు చూచింది) నాకేం తోచడంలేదు. మీరంతా పెద్దలు! మా అమ్మా, మా కుటుంబం— మీరూ, మీ కుటుంబం పరువూ. ప్రతిష్ఠ—అన్నీ అంతా పటిష్ఠంగానే ఉన్నాయి రాజశేఖరంగారూ! మీరేం ఖంగారు పడక్కర్లేదు రంగనాయకులుగార్కి నేనేం చెప్పలేదు. ఈ బొందిలో ప్రాణముండగా ఎవర్తోనూ ఏమీ చెప్పను సరేనాండి ? నమస్కారం వొస్తాను.

(శ్రీదేవి సుడిగాలిలా వెళ్ళిపోయింది. రాజశేఖరం నిట్టూర్చేడు. వొచ్చి సోఫాలో కూచున్నాడు. అప్పుడు రంగనాయకులు వచ్చేడు. అతనిప్పుడు పూర్తిగా దెబ్బ తిన్న మనిషిలా ఉన్నాడు. అతని వెనక గోపీ ఉన్నాడు.)

రంగ : ఎంతసేపయింది మీ రొచ్చి ?

రాజ : ఇప్పుడే ఇంతక్రితమే వొచ్చేను.

రంగ : ఆల్‌రైట్ గోపీ ! నువ్వు మీ యింటికి వెళ్ళిపో.

(గోపి కొంచెం తటపటాయించేడు. రంగ నాయకులు అరిచేడు.)

రంగ : గో !

(గోపి వేగంగా వెళ్ళిపోయేడు.)

రాజ : (ఏం తెలినట్టు) ఎవ్రరా ఆ అమ్మాయి ? ఏం జరిగింది ?

రంగ : నన్ను తిన్న మనిషి నాన్నా ! నన్ను తిన్న మనిషి ! మొగుడ్ని రాచి రంపాన పెడుతున్నానని తెలిసి ఇంటికొచ్చి వేడుకోలు చెప్పుకుంటుం దిప్పుడు. వీళ్ళాయన మా ఆఫీసులో గుమాస్తా అంతే. అదే జరిగిం దిప్పుడు.

రాజ : అయితే నువ్వా మనిషిని మరిచిపోలేదన్నమాట ?

రంగ : అదికాదు నాన్నా ! మరిచిపోదామని ప్రయత్నిస్తూనే ఉన్నాను. (చేతు లూపేడు) దేవుడు నా ప్రయత్నాన్ని తినేస్తున్నాడు మరి. నేనేం చేసేది ? (క్షణం ఆగేడు) అమ్మ కులాసాయేనా ? ఈ ఏడాది పంటెలా వొచ్చింది ?

రాజ : అన్నీ బాగున్నాయి అవునూ నేనెన్ని ఉత్తరాలు రాస్తున్నా (రంగనాయకు లేదో చెప్పబోయేడు) మాటాడకు జవాబు రాయవు గదా ! అంత తీరుబడి చిక్కని రాచకార్యా లేమిటోయ్ ?

రంగ : మరి. తలుచుకుంటూంటే నాకే చిత్రంగా ఉంది. మీరు నాకు డజన్ల నా ఉత్తరాలు రాసి ఉంటారు ఒక్క ఉత్తరం గూడా నేను రాయలేదు కారణమంటూ ఏదీ చెప్పలేన్నాన్నా ! ఏమీ చెప్పలేను.

రాజ : (జేబులోంచి ఒక ఉత్తరం తీసి అన్నాడు) కాకినాడ నుంచి మరో ఉత్తరం వొచ్చింది

రంగ : వొచ్చే ఉంటుంది. నేను చదవనది. వాళ్ళకి గట్టిగా రాసి పారేయండి. నేను వాళ్ళమ్మాయినే కాదు ఎవర్నీ ఈ జీవితంలో చేసుకోను. అలా అని గట్టిగా రాసిపారేయండి

రాజ : (కోపం వచ్చింది) అంటే నీ తల కెక్కిన తిక్క ఇంకా దిగలేదన్నమాట.

రంగ : తిక్క !

రాజ : మాటాడకు మరి ! తిక్కా తిక్కన్నర ! ఎవర్తినో ప్రేమించేవ్ బాగుంది. నేను నీ ప్రేమని కాదన్లేదే ? లక్షణంగా పెళ్లి చేసుకోరా నాయనా ! అన్నాను. అన్నానా లేదా ?

రంగ : అన్నారు !

రాజ : అవునా. తర్వాత ఏమైంది, ఆపిల్ల కాస్తా నిన్ను ఛీ కొట్టింది.

రంగ : (కోపంగా ఆవేశాడు) నాన్నా !

రాజ : అదే లేవోయ్ ! నీ ప్రేమని తిరస్కరించింది. ఆ విషయాన్ని నువ్వే చెప్పేవ్. చెప్పేవా లేదా ?

రంగ : చెప్పేను.

రాజ : అయ్యిందా ! అప్పుడు నే నది విని నిన్ను సముదాయించేను. "పోన్లేరా రంగా! ఈ పిల్ల కాపోతే మరోపాటి. నువ్వు వూ అను, క్షణంలో వంద మందిని పట్టుకొచ్చేస్తానని చెప్పేను చెప్పేనా లేదా ?

రంగ : చెప్పేరు కానీ—

రాజ మాటాడ కింక ! దానికి నువ్వు 'నే నప్పుడే పెళ్లి చేసుకోన్నాన్నా! నేనింకా చదవాలి. ఏదో పొడిచేసేయాలి అవటాని అన్నావు. అన్నావా లేదా ?

రంగ : అన్నాను.

రాజ : మరింకే ? అన్నంతపనీ చేశావ్ ! ఒక జిల్లాకి ఆఫీస రయ్యావు. నీమాట నిలబెట్టుకున్నావ్. సరిపోయింది. ఇంక మరి నా కోరికెప్పుడా తీర్చేది ? ఒక్కగా నొక్కడివి కళ్లల్లో పెట్టుకు పెంచేను. స్థితికి మించిన దర్జాతో తిరిగేవు. అప్పో సప్పో— నా ఇబ్బందేదో నేను పడి నీ సుఖానికి అన్నీ అమర్చేను అవునా ? దానికి ప్రతిఫలంగా నువ్వు నాకు చేస్తున్న దేమిటి—మాటాడకు మరి. నన్ను చెప్పనివ్వు. నువ్వేం చేస్తున్నావ్ ? చెట్టంతవాడ్ని నన్ను పట్టుకుని నా మాట కాస్తా తీసి పారేస్తావ్ ? ఎవర్నుద్ధరించడానికిరా ! నువ్వింత ఎదిగింది ?

రంగ : అవును. నే నెదిగింది ఎవర్నుద్ధరించడానికి ?

రాజ : కాబట్టే, నే చెప్పిన పని మాటాడకుండా చేసి పారేయ్. నే నిప్పు డర్జంటుగా కాకినాడ వెళ్లిపోయేసి, మావాడు మీపిల్లన్జేడ్దాని కొస్తున్నాడు బావగారూ—మాటాడకు—అని చెప్పొచ్చేస్తాను. మంచి రోజ్జూసి మనం కాకినాడ వెడదాం. సరేనా ?

రంగ : నేను పెళ్లి చేసుకోను.

రాజ : (లేచి నించున్నాడు) కోవూ? ఎందుకోవు చేసుకోవురా ? ఎందుకు చేసుకోవూ ?

రంగ : నాకు పెళ్లంటూ జరుగుతే శ్రీదేవితోనే జరిగేది.

రాజ : ఇప్పుడు. ఇప్పుడా పిల్ల మరోడి భార్యరా !

రంగ : అలాంటప్పుడు నాకు భార్య లేదు ! ఉండదు.

రాజ : ఒరేయ్ ! రంగనాయకు లోరేయ్ ! నువ్వేం చేస్తున్నావో తెలుసా ? నీ పిచ్చితో మనకేం జరగబోతోందో ఊహించేవా ? నాకేం ఫర్వాలేదురా! రాయిలాటి మనిషిని. కానీ అవతల మీ అమ్మ ! నువ్వే గనక బ్రహ్మచారిలా ఉండిపోతానని చెప్పేస్తే, అది కాస్తా ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటుంది.

రంగ : నా పెళ్లితో అమ్మ కేమిటి సంబంధం ?

రాజ .ఏం సంబంధమా ? పిచ్చోడా ? ఇంత వయస్సూ, ఇంత హోదా ఉండి నువ్వర్థం చేసుకునే దింతమాత్రమేనా ? అది నీ తల్లిరా ! దాని వంశం ఆరు కాయలూ మూడు పువ్వులై వర్ధిల్లాలని తాపత్రయంరా ! నేనున్నాను—నేనే గనక పెళ్లి చేసుకోనవటాని నీలాగా భీష్మించుక్కూచుంటే నువ్వుండేవాడివా ? మాటాడకు. అలాగే మువ్వీనాడు ఇలా పెళ్లి చేసుకోనని చెప్పేస్తే రేప్పొద్దున ఈ రాజశేఖరం చచ్చి ఎవడి కడుపున పుట్టాలిరా ? ఏద్దైనా గాడిదని చూచి దాని కడుపున పుట్టమంటావా ? చెప్పరా ? . చెప్పు . . .

రంగ : అబ్బబ్బ .... మీరంతా కలిసి నాకు పిచ్చెత్తించేస్తున్నారు. వెళ్లండి. నాకు పెళ్లొద్దు వొద్దు.

రాజ : వొదూ . నీకు పెళ్లొద్దట్రా. సరే... నే నిటు వెళ్లగానే అటునుంచి మీ అమ్మ చావు ఖబురూ , నాదినం ఖబురూ వింటా వొరేయ్ !

రంగ . పెళ్లి స్వవిషయం ! నా పెళ్లి నా చేతుల్లో ఉంది. మీరెన్ని చెప్పినా నేను వినదలుచుకోలేదు. వినను.

రాజ : నీ యిష్టమొచ్చినట్టు ప్రేమించుకుని, ఆనక అపిల్ల కాస్తా నీ మొహం మ్మీద నువ్వు నా కొద్దని చెప్తే దానికి మేమెట్రా బాధ్యులం. ఆ కసిని కడుపులో పెట్టుకుని మమ్మల్ని సాధిస్తే ప్రయోజన మేమిటి ? ఏదో జరిగిపోయిం దేదో జరిగిపోయింది. అంతా మన మంచికే జరిగిం దని చెప్పేసి నామాట కాదనకుండా నువ్వీ పెళ్లికి వొప్పుకో. అవతల కాకినాడ సంబంధం మహా గొప్ప సంబంధం !

రంగ : నాన్‌సెన్స్. ఇంకీ విషయంలో నన్ను వొత్తిడిచేస్తే నే నూరుకో నంతే! ఇదికాక మరేదైనా మాటాడా లనుకుంటే మాటాడండి—లేదూ—

రాజ : ఊ .... లేదూ—

రంగ : వెళ్లిపొండి. అంతే.

[విసురుగా మేడమీదికి వెళ్లబోయేడు. అతన్ని పట్టుకు ఆపేడు రాజశేఖరం.]

రాజ : నాకు తెలుసురా ! నీ సంగతి యావత్తూ నాకు తెలుసు. పిచ్చిబాగుల్ది మీ అమ్మ నిన్ను నమ్మింది గానీ, నే నేనాడూ నమ్మలేదు. 'చదువు ముగించి పెళ్లాడుతాడని' దాని ఉబలాటం. కానీ, నేనో .... నేను ఛస్తే నమ్మనోరేయ్ ! మాటాడకు నీ విషయం వేరు. పదిమందిని ప్రేమించే వాడివి కాదు. అలా అయితే పదకొండో పిల్లని నీకు నేనే చూపించి, నీచేత ప్రేమింపజేసి మీ యిద్దరికీ పెళ్లిజేసి పారేశేవాడిని. ఉహూ— నువ్వలాటి వాడివికాదు. ఇక తప్పదు నువ్విక మామాట వినేవాడివీ కాదు. విను రంగా ! నీకు శ్రీదేవితో పెళ్లి జరగదని నాకు తెలుసు. ఆ అమ్మాయీ, వాళ్లమ్మా—ఇద్దరూ నాకు బాగా తెలుసు. ఆ ఇద్దరి తోనూ మాట్లాడి నీ పెళ్లి చెడగొట్టింది నేను !

రంగ : (ఆశ్చర్యపోయేడు) నాన్నా !

రాజ : మాటాడకు. నాలుగేళ్ల క్రితం నువ్వాయింటి కెళ్లిన రోజు, నేనూ నీ వెంట వొచ్చేను. అంత క్రితం పది రోజుల ముందు వోమాటు వెళ్ళేను అప్పుడే అసలు కథ తెలిసింది. అయ్యిందా—ఈనాడు నువ్వు ఆశ్చర్యపోయి 'నాన్నా' అని గావుకేక పెడతావనీ తెలుసు. అందుకే, ఈ పాత ఉత్తరాలు నాలుగు వెంట పట్టుకొచ్చేను. తీరుబడిగా చదువు ఏమైనా అర్థం కాకపోతే నన్నడుగు. (ఉత్తరాలు రంగనాయకులి కిచ్చేడు. అతను ఆత్రంగా తీసుకున్నాడు) చదివి—ఒరేయ్ రంగా నాకెదురు చెప్పకు. నేను మేడమీద ఉంటాను. నేను చూచిన సంబంధం వొప్పేసుకో. అంతే.

[రాజశేఖరం మేడమీదికి వెళ్లేడు. రంగనాయకులు ఒక ఉత్తరాన్ని పూర్తిగా చదివేడు. అతని మొహంలో మార్పు కొట్టొచ్చినట్టు కనుపించింది. గొణుక్కున్నట్టు పైకి అనేశాడు.]

రంగ : బుచ్చీ !—కాదు ఇది అబద్దం. నామీద కుట్ర నాన్నా ! ఇది నమ్మను.

[గబ గబా మేడ మెట్లెక్కుతూండగా—తెర.]

## మూడో రంగం

(వరదరాజు లిల్లు)

[పడక్కుర్చీలో వరదరాజు లొక్కడూ కూర్చున్నాడు. చేతులు రెండూ కుర్చీ వెనగ్గా చాచి పెట్టుకున్నాడు. ఇంటి కప్పువేపు చూస్తుండిపోయేడు. హఠాత్తుగా లేచి నించున్నాడు. అంతవరకు గుమ్మం దగ్గర నించున్న గోపీలో వింతైన మార్పు కనుపించింది.

వరద : అవునోయ్ గోపీ— ఊళ్లో వాళ్ల క్కనిపించకుండా ఈ రెండు నెలలూ ఎక్కడెక్కడ తిరిగొచ్చే రేమిటి ?

గోపి : ముందస్తుగా తిరుపతి సార్ నాలుగు రోజులు అయ్యగారి వూళ్లో సార్! తర్వాత భద్రాచలం. మళ్లా అయ్యగారి వూరు. తర్వాత తిన్నగా పూరీ జగన్నాథం సార్. వొచ్చేప్పుడు సింహాచలం, అన్నవరం. మళ్లా అయ్యగారి వూరు. నిన్నేమో ఈవూరు అదీసార్ సింపుల్‌గా టూరు !

వరద : తీర్థయాత్రలు చేశారన్నమాట భక్తులు !

గోపి : నేనోమాట చెప్తానుసార్! మీ రది నమ్మితీరాలి. మ వాఫీసరు మునుపటిలా లేరండి. బాగా మారిపోయేరు. రోజూ ఏమిటేమిటో తలుచుకుని కళ్ల నీళ్లు పెట్టుకుంటున్నారు సార్! ఎంతడిగినా ఏమీ చెప్పరు. 'గోపీ! నేను పాపాత్ముడినోయ్ !నాకు మనసు లేదోయ్ ! నేను మనిషిని కాదోయ్ !' అని వో ఇదై పోతున్నారుసార్ ! ఆయన్ని చూస్తుంటే—

[కంఠం రుద్ధమైంది.]

నా కేడుపొస్తుందిసార్ ! ఎలాంటివాళ్లు ఎలా అయిపోయారు సార్! సార్! రెండు నెలలు ఆయనొస్తే తిరిగేనని చెప్పి మా యింటి కాయన అయిదొందలు రూపాయిలు పంపేరు సార్ !

వరద : మీకు అయిదొందలుపంపేడా. దానకర్ణుడై పోయా డేమిటోయ్ బొత్తిగా

గోపి : ఇంకోటిసార్ ! మునుపు పెళ్లి చేసుకోనని పట్టుపట్టి కూర్చున్న మనిషి కాస్తా, ఈ యాత్రలన్నీ ముగిసిన తర్వాత పెళ్లి కొప్పుకున్నార్ సార్ ! అయ్యగారి మాట చెప్పిం తర్వాత సార్ ! పెద్దమ్మగారూ పెద్దయ్య గారూ ఎంతసంతోషించేరని సార్ !

వరద : బలే ఉందోయ్ ! పులికి కోర లూడటమే కాకుండా ఉత్త సాధుజంతువై పోయిం దేమిటోయ్ ! ఇకనుంచి గడ్డి తింటుంది కాబోలు !

గోపి : (బాధగా) సార్ !

వరద : నువ్వూ మారిపోయావోయ్ గోపీ !

గోపి : మీరు చాలా అన్యాయంగా మాటాడుతున్నారు సార్ !

వరద : నీకు అయిదొందలు ఇచ్చేడు కదోయ్ మరి ! నే నన్యాయంగానే మాటాడు తున్నాను.

గోపి : ఆయన దేవుళ్లు సార్ ! రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేయ వచ్చు. (కొంచెం మాగి అన్నాడు) ఆయన పుట్టినరోజువండగని ఈ ఏడాది బ్రహ్మాండంగా చేసుకుంటారట. మిమ్మల్ని వెంటబెట్టుకు రమ్మని నన్ను పంపేరు. మీ్రరావాలిసార్ ?

వరద : నేను రాను. రానని చెప్పేనని చెప్పు.

గోపి : (దీనంగా) సార్ !

వరద : అంతే—'వరదరాజులు రానని చెప్పేర్సార్ !' అన్చెప్పు.

గోపి : ఇది అన్యాయంసార్ ! మీకు మంచిని చేసిన మనిషిని మీరంత తొరగా మరిచిపోడం అన్యాయం సార్ !

వరద : షటప్. ఏమిటోయ్ నాకు చేసిన మం ... చి .... ప్రమోష నిచ్చేడనా ? ప్రమోష నిచ్చి పెద్దవాడిని చేశాడు గదాని లెంపలు వేసుకుంటూ వొచ్చి ఆ దయ్యాన్ని వెయ్యేళ్లు వర్ధిల్లమని కోరుకునేదా ? గెటవుట్. వెళ్లిపో ముందు.

గోపి : వెళ్తన్సార్ ! మిమ్మల్ని వెంటబెట్టు కొస్తానని అయ్యగారికి మాటి చ్చేను. మీ ్రరందే నేను వెళ్లను.

వరద : (లేచేడు) ఫూల్ ! ఎవడో అయిదొందలు ధర్మం చేసేడని, ఆ ముష్టికి కట్టుబడి వెట్టి చాకిరీ చేసే వెధవ్వి. నిన్నింతవరకూ స్పేర్ చేయడం నా తప్పు. నువ్విక్కడ్నుంచి వెళ్లిపో. వెళ్లకపోతే మెడపెట్టి గెంట వలసి వొస్తుంది !

గోపి : మీకా శ్రమ ఎందుకులెండి సార్ ! నేనే వెళ్లగలను. అధికారం మనిషి కళ్లు కప్పుతుందని నే ననుకున్నది అయ్యగారి విషయంలో అబద్ధమైనా మీరు నిజం చేసేరుసార్ ! కానీ సార్ !

వరద : గెటవుట్. అవుట్ యూ రాస్కెల్ !

(గోపి తలొంచుకు వెళ్లిపోయేడు. శ్రీదేవి రెండు కప్పుల్తో కాఫీని తీసుకొచ్చింది. ఆమెని చూసేడు.)

వరద : (ఒక కప్పు తీసుకుని) రెండోది గోపీకి తెచ్చేవా ?

శ్రీదేవి : మీ రతన్ని పంపించేరుగా.

వరద : నెత్తిమీద పెట్టుకు పూజించలేదని దిగులుగా ఉందా ? సారీ ! శ్రీదేవీ నే నింకా నేర్చుకోవలసినవి చాలా ఉన్నాయనుకొంటున్నాను.

శ్రీదేవి : మాటకుముందు నిష్ఠూరా లాడటం ఎక్కువై పోయింది.

వరద : తగ్గించుకుంటాను ! కానీ, ఈ వ్యాధికి మందు లేదుట పాపం ! ఏకంగా కాటికి వెళ్లినప్పుడుగ్గాని పోదు. ఏమైతేనేం ! మీ అమ్మ, నువ్వూ ఇద్దరూ నన్ను ఒలిచేశారు. ఫినిష్.

శ్రీదేవి : (్రటే టీపాయ్ మీదుంచింది) ఏనాడు పాపం చేసుకున్నానో ఈ జీవితానికి సుఖంలేదు.

వరద : (కాఫీ తాగలేదు. కప్పు ్రటేలో ఉంచి అన్నాడు) అనుక్షణం మోసంచేసే మనుషులు సుఖించడానికి వీల్లేదు అంతే. అది రూలు !

శ్రీదేవి : పోనీలెండి. కాఫీ తాగండి. చల్లారిపోతూంది.

వరద : ఏ కప్పులోది తాగమంటావో చెప్పు. కళ్లు మూసుకు తాగేస్తాను.

శ్రీదేవి : ఇదేమిటి ?

వరద : అవును శ్రీదేవీ ! నువ్వు రెండు కప్పుల్లోనూ విషం కలుపుకొచ్చేంత తెలివితక్కువదానివి కాదు. అందులో ఒకటి గోపీ కోసం తెచ్చేవ్, గోపీ రంగనాయకులు మనిషి. చెప్పు. విషమున్న కప్పేదో చెప్పు. వొరేత్తు కుండా తాగి చస్తాను.

శ్రీదేవి : నన్ను అనుక్షణం చంపుతన్నది మీరు.

వరద : అందికే అంటున్నాను. ఇకముందు నీ కాబాధుండదు. నేను చచ్చేందుకింత విషం పెడితే, అంతా గప్‌చిప్ !

శ్రీదేవి : మాటిమాటికి నన్ను హింసించడం ధర్మంకాదు.

వరద : ధర్మం. మంచిమాటన్నావ్ శ్రీదేవీ ! చాలా చక్కటి మాటన్నావ్. తాడూ బొంగరంలేని రోజు మీయింటి కొచ్చేను. నీకోసం వొచ్చేను. నువ్వడిగేవ్—నన్ను ప్రేమిస్తున్నావా, మా అమ్మ ఆస్థి గ్రటాని ప్రేమిస్తున్నావా ? అని నా పేదతనం అంత నీచమైంది పాపం. కానీ, శ్రీదేవి, అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ గూడా నిన్నే ప్రేమిస్తున్నాను. నువ్వన్న మీ అమ్మ ఆస్థి గ్రటా మీ అమ్మతోనే పోయేయి. మీ అమ్మ పోతూ పోతూ, తొందరగా పోకుండా ఆస్తినీ హరించి మరీ పోయింది. అప్పుడు గూడా నువ్వే నా క్కావాలన్నాను. ఇది ధర్మంకాదు. అన్ని రకాలుగా నన్ను ప్రశ్నించి, నా పేదరికాన్ని అనుమానించి నన్ను కట్టుకున్న నీకు ధర్మం గురించి బాగా తెలుసు నన్ను మోసం చేయడం ధర్మం ! ఈ అమాయకుడిమీద ప్రయోగం చేయడం ధర్మం. నేను యాచకుడిని శ్రీదేవీ ! నీ ప్రేమకోసం యాచించి వొచ్చిన .....

శ్రీదేవి : (విస్లేకపోయింది) కాదు. మిమ్మల్ని మీరు తక్కువ చేసుకోడం మంచిదిగాదు.

వరద : అబద్ధం. నే నెన్నటికీ తక్కువ వాడినే. ఎందుకూ పనికిరాని చవటని. గౌరవనీయురాలైన వర్ధనమ్మ ప్రాపకంలో ఉద్యోగం సంపాయించిన చవట నెంబర్ వన్ ని మహా పతివ్రతాశిరోమణి శ్రీదేవి మాటసాయంతో గ్రుున నెల తిరక్కముందే ప్రమోషను పుచ్చుకున్న చవట నెంబరు టూని.

శ్రీదేవి : మిమ్మల్ని బాగుచేయడం నా తరంకాదు. దైవసాక్షిగా చెప్తున్నాను. మిమ్మల్నేనాడూ కించపరచలేదు. మీరు తలొంచుకునే పనిని నే నేనాడూ చేయలేదు. నన్ను నమ్మండి. మీరు పూర్వం వరదరాజులుగా మాట్లాడండి. ప్లీజ్ . నన్ను హింస పెట్టకండి.

వరద : పూర్వం ! (నవ్వేడు బరువుగా) పూర్వం వరదరాజా లనబడే వో పేద మనిషి గలడు. ఆ వరదరాజులుత్త ఫూల్. వట్టి వన్నీ నీళ్ళు

తెల్లనివన్నీ పాలనుకునే వెర్రిబాగుల మనిషి (కోపం వొచ్చింది) కాలం ఒక్కలా ఎప్పుడూ ఛస్తే ఉండదు ఆ వరదరాజులు కళ్ళు తెరిచాడు. అతనో విషవలయంలో యిరుక్కున్నట్టు గమనించేడు. దాన్నుంచి తప్పుకునే దెలా అన్న సమస్యతో కొట్టుకు చస్తున్న వరదరాజుల యొక్క నిజ స్వరూపాన్ని చూచి భయపడే పక్షి పేరు శ్రీదేవి. ఆ శ్రీదేవికి ఈ వరదరాజులు పూర్వం మనిషిలా, అమాయకుడిలా మారి పోవాలని ఉంది (కసిగా నవ్వేడు) ఆ అమ్మాయి చెప్పు చేతుల్లో గంగిరెద్దులా తలూపాలని ఉంది. కదూ!

శ్రీదేవి (ఉలిక్కిపడింది) మీరు నవ్వొద్దు. అలా నవ్వొద్దు. నిజమే మీరు చెప్పిందంతా నిజమే! మీరు దేవుళ్లాటి మనిషి నిజమే!

వరద నాకు చాలా అర్థంకావటంలేదు శ్రీదేవి! రంగనాయకులతో విలాసంగా తిరిగిన నీకు నే నెందుకు నచ్చేనో తెలీదు ఓ పక్క వర్ధనమ్మత్తయ్య వొద్దని ఎంత చెబుతున్నా ఆ మాటల్ని పెడచెవిని పెట్టి, నన్నెందుకు పెళ్లాడేవో తెలీదు. చెప్పు శ్రీదేవి! ఇదంతా ఎందుకు జరిగింది?

శ్రీదేవి . మీ రనుమానించేంత దారుణంగా నే నేనాడూ రంగనాయకులుగారితో తిరగలేదు.

వరద అంత గట్టి పరిచయం లేకపోతే, ఈ వరదరాజు లింత ఘనుడై పోగలడా? టైగరుమార్కు ఆఫీసరు వరదరాజులకి చక్కటి ప్రమోషన్ ఇవ్వగలడా ఇచ్చి నెత్తినెట్టుకు పూజించగలడా? అంతే కాదు శ్రీదేవీ! ఇవాళ అతని పుట్టినరోజు పండక్కి మనం ప్రత్యేకమైన ఆహ్వానితులం ఈ తిరకాసుకి మూల మేమిటి? మీ అనురాగం మీ అనురాగాన్ని నేను తినేశాను. వొప్పుకుంటాను కానీ, నువ్వు ఆనాడే చెప్పిఉండాల్సింది 'నిన్ను పెళ్లి చేసుకోలేను బావా! నాకో ప్రియుడున్నాడు—'

శ్రీదేవి (చెవులు మూసుకుంది. గట్టిగా అరిచింది) ఆపండి నేను వినలేను. భగవంతుడా ఏమిటీ పరీక్ష? నిజం చెప్పినా అర్థంచేసుకోలేని మనిషి ముందు నే నేవిధంగా నిజం చెప్పగలను? ఎలా చెప్పేది?

వరద నువ్వేం చెప్పినా అబద్ధమే అవుతుంది శ్రీ శ్రీ శ్రీ రంగనాయకులింట్లో, వొంటరిగా నువ్వు నించున్నవేళ నే నొచ్చేను. పాయింటు నెంబరు టు క్రూరుడైన రంగనాయకులు గురించి ఎన్నెన్ని చెప్తున్నా విని వూ కొట్టేవే గాని ఆ ఫలానా మనిషి నాకు ఫలానా అని చెప్పేవుగాదు. పాయింటు నెంబరు త్రీ, నువ్వావేళ ఆయింటి కెళ్లిన రోజుకి సరిగ్గా నెలరోజులు తిరక్కముందే నాకు ప్రమోషన్ వొచ్చింది.

శ్రీదేవి దైవసాక్షిగా మీ ప్రమోషను గురించి నేనేమీ చెప్పలేదు.

వరద . మధ్య దేవు డెందుకు సాక్ష్యం శ్రీదేవి! మన ముగ్గురిమీ చాలు 'నా మొగుడికి ప్రమోషన్ ఇవ్వు రంగనాయకులూ' అని నువ్వు నోరు విప్పి చెప్పాలా? నువ్వు నాకు భార్యవని ఆ మనిషికి తెలుస్తే చాలు అదే ఒక గొప్ప క్వాలిఫికేషను రంగనాయకులు ఆవులిస్తే పేగు లెక్కపెట్టగల దిట్ట

శ్రీదేవి మీ మనసులో ఇంత విషం గూడు కట్టుకున్నట్టు తెలీదు. సరే మీ యిష్టం వొచ్చినట్టు అనుకోండి నేనేం చెప్పలే నింక నా గురించి నాకు బాగా తెలుసు. అదే చాలు నాకు

(వరదరాజులు కోపంగా ట్రేని లాగేడు. ట్రేలోని కప్పులు కిందపడిపోయేయి. శ్రీదేవిని కొట్టేందుకు ట్రే నెత్తేడు.)

వరద · యూ డెవిల్!

(కానీ కొట్టలేక పోయేడు. చెయ్యి దించేడు.)

శ్రీదేవి . ఆగిపోయావేం బావా!

వరద బావ ! ఛీ .... ఎంత అసహ్యంగా అనేశావ్ శ్రీదేవీ ! నీకు నేను బావని (తమాషాగా నవ్వేడు) ఇప్పటివరకూ ఈ పిలుపుతో నన్ను కట్టి పారేశావ్ నా నోరు మూసేవ్. ఇంక నన్నలా పిలవకు

(బయట కారాగిన శబ్దమైంది. ఒక తడవ శ్రీదేవి వేపూ మరోతడవ గుమ్మంవేపు చూచి అన్నాడు.)

వరద రంగనాయకు లొచ్చేడు కాబోలు ! ఇప్పుడీ క్షణంలో వాడో వీడో తేలి పోవాలి. ఎవడో ఒకడు సఫా. చూచే ధైర్యం లేకపోతే కళ్లు మూసుకో, లేదా వంట గదిలోకి పారిపో . రెండు నెలల్గానీ ఈ అవకాశం చిక్కలేదు నాకు రా వా తండ్రీ ! రా !

(రెండడుగులు ముందుకు వేశాడు)

శ్రీదేవి (ఖంగారుగా అన్నది) తొందరపడకు బావా ! నామాట విను. రంగ నాయకులు గురించి నీకేం తెలీదు. నే చెప్తాను బావా ! ఆగు.

(గుమ్మంలో ఆర్గోవిందరావు నించున్నాడు. అతన్ని చూచి శ్రీదేవి కొంచెం కుదుట పడింది. కిందవున్న కాఫీ కప్పులు సర్దడం మొదలు పెట్టింది. ఆర్గోవిందరావు వరదరాజులు చేతిలోవున్న ప్లేటని చూచి ఆశ్చర్యంగా అన్నాడు.)

గోవింద ఏమిటండోయ్ ! ఇది !

వరద (సర్దుకున్నాడు) ఏంలేదు. మా ఆవిడ కాఫీ చేసిందన్న మాటేగానీ అందివ్వడం చాతకాక కింద పారేసింది. ఇంతలో మీ కారు శబ్దమూ వినరానూ. రండి లోపలికి

(ఆర్గోవిందరావు లోపలికొచ్చి అన్నాడు)

గోవింద ఏమిటో మాయ ! అయ్యయ్యో కాఫీ అంతా పడిపోయిందే ?

వరద : మరే ... మీ కివ్వడానికి గూడా వేరే లేదు అవునూ—ఏదో పనిమీద వొచ్చినట్టున్నారే ?

గోవింద ఏదీ—మీకు ప్రమోష నొచ్చిం దగ్గర్నుంచీ మిమ్మల్ని కలుసు కుందామని అనుకుంటున్నా వీలవట్లేదు ఏమిటో మా బిజినెస్ అంతా గూడా అటువంటిది. దానికి తగ్గట్టూ బిజినెస్ గూడానూ అటూ ఇటూగా ఉందిలేండి. మహా ఇబ్బందిలో మునిగిపోయేం !

వరద : కూర్చోండలా ! (కూర్చున్నాడు) ఇంతకీ విశేష మేమిటో చెప్పేరు కాదు.

గోవింద ఏంలేదు (శ్రీదేవి వేపు చూచి ఆగిపోయేడు అది వరదరాజులు గమనించేడు)

వరద : ఫర్లేదు చెప్పండి. మీ రిప్పుడు నాతో ఏం చెప్పినా నేను తిరిగి అవన్నీ మా ఆవిడకి తూ. చ. తప్పకుండా చెప్పాలంతే !

గోవింద (ఖుషీగా నవ్వి అన్నాడు) అనుకూల దాంపత్యం

వరద అసలు సంగతేమిటో చెప్పేరుకాదు.

గోవింద : మీరలా తొందర పెట్టేస్తే చెప్పబోయేది సరిగ్గా చస్తే చెప్పలేను. కొంచెం తాపీగా చెప్పవలసిన విషయం. మీరు కూర్చోండి చెప్తాను.

(వరదరాజులు అయిష్టంగా కూర్చున్నాడు.)

గోవింద : మనిషై పుట్టేం తర్వాత పొరపాట్లనేవి అనేకం తప్పనిసరిగా జరిగి తీరుతాయి. ఆనాడు మీరూ, ఆఫీసరుగారూ ఆడిన నాటకం మహాద్భుతం అనుకోండి. తలుచుకుంటూంటే ఇప్పటిగ్గూడాను కాళ్లు వొణుకుతున్నాయి. అదంతా తమాషాగా జరిగిపోయింది గదా. తమాషాని తమాషాగానే తీసుకోవాలి గాని, కడుపులో కసిని పెట్టుకు తిరుగుతే ఎలా చెప్పండి ?

వరద : (విసుగ్గా అడిగేడు) ఇప్పుడేమైందండి ?

గోవింద : ఏంలేదు—ఆనాటినుంచి నేటివరకూ మీ ఆఫీసరువారు మామీద దయచూపలేదు ఇవాళేమో ఆయన ఆఫీసుకి వొచ్చార్ట. ఏదో సర్దుకుపోడంలో మంచి ఉంటుంది గానీండి, ఇలా పేచీలు పెట్టుకూర్చుంటే ఎలా చెప్పండి ? అవతల మా పెద్దబ్బాయి ఈ ఆఫీసర్నేమైనా చేయించ గలనని శివాలెత్తుతుంటే, నేనే గదమాయించి కూచోపెట్టేను. ఎందుచేతంటారు ? మీ అందరిమీదా నాకు అభిమానం చావక అవునండీ ! నేనిక్కడిలా కిందా మీదా పడుతూంటే మీ ఆఫీసరు ఎత్తిన కత్తి దించడంలేదు ఇవాళ ఉదయం, మాది మరో బిల్లొకటి తొక్కిపారేశారుట. ఇలా పంతాల్లోకి వ్యవహారం దారితీస్తే జరగ వలసిన అనర్థాలు చాలా వుంటాయనే భయంకొద్దీ, అది ఇరు పక్షాలకీ మంచిదికాదనే ఆలోచనకొద్దీ—

వరద : రాయబారాని కొచ్చేరు అంతేనాండీ !

గోవింద నామాట గూడా మీరే అనేస్తే ఎలా ? పోతే ఈ రాయబారానికి మార్గ మేమిటి అనేది ప్రశ్న. మీరు నాకు కనిపించేరు. మీమీద ఆఫీసరుగారికున్న స్నేహం గుర్తుకొచ్చింది అదీగాక ఆయనగారే ప్రత్యేకమైన అభిమానం తీసుకొని మీకు ప్రమోషను వేయించిన సంగతీ విన్నాను.

వరద : ఆగండాగండి ! ఆమాట కాస్త మా ఆవిడతో చెప్పండి నే నెంత చెప్పినా నమ్మదు ఆఫీసరుకూ, నాకూ మంచి స్నేహిత ముందని నోటికి తాళం లేకుండా వాగుతూంటే, పోండి మీ బడాయి అంటుందే గానీ అర్థం చేసుకో దేమిటండీ బొత్తిగా ! వూళ్లో మీలాంటి పెద్దమనుషులు అందరికీ తెలిసిన యీ విషయం మా యింట్లో మనుషులకి తెలీదు ఖర్మ ! చెప్పినా అర్థం చేసుకోరు (శ్రీదేవి తలొంచుకున్నది )

గోవింద . ఆడంగులంతా యింతేనండి ! ఇక పోతే నే చెప్పబోయే దేమిటంటే, నా విషయంలో మీరైనా తగిన శ్రద్ధ తీసుకొని ఆయన చెవినేస్తే ఏదో మీపేరు చెప్పుకుని ఇరువక్షాలూ క్షేమంగా ఉంటాయి లేదు— అదంతా నా నోటితో చెప్పవలసింది కాదనుకోండి మా పెద్దబ్బాయి తల్చుకున్నది చేసి మరీ వొదిలిపెట్టగల దిట్ట !

వరద ఏమైనా చేయగలడా ? దండకారణ్యానికి బదిలీ చేయించగలడా ?

గోవింద . ఆహా . కావలిస్తే అండమానూ పంపించగలడు. పోయినాఫీసరుకి రోజుల్లో 'దశ' మారితే, ఈ ఆఫీసరుకి క్షణంలో—

వరద : (మధ్యలో అందుకున్నాడు) మీరీ మాటమీదే నిలబడాలి నిలబడతారా ?

గోవింద ఏమిటండీ చోద్యం ! ఏమిటి ? మా సత్తా పరీక్షించా లనుకుంటున్నారా చూస్తారేమిటి తమాషా ?

వరద : చూడాలని చాలా కుతూహలంగా ఉందండి గోవిందరావుగారూ ! మీరు మీ తడాకా చూపించే మాటయితే మీ మేలు మరిచిపోలే నీ జన్మలో ! వెళ్లండి వెళ్లి మీ ప్రయత్నాలేవో మీరు చేయండి

శ్రీదేవి ఏమండీ !

వరద నువ్వూరుకో శ్రీదేవీ ! నీకేం తెలీదు. మీరు వెళ్లండి గోవిందరావు గారూ ! మీ విజృంభణ ప్రారంభించండి

గోవింద పెద్దవాడిని నామాట తీసేయకండి వరదరాజులుగారూ ! (శ్రీదేవి నుద్దేశించి) మీరైనా చెప్పి చూడండమ్మా ! ఏమైనా జరుగుతే ఆ ఆఫీసర్తోనే కాదు, ఇటు వరదరాజులుగారు కూడాను—

వరద : (లేచి నించున్నాడు) వెళ్లవయ్యా స్వామీ ! నీకు కోటి నమస్కారాలు. వెళ్ళి నీ ప్రతాపమేదో చూపించు.

గోవింద : (కోపంగా లేచేడు) పదే పదే చెప్పించుకోడానికి నేను మీ తొత్తుని

కాదు. వొస్తాను. మళ్ళా రేపేవేళకి మీ జాతకా లేమిటో తేలుస్తాను. ఆ. అంతే.

(వెళ్ళబోయేడు.)

శ్రీదేవి : ఆగండి (గోవిందరావు ఆగేడు) మీరు పెద్దలు. విషయ మేమిటో నాకు పూర్తిగా తెలీదు. ఇంత కోపంతో మీరు వెళ్ళిపోవడం ఏం బాగు లేదు. కొంచెం శాంతించండి !

వరద : మీరు కొంచెం నోరు మూయండి ! గోవిందరావుగారూ మీరు వెళ్ళిరండి.

గోవింద : పిల్లకాకులు. ఉండేలుదెబ్బ తెలీదు వొస్తాను (వెళ్ళిపోయేడు.)

(శ్రీదేవి గదిలోకి వెళ్ళబోయింది.)

వరద : ఆగు శ్రీదేవీ ! (ఆగింది) నివ్వాళుగా దుమారం. ఏమిటంటావ్ ఇదంతా. నా ప్రమోషను నా స్వశక్తిమీద రాలేదనే విషయం ఆఫీసులోనే కాదు బయట మార్కెట్టుకీ తెలిసింది. కారణ మేమిటయ్యాంటే నామీద ఆఫీసరుకున్న అభిమానమని ఫూల్సనుకుంటున్నారు. రేపో మాపో అసలు రీజను తెలిసిపోతుంది. వరదరాజులుగాడి పెళ్ళాం, రంగనాయకులతో కొన్నాళ్ళపాటు తిరిగిందావటాని. ఆ వెనక మన ప్రత్రికలు, ఆ తర్వాత మన నూయిూసెన్సే డప్పు, ఆపైని—

శ్రీదేవి : మీరు చెప్పిందంతా అబద్ధం. అంతా అబద్ధం.

(బయట గోవిందరావుకారు కదలిన శబ్దమైంది.)

వరద : కాదు నిజం. పచ్చి నిజం. కాదని నువ్వు నిరూపించు చూద్దాం. నీకూ రంగనాయకులుకీ సంబంధంలేదని ఓ కట్టుకథ చెప్పు వింటాను. ఆ కథని సాక్షాత్తు నేనే ప్రచారంలో పెట్టేస్తాను. చెప్పు శ్రీదేవీ !

శ్రీదేవి : నాకు రంగనాయకులు స్నేహితులు. మంచి స్నేహితులు. ఆయనే కాదు. వాళ్ళ కుటుంబమంతా మాకు స్నేహితులు.

వరద : ఒక ఆడదానికి ఒక మగవాడు స్నేహితుడంటే లోకం దాన్ని 'ప్రేమ' అనేస్తారే ?

శ్రీదేవి : అది వాళ్ళ ఖర్మ.

వరద : సరే. ఇంకేం చెప్పమంటావ్. కేవలం—రంగనాయకులు కుటుంబం మా శ్రీదేవి వాళ్ళతో స్నేహితంగానే ఉండేవారు గానీ అంతకుమించి మరేం లేదురా, సన్నాసులూ ! అని కోప్పడతాను. అంతేనా ? అది చాలా ?

శ్రీదేవి : అంతేకాదు. ఇంకా ఉంది.

వరద : ఏమిటో అది ?

శ్రీదేవి : చెప్తాను. కొంచెం టైమివ్వండి. సాక్ష్యాల్తో సహా మీముందుంచు తాను. నే నొక్కర్తినీ చెప్పవలసిన కథ కాదు ఇది. చెప్పవలసినవాళ్ళు ఇంకా ఉన్నారు అంతవరకూ మీరు ఆవేశాన్ని చంపుకోవాలి.

వరద : గూడ్. శ్రీదేవి ఏదో మంచి ప్లానే వేసింది.

(విసురుగా, చెదురుగా వచ్చేడు సుబ్బారావు. అతని బట్టలుమీద అక్కడక్కడ నెత్తురు మరక లున్నాయి.)

సుబ్బా : నేనూ మంచి ప్లానే వేశాను వరదరాజులుగారూ ! చాలా చక్కని ప్లానే వేశాను. వెధవ గోపీగాడొచ్చి నా ప్లాను చెడగొట్టేడు.

వరద : ఏమిటయ్యింది ?

సుబ్బా : సమయం చిక్కక ఇన్నాళ్ళూ చేతులూపుకుంటూ తిరిగేనా ? ఇవాళ దొరికింది. ఇంట్లో పక్షి ఒక్కటే ఉంది. వెళ్ళాను. "ఏంరా ? రాస్కెల్ హాశారాయూ ?" అన్నాను. వెధవ బిక్కమొహం పెట్టేడు బిత్తరపోయేడు. సన్నాసి, నా ప్రేమనీ తింటావుట్రా రాస్కెల్ అన్నాను. ఫ్లవర్ వాజెత్తి లాగిపెట్టి కొట్టబోయాను. చావు తప్పినా గట్టిదెబ్బ తగిలింది. అంతా నెత్తురు. గోపీగాడొచ్చి అడ్డుపడ్డాడు కానీ, వరదరాజులుగారూ, నేను వాడి చావుని చూస్తాను.

వరద : దెబ్బ బాగా తగిలిందా ? ఇంకా గిలగిలగిలా తన్నుకుంటున్నాడా ?

సుబ్బా : ఎవడిదో మంచి మొహం చూసి ఉంటాడు. చావు తప్పింది.

శ్రీదేవి : (భయపడింది) ఏమండీ ! ఏమిటిదంతా? ఏముయింది.

వరద : రంగనాయకులు ఉన్నపళంగా ఛస్తే నీకూ లాభంలేదు సుబ్బారావ్ !

తీసుకు తీసుకు చావాలి. ఈ పక్క నుంచి గోవిందరావ్, ఆపక్కనుంచి నువ్వు, అప్పుడప్పుడూ నేను—అంతె, ఆటకట్టు. పిట్టగిలగిల తన్ను కోవటం తమాషాగా ఉంటుందిలే !

శ్రీదేవి :(కోపం వొచ్చేసింది) మీరంతా రాక్షసులు. దయ్యాలు.

సుబ్బా : మేముకాదు. మేము చాలా మంచివాళ్ళం. వాడే ఆ ఫూలే దయ్యం.

శ్రీదేవి వెళ్ళండి. వెళ్ళి ఆయన కాళ్ళ మీదపడి క్షమాపణ కోరుకోండి. వెళ్ళండన్నయ్య గారు! వెళ్ళండి.

సుబ్బా: ఏమిటిది వరదరాజులుగారు! ఈవిడకి మన విషయాలేం తెలీదులాగుందే. మీ రమాయకులమ్మా. మీకేం తెలీదు. వాడి మూలకంగా నేను చాలా అన్యాయమైపోయేను. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఇలా రోడ్ల వెంట తిరుగుతున్నాను. నెలలు గడుస్తూన్నా మావూరెళ్ళలేక పోడానిక్కారణం వాడు! నాకిన్ని కష్టాలు రావడానిక్కారణం వాడు! వరదరాజులుగారూ! మీరైనా చెప్పండి.

వరద: ఆవిడకి నేనేం చెప్పినా అర్థంగాదు. పదండి. ముందు మీ రూము కెళ్ళి బట్టలు మార్చుకుని మళ్ళావొద్దాం! రండి! తలుపేసుకో శ్రీదేవీ! ఎక్కడికీ వెళ్ళకు నీగుండె బేజారెత్తిన సంగతి నాకు తెలుసుగానీ, కొంచెం కుదుట పడు. పదండి సుబ్బారావుగారు!

(వాళ్ళిద్దరూ వెళ్ళిపోయేరు. శ్రీదేవి తలుపు వేసుకుంది. ఇంట్లో ఒక్కత్తె కూర్చుంది. మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది. వెనకటి విషయాలెన్నో గుర్తు కొచ్చేయి. బాగా కదిలిపోయింది శ్రీదేవి.)

(అప్పట్లో)

వరద: థేంక్స్. వెరీ మచ్ థేంక్స్. చూడు నేనెంత అల్ప సంతోషినో! నా కెప్పుడూ మన బంధుత్వం గుర్తు కొస్తూంటే కొండంత ధైర్యం వొస్తుంది. ఆ ధైర్యంతో—అధైర్యంతో ఇంత ఎంగ్రడిస్ పువ్వుకు చావ మన్నావనుకో. చెప్పిన మరుక్షణం ఠా. అంతే.

శ్రీదేవి: (అన్నది) నువ్వు చాలా మంచివాడివి బావా! చాలా మంచివాడివి. నిన్ను బాధ పెడుతున్నాన్నేను. అమ్మకిచ్చిన మాట నన్ను కట్టేస్తుంది బావా! కానీ, బావా! నీకు నిజం ఎప్పటికైనా తెలుస్తుంది. ఎప్పటికైనా తెలుస్తుంది.

రంగ: (అనాడు) జీవితంలో ఎవర్నీ ఎప్పుడూ ఏ విషయంలోనూ ప్రాధేయపడలేదు నేను. నాకోసం నేను కొన్ని పరిధుల్ని చిన్నప్పుడే ఏర్పాటు చేసుకున్నాను. వాటిని దాటి బయట పడటం నాకేనాడూ యిష్టంలేదు. అలాటి దీరోజు ప్రాధేయ పడుతున్నాను. అకారణంగా నన్ను దూరం చేసుకోవద్దని వేడుకుంటున్నాను......మొడపెట్టి గెంటించుకునేందుకు రాలేదిక్కడికి. వెడతాను. రంగనాయకులు అతిమంచివాడని పేరు నాకు. ఎప్పుడైనా నేను రాక్షసుడినైతే దానిక్కారణం మీరే అవుతారు. మీరే అవుతారు.

శ్రీదేవి: (అనేసింది) అవున్నిజం. నేనే కారణం. కారణం నేనే. దౌర్భాగ్యురాలిని. నన్ను నమ్ముకున్న మనుషులందరికీ బాధ కలగజేస్తున్నాను. క్షమించండి.

రంగ: నాలుగేళ్ళ క్రితం శ్రీదేవి అన్న ప్రతీ మాటా గుర్తుంది. ఫారిన్ ట్రిప్, పాలరాతి మేడ, నల్లకారు—ఓహ్!

శ్రీదేవి: తప్పుకునేందుకు. కేవలం మీనుంచి తప్పుకునేందుకలా అన్నాను అందుకే అన్నాను.

(ఏడ్చేసింది.)

వరద: 'దేవుడి అవతారం ఆఫీసరూ' కానీ కొంచెం షాకేదో తగిలి దానవుడైపోయే డావటాని నీకు చెప్పింది నేను. తెలిసి గూడా కారణం చెప్పలేదు నువ్వు. క్లాస్ వన్ అడదానివి.

శ్రీదేవి: నన్ను నమ్మ బావా! నీకు నేనెన్నడూ ద్రోహం చేయలేదు చేయను మా కథ ఈ ఆవేశంలో నీకు తెలుస్తే మరింత రుద్రుడవైపోతావని నా భయం. అందుచేతే ఆగిపోయేను బావా! (క్షణం మవునం) ఇదంతా నావల్లనే జరిగింది నేనే కారణం

(లేచి నించుంది. తలుపు శబ్దమైంది. కళ్లు తుడుచుకుని జుట్టు సవరించుకున్నది. వెళ్లి తలుపుతీసింది. తలమీద కట్టుతో రంగనాయకులొచ్చేడు. అతనివెంట గోపి ఉన్నాడు. వాళ్లిద్దర్నీ చూచి లోపలి గదిలోకి వెళ్లి పోయింది శ్రీదేవి.)

రంగ. ఇంక నువ్వు వెళ్ళిపో గోపి!

గోపి. (మొండిగా అన్నాడు) వెళ్ళనుసార్. మిమ్మల్ని ఓ క్షణమైనా విడిచి నేనెక్కడికీ వెళ్ళను. మీకే అపకారం జరగడానికి వీల్లేదు.

రంగ: గోపీ ఇది నాయిల్లు ఇక్కడ నాకేం భయంలేదు. నువ్వెళ్లు

గోపి. మీకు తెలీదు సార్! మీమీద వరదరాజులుగారు కూడాకోపంగా వున్నారు సార్! మీరు వీళ్ళనెవళ్ళనీ నమ్మొద్దు సార్! మీమంచితనం వీ రెవరికీ అర్థం కాదు.

రంగ నువ్వు నన్నర్థం చేసుకున్నావా?

గోపి సార్! నిజం చెప్తున్నాను సార్! మ నువు నేనూ వీళ్ళలాగే మీమీద కత్తి గట్టేను సార్! అవసరమైతే ఎంతకైనా సరె తెగించాలనుకున్నాను సార్! కానీ సార్ (బాధగా అనేశాడు) మీగురించి ఎవరికీ ఏమీ తెలియద సార్! సుబ్బారావుగారు చేయి చేసుకున్నా మీరేం మాటాడలేదు ఆవేళకి నేను రాకపోతె, వొద్దు సార్. నేనిక్కడ్నుంచి కదలను.

రంగ: (బాగా కదిలిపోయేడు. లాలనగా అన్నాడు) గోపీ!

గోపి. (ఆశ్చర్యపోయేడు) నేను అల్పుడ్ని సార్! అంత తియ్యటి పిలుపు నేను భరించ లేను సార్! మీ ఆఫీసుల చప్రాసీ వెధవని. మనుషుల్లా నన్ను విసుక్కోండి. **గట్టిగా కేకలు పెట్టండి. అంతేగాని అంత తియ్యగా మాటాడకండి సార్! మీరు టైగర్! అవినీతిపరుల గుండెల్లో మెదిలే సింహం! మీకేమిటి సార్** తక్కువ?

రంగ. గోపీ! వెళ్ళిరా! నా పుట్టినరోజు పండగ నేనిక్కడ బ్రహ్మాండంగా జరుపు కుంటాను. ఇక్కడ నాకేం భయంలేదు. రైలొచ్చే వేళయింది. నాన్న గార్ని తిన్నగా యిక్కడికే తీసుకురా. వెళ్లు.

(గోపి రంగనాయకులు వేపు చూచుకుంటూ కదిలేడు.)

రంగ: (అప్రయత్నంగా అనేశాడు) గోపీ!

(రివ్వునవచ్చి రంగనాయకులు దగ్గిర కూర్చుండి పోయేడు గోపి.)

రంగ: (మనఃపూర్వకంగా అన్నాడు) నాకు నిజమైన స్నేహితుడివి నువ్వే! ఈ జీవి తానికి ఒక మంచి మనిషిని దేవుడు పరిచయం చేశాడు తమ్ముడూ! ధన్యుడ్ని!

గోపి: తమ్ముడు! నేనా సార్! నేనా తమ్ముడ్ని సార్! సార్! నా కేడుపొచ్చేస్తుంది సార్! ఏడుపొస్తోంది.

రంగ: (సర్దుకున్నాడు) నాన్నగార్ని వెంటబెట్టుకురా! తొందరగా వొచ్చేయ్!

(గోపి వేగంగా వెళ్లిపోయేడు. కాసేపటికి కారు కదిలిన శబ్దమైంది. రంగనాయకులు కదిలిన శబ్దమైంది. రంగనాకులు వీధి గుమ్మంవరకు వెళ్ళొచ్చి లోపలి గది వేపు తొంగి చూచి అన్నాడు.)

రంగ శ్రీదేవీ!

శ్రీదేవి (భయంగా వొచ్చి నించుంది.)

రంగ నన్ను చూస్తుంటె భయంగా వుందా? నేను పూర్వం రంగనాయకుల్ని కాదు.

శ్రీదేవి. (తలొంచుకున్నది)

రంగ మాటాడు శ్రీదేవీ! నేను పూర్తిగా వోడిపోయిన మనిషిని. నువ్విప్పుడేం మాటాడినా గెలుపు నీదే అవుతుంది. మాట్లాడు. (క్షణమాగి) వరద రాజులు లేడా?

శ్రీదేవి సుబ్బారావుగారోతో కలిసి వెళ్లారు!

రంగ (తలని తడుంకున్నాడు) సుబ్బారావ్!

శ్రీదేవి మిమ్మల్ని కొట్టాడటగా!

రంగ చంపడాని కొచ్చి చాతగాక ఈ విధంగా కసి తీర్చుకుపోయేడు దానికి నే చేసిన తప్పేమిటో తెలుసా? తెలుస్తే నవ్వేస్తావ్! అవునూ—ఈ వరదరాజులూ సుబ్బారావుతో చేయి కలిపాడా? బాగుంది. కుట్రకి ఉపాయం ఇక్కడే ఆలోచిస్తే బావుండిపోయేది అందర్నీ చూచినట్టయినా వుండేది నాకు.

శ్రీదేవి ఈ యింటి కెందుకొచ్చేరు.

రంగ రాకూడదా?

శ్రీదేవి పరిస్థితులు ఏం బాగోలేదు.

రంగ. ఎందుకు బాగుండవో తేల్చుకుంటానిప్పుడు. నేను నీకు దూరంగా తిరుగు తున్నా, ఈయింటి పరిస్థితులన్నీ తెలిసేయి నాకు

శ్రీదేవి మాగురించి మీరేం శ్రమ తీసుకోనక్కర్లేదు. వెళ్లిపోండి. దయచేసి త్వరగా వెళ్లిపోండి

రంగ వెళ్లను ఎందుచేతనో ఇవాళ నా పుట్టినరోజు ఇక్కడే జరుపుకోవాలని పించింది.

శ్రీదేవి ఇవాళేదో ప్రళయం జరిగేట్టుంది.

రంగ జరగదని హామీ యిచ్చేదా?

శ్రీదేవి ఇన్నాళ్లూ పరోక్షంగా కీడు చేసేరు. ఇవాళ—

రంగ చిన్నతనంలో ఒకనాడు నేను రంగులరాట్నం ఎక్కి తిరుగుతున్నప్పుడు నా చుట్టూతా తిరుగుతూన్న వొస్తువులేమిటో సరిగ్గా పోల్చలేక, వొచ్చే గావుకేకని బలవంతంగా దిగమింగి కూర్చున్నాను. రంగులరాట్నం ఆగిం తర్వాత ఇంత గాలి పీల్చుకుని సంబరపడ్డాను ఈ నాలుగేళ్లూ అదే అను భూతిని నా జీవితం పట్ల పోల్చుకోక తప్పలేదు.

శ్రీదేవి ఏమో! నా కేమిటో భయంగా వుందిప్పుడు.

రంగ పిచ్చిగా మాట్లాడకు శ్రీదేవి? నీకు భయమా!

శ్రీదేవి మా బావకి ఈ ప్రమోషనొచ్చిందగ్గర్నుంచీ మీరంటే కోపంగా వున్నాడు. మీరా ప్రమోషన్ నెందుకిచ్చేరు?

రంగ. పిచ్చిప్రశ్న!

శ్రీదేవి: అప్పట్నుంచీ, ఈ యింట్లో ఎవరికి సుఖంలేదు అపార్థలూ, అనుమానాలూ ఎక్కువై పోతున్నాయి.

రంగ ఆ అవకాశం నువ్వే యిచ్చి వుంటావ్!

శ్రీదేవి: (ఖచ్చితంగా అడిగేసింది) నిజం చెప్పండి! మీరు నన్నింకా ప్రేమిస్తున్నారా?

రంగ: ఇంకా అనుమానిస్తున్నావా?

శ్రీదేవి: అయితే ఈ వేళ మీరీ యింటికి ఎందుకొచ్చేరు?

(వీధిలో శబ్దమైంది)

రంగ: వరదరాజు లొచ్చేడు కాబోలు! ఒకసారి చూచి వొస్తావు?

(శ్రీదేవి ఖంగారుగా గుమ్మం దగ్గరికి వెళ్లి వచ్చింది.)

శ్రీదేవి: (భయంగా అన్నది) అవును. వారే వొస్తున్నారు

రంగ: అతని చేతిలో తుపాకీ గట్రా లేదుగా దానివ్వ ఫర్వాలేదు.

(వరదరాజులు గుమ్మం దగ్గరే ఆగిపోయి ఇద్దరి వేపు చూస్తుండిపోయేడు.)

రంగ. నా పుట్టినరోజు పండుగ, మా యింటికి రమ్మని ఖబురంపినా మీరు రాలేదు. అందుచేత స్వయంగా నేనే యిక్కడికి వొచ్చేను వరదరాజులూ!

(వరదరాజులు రెండడుగులు ముందుకివేసి గట్టిగా అరిచేడు.)

వర: గెటవ్‌ట్!

శ్రీదేవి: ఏమండీ!

వరద: రాక్షసి! మాటాడకు. మీరిద్దరూ వెళ్లిపోండి ముందు నన్ను చంపిన మనుషులు మీరు. వెళ్లిపోండి.

రంగ. వెళ్లకపోతే ఏం చేస్తావ్?

వరద: చంపుతాను.

రంగ: ఒకవేళ నువ్వే యిక్కడ్నుంచి వెళ్లిపోవలసి వొస్తేనో!

వరద: షటవ్. యూ ఇడియట్!

రంగ: ఫెంటాస్టిక్!

వర: ఇలా ఎందరి కొంపలు కూల్చాలని చూస్తున్నావ్? నీకెంత ధైర్యం లేకపోతె నువ్వీ యింటికొస్తావ్? సుబ్బారావు గనక నిన్ను కొట్టి వొదిలిపెట్టేడు. నీకిప్పుడు నా చేతిలో చావు తప్పదు అందికే వొచ్చేవిక్కడికి.

రంగ: ఇవాళ నా పుట్టినరోజు పండగ. చావుల సంగతి ఎత్తకు. తర్వాత అంతగా అరవకు. నా పండగ కన్నులపండగ్గా జరగాలి. తెలిసిందా? శ్రీదేవీ! ముందు మాయిద్దరికీ కాఫీ చేసి పట్టుకురా! (శ్రీదేవి లోపలికి వెళ్లిపోయింది. వరదరాజుల్నుద్దేశించే అన్నాడు) చాలాఆయాసంగావున్నావు కూర్చోముందు.

వరద: ఇది నాయిల్లు! ఇక్కడ నీ ఆజ్ఞలు పాటించవలసిన అవసరంలేదు ముందు నువ్విక్కడ్నుంచి వెళ్లిపో లేదా (కుర్చీ ఎత్తేడు. గమ్మత్తుగా నవ్వి వూరుకున్నాడు రంగనాయకులు.)

రంగ: మనిషిని కొట్టేంత నీచానికి నువ్వు దిగవు. నాకది తెలుసు. ముందా కుర్చీ దింపు.

వరద: (కుర్చీదించి, దాని మీద కూచుని, చేత్తో మొహాన్ని రుద్దుకున్నాడు)

రంగ నువ్వు—నీకు పిచ్చెత్తింది.

వరద: (రంగనాయకులు మొహం వేపు కసిగా చూసేడు.)

రంగ: నాగురించి నీకేం తెలుసో చెప్పు. వింటాను హు. నీలాటివాళ్లు ముఖ్యంగా—నీలాటి వాళ్లు వెయ్యిజన్మలు తపస్సు చేసినా నేనర్థంకాను తెలుసా? నీకు ప్రమోషనెలా వొచ్చింది? చెప్పు చూద్దాం.

వరద: శ్రీదేవి నా భార్య నా భార్యకీ నీకూ—

రంగ. సిగ్గులేదు నీకు. కానీ, నేను చాలా అభిమానంగల మనిషిని. శ్రీదేవిని ఒకప్పుడు ప్రేమించిన మాట నిజమే. అంతమాత్రం చాత ఆమె బంధువర్గాన్ని నెత్తి మీద పెట్టుకుపూజించడానికి నేనేం పిచ్చివాడి ననుకున్నావా? ఏళ్ల తరబడి చదివి, కృషి చేసి సాధించిన హోదాకి ఇలాటి పిచ్చి పనుల్తో కళంకం తెచ్చుకునేంత తెలివితక్కువ వాడినా?

వరద. కాదు. గొప్ప లౌక్యుడివి అవకాశవాదివి

రంగ. మీరంతా నా ఆకారాన్ని చూచి మోసపోయేరు సుబ్బారావు నామీద చేయి చేసుకోడానికీ, నువ్వింత ఆవేశం చెందడానికీ అదే కారణం. కానీ, వరదరాజులూ! మీరెవరూ నా మనసు చదవలేదు. అది మీకు చాతకాదు గర్వం కాదంటె నాగురించి చెప్పుకుంటాను. నామనసు నవనీత సమానం. నామాట వజ్రాయుధం. ఇది తెలీదు మీకు. మీమీద నేనెంత విసుగు చెందినా ఆఫీసు పని పరంగా మీరెంత యోగ్యులో నాకు తెలుసు. అందికే మీకు ప్రమోషనొచ్చింది తెలుసా వరదరాజులూ!

వరద: (అమాయకంగా చూసేడు)

రంగ: చూడండి. అప్పుడే మీరెంత చల్లారిపోయేరో! నాకు మనుషులమీద నమ్మకం చాలా వుంది. ఆవేశం మనిషిని మనిషిగా వుంచదు. కొంచెం ఆలోచన చేస్తే—సుబ్బారావు నన్ను కొట్టేవాడు కానేకాదు.

(కొంచెం సేపు మాట్లాడటం మానుకున్నాడు. చేతులూపుకుని అన్నాడు.)

రంగ ముఖ్యంగా మీరు నన్నో ప్రశ్న అడగాలి. మీ అనుమానం తొలగాలి నామీద నమ్మకం చావ లేదంటే నేను నిజమే చెప్తాను. చెప్పేదా వరదరాజులూ!

వరద. (తలొంచేడు.)

రంగ. ఆల్‌రైట్! నిజమే! నేనూ శ్రీదేవీ ప్రేమించుకున్నాం. పెళ్లి కూడా చేసుకుందామనుకున్నాం.

వరద యూ—

రంగ ఆగండి. ఆవేశం కూడదని ముందే చెప్పేను! ఈ కథలో బుచ్చి చోటు చేసుకునుండకపోతె మాపెళ్లి నిర్విఘ్నంగా సాగి వుండేది. బుచ్చి ఆ అవకాశాన్నివ్వలేదు.

వరద: బుచ్చి ఎవడు?

రంగ: మా చిన్నాన్న! అప్పుడే ఒక పాత్ర పరిచయం అయిపోయింది. ముఖ్యమైన పాత్ర గూడా అదే! (క్షణమాగి) వాలుగేళ్ల క్రితం వున్నట్టుండి 'నిన్ను ప్రేమించడంలేద ని శ్రీదేవి చెప్పిన్నాడు నేను ఆశ్చర్యపోయే ను! కారులూ, మేడలూ కావాలని చెప్పిన్నాడు దూషించేను. నన్ను మోసం చేశావని శ్రీదేవిని నిందించేను. చివరికి మిమ్మల్ని పెళ్లి చేసుకున్నదని తెలిసిన్నాడు మళ్ళా ఆశ్చర్యపోయేను. ఈ తిరకాసు అర్థమైందికాదు

వరద: ఇదంతా కొత్త కథ!

రంగ: కాదు నిజమైన పాతకథ పాతికేళ్ల క్రితం బుచ్చి వో నర్సుని ప్రేమించేడు. పట్టపగ్గాల్లేకుండా వాళ్లిద్దరూ కలిసి తిరిగేరు. బుచ్చికి తల్లీ తండ్రీ లేరు ఉన్నది కేవలం అన్నగారు. ఆ అన్నగారు వంశప్రతిష్ఠలకొరకు, ప్రాణత్యాగం చేయగల ధైర్యవంతులు. అందుచేతనే బుచ్చిని మందలించి నాగపూర్‌లో ఉద్యోగం వేయించి అక్కడికి పంపేరు బుచ్చి నాగపూర్ చేరక మునుపే రైల్లో ఆత్మహత్య చేసుకున్నాడు. కానీ, అతనా వేళకి తండ్రైపోయేడు ఆ నర్సు పేరు వర్ధనమ్మ! ఆ పాపాయి పేరు శ్రీదేవి! శ్రీదేవి నా చెల్లెలు వరదరాజులూ! చెల్లెలు.

**వరద:** (గబిక్కున లేచి నించున్నాడు) నేనన్నమ్మను. ఇదంతా కట్టుకథ. గౌరీపతి గారు వర్ధనమ్మత్తయ్య భర్త! ఆయన గొప్ప సంఘసేవకుడు.

**రంగ:** కనకనే—వర్ధనమ్మ నాదరించి, తన భార్యగా లోకానికి పరిచయం చేయగలిగారు వర్ధనమ్మకి నవజీవనం ప్రసాదించేరు! ఈ కథ వర్ధనమ్మకీ, శ్రీదేవికీ, మానాన్నగారికీ తెలుసు తెలిసి నేను శ్రీదేవిని ప్రేమించేను. శ్రీదేవి వివరాలు కనుక్కున్న మానాన్న చిన్ననాటకం ఆడి మా పెళ్లి తెలివిగా ఆపగలిగేరు

(ఆవేళకి శ్రీదేవి కాఫీ తీసుకొచ్చినించుంది. ఆమె కళ్లల్లో ఆనందం తొణికిసలాడింది.)

**శ్రీదేవి:** అన్నయ్యా!

**రంగ:** విన్నావా వరదరాజులూ! ముందు కాఫీ తాగు.

(ఒకటి తను తీసుకుని, రెండో కప్పు వరదరాజులి కిచ్చేడు. తను తీసుకున్న కాఫీ కప్పుతో గోడ అంచుకి వెళ్ళిపోయి, మాటాడుతూనే ఆ కప్పులో ఏదో కలుపుకున్నాడు. జేబులోంచి ఓ కాగితం చేతిలో పెట్టుకున్నాడు.)

**రంగ:** మార్చి ఇరవైరెండు మంగళవారం 1966 సాయంత్రం అయిదున్నరికి జరిగిన ముఖ్యఘట్టం. ఒక అమాయకుడికి నిజం తెలిసిన రోజు. ఆనిజం వెనక ప్రాణంలాటి వంశప్రతిష్ఠలు కాఫీ చుక్క ఒక్కటి నీ గొంతులో పోసుకో వరదరాజులూ! కొంచెం ఉత్సాహంగా వుంటుంది శ్రీదేవి ముందు రంగనాయకులు ఓడిపోయిన వైనం, ఓడిపోయిన తర్వాత లతన్ని మింగే అభిమానం చేసిన తమాషా, కథ తెలిసి పశ్చాత్తాపపడిన వరదరాజులి యొక్క మానసిక సంచలనం, ఆ సంచలనం చూచి శ్రీదేవి ఆనందించబోయే క్షణం, నేతాగబోయే కాఫీ చుక్కతో ప్రారంభమవుతుంది

(కాఫీ తాగేడు. వొచ్చి కూర్చున్నాడు. బైట కారాగింది.)

వెళ్ళు వరదరాజులూ! నా పుట్టిన్రోజు పండక్కి ముఖ్యమైన అతిథి మా నాన్నగారు వొచ్చేరు! ఈ ఇంటి కామందువి నువ్వు! ఆయన్ని సాదరంగా ఆహ్వానించు. నీ మనసులోని మేఘాలు విడిపోయాయని చెప్పు విని సంతోషిస్తాను. ఇష్టం లేనిపెళ్లి ఈ జన్మలో చేసుకోనని నా తరపున మా నాన్నగార్కి నువ్వుగూడా నొక్కి మరీ చెప్పు. వెళ్లండి' ఆయనకి స్వాగతం చెప్పండి

(వరదరాజులూ, శ్రీదేవీ యిద్దరూ గుమ్మం దగ్గిరికెళ్లి నించున్నారు. రాజశేఖరం, గోపీ వొచ్చేరు. రాజశేఖరం వస్తూనే అన్నాడు.)

**రాజ** నీ పుట్టిన్రోజెమిట్రా! ఉంగారంగా వైరివ్వడ మేమిటి? పైగా అంకంత ఇల్లు అక్కడ పెట్టుకుని ఇక్కడికి రావడమేమిటి? మాటాడకు—నేనన్న దానికి జవాబు చెప్పంతే!

**గోపి** (రంగనాయకులు దగ్గిరికి వొస్తూ) ఇదేమిటి సార్! మరి నాతో పుట్టిన్రోజు పండగని చెప్పేరే సార్! ఒలేవారే మీరు సార్

(గోపికి అనుమానం వచ్చింది. రంగనాయకుల్ని పట్టుకు చూచి మెల్లిగా 'సార'ని పిలిచేడు. రంగనాయకుల్లో కదలిక లేదుగాని, అతని చేతిలోని కాగితమ్ముక్క గోపిని ఆకర్షించింది. ఆత్రంగా తీసి చదివేడు.)

**గోపి** "ఇది ఆత్మహత్య! ఇందులో ఎవరి ప్రమేయమూ లేదు రంగనాయకులు' సార్! ఇదేమిటి సార్ సన్నమ్మను సార్! సార్.

(అందరూ ఒక్కసారి ఉలిక్కిపడి రంగనాయకుల చూట్టూతా చేరేరు. ఆ క్షణంలో ఎవరికీ నోట మాట రాలేదు.)

# భ్రాంతి

## శ్రీ శివ శంకర శాస్త్రి

1

సుబ్బరాయ శాస్త్రిగారు,
చూడగానె రాచఠీవి—
తోడ గానబడెడివారు,
దొడ్డవారు; సంస్కృతాంధ్ర
విద్వాంసులె కాక బ్రహ్మ—
వేత్త లనెడి ఖ్యాతి కలదు.
మా కెల్లర కాయనయెడ
మహిత భక్తితోడ ప్రీతి.

వేదాంతార్థము లాయన
వివరించుచు నున్నప్పుడు
వ్యాసులవారె అవతరించి
వచ్చినట్లు తోచుచుండు.

జగత్తు విషయమున రజ్జు—
సర్పభ్రాంతి కలుగుచుండు
ననియు, శివస్సత్యమ్మని,
అన్యమ జగదాదికంబు
కేవలమ్ము మిథ్య యనియు
భావించుచు నుండువారు
కలానిధులు నేతి వంశ—
కలశాంబుధియందు వారు.
మా నాయనగారి కెటులో
మేనల్లుని వరుస వారు.
తమ దుహితను నా కొసంగి
త్వరలోనే పరిణయంబు
చేయుటకై సంకల్పము
చేసియున్నవా రగుటను,
అచ్చట నే నాంగ్ల విద్య
అభ్యాసము చేయుచుంటి.

2

అనుములవారి పెద్దయింట
అందరమును నివసింతుము.
ప్రాకారము కలదు నాల్గు—
పక్కలయం, దంగణంబు

విశాలంబు, నలు దిక్కుల
వివిధ తరులు కుంజంబులు,
మొలిచియుండు రకరకముల
మొక్క లెన్నొ మిక్కుటముగ.

అప్పుడపుడు పెరటిలోన
అగపడుచుండును సర్పము.
పశ్చిమ దిక్కున చిక్కగ
పట్టియున్న గడ్డినుండి
పాకుచు నరుదెంచు పాము
భవంతిలోని కెన్నిసార్లో.
బలగ మధిక మింటిలోన:
పక్కలు, మంచములు, చాప—
చుట్టలు, బల్లలు, కుర్చీ
లిట్టట్టులు కానవచ్చు.

**3**

ఒక్కనాటి సాయంత్రము
పక్కలు వేసెడి వేళకు
మామగారి దుహిత వచ్చి
మంచముపై పరపుచుట్ట
పరచి పెట్టుమని కోరగ,
చిరునగవున లేచి నేను
గది గొళ్ళెము తీసి, లోన
కాలిడినంతనె లోపల
చుట్ట చుట్టుకొన్న పాము
కళ్ళెదుటం గానవచ్చె.

“పామువోలె గానిపించు—
పద, పద యిటనుండి యనుచు
పంపివేసి యామెను, నే
తలుపుమూసి దూరముగా
తొలగిపోయి నిలిచియుంటి.

**4**

ఇంతలోనె మామగారు
ఏగుదెంచి దీపికతో
తెరచి తలుపు భద్రముగా,
దీపికతో పరిశీలన
కావించుచు, “అది రజ్జువు,
కాదు సర్ప”మని తేల్చిరి.

సంభ్రమమ్ము తొలగె నాకు.
శ్వశురమహాశయులు పిదప

ఇట్లు అనిరి: "రజ్జు వేదొ
ఏది సర్పమో చూడక
ఆరోపణ చేసినావు
అన్యోన్య పదార్థములకు."

"చీకటి మందముగ నుంట—
చేత భ్రాంతి కలిగె నాకు—
అదియుగాక సర్పంబిట
కప్పుడపుడు వచ్చుగదా!"
అని మృదువుగ నే నంటిని.

అపుడు శ్వశుర మహాశయులు
"నీవు భ్రాంతిపడినావా
నిజముగ? వృద్ధులతోడను
చమత్కారమా?" యనుచును
వదనములోని కరిగినారు.

5

కూరుచుంటి నావల నే
కుర్చీలో మౌనముగా.
శ్వశుర దుహిత మరలవచ్చి
వాలకమ్ము కనుంగొనుచు—
తనకు నేను భర్త నగుదు
నని బాలిక యెరుగదపుడు—
"గువ్వవోలె మౌనముగా
కూరుచుంటి వెందులకో!
నను జూచియు పలకరింప"
వని యడిగెను మందముగా.

"విన్నావా నాన్నగారు
అన్నమాట? పెద్దలతో
చమత్కారమాడుదునని
సందేహము వెలిబుచ్చిరి.
ఆదరానురాగంబులె
అన్ని వేళలందు నాకు
పెద్దలయెడ" నే ననగా,
పిల్ల అందుకొనియె నిట్లు:

"పాపము! నీ కేమి తెలియు?
పరియాచక మేమున్నది?
ఉన్నది ఉన్నట్టు నేను
నాన్నగారితో చెప్పెద!"
అని ముందరి కడుగు వేయు
నామె నాపి, మామగారి

ముద్దుల బిడ్డవు నీవని
ముద్దు పెట్టుకొని పంపితి.

*   *   *

మామగారు బ్రహ్మణ్యులు :)
మాట లెట్లు వారు పల్క,
సత్యంబే స్ఫురియించును.
జగత్తు విషయమున రజ్జు
సర్పభ్రాంతి నిత్యంబే.
అతస్మిన్ తద్వస్తువు
నారోపణ చేయుటచే
భ్రాంతి మూలకమ్ము సృష్టి
ప్రతీయమానమ్మె కదా!
అప్పుడపుడు తలచుకొన్న
ఆశ్చర్యము కలుగుచుండు:
ఉన్నది ఉన్నట్టు తెలుప
నొల్లరు విద్వాంసులైన.
శాస్త్ర ప్రవచనములో
సమ్మతమే భ్రాంతి యన్న.
కాని జగద్వ్యవృత్తమందు
గ్రహియింపరు భ్రాంతి లీల!



# ఎగ్జిస్టెన్షలిజం

## శ్రీ సంజీవదేవ్

ఇదుగో ఇక్కడ గులాబీ పూవుంది.

ఉన్నట్లు రుజు వేమిటి ?

ఇదుగో దానిరూపం కంటికి కనిపిస్తూంది.

దాన్ని గోటితో మీటితే దాని ధ్వని చెవికి వినిపిస్తూంది.

దాని సుగంధం ముక్కుకు తగులుతూంది.

దాన్ని తాకితే దాని స్పర్శ తగులుతూంది చేతికి.

ఇంకా దాని దళాన్ని కొరికితే దాని వగరైన తీపి నాలుకకు తడుతూంది.

అంటే యీ గుణాలన్నీ ఉన్నవి కనుక యిక్కడ గులాబీ పూవుందని రుజువవుతూంది.

ఎగ్జిస్టెన్షలిజం దీన్ని అంగీకరించదు. ఈ గుణాలన్నీ వున్నందున గులాబీ పూవు లేదు, గులాబీపూవు ఉన్నందువల్లనే యీ గుణాలన్నీ ఉన్నవి అంటుంది ఎగ్జిస్టెన్షలిజం.

'ఉండటం' అనేది లేనప్పుడు ఇంకా ఆ గులాబీకి రూపం ధ్వని, సుగంధం, స్పర్శ, రుచి ఇవన్నీ ఎక్కడుంటవి కనుక ? ఏదైనా ఉంటేనేగా మిగతావన్నీ దాన్ని అంటిపెట్టుక ఉండేది !

కనుక సృష్టిలో ప్రధానమైంది 'ఉండటం' (Existence). లేంది సృష్టి ఎట్లా అవుతుంది ?

అందుకే 'ఉండటమే' సర్వస్వం అంటుంది ఎగ్జిస్టెన్షలిజం.

మానవుడికి ఆలోచన ఉంది అనుభూతి ఉంది, దుఃఖం ఉంది సుఖం ఉంది విద్య ఉంది, అవిద్య ఉంది. కాని ఇవి ఉన్నందు వల్ల మానవు డున్నాడని కాదు, మానవు డున్నాడు కనుకనే యివన్నీ ఉన్నవని.

డికార్టె అంటాడు "Cogito ergo sum" (నేను ఆలోచిస్తున్నాను కనుక నేను ఉన్నాను) అని. కాని ఎగ్జిస్టెన్షలిజానికి జన్మదాత అయిన బ్లెయిజ్ పాస్కల్ అంటాడు దానికి విరుద్ధంగా "నేను ఉన్నాను కనుక నేను ఆలోచిస్తున్నాను" అని. పాస్కల్, డికార్టె సమకాలికులే ఒకవిధంగా. పాస్కల్ 1623 లో జన్మించి 1662 లో మరణించాడు డికార్టె 1596 లో జన్మించి 1650 లో మరణించాడు. డికార్టె తాత్విక దృక్పథంలో బుద్ధి (intellect) ప్రధానమైతే పాస్కల్ దృక్పథంలో బోధి (Intuition)[1] ప్రధానం. మొదటిది వస్తుగత హేతువాదం; రెండవది వ్యక్తిగత మర్మవాదం.

క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దానికి ముందు పాశ్చాత్య తత్వశాస్త్రం ప్రధానంగా మతంతోనే సంబద్ధమై ఉండేది. మతాన్నుంచి వేరై తత్వశాస్త్రం అప్పటి ప్రత్యేక వస్తుగత శాస్త్రంగా వ్యక్తం కాలేదు. మొదటిగా ఆరవ శతాబ్దం (క్రీ. పూ.) లో థేల్స్ అనే ఆయన ద్వారా గ్రీక్ తత్వశాస్త్రం ఉత్పన్నమైంది. ఆయనే మతం నుంచి తత్వశాస్త్రాన్ని విడదీశాడు. ఇది తర్వాత కొంతకాలానికి అరిస్టాటిల్ చేతుల్లో తర్కశాస్త్రంతో సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకొంది. అప్పుడప్పుడు ప్లోటినస్ లాంటి క్రైస్తవ మర్మసాధకుల ద్వారా పాశ్చాత్య తత్వశాస్త్రం తిరిగి మతంతో సంబంధం ఏర్పరచుకొంటూ వచ్చినా కూడ అది ప్రధానంగా మతంతో సంబంధం లేని బుద్ధివాదంగానే ఉండిపోయింది.

బ్లెయిజ్ పాస్కల్ తన ఎగ్జిస్టెన్షలిజం రూపం ద్వారా పాశ్చాత్య తత్వశాస్త్రాన్ని క్రైస్తవమతంతో అనుబద్ధ పరచాడు. ఆయన గొప్ప గణిత శాస్త్రజ్ఞుడూ, వైజ్ఞానికుడూ అయినప్పటికీ మానవుని అస్తిత్వానికీ సంబంధించిన సమస్యలు ఆయన్ను ఎక్కువగా ఆకర్షించినవి. సాంప్రదాయికమైన క్రైస్తవమతం మొదట ఆయనకూ సంతృప్తి యివ్వలేకపోయింది. అందుకే మానవుని మౌలిక అస్తిత్వానికి సంబంధించిన అనుభూతుల వైపు మొగ్గ కలిగింది పాస్కల్ అంటాడు :

"When I consider the tiny span of my life, which is swallowed up in the eternity which precedes and follows it, when I consider the tiny space that I occupy and can even see, lost as I am in the infinite immensity of Space which I know nothing about and which knows nothing about me, I am terrified and marvel to find myself here rather than there, for there is no reason at all why "here" rather than "there," and why "now" rather than "then" Who put me there? By whose command and under whose direction were this time and this place destined for me?"

---

1. Intuition అనే దానికి 'బోధి' అనే భారతీయ పదాన్ని ఉపయోగించటంలో స్వర్గీయ హీరేంద్రనాథదత్తుగారికి నేను ఋణపడి ఉన్నాను. బెంగాలీలో ఆయన "బుద్ధి ఒ బోధి" అనే పుస్తకం రచించారు.

"జీవితానికి ముందు వెనుకల నడుస్తూన్న అనంతకాలంలో మ్రింగబడి ఉన్న యీ నా జీవితపు అల్ప కాలాన్ని గురించి ఆలోచించి నపుడూ, నేను ఎరగనట్టీ నన్ను ఎరగనట్టీ అనంత ప్రదేశంలో మునిగిపోయిన నేను ఆక్రమించుకొని చూస్తూన్న యీ అల్ప ప్రదేశాన్ని గురించి నేను ఆలోచించినపుడూ, భయపడుతూ ఆశ్చర్యపోతుంటాను ఎందుకు నేను అక్కడ కాక ఇక్కడ ఉన్నానా అని; "అక్కడ" అనే దానికంటే "ఇక్కడ" అనేదీ, "అప్పుడు" అనే దానికంటే "ఇప్పుడు" అనేదీ ఉండటానికి కారణం ఏమిటా అని ! నన్ను అక్కడ ఎవరుంచారు ? ఎవరి ఆజ్ఞవల్ల, ఎవరి దర్శకత్వం క్రింద యీ కాలమూ దేశమూ నా నిమిత్తం ఏర్పడినవి ?"

అయితే, తరువాత ఒక నీటి ప్రమాదంలో మునిగి పోతూన్న పాస్కల్ రక్షించబడటంతో ఆయన జీవితంలో గొప్ప పరివర్తన సంభవించింది. ఈ ఘటనమూలంగా పాస్కల్ క్రైస్తవ మార్మికుడుగా రూపాంతరం చెందాడు. బుద్ధికంటే హృదయమే ప్రాధాన్యాన్ని అందుకొంది ఆయన ఎగ్జిస్టెన్షలిజంలో.

క్రైస్తవ ఆస్తిక ఎగ్జిస్టెన్షలిజం అనీ నాస్తిక ఎగ్జిస్టెన్షలిజం అనీ రెండు పరస్పర విరుద్ధ విభాగాలు ఏర్పడి పోయినవి యీ నవ్యతత్వశాస్త్రంలో.

పాస్కల్ అనంతరం డెన్మార్క్ దేశస్థుడైన సోరెన్ కీర్కిగార్డ్ (1813—1855) అనే తాత్వికుడు ప్రధాన పాత్ర అవలంబించాడు. నిజానికి ఎగ్జిస్టెన్షలిజం అనే పేరు ఈయన సృష్టించిందే. అసలైన అర్థంలో ఎగ్జిస్టెన్షలిజం అనే దానికి కీర్కిగార్డ్‌యే స్థాపకుడు. పాస్కల్ క్యాథలిక్ అయితే కీర్కిగార్డ్ ప్రొటెస్టెంట్. తన తార్కికశక్తినంతా మతానికీ, ప్రభుత్వానికీ, సంఘానికీ, ఆచారాలకూ, సంప్రదాయాలకూ వీటన్నిటికీ విరుద్ధంగా ఉపయోగించాడు. అంతేకాదు మానవతావాదం, బుద్ధివాదం మొదలైన వాటిని కూడ వ్యతిరేకించాడు. ఒక టేమిటి, మానవాత్మ స్వేచ్ఛకు బంధన అని తట్టిన దాన్నల్లా వ్యతిరేకించాడు.

మతం అనేది ఒక వ్యక్తిగత విషయంగా ఉండాలసిందే కాని అది మతగురువులకూ ప్రభుత్వానికీ చెందిందిగా ఉండకూడదని ఆయన వాదం. ఒక క్రమబద్ధరీతి అనేది పనికిరాదంటాడు డికార్టేకు చెందిన క్రమబద్ధరీతిని పాస్కల్ ఎదిరిస్తే హెగెల్‌కు చెందినరీతిని కీర్కిగార్డ్ ఎదిరించాడు. సంపూర్ణ ఆధ్యాత్మిక స్వేచ్ఛను పొందాలంటే చుట్టూ ఉన్న వివిధాలైన సాంప్రదాయిక బంధనాల్ని వదిలించుకోవా లన్నాడు.

జీవితంలో వస్తుగతసత్యంమీద ఆధారపడితే బాధ తప్పదు కనుక వ్యక్తిగతసత్యమే ఉత్తమమైందంటాడు. వస్తుగత రీతిమానవుని బానిసగా చేసివేస్తుంది. అయినప్పటికీ పాశ్చాత్య తత్వశాస్త్రం ప్రారంభంనుండీ వస్తుగతరీతితో సంబద్ధమైయేవుంది. కీర్కిగార్డ్ ఈ విధానాన్ని మార్చి వ్యక్తిగతరీతికి ప్రాధాన్యాన్ని ప్రసాదించ ప్రయత్నించాడు. సృష్టిలోని పరమ లక్ష్యం మానవుడు మాత్రమే, విశ్వజీవితంలో మానవ జీవితం మాత్రమే సర్వస్వం అనే మానవతావాదాన్ని ఎదిరించి దైవత్వానికి ప్రాధాన్యం ఇచ్చాడు.

పాస్కల్ చేతుల్లోనూ, కీర్కిగార్డ్ చేతుల్లోనూ ఎగ్జిస్టెన్షలిజం అనేది క్రైస్తవమతానికి మరో పేరుమాత్రంగానే నిలచిపోయింది ఈ దృక్పథాన్ని త్రిప్ప ప్రయత్నించాడు ఫ్రెడరిక్ నీత్చే (1844—1900). ఈయన పూర్ణంగా ఎగ్జిస్టెన్షలిస్ట్ తాత్వికుల్లో లెక్కకాకపోయినాకూడ ఈయన తాత్విక చింతనలో చాలా భాగం ఎగ్జిస్టెన్షలిస్టు ధోరణిలోనే ఉండి పరోక్షంగా ఎగ్జిస్టెన్షలిస్టు వాదానికి ఎంతో దోహదం చేశాడు.

నీత్చే రచనల్లో అసంబద్ధ ఆలోచనా స్రవంతి, పరస్పర విరుద్ధభావాలూ ఎక్కువ. ఈయనలో తాత్వికునికంటే కళాకారుని భాగమే అధికం. ఏ అంగీకృత సిద్ధాంతానికీ లోబడి ఉండడు. క్రైస్తవ సిద్ధాంతాలను విమర్శించాడు. సాంప్రదాయిక పంథాలో నీతి అనే పేరుతో వస్తున్న దాన్ని ఈయన అంగీకరించడు ఇటు వంటి కరుడుకట్టిన, బూజుపట్టిన నీతిజాలంనుండి బయట పడితేనేకాని వ్యక్తి ఆధ్యాత్మిక శిఖరాన్ని అందుకోజాలడంటాడు.

ఈయన దృష్టిలో హేతువాదం అంత ప్రధానమైందికాదు. బుద్ధి సత్యాన్ని గుప్తపరుస్తుందేకాని వ్యక్తపరచదనీ, బోధి (Intuition) మాత్రమే సత్యాన్నిసమగ్రంగా వ్యక్తపరచగలదనీ-ఈయన విశ్వాసం. మానవుడు మానవత్వాన్ని దాటకలిగితేనేకాని నిజమైన మానవుడు కాజాలడు. జీవితంలో జ్ఞానానికంటే ఆనందమే ప్రధాన మంటాడు. తెలుసుకోటంకంటే జీవించటమే ప్రధానమని. సృష్టిలో మార్పు అనేది ఉత్తమ సత్యం అందుకే ఆయన అంటాడు. "It is with thinkers as with snakes those that cannot shed their skins die". ఆలోచనాశీలురూ, పాములూ ఉభయులస్థితీ ఒకటే; తమ చర్మాలను విడవనివి జీవించవు. పాములు కుబుసాల్ని విసర్జించినట్లుగానే ఆలోచనాశీలురు పాత ఆలోచనలను విసర్జించుచుండాలని.

ఇక ఆధునిక ఎగ్జిస్టెన్షలిజం. ఇంతకుముందున్న ఎగ్జిస్టెన్షలిజం ఒకవిధంగా ఆస్తికమైనది. ఇక ఇక్కడనుండి కనుపించేది నాస్తిక ఎగ్జిస్టెన్షలిజం ఇది కారల్ జాస్పర్సుతో ప్రారంభిస్తుంది. ఆయన 1883 లో జన్మించాడు. కీర్కిగార్డు "Existenz" అనే పదాన్ని ప్రసాదిస్తే జాస్పర్సు దాన్నిక్రింది విధంగా విశదపరచాడు. మానవుడు తన పరిసరాలనుండి స్వతంత్రుడుగా తనకు తానుగా జీవించగలడు. ఇందుకు తన పూర్ణ శక్తులను ప్రత్యక్షంగా తెలుసుకోవాలి. వ్యుత్పత్తి శాస్త్రరీత్యా కూడ ex-sistet అనగా బయటికివచ్చి నిలచుట అని అర్థం. అంటే అస్తిత్వం (existence) అంటే తన చుట్టూ పరిసరాలతో కాని తనకు వెనకున్న పృష్ఠ భూమితోకాని కలిసిపోక వాటి నుండి విడబడి స్వతంత్రంగా బయట నిలవటం అని. దీనికి వ్యతిరేక పదం "Da sein". దీని అర్థం ఒక నిర్ణీతమైన పరిస్థితిలో, దేశకాలాలతో చుట్టబడిన ఒక నిబద్ధ అవస్థలో ఇమిడిపోవటం. మొదటిది మానవుని స్వాతంత్ర్యాన్ని తెలుపుతుంది, రెండవది మానవుని బానిసత్వాన్ని తెలుపుతుంది.

కనుక నిజమైన అస్తిత్వం అంటే పరిస్థితిని అధిగమించటమే. కనుక ఎగ్జిస్టెన్షలిజం అంటే పరిసర ప్రభావాలకు లొంగక మానవుడు తన స్వీయ సత్తామీద ఆధారపడి జీవించటం అని జాస్పర్సు విశదీకరించాడు.

జాస్పర్సు "The Philosophy of Descartes" అనే ఒక గ్రంథం రచించాడు. అందులో ఎగ్జిస్టెన్షలిస్టు వాదానికీ డికార్టె బుద్ధివాదానికీవున్న తారతమ్యాన్ని విశదీకరిస్తాడు. డికార్టె దృష్టిలో జీవిత మనేది పరిష్కృతం కావలసిన ఒక సమస్య మాత్రమేకాని అనుభవించతగిన ఒక సత్యంకాదు. ఈ ఆధారంతో జాస్పర్సు ఫినామెనలాజికల్ విధానాన్నుండి ఎగ్జిస్టెన్షలిస్టు దృక్పథాన్ని వేరుచేసి చూపుతాడు. మొదటిదాని వైఖరి బయట నుండి పరిశీలించే ఒక సాక్షి లేక పరిశీలకునిది; రెండవది అస్తిత్వ సత్యంలో భాగస్వామిలాంటిది. ఈ అస్తిత్వసత్యం గులాబీలపాన్పు కాదు, ఎన్నో అపాయ్యాలకు, వ్యతిరేకతలకు బాధలకు, వ్యధలకు తీరని సమస్యలకు **అది నిలయం.**

అస్తిత్వపు మూలంలో ఐక్యపరచబడలేనిపరస్పర వైరుధ్యాలు, సరికాలేని వ్యతిరేకతలు, సమన్వయపరచజాలని ద్వంద్వాలు ఎన్నో ఉన్నవి. ఆశతో కూడిన నిరాశలు, బంధనతో కూడిన స్వేచ్ఛలు, బాధతో కూడిన సుఖాలు, ఋణాలతో కూడిన సంపదలు, అజ్ఞాన మిళితమైన జ్ఞానం, మరణంతో కూడిన జీవనం, ఈవిధంగా ఎన్నో. ఈ ద్వంద్వాలు లేకపోతే అస్తిత్వమేలేదు. ఈ వ్యతిరేకతల బిగింపులమధ్య తలెత్తే ప్రధాన అనుభూతి బాధ. పాస్కల్‌నుండిసార్త్రే వరకూ ఈ సంప్రదాయపు ప్రతిసభ్యునిలోను ఈ బాధ అనేది ఒక విశిష్ట లక్షణంగా వస్తూనే ఉన్నది పాస్కల్, కీర్కిగార్డులు ఈ బాధను భగవంతునినుండి వియోగం కలిగిన మూలంగా ఉత్పన్నమైన బాధగా భావించారు.

మానవుడు ఉన్నత ఆధ్యాత్మిక జీవితాన్ని అందుకొనే ఆదర్శంలో పైకి ప్రాకుతూంటే ప్రాపంచికమైన అనేక అడ్డంకులు అతన్ని క్రిందికి లాగుతూంటవి. స్వేచ్ఛ వ్యక్తిగతం అయితే బంధన వస్తుగతం. అసలు వస్తుగత సత్యం అనేది సంపూర్ణ వస్తుగతం కానేరదు. అదేవిధంగా వ్యక్తిగత అనుభవం కూడ కొంత వస్తుగత సత్యంమీద ఆధారపడే ఉంటుంది. కనుక వస్తుగత వ్యక్తిగతాలు పరస్పర సంబద్ధాలు. అందుకే జాస్పర్సు అంటాడు "నేను ఈ ప్రపంచంలో నివసించటంలేదు. నా ప్రపంచంలో నివసిస్తున్నాను" అని. అంటే ప్రతి వ్యక్తి వస్తుగత ప్రపంచంలో జీవిస్తున్నప్పటికీ అందరికీ ప్రపంచం ఒకటిగానే గోచరించదు. ఎవరి స్వంత ప్రపంచం వారిదే.

జాస్పర్సుదృష్టిలో అస్తిత్వం అనేది అటు వస్తుగతానికీ ఇటు వ్యక్తిగతానికీవున్న మధ్యమార్గంగుండా పయనిస్తున్నది. వస్తుగతంద్వారా సుదృఢమైన స్థిరత్వాన్ని అందుకొని వ్యక్తిగతం ద్వారా అస్తిత్వపు లోతుల్ని గాలిస్తుంది. దీన్నే జాస్పరు, "ipse-ness" అంటాడు; అంటే ప్రపంచంతో ఒకటి కావటం అని. కేవల వ్యక్తిగతం అనేది ప్రపంచానికి దూరంగా తలుపులు మూసుక కూర్చుంటుంది; తాను తనలోనే బందీ. ఇందులో 'స్వ' అనేది కేంద్రీకృతమై గడ్డ కడుతుంది. దీన్నించి వెలువడే ఫలితం బాధ. ఈ బాధనుండి రక్షింపబడటం అంటే కేంద్రీకృతమైన తన 'స్వ' అనేదాన్ని వికేంద్రీకరించటం, అంటే తన గుప్త చైతన్యాన్ని వ్యక్తపరచటం.

జాస్పర్సు ఎంత తీవ్ర భావాలుగల మనిషో అంత మిత దృష్టిగల వ్యక్తి కూడ. రెండు వ్యతిరేకతలమధ్య సులభంగా రాజీ అవుతాడు. అస్తిత్వపు అంతిమ వ్యతిరేకతను ఆయన పగలూ రాత్రికీ వున్న గుణాలతో పోల్చిచూపుతాడు. పగలూ రాత్రీ అనేవి ఒకదాని కొకటి బంధింపబడి ఉంటవి. పగలు అనేది మనకు జీవన శక్తి నిస్తుంది, విశద రూపాల్ని చూపుతుంది సామంజస్యాన్నీ, హేతువునూ ప్రసాదిస్తుంది. ఈ ప్రపంచంలో ఏదో కొంత పని చేయమని అది ప్రోద్బలపరుస్తుంది. అంటే పగలు అనేది నిర్మాణాత్మకం అని. ఇక రాత్రి అనేది ఉన్న వ్యవస్థనంతా తారుమారుచేసి మననంతా చీకటి గుయారంలో చిందులాడించి, వ్యక్త ప్రపంచాన్నంతా దాచివేసి, జీవితాల్లోని కర్మణ్యశక్తిని నిస్తేజపరచి నిద్ర మత్తుని సృష్టించి మానవుని మృతప్రాయునిగా చేస్తుంది ఈ అర్థంలో పగలు అనేది నిర్మాణాత్మకమైందనీ, రాత్రి అనేది నిర్మూలనాత్మకమైంది అనీ; పగలు అనేది జీవనం, రాత్రి అనేది మరణం.

ఈ రెంటి ధర్మాల్లో ఇంత వ్యతిరేకత ఉన్నా కూడ జాస్పర్సు పగటిని భూషించనూలేదు, రాత్రిని దూషించనూలేదు! జీవితానికి ఈ రెండు దశలూ సమానంగా అవసరమే నన్నాడు. అస్తిత్వంలో సంపూర్ణత అనేదే ఉండదు. ప్రతి వ్యతిరేకతా ఒక అసంపూర్ణతే. వ్యతిరేకతలు ఏకం కావటం అంటే అసంపూర్ణతలు, ఒకటి కావటమే. అసంపూర్ణతల ఐక్యతే సంపూర్ణత. పగలూరాత్రుల వ్యతిరేక ధర్మాలే అస్తిత్వపు సమరస ధర్మం!

కీర్క్‌గార్డ్ భావాలకు జాస్పర్స్ ఒక నిర్మిత రీతిని ఏర్పరచాడు. ఆ రీతికి పూర్ణాకృతి నివ్వ ప్రయత్నించాడు 1889 లో జన్మించిన మార్టిన్ హిడిగర్. జాస్పర్సు వేరు వేరు అస్తిత్వాల అనుభవాన్ని గురించి కృషి చేస్తే హిడిగర్ సామూహిక అస్తిత్వాన్ని విశదపరచసాగేడు దీన్ని సంభవంగా తలంచలేదు జాస్పర్సు. కీర్క్‌గార్డ్, జాస్పర్సు తత్వాలనుండి తన తత్వాన్ని ప్రత్యేకంగా చూపడానికని హిడిగర్ తన తత్వానికి సూపర్ ఎగ్జిస్టెన్షలిజం అని నామకరణం చేసుకొన్నాడు. తనకు వెనుక వారి ఎగ్జిస్టెన్షలిజం కంటే తనిది చాలా విశాలభావం గలది అని ప్రకటించాడు. ఆయన దృష్టిలో ఆధ్యాత్మికతకంటే అస్తిత్వం ప్రధానమైంది. అస్తిత్వమూ ఆధ్యాత్మికతా కీర్క్‌గార్డ్, జాస్పర్సు చెప్పినట్లు ఒకటే అని వప్పుకోటానికి ఆయన తిరస్కరించాడు అయినప్పటికీ తన రచనల్లో ఆయన ఆధ్యాత్మిక పదాలవంటి పదాలను అతి జాగ్రత్తగా, తన్ను ఇతర్లు ఆధ్యాత్మికుడని భావించటానికి వీలులేకుండా ఉపయోగించాడు. జర్మన్ తాత్విక విశ్లేషణకు చెందిన హ్యూసెల్‌కు హిడిగర్ అనుయాయి అయినప్పటికీ తన రీతిని మరోరూపంలో మలిచాడు

అస్తిత్వాన్ని దూరంగా, నిర్లిప్తంగా, వ్యక్తిగతంకాని పద్ధతిలో నిలచి పరిశీలించవచ్చునంటాడు హ్యూసెల్. కాని హీడిగర్ అది వప్పుకోడు. అస్తిత్వాన్ని పరిశీలించటానికి అందులోకి దిగి సన్నిహిత సంబంధంతో సంచరించాలసిందే నంటాడు. హేతువాదుల తటస్థ విధానపుబుద్ధిని కాక, అస్తిత్వవాదుల తీవ్రవిధానపు బుద్ధినే ఆయన స్వీకరిస్తాడు.

ఆయనంటాడు, చైతన్య ద్వారాలను దాటజాలని కొన్ని అతి సూక్ష్మ సత్యాలు మనమీద ప్రభావాలను వేస్తుంటవి వీటిని మనం గ్రహిస్తాంకాని ఈ గ్రహించటం అనేది మామూలుగా గ్రహించే దానికంటే వేరు. ఇవి మౌలిక సంవేదనల (**Fundamental sensations**) ద్వారా మాత్రమే వ్యక్తమవుతయి. ఈవిధంగా మనం ప్రపంచంలోని మన స్థానాన్ని గుర్తించగలం. ఈ రూపంలో మన ప్రతిచిన్న కదలికకూ దారి చూపే అస్తిత్వాన్ని మనం స్థూలంగా గ్రహిస్తాం. దీన్ని మనం జీవిస్తాం, కాని విశదరూపంలో మాత్రం దీన్ని అర్థం చేసుకోజాలం.

ఈ భూమిమీద మానవుడు స్వతంత్రజీవికాని తన శరీరమూ, వ్యక్తిత్వమూ అనే అడ్డంకులకు కట్టుబడి ఉన్నాడు.

కాని మానవుడు తన పరిమితాలను తాను గుర్తించాలి. కారణం, తన పరిమిత శక్తులే తన అపరిమిత స్వేచ్ఛకు సోపానాలు. అస్తిత్వాని కొక స్థూల దశ ఉన్నది, దీన్ని హిడిగర్ Seinde'' అంటాడు. ఇది పూర్తిగా ఒక మార్పులేని స్థిర రూపంతాల్చిన దశ. ఈ దశలోవున్న మానవుడు ఒక వస్తువుతో సమానమేకాని జీవితో సమానంకాడు. ఇక దీనికి వ్యతిరేకంగా అస్తిత్వపు సూక్ష్మ దశ మరొక టున్నది దీన్ని "Project" అన్నాడు ఇది అస్తిత్వపు భవిష్యత్తుకు సంబంధించిన భావన. మానవుడు తన వర్తమాన కాలంతోనే కట్టుబడి ఉండలేడు. భవిష్యత్‌లోని పిలుపును అనుభూతి చెందుతాడు; ఈ భవిష్యత్‌లోని ఆఖరి పిలుపు విషాద ఛాయలతో కూడి ఉంటుంది. కారణం, ఆ పిలుపు మృత్యువు పిలిచే పిలుపు కనుక! ఈ తత్వంలో మృత్యువు అనేది మానవుని గొప్ప వ్యక్తిగత శక్తి. మృత్యుముఖంలోనే మానవుడికి నిజమైన స్వేచ్ఛ లభించేది!!

మానవుడు రెండు విధాల జీవితాలను జీవిస్తాడు అనుక్షణం—వాస్తవ జీవితం, ఆదర్శ జీవితం. వాస్తవ జీవితంలో మానవుడు అస్థి, చర్మ, రక్త, మాంసాలముద్ద. ఆకలి, దప్పిక, కామం, ఈ మూడూ ప్రధాన సంవేదనలు. తనకు కనుపించే రూపమూ, వినిపించే శబ్దమూ మొదలైనవాటికిమించి మరొకటి తెలియదు. కాని అదే సమయంలో ఆదర్శవాదం ప్రత్యక్ష మవుతుంటుంది. తాను అనుభవిస్తూన్న పరిమిత జీవితంకాక తాను అనుభవించాలసిన అపరిమిత జీవితం తన వెలుగుల్ని చూపుతుంటుంది. తానుగావున్న మానవుడు మాత్రమే చాలడు, తనకంటే మించిన, తనకంటే వేరైన మరో మానవుడు కావాలి అనిపిస్తుంది వాస్తవ జీవితంలో ఏవి తనకు అడ్డంకులుగా గోచరిస్తవో అవన్నీ తన ఆదర్శ జీవితానికి సాధనలుగా స్వీకరిస్తాడు.

ఎగ్జిస్టెన్షలిజం పథంలో ఒక్కపేరు సర్వోన్నత దీప స్తంభంగా నిలచివుంది. ఆ పేరే జీన్‌పాల్ సార్త్రే ఇటీవలనేఆయన నోబెల్ బహుమానాన్ని స్వీకరించటానికి తిరస్కరించి అధికజనం చేత ప్రశంసించబడి అల్పజనంచేత నిరసించబడ్డాడు. ఆయన ఫ్రాన్సు దేశీయుడు, 1905 లో జన్మించాడు.

సార్త్రే తాత్వికుడు మాత్రమేకాదు, నవలా రచయితా, నాటక రచయిత కూడా. తన ఎగ్జిస్టెన్షలిస్టు తత్వాన్ని వీలున్న చోటల్లా తన నవలల్లోనూ, నాటకాలలోనూ ప్రదర్శించాడు. సార్త్రే పూర్తిగా నాస్తికుడు. మానవుని అనంత ప్రజ్ఞలో విశ్వాసం ఉన్నవాడు. మానవుడు తాను తలచినట్లుగా మారగలడు. తన భవిష్యత్తుకు తానే బాధ్యుడు. సార్త్రేను ఒకవిధంగా ఎగ్జిస్టెన్షలిస్టు మానవతావాది అనవచ్చునేమో.

సార్త్రే సిద్ధాంతం ప్రకారం అస్తిత్వం అంతా ఒక నిశ్చిత రూపంలేని తయారవుతున్న పదార్థమే. ఘనరూపం తాల్చని జిగురు జిగురుగా అంటుకొంటే అతికేలాంటి పదార్థమే ఏ వస్తువు కూడ, ఏ ఆలోచన కూడ ఒక నిర్ణీత ఘన రూపంలో లేదని తన నవలలో, నాటకాలలో చూపుతాడు. అందువల్ల ప్రతిదీ జిగురుగా కారుతూన్నట్లు చేతికి అంటుకుంటూన్నట్లూ చూపుతాడు.

సార్త్రే తత్వం ఒకవిధంగా సంఘ వ్యతిరేకతత్వమే సాంఘిక నియమాల నేమీ పాటించకపోవటం మానవుని స్వతంత్ర అస్తిత్వానికొక లక్షణం అని కూడ. తన యవ్వనకాలంలో కోటూ కాలరూ ధరించకుండా తిరుగుతూ, సంఘదృష్టిలో చెడ్డగా చూడబడ్డాడు. అప్పుడాయన పారిస్‌లో ఉపాధ్యాయుడుగా ఉంటుండేవాడు. అటువంటి విషయాల్లో పాఠశాల యజమానులకూ, తనకూ చాలా సంఘర్షణ ఏర్పడింది. సంఘానికి వేరైన వ్యక్తిస్వాతంత్ర్యం ఆయన తత్వంలోని ప్రధానాశయం.

కేవల వ్యక్తిగత సత్యాన్నికాని కేవల వస్తుగత సత్యాన్నికాని సార్త్రే అంగీకరించడు. రెండూ నిజమైనవనీ, రెండూ అవసరమైనవనీ అంటాడు. ఆయన రచించిన ఉద్గ్రంథం "L' Etre et le N'eant" (Being & Nothingness) అనేది చాలా ప్రముఖమైంది. వ్యక్తి జీవితానికీ, వస్తు జీవితానికీవున్న భేదాలూ ఐక్యతలూ కూడ ఇందులో చక్కగా చూపబడినవి. ఈ గ్రంథం 1943 లో వెలువడింది.

సార్త్రే మూడు విధాలైన అస్తిత్వాలను చూపేడు · ఒకటి Being-for-itself, రెండు Being-in-itself, మూడు Being-for-others. వీటి మధ్యవున్న సూక్ష్మభేదాలు తెలుసుకోటం అంత సులభంకాదు. చేతనగల జీవి, మానవజీవి, లేక ఆలోచించేజీవి మొదటి దానికి చెందుతుంది. అది తన ఉనికిని తాను తెలుసుకొనకలుగుతుంది కనుక Being-for-itself అనగా తనకొరకు ఉండటం అని. ఇక అచేతనమైన వస్తువు రెండోదానికి చెందుతుంది. అది తన ఉనికిని తాను తెలుసుకోలేదు కనుక అది Being-in-itself అనగా తనలోనే ఉండటం. మొదటిది లేకున్నది, రెండవది ఉన్నది అని తెలుసుకో మంటాడు సార్త్రే మనను. రెండోది బయటి కేమి కనుపిస్తుందో లోపలా అంతే ఒక నిర్ణీతరూపం బయటా లోపలా కూడ ఒకటే. కనుక అది ఉన్నట్లు లెక్క. ఇక మొదటిది అటువంటిది కాదు. బయటికి కనుపించేది ఒకటి లోపల ఉన్నది మరొకటి. కనుక రెండోదానిలాగా అది నిజమైన వాస్తవంకాదు. వాస్తవం కాంది లేనట్లే. ఇక మూడోది Being-for-others, అంటే ఇతరుల నిమిత్తం ఉండటం. మనం ఉంటున్నట్లు మనకు మాత్రమే తెలియటం కాక ఇతరులకు కూడ తెలుస్తుంది. మనను చూస్తున్న ఇతరులను చూచి కూడ మన స్వంత ఉనికిని గ్రహిస్తాం. ఇతరులకోసం కూడ ఉంటున్నాం అనే సత్యాన్ని ఋజువు

పరుస్తుంది సిగ్గు అనేది మనం సిగ్గుపడుతున్నాం అంటే అర్థం ఇతరులను దృష్టిలో ఉంచుకొని మనం జీవిస్తున్నామనే అర్థం ఇతరులు మనను చూడనప్పుడు మనకు సిగ్గే ఉండదు కనుక ఇతరుల నిమిత్తం జీవించటం కూడ ఉన్నది

మానవుని యధార్థవర్తన విషయంలో సార్త్రే చాల శ్రద్ధ కనపరుస్తాడు మానవుడు తనకు తానే స్రష్ట అటువంటప్పుడు తన విలువలను తాను ఆచరణలో చూపాలి తమ గుణాలను తమ ఆచరణలో చూపకపోతే మానవులు కేవల మిధ్యా జీవితాన్ని గడుపు తున్నట్లే ఆచరణలో గోచరించని గుణాలు మానవుని మనసులో ఉన్నప్పటికీ అవి లేనట్లే లెక్క గుణాలు మాటలుగా ఉండి పోవటంకాదు కావలసింది కార్యరూపంలో ప్రత్యక్షం కావటం కావాలి ఇక్కడే 'ఎస్సెన్షలిస్టు'కూ 'ఎగ్జిస్టెన్షలిస్టు' కూ మధ్య వున్న భేదాన్ని సార్త్రే గమనించి మొదటిదాన్ని నిరసిస్తాడు ఒక వ్యక్తి స్వభావం మంచిదిగావుండి అతని ప్రవర్తన చెడ్డ దిగా ఉన్నా కూడ ఎస్సెన్షలిస్టు ఆ వ్యక్తి మంచివానిగానేచూస్తాడు కాని ఎగ్జిస్టెన్షలిస్టు వ్యవహారం అటువంటిదికాదు. వ్యక్తిలోని స్వభావం ఎంత మంచిదైనాసరే అతని ప్రవర్తన మంచిగా లేనప్పుడు ఎగ్జిస్టెన్షలిస్టు ఆ వ్యక్తిని మంచివానినిగా చూడడు మనిషి ఏమి ఆచరిస్తాడో అదే ప్రధానం ఎగ్జిస్టెన్షలిస్టుకు

కోరికా సంతోషమూ సహజీవనం చేయలేవు కోరిక ఉన్నపుడు సంతోషం జనించదు సంతోషం జనించినపుడు కోరిక చచ్చిపోతుంది దేన్నయినా అనుభవించాలనేకోరిక దాన్ని అనుభ విస్తూండగాకాని దాన్ని అనుభవించిన తరువాతకాని చచ్చిపోతుంది నెరవేరకుండా ఉన్నంతవరకే కోరిక ఉనికి నెరవేరటం అంటే ఆనందం జన్మించటం ఆనందం జన్మించటం అంటే కోరిక మరణించటం కోరికలో కూడ ఒక బాధామయ మాధుర్యం తడుతుంది ఆ మాధుర్యాన్ని ఆనందించాలంటే కోరిక నెరవేరకుండా జీవించి ఉండాలి!

సార్త్రే సిద్ధాంతాలలో ఇతర గొప్ప తాత్వికుల సిద్ధాంతాలలో వలెనే అక్కడక్కడ పరస్పర వైరుధ్యాలు గోచరిస్తవి సార్త్రే ఎగ్జిస్టెన్షలిస్టు మాత్రమేకాక మార్క్సిస్టు కూడ 1960 లో "Critque de la raison dialectique" అనే గొప్ప గ్రంధాన్ని రచించాడు ఇందులో ఎగ్జిస్టెన్షలిజానికీ, మార్క్సిజా నికీ ఐక్యత సమకూర్చాడు మార్క్సిజానికి ఎగ్జిస్టెన్షలిజంతో వడును పెట్టేడు పంధొమ్మిదో శతాబ్దంనాటి నిర్ణయవాదం అంటే determinism తో కూడుకున్న మార్క్సిజాన్ని ఎగ్జిస్టెన్ష లిజంలోని స్వేచ్ఛతో ముడివైచి ఒక నూతనమైన వెలుగుతో చూపెట్టేడు తాను 1943 లో రచించిన "L'Etre et le Niant" అనే గ్రంథంలోని భావాలకూ 1960 లో రచిం

చిన ఈ నూతన గ్రంథంలోని భావాలకూ చాలా భేదాలు గోచరిస్తవి మొదటిదానిలో అవును అన్న సిద్ధాంతాలను రెండవదానిలో కాదనటం, దానిలో కాదు అన్న వాటిని ఇందులో అవును అనటం జరిగింది పరిణతి ననుసరించి భావపరివర్తనం జరుగుతూండటం సహజం కూడ

ప్రేమను గురించీ, లైంగిక (sexual) సంబంధాలగురించీ సార్త్రే కొన్ని విచిత్ర భావాలను వెల్లడించాడు తాను ఇతరులను ప్రేమించటంఅనేది తనను ఇతరులు ప్రేమించటానికే అనీ, లైంగిక వాంఛ కోరేది కేవలం పట్టి దేహాన్నికాదు ఆ దేహానికి ఒక అర్థాన్నీ, ఐక్యతనూ ప్రసాదించే చైతన్యాన్నేననీ ఈవిధంగా లైంగిక సంబంధాల లోని శాడిజం గురించీ,మెసోకిజం గురించీ కొంత వెలిబుచ్చాడు సార్త్రే అభివ్యక్తపరిచే ప్రతిభావంలోనూ కొంత మౌలికత తొంగిచూస్తుంటుంది ఆయన వ్యక్తపరచే విధానం సూటిగా ఉన్నప్పటికీ పాఠకునికి ఆయన భావాలు అంత సూటిగా తట్టవు ఇందుకుప్రధాన కారణం అసలు విషయంలోని జటిలతే కాని శైలిలోని జటిలతకాదు

మొత్తంమీద సృజనాత్మక సాహిత్యంలో అనగా నవలల్లో, నాటకాల్లో, కథానికల్లో ప్రథమంగా ఎగ్జిస్టెన్షలిస్టు తత్వాన్ని చొప్పించిన ప్రథమ సాహితీ శిల్పి జీన్‌పాల్ సార్త్రే యే అందువల్ల నేడు ఎగ్జిస్టెన్షలిజం అనేది ఒక తత్వశాస్త్రంగాకంటే, ఒక సాహితీ ప్రక్రియగా ఎక్కువ వాడుకలో ఉంది

సార్త్రేకు సమకాలికుడైన మరో ఫ్రెంచి ఎగ్జిస్టెన్షలిస్టు గ్రేబియల్ మార్సెల్ అనే ఆయన ఉన్నాడు అయితే ఆయన దృక్పథం సార్త్రే దానికి కేవలం వ్యతిరేకం. సార్త్రేది భౌతికమైన ఎగ్జిస్టెన్షలిజం అయితే మార్సెల్‌ది ఆధ్యాత్మిక ఎగ్జిస్టెన్షలిజం లేక క్రైస్తవ ఎగ్జిస్టెన్షలిజం మార్సెల్ భావాలు సార్త్రే వాటివలె కాక చాలా మృదుమధురంగా, అతీతంగా, అమూర్తంగా ఉంటయి. ఇంద్రియానుభవం (empiricism) సరైన సత్యాన్ని చూప లేదనీ, ఇంద్రియానుభవానికంటే సృజనాత్మకానుభవం చాలా గొప్పదనీ వెలిబుచ్చాడు దృశ్యానికీ, అదృశ్యానికీ మధ్య ఒక గుప్తసంబంధం ఉన్నదని ఆయన గ్రహించాడు. సుదూరపు హృదయంలో సామీప్యాన్ని కనుగొనాలనీ, ఇక్కడ అనే వానిలో ఎక్కడో అనేదాన్ని గమనించాలనీ, ఇంకా ఇటువంటి అనేక మార్మిక భావాలను ఆయన వ్యక్తం చేశాడు బుద్ధి (intellect) కంటే బోధి (intuition)కే ఆయన ఎక్కువగా అంకితం అయినాడు

మొత్తంమీద ఎగ్జిస్టెన్షలిజం అనేది ఐరోపీయ తాత్విక చింతనకు ఒక గొప్ప ప్రతిక్రియ యూరప్‌లో పునర్జాగృతి (Renaissance) అనంతరం వ్యాప్తిలోవున్న వస్తుగత వైఖరే ప్రాధాన్యంగాగల పాశ్చాత్య తత్వ శాస్త్ర రీతులపై తిరుగుబాటే ఎగ్జిస్టెన్షలిజం వ్యక్తి స్వాతంత్ర్యాన్నీ, సృష్టిలోని అనిర్ణయవాదాన్నీ (indeterminism), హేతువాదపు అసంపూర్ణత్వాన్నీ, జగత్తులోని నిరంతర పరివర్తనాన్నీ, ప్రతివారిలోనూ దాగివున్న గుప్తబాధనూ వ్యక్తపరచేది ఎగ్జిస్టెన్షలిజం మానవుడు తాను ప్రస్తుతం జీవిస్తూన్న స్థితికంటే అతీతస్థితి నందుకోటంలో తన పరిమితశక్తులకు అపరిమితశక్తిని ప్రసాదించటంలో తోడ్పడే ఇతర సాధనాలలో ఎగ్జిస్టెన్షలిజం కూడ ఒకటి.

# విదియ జాబిల్లి

## శ్రీ నోరి నరసింహ శాస్త్రి

ఆకాశంబున నీవు దోపమిని మూడో రాత్రులున్ తామసీ
ప్రాకట్యంబున మూర్ఛ మున్గినది విశ్వంబెల్ల, నధ్యాపన
శ్రీకిం దూరగులైరి సద్గురువులున్ శిష్య ప్రశిష్యావలుల్
నీ కల్యాణపురేఖ దోపగదవే నేడే గృపన్ జాబిలీ!

మామయ్యా, నెల బాలకా, నతులివే, మాదేవి తోబుట్టువా,
నీ మేనల్లుడ మేనమామ వనుచున్ నే విచ్చు నూల్పోగిదే,
నీ మహాత్మ్యము మేర చాటగదె మేనిం జీకుచేలంబుల
న్నీ, వై వాయ దొలంచి నవ్యవసనస్నేహ ప్రసాదంబులన్!

నీ మాంగల్య సుదర్శనంబున హిమానీస్పర్శ మైనట్లుగా
నా మై జిల్లన బుల్కరించె, బహుమాన్య ప్రేమ గంభీరతా
సీమా, నా హృదయాంతరాళమున వీచీ నృత్య విర్వేల సు
శ్రీ మిన్నంటు సుధాబ్ధి పొంగుల గటాక్షింపంగదే, జాబిలీ!

నీ కారుణ్య కటాక్ష వీక్షణ కలా స్నిగ్ధార్ద్ర పీయూష ధా
రా కల్యాణ మహా ప్రవాహములు స్వర్గ ద్వార దేశంబులన్
దాకన్, నిర్జరతామరత్వ త్రిదశత్వస్ఫూర్తిమత్త్వంబులన్
వీకన్ బొందుదురట్టె, నాకు నవి జాబిల్లీ, ప్రసాదింపవో!

జాబిల్లీ, నెలబాల, మ్రొక్కెద నిదే, సంప్రీతి మన్నింపవే,
నీ బొజ్జన్ మును నిల్పడే యమృతభాండిన్ దా జగన్మోహ లీ
లా బాలా శుభమూర్తి యచ్యుతుడు, చిల్కన్ రావె తల్లేశముల్
నీ బంగారు కరాల చల్వ, జని యున్నిద్రం బజాడ్యంబుగాన్!

నీవు కలా నిధానమవు, నీవు సుధానిధి, నీవు నెత్తిపై
పూవవు శ్రీ మహేశునకు, ముద్దుల బిడ్డవు పాలవెల్లికిన్,
శ్రీ వనితా సగర్భమవు, చేసెడి విన్నప మేమి పెద్ద నీ,
కీ వె తలంచితే నమృత హిండితమున్ జగమెల్ల జేయవే!

# "శబ్ద నిత్యత్వ వాదము"

## శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు

శబ్దము నిత్యమా? అనిత్యమా? అను వివాదము అతి ప్రాచీనమైనది ఈ వివాదములో గౌతమ కణాదులగు న్యాయ వైశేషికులు, జైమిని ప్రభాకర కుమారిలభట్టు మొదలగు పూర్వ మీమాంసికులు, పాణిని, భర్తృహరి, మొదలగు వైయాకరణులు, ఆనందవర్ధనుడు మొదలగు ఆలంకారికులు పాల్గొని ఈ వివాదమును అత్యున్నత శిఖరములకు తీసికొనిపోవుటయేగాక, మహామేధో వైశిష్ట్యముతో విద్వల్లోకమును అలరించిరి ఈ వివాదములో భిన్న భిన్న విద్వాంసుల వాదనా సౌకుమార్యమును దిక్ప్రదర్శనముగా సూచించుటకై ఈ ప్రయత్నము

శబ్దము నిత్యమైనదని వాదించుట మహా సాహసమే ఉచ్ఛరించుటకుముందు శబ్దములేదు ఉచ్చారణము పూర్తి అయిన తర్వాత శబ్దములేదు శబ్దముయొక్క పుట్టుక "మరణము" ఇట్లు తెలియబడుచుండగా దీనిని నిత్యము అని చెప్పుట కెట్లు సాధ్యమని సామాన్యులు గూడ భావింపవచ్చును కాని ఈ వాదమునందే భారతీయమైన మహా విద్వత్తు గోచరమగు చున్నది ఈ వాదము, ఈ వాదమునందున్న తాత్త్విక వైదగ్ధ్యము ప్రపంచములో మరి ఏ ఇతర దేశమునకు తెలియదని చెప్పుట సత్యదూరముకాదు

శబ్దోచ్చారణ ప్రయత్నము కన్పడుచున్నదిగదా (దర్శింపబడుచున్నదిగదా!) "కర్మైకే తత్ర దర్శనాత్" మరియు శబ్దము ఉచ్చరింపబడిన తర్వాత ముహూర్త మాత్రముండును ఆ పిమ్మట అదృశ్యమగును (అస్థానాత్) కనుక శబ్దము అనిత్యమేకదా? "శబ్దము (ధ్వని చప్పుడు) చేయవలదు—శబ్దమును చేయుము" మొదలైనవి (కరోతితి శబ్దాత్) వ్యావహారికము నందున్నవే ఇట్లే చేయబడుచున్న కుండలు (ఘట—)మొదలగునవన్నియు అనిత్యములే కదా? ఇట్లు చేయబడు ఘటములు మొదలగునవి కర్మాపేక్షకములు కర్మాపేక్షకములైనవన్నియు అనిత్యములే ఒక్కని చేత చేయబడిన శబ్దము ఏకకాలమునందు అనేకులకు విన్పించుచున్నదికదా! (సత్వాంతరేచ యౌగపద్యాత్) కాబట్టి శబ్దమునకు విస్తృతమైన అంగములు అవయవములు కలవన్నమాట అనగా శబ్దము 'సావయవి' అని నిర్ధారింపబడుచున్నది 'సావయవి' అనబడు వస్తువులన్నియు అనిత్యములే కనుక శబ్దము కూడ అనిత్యమే. శబ్దములపైన ప్రకృతి వికృతుల ప్రభావమున్నది (ప్రకృతి వికృత్యోశ్చ) ఉదాహరణకు "తపః శక్తి" అనునవి తపశ్శక్తిగా మార్పు చెందుట తెలిసిన విషయమే. ఇట్లు ప్రకృతి వికృతుల బద్ధమైన శబ్దము అనిత్యమైనదే కావలయును మట్టి ముద్ద (మృత్), అనేకములగు కుండలు చేయబడినచో మట్టి బహుళములైన కుండల రూపములతో కన్పడును కదా అట్లే శబ్దమును ఉచ్చరించు జనులు ఎక్కువమంది అయినప్పుడు శబ్దముయొక్క బృహత్త్వము (పెద్దతనము) దర్శనీయమగుచున్నది (వృద్ధిశ్చ కర్తృ భూమ్నాస్య) కాబట్టి శబ్దము న్యూనత, అధికత, అను గుణములచేత పాలింపబడుచున్నది న్యూనాధిక్యతా గుణములు గల వస్తువులన్నియు అనిత్యములే కావున శబ్దము అనిత్యమే ఈ భావములే గౌతమకణాదాది న్యాయ వైశేషికుల (నైయాయికుల) వాదములందున్నవి

ఈ అనిత్యవాదమునకు భిన్న భిన్న విధములుగా పూర్వ మీమాంసికులు, వైయాకరణులు, ఆలంకారికులు సమాధానము చెప్పిరి

శబ్దము ఉత్పత్తి అగుటలేదు అనగా జన్మించుటలేదు శబ్దము పూర్వమే ఉన్నది దానిని ప్రయత్నముచేత బయట పెట్టుట జరుగుచున్నది ప్రయత్నము ఉత్పత్తి కాజాలదు ప్రయత్నానంతరము అభివ్యక్తము (బయట పడుట) కాబడుచున్న శబ్దము పుట్టుచున్నదని చెప్పుట తప్పు 'ఉత్పత్తి', 'అభివ్యక్తత్వము' భిన్నములే (సమంతు తత్ర దర్శనం) అనగా శబ్దము పూర్వమున్నదే దానిని ప్రయత్నముచేత వెల్లడించుచున్నాము అది ఇప్పుడు క్రొత్తగా పుట్టుటలేదు కాబట్టి శబ్దమునిత్యమే ఉచ్చారణానంతరము ఒక్కముహూర్తముమాత్రమే శబ్దముండునని చెప్పుట సరికాదు (సతఃపరమదర్శనం విషయానాగమాత్) శబ్దమెల్లప్పుడు నున్నదే ఉచ్చారణానంతరము ముహూర్తమాత్రమే కాదు—సదా ఉండును కాని శ్రోత్రేంద్రియములు (చెవులు) ఆశబ్దమును ముహూర్తము మాత్రమే స్వీకరించుటకు శక్తి కలిగిఉన్నవి కనుక శబ్దము లేనట్లు తోచుచుండుటన్న లోపము చెవులదిగాని శబ్దమునకు చెందినదికాదు శబ్దగ్రహణ సామర్థ్యములో చెవులకున్నైన లోపమును శబ్దమునకు అధ్యారోపించుట (ఆపాదించుట) తప్పేగాని సమర్థనీయముకాదు శబ్దము తరంగములుగా దిగంతములవరకు ప్రయాణించుచునే ఉన్నదను (Sound travels in waves to

infinity) ఆధునిక సిద్ధాంతము ఈ వాదమునకు ఛాయగానున్నది కాబట్టి శబ్దము నిత్యమే 'శబ్దము చేయుము', 'శబ్దము చేయవలదు' అను వాక్య ప్రయోగములలో (ప్రయోగాస్యపరం) లాక్షణికత్వమే గ్రహింపవలసి ఉన్నదిగాని ముఖ్యార్థము కానేకాదు లాక్షణికముగా 'గంగలో గొల్లపల్లె' అన్నప్పుడు 'గంగ గట్టుపై మున్న గొల్లపల్లె' అని అర్థము చేసుకొనుచున్నాము గంగానదిలో గల గొల్లపల్లె అని భావించుటలేదు అట్లే 'శబ్దము చేయుము, చేయకుము' అను వాక్య ప్రయోగములలో ముఖ్యార్థమునే గ్రహింపవలెను అనగా "శబ్దమును బయట పెట్టుటకు ప్రయత్నింపుము—అట్టి ప్రయత్నమునలదు" అను నర్థములే లాక్షణికము అన్నమాట కాబట్టి శబ్దము నిత్యమే ఒక సూర్యుడు అనేక మంది జనులకు ఏక కాలమునందు కన్పించుటలేదా? అందువలన ఆ సూర్యుని ఏకత్వమునకు దోషము వచ్చినదా? (ఆదిత్యవద్యౌగపద్యం) రాలేదు అట్లే ఒకే శబ్దము బహుళమైన జనమునకు ఏకకాలమునందు వినబడుచున్నది ఇట్లు వినబడుట దాని న్యూనాధి కృతలవలనకాదు న్యూనాధిక్యతా గుణ సంబంధమైన అనిత్యత శబ్దమును బాధించదు. కాబట్టి శబ్దము నిత్యమే. శబ్దముల సంధిలో (తవశ్శక్తి) శబ్దాంతరమేగాని ప్రకృతి వికృతుల బద్ధత్వముకాదు కాబట్టి శబ్దము నిత్యమే (వర్ణాంతర మవికారః) శబ్ద వృద్ధి అనగా అభివ్యంజనమున నిరంతరమైన సంయోగ విభాగముల హేతువుగా నాదవృద్ధి గోచరించును (నాదవృద్ధి పరా) అంతమాత్రముచేత శబ్దమునకు అనిత్యత వాటిల్లదు శబ్దము నిత్యమైనదే.

శబ్దము పదార్థస్ఫురణము చేయుచున్నది ఒక పదార్థము (వస్తువు పదము యొక్క అర్థముకదా! అనగా ఆ పదార్థము (వస్తువు, దాని నామము (పదము, శబ్దము) పైన ఆధారపడియున్నదనుట నిర్వివాదమైన విషయము పదార్థము (Matter) వ్యక్తి లక్షణముగాకాక జాతి పరముగా నిత్యమైనది (Matter is indestructible; ఇది ధార్మవిక భావమే) ఆ పదార్థమును స్ఫురింప జేయు శబ్దము కూడ నిత్యమైనదే 'గోవు' అను శబ్దముచేత జాతి పరముగా సకల గోవ్యక్తులును స్ఫురింప జేయబడుచున్నవి గో శబ్దము నిత్యాకృతి వచనము (సర్వత్ర యౌగపద్యాత్). ఇచట నిత్యా నిత్యముల సంబంధము లేనేలేదు. పద అర్థములకు సంబంధము నిత్యము కాబట్టి శబ్దము నిత్యమే ఒక ఆవును రెండుసార్లు పిలువగా—అది రెండు ఆవులు కాజాలదు రెండు పర్యాయము లుచ్చరించినంతమాత్రముచేత ద్వయాకృతి చెందదు ఏకత్వమే నిలచును అనిత్యములకు సహజమైన సంఖ్య శబ్దమునకు వర్తించదు (సంఖ్యా భావాత్) కాబట్టి శబ్దము నిత్యమే. కుండలు, వస్త్రములు మొదలగునవి నశించుట మనము చూచుచున్నాము అనగా వాటియొక్క నాశనము మనకు గోచరముగుచున్నదనుట ఇదే విధముగా శబ్దముయొక్క నాశనము మనకు గోచరముకాదుగదా (అనపేక్షత్వాత్) కాబట్టి శబ్దమునకు వినాశములేదు అది నిత్యమైనదే శబ్దము ఇతర ద్రవ్య వికారముకాదు శబ్దము ఇతర ద్రవ్య వికారమైనచో చెవులకు అనుగుణ విషయాభావ మేర్పడవలసి ఉన్నది అట్లు ఏర్పడుటలేదు కావున శబ్దము పర ద్రవ్యవికారము కాదన్నమాట అంతేగాక శబ్దము ఆకాశ భూత సూక్ష్మ ప్రకృతి అనియు దానిని చెవులను (శ్రీ ఇంద్రియములే) ఇంద్రియములు విషయము కావించుకొన్నవనియు ప్రసిద్ధమైన విషయములు కనుక శబ్దము ప్రత్యేక ద్రవ్యము. (ప్రఖ్యాభావాశ్చయోగస్య) అది నిత్యమైనదే వేదములు పరమ ప్రమాణములైనవి వేదవాక్యము శంకలకు తావీయదు అది శిరసావహింపవలసినదే వేదము స్వతః ప్రామాణ్యత గలది వేదము శబ్దమును నిత్యమని చెప్పినది—'వాచా విరూప నిత్యతా' అని పరమ ప్రమాణమైన ఋగ్వేదీయ వాక్యము కాబట్టి శబ్దము నిత్యమే నిత్యమనగా (లింగ దర్శనాచ్చ) అభావ వ్యతిరిక్తమైనదని అర్థము ఈ భావములతో పూర్వ మీమాంసా దర్శనమును జైమినిమహర్షి పుష్టి గావించినాడు

జైమిని మహర్షి తరువాత పూర్వ మీమాంసా వ్యాఖ్యాతలలో ప్రముఖులైన ప్రభాకరభట్టు, కుమారిలభట్టు ఈ శబ్ద నిత్యత్వవాదమునకు నూతనార్థ స్ఫురణములు చేకూర్చిరి అందు ప్రభాకరభట్టు అభిప్రాయము లిట్లున్నవి ఆయన దృష్టిలో అస్పష్టమైన ధ్వనిలేదు శబ్దములన్నియు అక్షరముల నాశ్రయించియున్నవి శబ్దములు అక్షర రూపములే ఆయన భావములో అక్షరములకు పదములకు భేదములేదు అనగా పదము అక్షరములకు దూరముగా నుండలేదు అక్షరముల సంపుటీకరణమే (కూర్పు) పదముయొక్క రూపార్థ స్ఫురణము చేయును కాబట్టి పదమునకు అక్షరములకు భిన్నత్వములేదు పదము నందుగల భిన్న భిన్నములైన అక్షరములు వేరు వేరుగా తోచును గాని—అవి ఒక దాని నొకటి అనుసరించి స్ఫురించుటచేత—ఆ అక్షరము దాని యొక్క సంస్కారము (impression) మనస్సునందు కల్పింపజేసి వెడలును ఆ అక్షరసముదాయము (పదమునందున్న)యొక్క క్రమ స్ఫురణము మానసికమైన స్మృతిచే ఏకమై ఏకార్థమును కలిగించును ఈ అర్థ స్ఫురణము అక్షరములవలన కలుగుచున్నదేగాని అందుకు భిన్నముగా పదము యొక్క ఇతర శక్తివలన కలుగుటలేదు కాబట్టి ఈ అర్థ స్ఫురణ శక్తి అక్షరములకు చెందవలసినదే పదములందున్న అక్షర సముదాయమే పదార్థమును సూచించుచున్నది కాబట్టి అక్షరములే శబ్దమునకు ఆధారములు పదములకు అక్షరములకు గల సంబంధమువంటిదే వాక్యములకు పదములకు గలదనియు, పదములు వాక్యములందు చేరి అర్థ స్ఫురణ చేయు

చున్నవని ప్రభాకరభట్టు అభిప్రాయము ఈ ప్రాభాకర సిద్ధాంతమునకు 'అన్వితాభిధాన వాదము' అని పేరు వచ్చినది

కుమారిలభట్టు ప్రాభాకరసిద్ధాంతమును బలపరచలేదు కుమారిలభట్టు వాదమున పదములు స్వయముగా అర్థస్ఫురణ చేయగలవి స్వతస్సిద్ధముగా పదములు తమంతట తామే అర్థస్ఫురణము చేయుట స్మృతివల్లగాక వాటి అర్థ స్ఫురణాశక్తి వలన కలుగుచున్నది ఆ శక్తికి 'అభిధా' అని పేరు అనగా అర్థస్ఫురణము అభిధాశక్తివలన కలుగుచున్న దన్నమాట ఈ అభిధా శక్తి సంపన్నములైన పదములు వాక్యములుగా ఏర్పడి వాక్యార్థము కలిగించుచున్నది ఈ అభిధాయుతమైన పదములు వాక్యమునందున్న కాలమున సమిష్టిగా వాక్యార్థమును కలిగించుటయేగాక అవి తాము తాము ప్రత్యేకముగా అర్థములు కలిగియున్నవన్నమాట ఇది కుమారిలభట్టు సిద్ధాంతము ఈ సిద్ధాంతమునకు అభిహితాన్వయవాదమని పేరు వచ్చినది

పూర్వ మీమాంసావాదుల శబ్ద నిత్యత్వవాదమునకు అతిలోకమైన భావ సౌందర్యమును చేకూర్చినవారు వైయాకరణులు వ్యాకర్తల కృషిచేత ఈ వాదము క్రొత్త మార్గములలో దర్శనరాజమార్గమున ప్రవేశించి ప్రశంసనీయమైన వాదబలమును చేకూర్చుకున్నది వైయాకరణులలో పాణిన్యాదిమునిత్రయము వారును, భర్తృహరి, నాగోజిభట్టు (మంజూష) కొండుభట్టు (భూషణము) మొదలగువారు ఈ వాదమునకు సౌకుమార్యమును చేకూర్చినవారు

ప్రధానముగా వ్యాకరణ శాస్త్రము శబ్ద స్వరూప విచారమునకు శబ్దసాధుతాసాధుతల నిర్ణయమునకు ప్రభవించినది కాబట్టి వైయాకరణులకు శబ్ద స్వరూపమే లక్ష్యమైనది శబ్ద గతమైన అర్థముతో వారికి ప్రసక్తి తక్కువే కాని శబ్దగతమైన ఆర్థిక (అర్థ సంబంధమైన) చర్చ కూడ వైయాకరణులు విస్మరింపలేదు ఇట్టి ఆర్థిక చర్చా గ్రంథములలో ముఖ్యములైనవి భర్తృహరి రచించిన వాక్య పదీయము, కొండుభట్టు రచించిన భూషణము, నాగోజిభట్టు రచించిన మంజూష

'గౌః' అను శబ్దము ఉచ్చరించునప్పుడు ముందు గకారము పిమ్మట ఔకారము (గ్+ఔ=గౌ) ఉచ్చరింపబడవలయును కదా! ఔ కారము ఉచ్చరించునప్పటికే గ కారము నశించినది అట్లే ఏ కారము వ కారోచ్చారణకాలమునకు నశించినది చిట్ట చివరి అక్షరము ఉచ్చరించిన తర్వాతగాని అర్థ స్ఫురణము కలుగుటలేదు అక్షరములు యుగపత్ శ్లిష్టి (ఏకకాలికత్వము) లేక నశించుచూ ఈ అర్థస్ఫురణమునకు శక్తివంతములు కావని వైయాకరణుల అభిప్రాయము నశించునట్టి ఈ అక్షరములచేత అభివ్యక్తమై— అక్షరాతీతమైన అర్థమును స్ఫురింపజేయు నిత్య పదార్థ మొకటున్నదని వారి అభిప్రాయము 'ఆ నిత్య పదార్థము కూడ' శబ్ద జాతికి చెందినదని నిర్ణయించి దానిని వైయాకరణులు 'స్ఫోటః' మని నామకరణము చేసినారు స్ఫుట్యతే=వ్యజ్యతే వర్ణైః ఇతి స్ఫోట అనియు, స్ఫుటత్యర్థో౽స్మాదితిస్ఫోటః—అనియు, స్ఫోటయత్యర్థమ్' అనియు, వర్ణాతిరిక్తో వర్ణాభి వ్యంగ్యోర్థ ప్రత్యాయకోనిత్య శబ్దః స్ఫోటః'' అనియు, "పూర్వ పూర్వ వర్ణానుభవాహిత సంస్కార సచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతే స్ఫోటః' అనియు అనేక వ్యుత్పత్తి నిర్వచనములున్నవి

ఈ స్ఫోటవాదమును ప్రతిపాదించినది స్ఫోటాయనుడని హరదత్తాదుల అభిప్రాయము వేదాంగమైన ప్రాతిశాఖ్య వ్యాకరణమున "స్ఫోట" శబ్దము కన్పడదు కాని వ్యాఖ్యాత లీ శబ్దముపయోగించిరి ఈ స్ఫోట బ్రహ్మ రూపమును భర్తృహరి —

"అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్
వివర్తతే౽ర్థ భావేన ప్రక్రియా జగతోయతః''

అని వాక్యపదీయమున (బ్రహ్మకాండ) వర్ణించెను (సకల జగత్తు యొక్క ప్రక్రియ ఎట్టి దానివలన జరుగుచున్నదో ఆ అర్థ భావము కలిగి వివర్తించు బ్రహ్మము అక్షరము అది తొలుత నిధన [ధన] రహితమైన శబ్దతత్త్వమే ఈ స్ఫోట నశించునట్టి అక్షరములచేత అభివ్యజ్యము చేయబడి తాను నిత్యమైయున్నది ఇతరార్థమును తాను స్ఫుటీకరించును కూడ ఈ నిత్యమైన స్ఫోట శబ్దవాదులగుటచేత వైయాకరణులు శబ్ద నిత్యత్వ వాదులైనారు గుణ రూపవంతమైన ప్రకృతిచేత పదార్థరూపముగా వివృతి పొందిన దీ నిత్యమైన శబ్ద బ్రహ్మమేనని వైయాకరణుల సిద్ధాంతము ఈ సిద్ధాంతమును పాణిని మహర్షి తన సూత్రము నందు (అష్టాధ్యాయి) ఆద్యంతములందు స్పృశించెను.

పాణినీయ సూత్రములలో "వృద్ధి రాదైచ్", 'అదేఙ్ గుణః' 'ఇకో గుణ వృద్ధీ'' అనునవి మొదటి మూడు సూత్రములు. "బృహత్వాద్బృంహణాత్వాత్'' "బృహత్వాద్బృంహణత్వాద్బ్రహ్మ'' అనగా వృద్ధి పొందునది, వృద్ధౌ=బృహి కాబట్టి వృద్ధి శబ్దముచేత మొదటి సూత్రమునందు (ఇది శబ్దమునకు చెందినది) బ్రహ్మమును ధ్యానించుట జరిగినది. రెండవ సూత్రమున ప్రకృతి ఉపాదాన కారణ గుణమని ధ్వనింపచేసి మూడవ సూత్రమున శబ్దార్థ వివర్తనమునకు కారణము విద్యమానము చేయబడినది తుది సూత్రము "అ అ'' అను దానిలో పరిసమాప్తిలో అకారము బ్రహ్మ స్వరూపమగుటచేత (అక్షరాణాం అకారో౽స్మి) సర్వమును దాని యందు పరిసమాప్తి నొందునవియు సూచింపబడినది.

ధాతుపాఠమును కూడ 'భూ—సత్తాయాం' అని బ్రహ్మమునకు పర్యాయమగు 'సత్తా' శబ్దముతో ప్రారంభించెను.

"వర్ణజ్ఞానం వాగ్విషయో యత్ర చ బ్రహ్మ వర్తతే" "సిద్ధే శబ్దార్థ సంబంధే" (అనగా బ్రహ్మ వాగ్విషయముల వర్తించును సిద్ధ రూపమనగా శబ్ద నిత్య రూపము) అనుచు వార్తికకారుడు నిర్వచించెను భాష్యకర్తయగు పతంజలి కూడ శబ్దమును గురించిన చర్చలో "యే నోచ్చారితేన సాస్నా లాంగూల ఖుర విషాణినాం సంప్రత్యయో భవతి స శబ్దః" అని వివరించెను దీనికి వ్యాఖ్యానములో 'స్ఫోట స్వరూప నిత్య శబ్దమని' వ్యాఖ్యాత లంగీకరించిరి పతంజలి అక్షర సమామ్నాయమంతయు (ప్రతిమండితో బ్రహ్మరాశిః) బ్రహ్మరాశి యనెను "కింపునర్నిత్యః శబ్దః అహోస్విత్ కార్యః"—అని శబ్ద నిత్యత్వమును ప్రస్తావించెను వైయాకరణశ్రేష్ఠులగు పాణిని, వార్తికకార, పతంజలులు శబ్ద బ్రహ్మత్వము శబ్ద నిత్యత్వము ప్రతిపాదించినవారే పాణిన్యాచార్యులకు ముందువాడైన బోధాయనుడు (ఉపవర్ష) మీమాంసా వ్యాఖ్యానము వ్రాసెను ఆయన కూడ శబ్ద నిత్యత్వవాదియని శ్రీ శంకర భగవత్పాదులవారు ప్రస్తావించిరి (వర్ణా ఏవతు శబ్దః ఇతి భగవానుపవర్షః—ఇది 'శబ్ద ఇతి చేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యా' మను సూత్ర వ్యాఖ్యాన సందర్భమున )

స్ఫోటవాదములు అష్ట విధములు వర్ణ, పద, వాక్య, అఖండ పద, అఖండవాక్య, వర్ణజాతి, పదజాతి, వాక్యజాతి అనునవి ఈ వ్యాసము శబ్ద నిత్యత్వవాదములో భిన్న భిన్న వాదములు తెలుపుట కుద్దేశించినదిగాని స్ఫోటవాదమును గురించిన ప్రత్యేక వ్యాసము కాకపోవుటచే నిందు అష్ట విధ స్ఫోటవాదముల వివరణములు వ్రాయుటలేదు మరియు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపమైన వాక్కులలో మధ్యమాస్వరూపమే స్ఫోటమనియు, ఆ చతుర్విధ వాక్కుల స్థానములు అంతరకములముల (మూలాధార ఇత్యాది)నియు చెప్పుదురు స్థానముల విషయములలో అభిప్రాయ భేదములున్నవి ప్రకృత వ్యాసమునకు ప్రసక్తి లేదని వివరించుట లేదు

వైయాకరణులు తమఅష్టవిధ స్ఫోటవాదములో (అష్టవిధములందు పరమ సిద్ధాంత భూతములైనవి అఖండ వాక్య స్ఫోటము, వాక్యజాతి స్ఫోటము అనునవి) శబ్ద నిత్యత్వ సిద్ధాంతమునకు నూత్నాలంకారమును కూర్చిరి వైయాకరణుల వాదమే దీనిని శిఖరాగ్రస్థితికి చేర్చినది

ఈ వాదములో నొక ఉపవాదమును లేవదీసి ఆలంకారికుడైన ఆనంద వర్ధనుడు ప్రవర్తింపజేసెను

శబ్దమునకు వాచ్యార్థమేగాక లక్ష్యార్థము కూడ కలదని తొలి తొలుతనే అంగీకరింపబడినది శబ్దమునకు ఇంతమాత్రమే గాక వ్యంజనా శక్తి కలదని ఆనందవర్ధనుని వాదము వ్యంజనాశక్తి అనగా అర్థాంతరమును తెలుపునది అర్థాంతరమును వ్యంగ్య మందురు వ్యంజనారూపమైనది శబ్దము ఈ వ్యంజనమునే ఆలంకారికులు ధ్వని యనిరి ఇది అనేక విధములు శబ్దమునుగాని అర్థమునుగాని, రీతినిగాని, వర్ణములనుగాని ఇది ఆశ్రయించియుండ వచ్చును అలంకారరూపమై లేక రసభావరూపమై,లేక వస్తురూపమై ఇది భాసింపవచ్చును వైయాకరణులు సంభావించిన స్ఫోట వ్యంగ్యములో ఆనందవర్ధనుడు అర్థాంతరవ్యంగ్యమును దర్శించి దానిని 'కావ్యాత్మ' గా నిర్ణయించెను ఆత్మ పరమాత్మల సంబంధిగా ఆనందవర్ధనుడు కూడ శబ్దనిత్యత్వ సిద్ధాంతమున పాల్గొనినట్లే

తన ఆలంకారిక ధ్వని సిద్ధాంతమునకు వైయాకరణుల "స్ఫోటవాదమే" ఆధారమగుట ఆనందవర్ధనాచార్యుడు వైయాకరణులను "ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః" అని కీర్తించెను మరియు "బుధైః వైయాకరణైః ప్రధానీభూత స్ఫోట రూప వ్యంగ్య వ్యంజకస్య శబ్దస్య ధ్వనిరితి వ్యవహారః కృతః" అను ఆలంకారిక వచనమునుబట్టి ఆనందవర్ధనాది ధ్వనివాదులకు శబ్ద నిత్యత్వవాదులైన వైయాకరణులే మార్గ దర్శకులనుట నిర్వివాదమైన విషయము

గౌతమ కాణాదులైన న్యాయ వైశేషికులకంటె, జైమిని ప్రభాకర, కుమారిలభట్టు మొదలగు పూర్వ మీమాంసకులకంటె వైయాకరణుల నిత్యత్వవాదము ఉపనిషత్తులకు సన్నిహితముగా నున్నది.

ఈ శబ్ద నిత్యత్వవాదమును బ్రహ్మ నిత్యత్వ సిద్ధికి ఉపాయముగా నెంచవలసినదని భర్తృహరి తానే చెప్పెను.

"ఇదమాద్యం పదస్థానం సిద్ధి సోపాన పర్వణామ్।
ఇయం సా మోక్షమార్గాణా మజిహ్మా రాజపద్ధతిః।
అత్రాతీత విపర్యాసః కేవలా మనుపశ్యతి"

# కళ్ళెం పట్టుకున్న మనిషి

"శ్రీపతి"

వేకువజాము
చీకటి దట్టంగా
చీకటిలో మరీ చీకటిగా పూరిళ్లపల్లె
మనసులోని అరల్లా సన్నని వీధులు
ఇసికనేల
రెండుమైళ్ళదూరంలో సముద్రపుహోరు
సన్నని వీధుల మధ్య మధ్య పాదులూ పందిళ్ళూ
తులసికోటలూ రచ్చబండలూ
పూరకేపడున్న బళ్లు
ఎక్కడో కోడికూత
మరెక్కడో కవ్వంమోత
తడీ బరువూలేని చీకటి వర్షం కుండపోతగా.
రామం పోతున్నాడు రోజూమల్లే
ఒకరిద్దరు చూసారు
అలవాటుగా నిట్టూర్చారు

భార్య చనిపోయి ఆర్నెల లయింది
ఆ చనిపోయిన దినంనుంచీ నిత్యం
ఆమె దహనక్రియలు జరిపిన ఆ చోటుకివెళ్లి
పిచ్చివాడిలా ఆచోట కూచుంటాడు
అది వాళ్లతోటలోనే

రాతిగుండె కరిగిన మంచు కన్నీళ్ల హేమంతం
పూరుస్మృతిలాగ దూరంగా ఉండి పోయింది
దేవతలువిహరించే ఉద్యానవనంలాంటి కొబ్బరితోటల్లో రామం

కన్నీటి చారలాంటి దారిలో నడక
ఇంకా విడని మూగిపూల ఉదయం
కాళ్లకింద ఇసికమంచు
చలిగాలుల జల్లులు
మూలుగుతోన్న ఇసికని కుమ్ముతో రామం అడుగులు
ఆకాశాన్ని కప్పేసిన తోటలు
రంగుల నందుకోలేని వెలుగు
ఆశలు కాలిపోయిన చుక్కల చూపులు

ఇలాంటి మంచుపూలు పూసిన హేమంతంలోనే
మనం తొలిసారి ఈ పల్లెటూరికి కనపడ్డప్పుడు
నువ్వు హిందూస్త్రీలా కుంకుమ పెట్టుకుని
మల్లెరంగు సంపంగి వన్నె అంచు చీరకట్టుకుని
కొత్తకాంతులు విత్తులు చల్లటానికి కనిపించినప్పుడు
మనిద్దరిని చూట్టానికి చేతిలోని పనులు మాని
ఆడా మగా వీధుల్లో ఆనందంతో, ఈర్ష్యతో
రతీ మన్మధులను చూట్టానికి నిలపడ్డప్పుడు
కళారాధకులను చూసి ఖజరహో శిల్పాలు
తన్మయతతో వచ్చేతరాలమీద పరిమళాలుచల్లినట్టుగా
నిన్నారసుకుంటూ నడుస్తున్న నాకు దైవత్వం
అబ్బినట్టుండేది.

నడుస్తూ రామం
చెట్లకన్నీట తడుస్తున్నాడు
గుండెల్లో మృత్యుశ్వాసనిశ్వాసల ఘోష
చలి.

చీకటి కౌగిట్లో రాత్రి
'చుక్కల్లా మెరుస్తున్నాయి నీ కళ్లు'
'మీ కళ్లకాంతిలో నా ఆనందం కురుస్తోంది'

మనం అలిసిన జట్కాబండి దిగి ఇంటిముందు
మంచున్నప్పుడు
ఎనభైయ్యేళ్ల జీవితాన్నిమోసి అలసిన చూపులతో
తాతయ్యచూసి
నేను చేసిన ఆగడపుపనికి కినిసి నీలో తన మనుమడి
సౌభాగ్యం చూసి
సంఘం మతం పేరిట అరుస్తుందని తెలిసికూడా
స్వార్ధపరుడయ్యాడు
అమ్మా అని నిన్ను పిలిచి నిమిరి సుఖంగా వెయ్యేళ్లు
జీవించమన్నాడు

చల్లని వాసనలు గుండెను తాకుతోన్నాయి.
చీకటి ఐరుకుతనం పోయింది
కళ్లు తెరచి చూస్తున్నాయి సరిహద్దులు

మనిషి నిద్రలో రుచిగొన్న విశాల విశ్వం
మేలుకుంటున్న చూపులతో రంగుల తోరణాలు
రామం ఒక్కడూ ఆ తోటల్లో నడుస్తూ—

'నిన్ను సుశీ అంటాను'
'మీ ఇష్టం'
'నిన్ను పారూ అంటాను'
'ఊఁ'
'కోటిపేర్లతో పిలుస్తూ
ముత్యపుచిప్పలో చినుకులు పడ్డట్టు—

ఆకుపచ్చని రంగుని ఆకాశంమీద పులిమేసిన తోటలు
అక్కడక్కడ—అక్కడక్కడ—అక్కడక్కడ—ఆలమందలు
గొర్రెలమందలు—మేకల మందలు—అక్కడ కుక్కలు
నక్కలు గొర్రెలను ఎత్తుకు పోకుండా కాపలా కుక్కలు
మనిషిని అవిశ్వాసపు జీవిగా గొంతెత్తి అరిచే కుక్కలు

'నేను నే ను నే .'
'ఆమాట అనొద్దు ఫాతిమా'
'ఇం క బ్ర .త క'
'అనొద్దు అనొద్దు అ. నొ . ద్దూ'
కన్నీళ్లు ఆమె మీద
కన్నీళ్లు కూడా లేని ఆమె కళ్లు
ప్రమిదలో నూనె ఇంకిపోయినా వెలుగుతున్న దీపాలు.

ముల్లు గుచ్చుకుంది పాదానికి
శరీరంలోని పంచేంద్రియాల బంధంలో
ఒక సున్నితమైన ముడి వీడిపోయిన నొప్పి
నొప్పి గుండెల్లో గుచ్చుకుంది
ముల్లు పాదంనించి లాగి
ప్రకృతి మనిషిని శిక్షించగల శక్తికి కంపించి
జీవుల్లో మనిషి పరమ అల్పుడని విలపించి
లోకంమీద నిరాశ నిప్పులు కురిపించి
తన వ్యక్తిత్వపు సౌందర్యంమీద గోరీకట్టి
నడుస్తున్నాడు నాగలి చాళ్ళమీద నలిగిన
చీమ నడక వంపుల దారిలో రామం.

'ఎందుకేడుస్తున్నావ్?'
'నే ను బ్ర త క'
'అనొద్దు అనొద్దు ఆమాటనొద్దు'
కన్నీట తడిసిన పెదాలు

ఇప్పుడు నేను నువ్వులేని కాలాన్ని భానిసలాగ మోసుకుంటూ
నీ జ్ఞాపకాల నిప్పులమీద కదలకుండా ఒక్కణ్ణీ నిలబడి
గతానుభవాల కొరడా విసుర్లు ఛళ్లు ఛళ్లన మనసుకుతగిల్తుంటే
ఎవర్నెవర్నో ద్వేషించుకుంటూ ఏమిటేమిటో తిట్టుకుంటూనేను.

నువ్వు పెట్టిన అన్నం తింటున్న తాతయ్యనుచూస్తే
నాకు ప్రపంచాన్ని మొక్కాలన్నంత ఆనందం
జామిచెట్టుమీది చిలకలు అన్నాడు తాతయ్య
ఇద్దరం ఒకేపళ్లెంలో తింటున్న దృశ్యం చూసి.

మృత్యువు విరుపులాగ బుస్ మన్న ధ్వని
పడగెత్తి ఎదురునిల్చి పాము
కటువుగా నిల్చొన్న పాము
పాముల నరసయ్యగారూ

ప్రార్థన. భక్తి. నిస్సహాయత
కంపన.... పిరికితనం భయం ..
రామం అంజలి ఘటించాడు
పడగమీద వాలికింది పిసరంత కొత్తకాంతి
శాంతించింది కత్తెత్తిన హిమనగం
తిరిగిపోయింది దయతలచిన స్త్రమాట్టులాగ.
పాము.

కాటేసింది కాదే!
ఫాతిమా దగ్గరికి పోయేవాడిని!

కాలం కొత్త చీరలో
గానమాధురీఝరిలో సిట్టలు.

ఇంత చిన్నపాము
భయం భయం
భగవంతుడు భగవంతుడు
భుజంగ భూషణుడు

సృష్టిని తలకిందు చెయ్యగల మనిషివి
పాము బుసకొట్టి—
ముల్లు గాయపరచి—
మనిషీ నువు అల్పుడవు
గర్వించకు
పాము విషం మృత్యువు
మనిషీ
నొప్పి భరించలేని పురుగువి నువ్వు

అబ్బా!

భయం
వణుకు
పాము

పాము
పాము
కళ్లెదుట

రామం నడుస్తున్నాడు తనదారిలో—తట్టుకుని—
కొండ చిలువ అతడి మనసుని చుట్టుకుంది.
మనిషీ నువ్వు మురికివి
అమీబా ఏకకణ జీవివి.

ఔనౌను
ఔనౌనౌను
ఔను పాము
కాలానికి కోరలు
ముళ్ళకోరల్లో విషం.

'ఆయనకి నేనే దిక్కు అక్కడికి పోదాం'
'మరి మీ ఉద్యోగమో?'
'వొద్దు. తోటలున్నాయి వ్యవసాయం చేసుకోవచ్చు'
'తాతగారేమనరా?'
అనరని తలూపితే
'తురకది అనరూ?'
'అనరు'
'మరి ఆ పల్లెటూరు జనం అనరూ?'
'అలా జడిసి ఎంతకాలం?'

అక్కడికి చేరిపోయాడు
అది స్వర్గం
మట్టిలో కలిసిపోయిన ఫాతిమా
అక్కడే అక్కడే

మట్టిలా కనబడుతోన్న ఫాతిమా
అక్కడే అక్కడే—
చీకటి కమ్మేసింది వెలుతురు సోయగాన్ని
అక్కడే అక్కడే
ఆరుమాసాలు కాలం కురిసిన కన్నీరు
అక్కడే అక్కడే
అక్కడి ఆ బూడిద
మిగల్లేదు మిగల్లేదు
ఆనాటి ఆ జ్వాలా నృత్యం
మిగల్లేదు మిగల్లేదు

తామరాకుమీది నీటిబొట్టులా ప్రకృతి
అక్కడున్న గాలిని కావలించుకుని
రామం
అక్కడున్న మట్టిని ముద్దిడుకుని
రామం
ఏడుపు
ఉన్న ఒక్క వరాన్ని దొంగిలించి శపించావా ప్రభూ?
ఆదినే తల్లి కర్ణుని శపించింది
కన్నీటి నైవేద్యం ప్రియురాలికి
రోజూలాగే ఆరు నెలలన్నించి

పక్కనే ఆలమంద
ఇంకా చలి
ఇంకా నిద్ర
ఆలమంద
తోకలతో దోమలని తోలుకొంటో ఆవులు

తల్లికి దూరంగా రాటకి దూడ
ఏడుస్తో
దూడ అంబా అంబా
ఆవు అంబా అంబా
ఆకలితో
రాట చుట్టూ పెనుగులాడుతో దూడ

నా సర్వస్వం నువ్వు
నా కళ్లరుచులు నీ దేహంలో
ఆకాశపు ఔన్నత్యం నీ కళ్లల్లో.
నీ కురుల్లో కొత్త పరిమళాలు
జీవితమ్మీది ఆశ నీ కెమ్మోవిలో
కృష్ణవేణుగానం నీ ప్రత్యక్షం
నా పంచ ప్రాణాలు నువ్వు

ఎందుకు పుట్టక
ఇంకో జన్మం
ఎందుకు పుట్టక

తల్లి చనిపోయిందని—తండ్రి
లేరు లేరు
త్యాగమూర్తులకు ఈ పిరికి ఎలా జన్మించాడు?
భక్తుడూ భగవంతుడూ లాగ అమ్మా నాన్నా
అమ్మని సముద్రుడు దొంగిలించాడు
గ్రహణం రోజున
సోమకుడికోసం వెతుకుతున్నాడు నాన్న
సముద్రాన్ని మత్స్యావతారమెత్తి
అమ్మ అరుస్తోనేవుంది.

నాన్న పిలుస్తూనే వున్నాడు
వీరధి హెూరు వినిపిస్తూనేవుంది.

ముకుళిత హస్తాలతో తన ప్రేయసిముందు రామం
మట్టిలో కలిసిన
తన హృదయేశ్వరిని దోసిట్లో పట్టుకుని రామం

గీతాంజలి వినిపించాలనుకున్నాను
నన్ను పిలచిన సరిగమస్వరాళి వినిపించాలనుకున్నాను.
అందాలు చూపిన అనంతాలు చూపాలనుకున్నాను
కాని—

## 2

'బాబూ'
పాపన్న పిలిచాడు
పదేళ్లవాడు
పశులకాపరి
చేతిలో తన ఎత్తు కఱ్ఱ
ఆ కఱ్ఱ అతడి ఆయుధం
ఆ కఱ్ఱ అతడి వాహనం

వల్లగా రూపు
తలుపు చెక్కలాగ బలంగా
పశుల కావరి పాపన్న
ఆవులను మేతకి తోలాలి
వేళయింది
వచ్చాడు వుట్టిలో పాలముంత పట్టుకుని
దూడని పాల కిడవాలి
పాలు తియ్యాలి

రామం లేచి
ఆవు దగ్గరికి
పాలు పితికేందుకు
ఆవు కొత్తగా ఈనింది
ఆవు దగ్గర రామం
ఆవు కొమ్ములు విసిరింది
కాలం శూలం గుచ్చుకుంది.

అబ్బా!
అని నొప్పితో, బాధతో
'అయ్యయ్యో' అని బాధపడుతూ పాపన్న

నొప్పి ..
వడుంమీద పొడిచింది ఆవు
బాధ నొప్పి

వణుకు వణుకు
తూలిపోయాడు లేచాడు.

పాము పాము
ముళ్ళు ముళ్ళు
పాము పడగ
ఆవు కొమ్ములు
కొమ్ములు ముళ్ళు
బాధ బాధ
మనిషీ హీనుడివి
ఔనౌను

'హాష్'
పాపన్న గొంతు కొరడా.
ఆవు జడిసింది
వెనక్కి తప్పుకుంది
శాసించగల శక్తి పాపన్నకుంది.
పదేళ్ల పాపన్న

'పితకండి బాబూ నే నిక్కడుంటాను'
పాపన్న ఆజ్ఞ
పాపన్న అభయం
వణుకుతూ కూచుని
భయంతో పాలు పితుకుతూ
పాలముంతలో తెల్లని పాలధారలు
చుంయ్ చుంయ్ ధ్వని

'తెల్లదానిమ్మ గింజల్లా నీ పలువరస'
'ఈ ప్రపంచంలో ఇంకో అందం కనబడదా మీకు?'
తలదించుకుంది పొగడ్తల బరువుతో
అందుకె భక్తుడంటే భగవంతుడికి ప్రేమ.

జుంయ్ జుంయ్
ముంతలో పాలు
పాలతో నిండుతో ముంత
పాలు పితుకుతో రామం
గుక్కెడుపాలు తాగిన దూడ దూరంగా రాటకి
కను సన్నల్లో ఆవునివుంచి నిలబడ్డ పాపన్న
ఆవుపాలు చేపేసరికి దూడని లాగేసేడు దూరానికి

గుక్కెడు పాలు తాగేసరికి నన్ను లాగేసేవు దూరం
మూగి మనసు మూలుగు
ఆమె అన్నయ్యలు ఒకరు లక్నోలో. ఒకరు విదేశాంగ మంత్రిత్వశాఖలో చిన్నవాడు ఐ.ఎ.ఎస్. పరీక్షకోసం.
ఆమె తల్లి సంస్కారవతి నాకు గర్వంగావుంది—
మతాంతర్వివాహం చేసుకుంటున్నందుకు. అందరికీ
ఉత్తరాలు రాస్తున్నాను
'మీరు తప్పకుండారావాలి—మీ—

ఆవు తన్నేసింది చూసి చూసి
పాలముంత పడిపోయింది నేల
అనురాగం మట్టిపాలయింది.

హుంకరించాడు పాపన్న
కర్రతో ఒక పోటు పొడిచాడు ఎముకల్లో
వాడిక్కోప మొచ్చింది
అన్ని పాలు వృధా అయ్యాయి
ఆ పాలు వాడి ఆకలిని తీర్చేవి
ఆ పాలు బాబుగారి టీకీ పెరుక్కీ సరిపోయేవి.
ఆ పాలు తాతగారికి రాత్రిపూట అవసరం.

చేదు చేదు
బతుకుచేదు
కాంతిలేదు
చీకటిల్లు
పాము విషం
మనిషి పురుగు
మనిషీ పురుగువి
సిగ్గు నీ బతుకు
సిగ్గు నీ శక్తికి
చూడు చుక్కలు
కోటి లోకాలు
నువ్వు అణువ్వి
అవునా కాదా
కాదా అవునా?
వణుకు వణుకు
ఛీ ఛీ బతుకు
ఎడారులు కోటి కోటి
ఇసుక తుఫానులు
ఉత్తరధ్రువం
దక్షిణధ్రువం
మంచుటండ్రాలు

బతుకు ఆశలా వుంది
చలికాలపు ఎండ వెచ్చదనం
పిరికితనంతో నెత్తురు నీరయిపోయింది
రామం ఆ వెలుగు నీడల సందుల్లో కూలబడ్డాడు.

ప్రళయం వస్తే
అగ్నిపర్వతం బ్రద్ధలయితే
హిరోషిమా నాగసాకీల్లాగ లోకం కాలిపోతే
పది లక్షల ఏళ్ల క్రితంలేని యీ మనిషి మృగం
చలి చీమల చేత చిక్కిన సర్పం
క్రిస్టియానిటీ ఇస్లామ్ బుద్ధిజం
హిందూ ఇజం
వాట్ దే ఎయిమెట్
డార్విన్ కథలేమిటి
ఫ్రాయిడ్ బోధనేమిటి
అసలు ఈ గాంధీ ఎవరు
కాని గాంధీ
డార్విన్
ఫ్రాయిడ్
లేరు లేరు
ఉండ రుండరు.

క్రీస్తు ఉండలేదు
బుద్ధుడుండలేదు
ఫాతిమా ఉండలేదు.
బ్రతుకుమాయ
జగం మాయ
శ్రీశంకరుడు
మాయ మాయ
పునరపి జననం
పునరపి మరణం
భజగోవిందం
అర్థం లేని చందం
సామాన్య శబ్దం
అర్థం అనర్థం
స్వీయ కల్పితం

ఫాతిమాలేదు
చేవల్లా ఆడుకునే ఆమె కళ్లులేవు
ఆమెగొంతు వీణలేదు
లేదు లేదు ప్రపంచం
కళ్లెం చెయ్యిజారింది

కాలం గుర్రం మయింది.
సర్పం స్త్రీమాట్లయింది.
ఆవు పాడిచింది తన్నింది
పాలు మట్టి పాలయ్యాయి
అరణ్యరోదన బ్రతుకు
లేరు లేరు అమ్మా నాన్నా.

లేదు లేదు
వెలుగులేదు
కాదు కాదు
బతుకు సుఖంకాదు

మోసగిస్తుంది చూపు
ఈ చూపు ఎక్కడిది
కాంతి కరుణించినది
కళ్లు చదువుతున్న భాష
కళ్లు మూసుకుంటే
రంగూ రుచీ వాసనాలేని వధువు ప్రకృతి.

తురకదాన్ని తెచ్చాడ్రా
యీసడింపు
ఈర్ష్య
ఎద్దుమాంసం తింటావురా?
హేళన
హింస.

పాలు ఇసికలో ఇంకిపోయి ఏర్పడిన మచ్చ
పాలముంత అట్లాగే ఒరిగివుంది,
పోవన్న ఆవును తిట్టి కొట్టి
దూడని విడిచాడు
అన్నిపాలు పోయినందుకు వాడికి బాధగావుంది
బాబుగారిమీద కూడా కోపంగావుంది
జాగర్త మీద పట్టుకోవాలా లేదా అని.
దూడ పాలు తాగుతోంది
తన బిడ్డకోసం దాచుకున్న ఆవు స్వార్థం

పిరమిడ్లు కట్టేసారు నీమీద
ఆ పూల తోటనిండా గోరీలు
మరగలు కక్కుతో మృత్యువు,
ఏముందని ఉండను ఇక్కడ
ఎవరికోసం తన పిరికి బతుకు

నీకు తెలుగు రాకుండావుంటే బావుండేది. లేక నేను కాకినాడ ఉద్యోగానికి రాకపోవలసింది. మీ నాన్నగారు మా ఆఫీసర్ కాకుండా

పోవల్సింది ఆయన నన్ను ఇంటికి తీసుకుపోయి కష్టపెట్టి పని చేయించకుండా ఉండాల్సింది నువ్వు నన్ను నాన్నగారు లేరని ఆ ఆది వారం చెప్పినప్పుడు ఉండండి కాఫీ తీసుకోండి అని అనక పోవాల్సింది మతాల గురించి కులాల గురించీ మన మధ్య సంభాషణలు రాకుండా ఉండాల్సింది ఆ సందర్భంలోనన్నా కనీసం మనిద్దరికి ఒకే అభిప్రాయం లేకుండా పోవాల్సింది రోజా నీతో మాటాడ్డానికి నేను తాపత్రయపడకుండా ఆపుకోవాల్సింది మీ గురించేచూస్తు వ్నానని అనక పోవాల్సింది మీరు ఏమిటో మన చేతుల్లో లేని శక్తులు కూడదీసాయి ఇంత అమృతం కుడిపాయి ఆ రుచిలో ఆ వెలుగులో ఒక్కసారి చేదు యీ చీకటి

నా సర్వస్వం నిన్ను ధ్యానించింది.

'పల్లెటూళ్లు అందంగా ఉంటాయికదూ ?
పొలాలగట్లు, సరస్సులు, చెట్లు, ప్రసాంతమైన ప్రకృతి, ఆలకాపర్ల పిల్లంగ్రోవి పాటలు'

తోటలు
చల్లని గాలులు
తీయని కలలు
స్మృతులు

'—'

'ఇంకో కొడుక్కూడా'

'అమ్మా అన్న పిలుపు మంత్రం కదూ ?'

'పిల్లలు వాళ్ల పరుగులు చిన్నారి బుల్లి చేతులు అమాయికమైన కళ్లు లోకాన్ని పూజించటానికి వచ్చిన భక్తులు విశ్వాన్ని ఆరాధించటానికి వచ్చిన ప్రేమికులు'

బిడ్డల ఈశ్వర ఛాయలను వెతికే కళ్లు
గుండెల్లో మూగి ప్రార్థన
అమ్మా, నాన్నా అన్న పిలుపు ప్రతిధ్వని
తీరని కోరిక

ఎండ వెచ్చగా
తోటలు ఆకుపచ్చగా
నేలమీద నాగేటి చాళ్లమీద వెలుగునీడల అద్దకం
పాపన్న పాట పాడుతున్నాడు హుషార్‌గా
ఈశ్వర అల్లా తేరే నామ్
సబ్‌కో సన్మతి దే భగవాన్
పాట మనసు పంచుతోంది
మంచి పెంచుతోంది

నువ్వు నేర్పిన పాటే వాడు పాడుతున్నాడు హాతిగా

'కాకినాడ వెళ్లిరావాలి అమ్మనీ, నాన్నగారినీ చూడాలి. ఒకటే కలలు వారం దినాలనుంచి.'

'వెళ్దాంలే'

వెళ్లనేలేకపోయావు

మీ అమ్మ తిట్టుంది

చిల్లంగిపెట్టి చంపించే సారని ఇంకా తిట్టోనో వుంటుంది మీ తమ్ముడు నీనిర్జీవ దేహాన్ని చూసి విలవిల్లాడి ఏడ్చాడు నేను తినేసాను నిన్ను

పాపన్న తన పనులు చేసుకుంటున్నాడు
పందిరిలో కట్టేడు దూడని
ఆవులని విప్పుతున్నాడు
పాపన్న ఆవులని మేతకి తోలుతున్నాడు
తోటలో అక్కడా అక్కడావున్న పచ్చిక అందుకుంటూ
నడుస్తున్నాయి ఆవులు

**3**

దబ్ దబ్ దబ్ — దబ్ దబ్
ఇసికమీద పాపన్న కఱ్ఱతో గట్టిగా కొట్టిన చప్పుడు
ఆవులు బెదిరాయి
రామం ఆ చప్పుడువేపు చూసాడు
పాపన్న తన ఆయుధంతో
కణ్వాశ్రమంలోని భరతుని లాగ

పదేళ్ళు నిండని పాపన్న
మనిషి జీవితం వ్యర్థం బూడిద అని
రామంని భయపెట్టిన పాముని
చిన్నకఱ్ఱతో
పదేళ్ళు నిండని పాపన్న
అబ్బో! మనిషి!
జేజేలు
పతాకాన్నందుకు ముందుకురుకుతోన్న విప్లవ విజేతలు!

పాపన్న కొత్తగా కనబడుతున్నాడు
డజనుమంది పిల్లలున్న తండ్రికి పదో బిడ్డడు
ఇంట్లో తిండిలేక కంబారి అయ్యాడు

ఆ వయసు పిల్లలని సేవకులుగా తీసుకోకూడదని లేబర్ సిక్కుంది ట పదేళ్ళకుఱ్రవాడిని, బానిసనిచేసి, వాడికి విద్యాబుద్ధులకు అవకాశం లేకుండా చేయటం నేరం

మరి సంఘాన్ని లేవనెత్తాలనుకున్న
తనకీ ఫాతిమాకి ఇన్నాళ్ళూ

పాపన్న సంగతి పట్టలేదెందుకో
ఎప్పుడూ వర్ణభేదాలు
మత భేదాలు లేకుండా చేసే పథకాలమీదికే
మనను మళ్ళింది
కాని పాపన్నని అర్థ బానిసనిచేసి—

పాపన్నకి పాత నిక్కరు తలకి తువ్వాలూ తప్పించి నిండాగుడ్డల్లేవు. జుట్టుకి నూనెవుండదు పాదాలకి ఏమీవుండవు మూడుపూటలు తిండి ముప్పయి రూపాయిల జీతం సాలుకి ఆవులు మేపుకురావాలి పగలంతా రోజుకు పన్నెండు గంటలు పని చేయాలి వాడు

కురుక్షేత్రంలో
ప్రథమ దివసం
అస్త్ర సన్యాసం చేసిన అర్జునుడు
పిరికి పిరికి రామం
విరాట్ రూపం చూపిన శ్రీకృష్ణుడు
పదేళ్ళ పాపన్న
గీత బోధ

యదార్థంగా ఈ యాత్మ దేనిని చంపుటలేదు దేనిచేతనూ చంపబడుటలేదు

చంపేదీ చంపబడేదీ నువ్వుకాదు
ఎవరు ఎవరు
ఎందుకెందుకు
చెప్పు చెప్పు?

పాము తాడయింది
పాపన్న ఆ తాడుని వేలాడ దీసాడు కఱ్ఱమీద
లేచి నుంచున్నాడు రామం
లేచి
వెళుతో రామం
పాపన్నా అని పిలుపు
పాతికేళ్ల వాడొకడు
పదేళ్ల రెండోవాడు
'పాపన్నా' రామం పిలుపు
ఎత్తుకున్నాడు పాపన్నని
ముద్దాడాడు బ్రతుకుని ప్రేమించి
వింతగావుంది పాపన్నకి

నాన్నా అంటావా?
అమ్మా అని ఫాతిమాని పిలుస్తావా

మా అమ్మ చాల మంచిది మా నాన్న చాల మంచివారు
అనుకుంటావా
ఆత్మలో మూగిగా కోరికలు

'నిన్ను పెంచుకుంటా' అన్నాడు రామం
'దించండి మొదాలు (ఆవులు) ఎలిపోతున్నాయి'
'పద నేనూ వస్తా'

ఇప్పుడే వినిపించిన ఆ గొంతెవరిది?
తనదికాదు
ఈ హృదయం ఎవరిది
తనదికాదు
ఈ సుధారసం ఎవరు చిందారు?
కోట్ల కోట్ల పేర్ల తన ఆత్మ

మనసులో
మా అమ్మా, మా నాన్నా చనిపోయారని
చెప్పుకుంటావా?
మా చరిత్రను లోకానికి మిగులుస్తావా?

రామం కి ఫాతిమా మిగిలినట్టయింది.
తమ చరిత్ర ప్రపంచానికి మిగిలినట్టయింది.
సెలయేటి నాడి కదిలినట్టయింది
పిరికితనం పాముని ఆశడేగ తన్నుకుపోయినట్టయింది.

ఇద్దరూ—
పదేళ్లవాడూ, పాతికేళ్లవాడూ—
ఆవులవెంట
ఆవుల నడకలో రేగుతున్న దుమ్ములో
నడుస్తున్నారు.

---



బందీ ప్రతాపరుద్రుడు

('ఆంధ్రపత్రిక'' ఆంగీరస సంవత్సరాదిసంచిక నుంచి)

చిత్రకారుడు : శ్రీ సుసర్ల వెంకటరామయ్య

# సంగీత విద్యావ్యాప్తి

## శ్రీ సంధ్యావందనం శ్రీనివాస రావు

సంగీత విద్యను భారతీయులు వేలకొలది సంవత్సరముల తరబడి తపస్సుచేసి, ఉపాసన గావించి నేటి ఉత్తమ స్థితికి తెచ్చియున్నారు భృంగి నటేశ మతంగ నారదాదులుపాసించిన విద్య! యాజ్ఞవల్క్యాది ఋషులు మోక్షసాధనమని చాటిన విద్య. పురందర దాసులు మొదలుకొని త్యాగరాజస్వాములు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామిదీక్షితులు, పల్లవిగోపాలయ్య, పట్నం సుబ్రహ్మణ్యయ్యరు, ఘనం కృష్ణయ్యర్ మొదలగు వాగ్గేయకారులు గొప్ప రచనలను చేసి సంగీతసంపదను బహురూపంగా పెంపొందించిరి ఇటీవల పాపనాశం శివన్, శ్రీ వాసుదేవాచార్యులు, ముత్తయ్యభాగవతర్, తి. న చ వెంకటనారాయణాచార్యులు, మంగళంపల్లి బాలమురళీకృష్ణ మొదలగు విద్వాంసులు తమ తమ మనోధర్మమునకు అనుగుణ్యముగా కొత్త రీతులలో అనేక రచనలను అతిదక్షతతో సాగించియున్నారు కీర్తనలు, వర్ణాలు, తిల్లానాలు, స్వరజతులు, జావళులు అనేక విద్వాంసులు రచియించగల్గుట నేటి విశేషమనవచ్చును సంగీత రచనకు చాలినంత వ్యుత్పన్నత లేనివారు, వట్టి సాహిత్యములను రచియించి వాటికి ఇతరులతో సంగీతమట్లులను రచియింపచేయువారును అసంఖ్యాకులుగా కలరు హిందుస్తానీ రాగములందు వర్ణములు తిల్లానాలు విరివిగా వచ్చుచున్నవి. పదములు, లక్షణగీతములు ఇటీవల రచియింపబడినవి చాల అరుదు లేవన వచ్చును ఇంత విపులముగా నవీన రచనలు కొల్లకొల్లలుగా లభించుచున్నప్పుడు సంగీత విద్య అత్యంతముగా అభివృద్ధి చెందినదని చెప్పక తప్పదుకదా! ఇంత ఎక్కువగా ముందంజ వేసిన సంగీతము, గాన కళోపాసకులకు ఎంతో తృప్తిని కలుగ చేయవలయునుకదా? నేటి సంగీత విద్యా హితైషులట్టి సంతోషమును పొంద గల్గుచున్నారా? కళోపాసకులకు తమ కళలను తనివితీర ఆరాధించితిమన్న ఆత్మ తృప్తి నేడు కలదా? రసికులకు మునుపటివలె సంగీతమును విన్నందువలన లభించిన వికాసము ఆనందము కలుగుచున్నదా? పాడే వారి సంఖ్య పెచ్చు పెరిగినను, ఉద్దండులు, మహా గాయకులు గడచిన తరములోవలె ఇప్పుడు ఎన్నతగినవారు బహు తక్కువ అన్న అభిప్రాయము ప్రబలినది 'సంగీతము బహు విరివిగావ్యాపించినదేకాని, లోతుపాతులు తగ్గినవి' అన్న అభిప్రాయములను అనేక సభలలో గాయకులు రసికులూ చెప్పుచుండుట పరిపాటి అయినది. హిందుస్తానీ సంగీతమును గురించియూ ఇట్లే అనుకొనుచున్నారు. సంగీతకళ, విద్య-నేడు క్షీణ దశ యందున్నదా? లేక అభివృద్ధి మార్గమున నున్నదా? ఇది చర్చనీయాంశము. ఇందులో భిన్నాభిప్రాయములు లేకపోవు; ఉండుట సహజము. పైగరు వరదాచార్యులవారి ఎల్లలేని మనోధర్మము, ముత్తయ్య భాగవతర్, సభేశయ్యరు, పొన్నయపిళ్లై మొదలగు విద్వాంసుల శాస్త్రపరిజ్ఞానము, కరైకుడి సోదరుల వీణ, పల్లడం సంజీవరావు వేణుగానము, దక్షిణామూర్తి పిళ్ళై కంజిరా, గోవిందస్వామిపిళ్ళై వయొలిన్, కొనేరి రాజపురం వైద్యనాథయ్యరు రాగ విస్తారం, నయనాపిళ్ళైగారి స్వర విన్యాసం, ధనమ్మ పదాలు విన్న చెవులకు ఈ రోజులలో లభించుగానము ఏ పాటి? అని వయసు ముదిరిన రసికులనుట విన్నాము. అట్లే అరియకుడి రామానుజ అయ్యంగార్ల అసదృశగానము, శ్రీ మహారాజపురం విశ్వనాథయ్యరుగారి తంజావూరి శైలిలో అంద చందములు విరజిమ్మ గానము, పాలఘాటు మణిఅయ్యరు మృదంగము, మహాలింగము వేణుగానము, వెంకటస్వామినాయుడుగారి వయొలిన్ నాదము, రాజరత్నపిళ్ళై నాగస్వరం అందరాని ఎల్లలయి నిలచిపోయినవి ఇక అటువంటి అప్పటమయిన చిక్కని సంగీతకల్పన, శాస్త్ర మర్యాద నతిక్రమించక, గౌరవముతోబాటు సభారక్తి గల్గించు ఉత్కృష్ట మనోధర్మము అరుదు—ముమ్మాటికి అరుదు—అన్న వాదములోని సత్యమును గుర్తించక తప్పదు ఒక్కొక్క తరమునందు అసామాన్య ప్రతిభ, మనోధర్మము, ప్రజల నాకర్షించు శైలి, కొత్త కొత్త రుచులన్న చూపెట్టు ధర్మములుగల గాన ప్రదర్శన లుండి తీరును అంతరిని శోభాసనిపించి, పండిత పామరులను రంజింపచేయు కళాకారుల సంఖ్య ఏ దేశమునందయినా ఏ కాలమందయినా తక్కువగానే యుండును

సంగీత కచ్చేరిల తరము, ఆ కచ్చేరీలను చేయగల గాయకుల సాధన సంపత్తి—రెండునూ బాగా పరిశీలించినంతమాత్రమున సంగీత విద్యావ్యాప్తి 'ఇట్లున్న'దని చెప్పుటకు వీలుపడదు సంగీత కచ్చేరిలందు హాజరయిన శ్రోతలను ఆకర్షించి, ఏరీతిగా పాడిన తన గానము మోహనకరముగ నుండునన్న ఏకైక లక్ష్యము కళా ప్రదర్శకుని ముఖ్య సమస్యగా పరిణమించును సభలందు సంగీతమును హాయిగా వినువారుందురు కొందరికి సాహిత్య ఉచ్చారణ

ముఖ్యము. శారీరము ఆకర్షణీయముగ నుండవలయును మరికొందరికి; రాగమును ఆలపించిన తృప్తి కొందరికి, కీర్తనలు మరి కొందరికి ఇష్టము మంచి తాళవరుసలు, లయ గొడవలు, హెచ్చు స్థాయిలోని త్వరితగతి ఫిర్కాలు, అచ్చటచ్చట హిందుస్తానీ సంగీతపు రుచుల జాడలు గల పట్లు—అపేక్షించువారు కొందరు; అట్టిది కూడదని ఆక్షేపించువారు మరికొందరు, ఏ గొడవలూ తెలియక ఏదో కొంతకాలము చెవి కింపు గొలుపు ధ్వనులను వినువారు ఎక్కువగ నుందురు బుద్ధికి పని ఇచ్చినా, ఇవ్వకున్నా విసుగుకొను వారుందురు. కేవలము ప్రసిద్ధ రాగములు తాళములతో రక్తి గల్గునేకాని, "కొత్త రాగములందు కల్పన వృథా ప్రయాసఅనియు, కొత్త తాళములందు పనులు చేయుట వట్టి పాండిత్య ప్రకర్ష అనియూ, ఎప్పుడూ కాంభోజి, కల్యాణి రాగాలేనా?" అని అడుగువారుందురు. నానా రుచులు, సంస్కారము, వయోధర్మములుగల సభికులను, తమ సంగీత విద్యా నైపుణిని జాగ్రత్తగా చూపెట్టి, మెప్పించి రక్తిగా కచ్చేరీలు చేయుగల్గువారు నిజంగా ధీరులు. ఇట్టి వారి ప్రదర్శనలను మాత్రము మనసులో నుంచుకొని సంగీత విద్య ఎట్టి దశయందున్నది అన్న విషయమును తేల్చుట న్యాయము కాదని నా మనవి

సంగీతప్రదర్శన కళోపాసకునిపరమావధి. మునుపటితరములో గాయకులు రాగ స్వరూపమును శుద్ధముగా, గమక పుష్టితో, భావయుక్తముగా పాడి, సంప్రదాయపుబద్ధీలను దాటక ప్రజలను సంతోషపరచెడివారు వారి అతిశయపుపనులలో సంప్రదాయమునకు విరుద్ధమయిన ప్రయోగములుగాని, గౌరవము చాలని చిలిపి చేష్టల మనోధర్మముగాని ఏమయినచేసి వినువారి మన్నన పొందుట పరమావధి అని చేసిన వివరీత కల్పనలు, చేతలుగాని, వెదకిననూ దొరికెడివికావు. ఇప్పటి తరములో ఆ నిబంధన రాను రాను నడలినది. విచ్చలవిడిగా వచ్చి రాగ స్వరూపమునకు చెందని సంగతులను బుద్ధి వైచిత్ర్యమని పొగడు రసిక బృందము తయారయినది. స్వరూపము, జీవములేని వట్టి 'Scales' అనబడు ఆరోహణ అవరోహణ పథకమునుబట్టి హద్దులేక గొంతు పలుకుబడిని చూపెట్టు నిస్సార ప్రస్తారము ప్రబలి మామూలు ప్రజలకు చక్కని సంప్రదాయ సంగీతమున మాత్రము లభించు శాంతిరసమునకు మారుగా, భ్రమ పుట్టించు గారడీలు విరళముగా లభించుచున్నవి వినువారి చెవులందు సురటి, కాంభోజి, భైరవి లాంటి రాగముల రుచి బాగుగా నాటని కారణమువలన ఇట్టి స్వల్పపు రుచులు (non-classical excellences) సంప్రదాయ సంగీత కచ్చేరీలందు ప్రబలినవి. విపరీతమయిన లయ గొడవలకు లోనయి, రాగరసమును, శ్రుతిని అటు త్రోసిపుచ్చి, లెక్కలకు మనసిచ్చిన కృత్రిమ స్వర విస్తారముతో గంభీరమయిన మనోధర్మమునకు, రాగ మర్యాదగల నెరవలు, తానం, పల్లవి, విళంబ రాగ విస్తారములు వెనుకబడినవి. నేటి సభలందు చక్కని సంప్రదాయ సంగీతమును పాడినందున ప్రజలు తృప్తి చెందజాలరన్న అతిశయోక్తి కాజాలదు.

కాబట్టి సంగీతవిద్య సర్వతోముఖముగా అభివృద్ధి జెందుటకు సభా ప్రదర్శనలు మాత్రము చాలవు త్రిమూర్తుల కీర్తనలందు ఎన్నింటిని ప్రజలు పూర్తిగా వినగల్గిరి బహు కొన్ని మాత్రమేకదా? వర్ణములు వందలాదిగా కలవు. పదములు, జావళులు, ఇంకా లక్షణ గీతములు ప్రబంధములు అన్నీ మరుగు పడిపోవుచున్నవి ఇట్టి సంపదను మొట్టమొదట కాపాడుట విధి. సంగీత విద్యా వ్యాప్తికి ఇది గొప్ప బొక్కసము కచ్చేరీలలో ఎవరికి నచ్చినట్లు వారు కీర్తనలను మార్చి పాడుటవల్ల మన సంప్రదాయమునకు తీరని నష్టము కలుగుచున్నది పాశ్చాత్య సంగీత పద్ధతిలో తర్బీతు పొందిన గాయకులు రసికులు, పెద్దలు చేసిన సంగీత రచనలో ఎట్టి మార్పును భరించరు '16 వ శతాబ్దపు రచన లవి' అనుచూ ఆధునిక ప్రదర్శకులు ఆ రచయిత హృదయమును ఎరిగి తు చ తప్పక వాయించెదరు బిథోవన్, మోజార్ట్ మొదలగు మహనీయుల సంగీత రచనలను అట్లే చెక్కు చెదరక, తమ మార్పుల నిసుమంతయు చేర్చక కాపాడుచూ ప్రదర్శించుచున్నారు మార్పులను వినువారు గర్హింతురు ప్రదర్శకులకూ అట్టి అవినీతి నచ్చదు హిందుస్తానీ సంగీత పద్ధతియందును ఇట్టి సంప్రదాయ విరుద్ధమయిన పనులను గాయకులూ తలపెట్టరు. వినువారు అసలు ఓర్చుకొనరు ధ్రుపద్ అనే రచన మామూలు ప్రజలకు రక్తినివ్వదన్న కారణముచేత దానికి మనోధర్మపు సంగతులు చేర్చి, త్వరితగతిలో పాడిన గాయకుని మన్నించరు ఖ్యాల్, ఠుమ్రి, టప్పా ప్రతిభీజ ఏ రీతిగా నుండవలయునో అట్లు సంప్రదాయంగా పాడి తీరవలయును వినువారికి ఆ సంప్రదాయముపట్ల ఆసక్తి గౌరవములు మెండు విలంబిత ఆలాపనను ఓపికబట్టివిని, సంప్రదాయ సంగీతమునందు గౌరవమయిన రక్తినే అపేక్షింతురు. మన పద్ధతిలో—గాయకులు స్వతంత్రులు దీక్షితుల కీర్తనలకు తమకు తోచిన సంగతులు చేర్చి, మధ్యమకాల కీర్తనల నడకలో అమర్చి పాడుటను ఎవ్వరూ ఆక్షేపించరు త్యాగయ్యగారి కీర్తనలు తారుమారులయిపోవుచున్నవి కచ్చేరికి పనికివచ్చు కొన్ని కీర్తనలను మాత్రమే నేర్చుకొని సంగీతవిద్యను క్షుణ్ణంగా అభ్యసించని గాయకులవల్ల మన సంగీత సంపద కాపాడబడునని ఎంతమాత్రము ఆశింపగలము? ఇక సామాన్య ప్రజలో తమకు కొంత హాయినిచ్చు గాయకులకు ఏదో వారి ప్రాప్తి కొలదిగా ధన సహాయముచేసి ఇతర సమస్యల

పట్ల శ్రద్ధ చూపుటలేదు కనుక మన సంగీత విద్య కృశించుచున్నది. త్వరలో సమసిపోవనున్నది. ఇట్టి నష్టము చేకూరకముందే విద్యా సంస్థలు దేశమంతటా ప్రబలి సంగీత రచనలను పూర్తిగా అభ్యసించు విద్యార్థి బృందములను తయారు చేసినగాని సంగీత విద్యా వ్యాప్తి సంతృప్తిగా సర్వతోముఖంగా కొనసాగనేరదు.

సంగీతవిద్య బాగుగా అభివృద్ధి పొందుటకు చక్కని విద్యా సంస్కారమున్న యువకులు, యువతులు పూనుకోవలయును. సంప్రదాయ ప్రదర్శినిలాంటి ఉద్గ్రంథములలోని గీతములను, ప్రబంధములను, వర్ణములను, రాగమాలికలను, సంచారి ప్రయోగములు పాడించి రికార్డు చేయించి ఆ రికార్డుల లైబ్రరీని పెద్ద విశ్వ విద్యాలయ సంస్థలు భద్రపరచవలయును. పదాలు, నవగ్రహ కీర్తనలు, పంచరత్న కీర్తనలు పెద్ద విద్వాంసులచే పాడించి రికార్డు చేయించి, విశ్వవిద్యాలయము లందును, సంగీత అకాడమీలాంటి సంస్థ లందును, క్రోడీకరించి ప్రజలకు కావలసినప్పుడు వినే సదవకాశమును ఏర్పరచవలయును. త్రిమూర్తుల కీర్తనలను, ఇంకనూ మారక మునుపే అప్పటమయిన పాఠాంతరములతో రికార్డు చేయించుట ఎంతయిన అవసరము వీటి తరువాత పెద్ద విద్వాంసులు వాయించిన తానము, రాగ ఆలాపన, స్వర విస్తారమును, సంప్రదాయమును విశదముగా శ్రోతలచెవికి అందించునట్టివి తయారు కావలయును. ఇదివరకు కచ్చేరీలు, గ్రామఫోను రికార్డులు కేవలము వ్యాపార దృష్ట్యా కొనసాగినవి. ఇట్టి సంస్కారమును కాపాడుటకని ప్రత్యేకమయిన రికార్డింగు సంస్థలను కేంద్ర ప్రభుత్వము ఏర్పరచి, కొనసాగించి, ఆ రికార్డులను విశ్వవిద్యాలయాలకు,రేడియో కేంద్రములకు, సంగీతసభలకు అందచేయగల్గిననాడు సంగీత సంపద సమగ్రముగా శ్రోతల అందుబాటులోకి రాగలదు.

సంగీత విద్యావ్యాప్తికి సంగీత బోధనలో విప్లవాత్మకముగు మార్పులు రావలసియున్నవి. ఇదివరకు సంగీత విద్యను నేర్చుకొనుట గురుకులవాస పద్ధతి మేరకు జరిగినది. గురువుసేవ చేసి అతనిమర్జీ ననుసరించి సంవత్సరముల తరబడి వారింటిలో నివసించి వారి కచ్చేరీలను, ఇంటచేయు సాధనను విని, విద్య నభ్యసించెడివారు. రాజుల ఆదరణలో నుండిన విద్వాంసులు ఒకేతావునందుండుటవల్ల విద్యార్థులకు విద్యాబోధన బాగుగా కొనసాగెడిది. మంచి శారీరము, శ్రుతిలయ జ్ఞానమున్న శిష్యులకు గురువులు ఎంతో ప్రేమతో నేర్పెడివారు. కాని ఈ విద్యాబోధనలో గురువు అనుగ్రహ సంపాదన పరమావధి శిష్యునికి స్వతంత్రము అరుదు. చర్చించుటకో, ప్రశ్నలు వేయుటకో ఆస్పద ముండెడిదికాదు. రాను రాను సభా కచ్చేరీలు రాజుల ఆశ్రయములకు మారుగా నెలకొన్నవి. ప్రజల—సమూహముల అభిరుచికి తగినట్లు తమ ప్రదర్శనలను సర్దుకోవలసి వచ్చినది.

కేవలము పెద్ద లక్ష్యములను గురించి బాధపడుటకన్న ప్రజాదరణకు కావలసిన సామగ్రికై గాయకులు ప్రయత్నించవలసి వచ్చినది. లక్షణ గీతములకు స్వస్తి చెప్పబడినది. కేవలము సంగీతవిద్య నభ్యసించి విద్వాంసులు కావలయునన్న దీక్ష తగ్గినది. లక్షణములను తెలుసుకొను ఆసక్తి, సాహిత్యసంస్కారము, పరిశోధనాత్మక దృక్పథము మాసిపోయి, కచ్చేరికి పనికివచ్చే కొన్ని వర్ణములను కీర్తనలను పదం జావళులను మాత్రము అభ్యసింప దొడగిరి. Academic—attitude, విద్యావ్యాసంగ కాంక్ష నశించినది. ఇక గాయకులు నెలకు ఇరువది రోజులు ప్రయాణములందు, కచ్చేరీలందు నిమగ్నులయి పందున తమ విద్య నభివృద్ధి చేసుకొనుటకే అవకాశము చాలినందున, చెంత జేరిన శిష్యులకు నేర్పించు వ్యవధి యుండెడిది కాదు పది సంవత్సరముల తరువాత కూడ రెండువర్ణములు, నాలుగు కీర్తనలు చెప్పని గురువు లెందరో కలరు. విద్యాబోధన జరుగవలసిన రీతిగా సక్రమముగా జరుగుట దుర్లభమయినది. ఇట్టి సందర్భములో రేడియోలాంటి సంస్థలు రావడము జరిగినది. అల్పము, స్వల్పము పాడగల్గినవారికి ఇంతో అంతో ప్రోత్సాహము లభించినది. మునుపటివలె ఎప్పుడోగాని కచ్చేరీ లభించుటకు మారుగా సులువుగా ఎక్కువగా అవకాశములు ఏర్పడినవి. సంగీత కచ్చేరీలు జరుపని విద్వాంసులకు ప్రయివేట్ ట్యూషన్లమూలమున ఒక ఉపవృత్తి ఏర్పడినది. అధికారమున్నవారు, లేనివారు ప్రతివారికి సంగీతమును నేర్పడము కొనసాగినది. ఇట్టి స్థితిలో మంచి గాయకులు రావడము దుర్లభముకదా! తమ శక్తిని పూర్తిగా వ్యయపరచినగాని నలుగురికి నేర్పి బ్రతుకజాలరు. నేర్పించువారి గొంతు క్రమంగా మొద్దుబారి వారి సంగీత నైపుణ్యము కూడ క్రమముగా తగ్గిపోవుట తప్పనిసరి. పోషణ చాలని సంగీత విద్యనమ్మి ఎవరు అభ్యసింపగలరు? నేడు సంగీతవిద్యను నేర్చుకొనుటకు యువకులు వెనుకంజవేయుచున్నారు. ఎంతమాత్రము చదువువచ్చినా ఏదో ఉద్యోగము చేసుకోవచ్చునుగాని నిరంతరము నమ్మకములేని జీవనము గడుపుటకు ఎవరు సాహసింతురు? సంప్రదాయ సంగీతము బాగుగా వ్యాపించవలయునన్న ప్రతి బాలునికి, బాలికకు తన బడిలో చాలినంత నేర్చుకునే అవకాశము వుండవలయును. ప్రతి పాఠశాలలోను సంగీత విద్యా బోధన కొనసాగవలయును. ప్రతి వారూ అంతో ఇంతో ప్రయత్నించిన పాడగల చిన్నపాట లెన్నయిన గలవు. ప్రాథమిక పాఠశాలలందు కొన్ని చిందుల పాటలు, భద్రాచలం రామదాసుపాటలు, డ్రిల్లుక్లాసు డ్రాయింగ్ క్లాసులవలె ఎక్కువ ఆర్భాటములేక నేర్పించవలయును. ప్రాథమికపాఠశాల వదలివచ్చుటకు అయిదు సంవత్సరములు పట్టును. అంతటితో ఈ చిన్నపాటలు సుమారు ఇరువది అందరికీ పట్టుబడును. ఇది నా అనుభవములోనిది. ఒక సభలోవిన్నాదికి 'పలుకే బంగార మాయెనా' అన్న రావ్వ

దాను పాటను పదిహేను నిముషాలలో నేర్పించి పాడించవచ్చును. మన జానపద గీతాలు, స్త్రీలపాటలు, కోలాటము వరుసలు, జాతీయ గీతాలు, కొన్ని భజన్లు—అందరికీ పట్టుబడును. అంతగా గొంతు లేదనుకొనువారుకూడ గోష్ఠిలో చేరిపాడగల్గుదురు. ఇట్టి వ్యవస్థకు Community singing అందురు. అమెరికా, ఇంగ్లండు మొదలగు దేశాలలో కాలేజివిద్యార్థులు అందరూచేరి పాడుచుండుటలేదా? క్రైస్తవాలయాలలో ఆదివారమునాడు సమూహ గానములో (Choir Music) పాల్గొన్నవారికి మూడు డాలర్లిచ్చెదరట. మనదేవాలయములందు అట్టి భజనబృందములను ఏర్పరచి పాల్గొను విద్యార్థులకు, యువతీయువకులకు ఇంతప్రసాదమును, రెండురూపాయలుసొమ్ము ఇచ్చిన ఈభక్తిగేయములు బాగా అలవడును. చిన్నవారికి కొంతసహాయము, ప్రోత్సాహము లభించును. భజనపద్ధతిలోని అమూల్యమైనపాటలను ప్రజలకు సంగీతసభలందును దేవాలయములందును నేర్పించి, అప్పుడప్పుడు మంచివిద్వాంసులు పాల్గొని నిర్వహించుగోష్ఠులను ఏర్పరచి, పాల్గొనువారికి కేవలము టెంకాయచిప్ప నివ్వక ధారాళముగా ధనసహాయము నివ్వవలయును. ఇట్టిప్రయత్నము రాష్ట్ర సంగీత నాటక అకాడమీవారు ప్రతిజిల్లాలోను, తాలూకాలందును "వరుస"లుజరుగుదేవాలయములందు ఏర్పాట్లు చేయించవలయును. గాయకులకు ప్రోత్సాహముతోబాటు ప్రజానీకానికి మన సంప్రదాయ సంగీతములో అభిరుచిగల్గి క్రమముగా ఆసక్తిగల పరిచయముకూడ ఏర్పడగలదు. అట్టిపాటలపుస్తకాలు సస్వరముగా వెలువడుట అవసరం.

ఇటుతరువాత హైస్కూలు తరగతులలో కూడ సంగీతమునకని మూడుగంటలు—ఒకవారమునకు కేటాయించవచ్చును. ఒకటి అందరికీతప్పనిసరి—చిన్నపాటలను కలసి పాడించుతరగతి. వారిలో మంచిశారీరము, సంగీతపుచెవి గలవారిని ఏర్చి, తతిమ్మా రెండుగంటలలో కొంతకాలము స్వరావళులను, త్యాగయ్య దివ్యనామ కీర్తనలను నేర్పించవచ్చును. హైస్కూలుతరగతిలో గీతములు, చిన్నకీర్తనలు, వీలున్నవారికి వీణ, వయొలిన్ నేర్పవచ్చును. హైస్కూలు తరగతులలో నాలుగుగంటలు కేటాయించిన మంచిది. ఒకటి మామూలు గోష్ఠి గానమునకు, తతిమ్మా మూడుశాస్త్రీయ సంగీత భోధనకు. ఇట్టిప్రయత్నమునకు ప్రభుత్వము పూనుకొనిన అనేక గాయకులకు ఆర్. టి. గ్రేడున ఉద్యోగము లభించుటవలన నేడుకనివిని ఎరుగనిసంఖ్యలో యువకులు, యువతులు సంగీతము నభ్యసించి మంచి ఉపాధ్యాయులు కాగలరు. పాటనేర్చినవారంతా కచ్చేరీలు చేయనక్కరలేదు. ఆ విద్యను బుద్ధివికాశముకొరకు తెలుసుకొనడమే పరమావధి. ఇప్పటిలో పెద్దపెద్ద పట్టణాలలో కూడ అనేకమందిబాలబాలికలు సరియయిన తర్ఫీతునిచ్చెడివారు లేనందున సంగీతము నేర్చుకొనజాలక పోవుచున్నారు. మనగ్రామములందు పాఠశాలలందు, హైస్కూళ్ళలోనూ సంగీత ఉపాధ్యాయులను నియమించిన ఆకొరతతీరిపోయి ప్రజాసామాన్యమునకు మనసంప్రదాయ సంగీతమందు అభిరుచి ఆసక్తి ఏర్పడును. భక్తి, సాహిత్యసంస్కారము, మెత్తని హృదయము, చక్కనిబుద్ధివికాసము అందరికీ తప్పకలభించును.

కళాశాలలందు పెద్దవర్ణములు, కీర్తనలు మనోధర్మ సంగీతమును నేర్పుటకు సంగీతమును ఒక "పార్టు"గా నుంచవలయును. హైస్కూలులో అందరికీ గోష్ఠిగానపు పాఠములతో ఈ బలవంతపు విద్యాబోధనను ఆపివేయవచ్చును. కళాశాలలందు బాలికలకు యువకులకూ సంగీతవిద్యను, ఆ శాస్త్రమును బాగుగా పరిశోధించి, చదివి, పాడి, సాధనచేయుటకు అవకాశము లేర్పడవలయును. అటుతరువాత మంచిశారీరము, వాద్యములందు స్వాధీనము గలవారు సంగీతమును వృత్తిగా చేసుకోవచ్చును. ఇప్పటిస్థితిలో వారు గురుకులవాసమునకు అర్హులు. పెద్దపేరు ప్రఖ్యాతలు గల విద్వాంసులఇంట కొన్నిసంవత్సరములుండి తమ జ్ఞానమును అభివృద్ధి చేసుకొనుట బహుతేలిక. ఇటువంటి శిష్యులక్కు నేర్పించుటకు ఎట్టివారికైన ఉత్సాహము వుండును. ఇటువంటి వారికి మూడు సంవత్సరములు పూర్తిగా సంగీతకళాశాలలందు తర్ఫీతునిచ్చిన మంచిది. అందులో ప్రదర్శనను ముఖ్యముగా మనసులో నుంచుకొనువారిని కచ్చేరికి, ప్రక్కవాద్యములకు తయారుచేయుటకు ఒకశాఖనుంచవలయును. ఇచ్చట రోజు కొన్నిగంటలు సాధనచేయించి గొంతుకను, వాద్యములను స్వాధీనపరచుకొనుట పరమావధి. ఇంకొకశాఖలో పరిశోధన ముఖ్యముగా కొనసాగవలయును. భరతముని రచించిన నాట్యశాస్త్రమును, ఆధునికులయిన శాస్త్రకారుల రచనలు చదివి, కొత్త కీర్తనలను, వర్ణములను కొత్తరాగాలలో ఏర్పరచి వీరు పరిశోధన కొనసాగించవలయును. ఇకవాద్యములను ఏరీతిగా తయారించుట? వాటితో కొత్తమార్పులేవని తెలుసుకొనుట; ప్రాచీన గ్రంథముల సారమును గ్రహించి నేటిసంగీత శాస్త్రమునకు మంచి సూత్రముల నేర్పరచుట; ఇతర సంగీతశాస్త్రములందు ప్రవేశము, అభిరుచి గలవారికి ఆ సంగీత పద్ధతులందు మంచి తర్ఫీతు నిచ్చుట. హిందు

స్థాని, కర్ణాటక పద్ధతుల పరస్పర సమ్మైక్యతవల్ల కలుగు క్రొత్త క్రొత్త వర్ణమట్టులు, వాద్యనైపుణ్యమును శాస్త్రరీతిగా పరిశీలించి రూపొందించుట ఎంతైన అవసరము. జిల్లాలందు వాద్యగోష్ఠు లుండుట ఎంతో ప్రోత్సాహకరముగ నుండును. ఇట్టి పరిస్థితులు అమెరికా, ఇంగ్లండులలో ఏర్పడి యుండుటవలన సంప్రదాయ సంగీతము, లలిత సంగీతము, జానపద గేయములు, జంత్ర సమ్మేళనములు అత్యంత వైభవముగా అభివృద్ధి చెందినవి. ఏ శాఖ కా శాఖ ప్రబలుతూ సంప్రదాయమయిన శాస్త్రీయ సంగీతమునకు ఇబ్బంది లేక అన్నీ వికాసవంతముగా ముందంజ వేయుచున్నవి. మన దేశమునందు శాస్త్ర సంగీత కచ్చేరీలందు ఏవి పాడినా చెల్లును. ఇది నష్టమునకు దారి తీయును. లలిత సంగీతమును, శాస్త్రీయ సంగీతమును వేర్వేరు సన్నివేశములందు విడిగా వినుటకు ఏర్పాట్లు జరుగుట ఎంతయిన అవసరము. ప్రజా సామాన్యమునకు మన ప్రసిద్ధ రాగములు, తాళములు పాఠశాలలందు అంతో ఇంతో బోధపడిన నాడు మన శాస్త్రీయ సంగీతము అత్యంతాభివృద్ధి నొందగలదు. సంగీతశాస్త్రము లక్ష్య లక్షణ సమన్వితముగా వ్యాపించును. సంగీత విద్యను అభ్యసించు వారికి మంచి జీవనోపాధి ఏర్పడును. ఆధునిక విద్యా విధానము మేరకు ప్రారంభ విద్యనుండి, M A., Doctorate స్థాయిలో గురుకుల వాసము మేరకు సంగీత విద్య నభ్యసించు ఏర్పాట్లును, సదవకాశమును మన ప్రభుత్వము క్రమముగా ఏర్పరచవచ్చునని ఆశించుచున్నాను మహాబుధు లుపాసించిన ఈ ఉత్కృష్ట సంగీతవిద్య తన సహజ ఔన్నత్యము నందుకొని భారత ప్రజల మనసునకు ఆనందమును, శాంతిని చేకూర్చును. మన సంగీత సంపద పూర్తిగా మనకు దక్కును.

# మహాజ్యోతి

శ్రీ వఝల కాళిదాసు

ఊహలతోనే
ఊయలకట్టి,
ఉవ్వెత్తుగపై
కూగిపోదురా

భూత భవిష్యత్
పాతాళాలకు
పడిపోవుటకై
చెడిపోవుటకై !

భూతం భూతం
భావి బావియే!
వర్తమానమే
వాస్తవ మెరుగుడు

ఉన్నది కన్నది
ఉత్తమమైనది
ఉన్నది నిత్యం
కన్నది సత్యం!!

గతం మృతంబని
కార్చకు మశ్రులు
భవిష్యత్తునకు
పడకే ఆశలు

నడుస్తున్నదే
నవజీవనము
కనబడలేదా
వినబడలేదా!!

బిర బిర బిర బిర
గిర గిర గిర గిర
కాల చక్రమిది
కదలుచునున్నది

గతాగతాలను
కరాళ దంష్ట్రాంల
గభీరవక్త్రం
కాలుని చక్రం!!

ఊహాలోకపు
ఉచ్చులలోబడి
గిలగిల తన్నుక
వలవల ఏడ్వకు

విరియుచు నున్నవి
విరులను చూడుము
త్రావుము తేనెలు
తనివి తీరగా!!

వెనుకకు చూడకు
తిరుగకు ప్రక్కకు
అడుగల నేమీ
తడబడ నీయకు

నిత్యంబైనది
సత్యంబైనది
ప్రతిక్షణంబున్
పరుగిడు నీతో!!

* * *

యుగ యుగాల పాతకథలు
తల్చి పెంచుకోకు వ్యథలు
రేపేదో వస్తుందని
కూర్చుంటే సరి నీ పని—

నడుస్తున్న చరిత్రలకి
నాయకులం మనం మనం
కదలలేని హృదయాలకి
కలిగిద్దాం సంచలనం!!

దీర్ఘనిద్ర కా దియ్యది
దివ్యమైన నిత్యమైన
వర్తమాన కాంతిపథము
వాస్తవిక జీవన విధము—

మాధుర్యము సౌదర్యము
మనసు నిండ తనువు నిండ
విరులవాన తేనెసోన
విశ్వమెల్ల కురిపిద్దాం!!

చరిత్ర నృత్యం నవ్యం:
చర్విత చర్వణ కాదని
గతాను గతికం లోకం
కాదంటూ లేదంటూ

విభూషించి విజృంభించి
విరామాట నిత్యకాంతి
వెలకొలిపే మహాజ్యోతి
వెలిగిద్దాం రండు రండు!!

మనమార్గం నిర్వక్రం
మానవతా ఋజుచక్రం
పయనిద్దాం రయవిచలత్
ప్రతిభ మీర రండు రండు—

శత సహస్రకోటి కిరణ
సంతతులై ధగధగమని
మెరిసిపోవు మహాజ్యోతి
వెలిగిద్దాం రండు రండు!!

## పెద్ద కథ:

# మర మేకులు, చీర మడతలు

### శ్రీ బుచ్చిబాబు

ప్రకటమైన ఉద్రేకమూ కనబర్చకుండా అప్రియమైన వార్త చెప్పే గుండె నిబ్బరం గలవారు కొద్దిమందే ఉంటారు. ఆకొద్ది మందిలో గంగాధరం వొకడు మధ్యాహ్నం రెండు దాటింది టేబిల్ మీద బెల్ నొక్కాడు. నౌకర్ కోటయ్యని వెళ్ళి మాధవిని తీసుకు రమ్మన్నాడు పదినిమిషాల్లో మాధవి వొచ్చి బల్లముందు నిలబడింది. అదిపెద్దబల్ల. వ్రాత పరికరాలు, నియాన్ బల్బులైట్, బ్లాటర్, కాలెండర్, వెల్, చుట్టల సంచి, అగ్గిపెట్టె,అవీ వున్నాయి పక్కన వాష్‌బేసిన్, సోప్, టవెల్, గుండ్రటి అద్దం—ముందు నాలుగైదు రెక్సిన్ తొడుగు కుర్చీలు,వాటి వెనక సోఫాస్యూట్, మధ్యన,బొమ్మలు అతికించిన స్క్రీన్, గోడని, అమ్మకాల వయనం చూపే, గ్రాఫ్ చిత్రాలు —

ఆ గదిని ఇదే రెండోమారు చూడటం మాధవి పదినెలల క్రితం ఉద్యోగం ఇచ్చిన రోజు చూసింది మళ్ళా ఇదే చూడటం మొదటిసారి, ఆమె గదిలో వొస్తువుల్ని సరిగ్గా చూడలేదు కంపెని యజమాని గంగాధరంగార్ని కూడా ఆమె ఎప్పుడూ, పరిక్షగా చూడ లేదు ఎత్తుమనుదురు, ఎగదువ్విన క్రాపింగ్—ఎన్నో వెండ్రుకలు లేవు—కాస్తంత భీకరంగా అగుపడే మీసం, చుట్టకీ, తాంబూలానికీ డాగుపడ్డ వంకర పళ్ళవరస, గుండ్రటి చెక్కిళ్ళు, గడ్డం, పాతబడ్డ రాగి చెంబు రంగు—మాసిన ఖద్దరుకోటు—అదీ గంగాధరంగారి వైఖరి ఆమెని ఎప్పుడూ పిలవలేదు, గంగాధరంగారు ఎందుకోనని ఆశ్చర్యపడుతూ, ఆతృత కనబరుస్తూ చేతిగుప్పెట్లు బిగించి, ప్రశ్నార్థకంగా చూసింది

వ్రాత నిలిపి ఆమెకేసి చూసి

"ఇంక నువ్వు రేపటి నుంచి పనిలోకి రానక్కర్లేదు" అన్నాడు గంగాధరం

మాధవి మొహం ఎఱ్ఱబడింది—రక్తం చిందరవందరగా కదిలి కాబోలు, రెండుమూడు రంగుల ఛాయలు ఆమె బుగ్గల మీద కదుల్తున్నాయి. పైన పంకా తిరుగుతున్నా, చెమట బిందువులు నుదిటిమీదికి తోసుకొస్తున్నాయి తటపటాయించింది

"ఎందుకండీ?" అనగలిగింది తన కంఠం బొంగురుపోయి, తనకే వింతగా తోచింది.

"ఎందుకో నీకే తెలుసు"

అని గంగాధరం బెల్ నొక్కాడు నౌకర్ కోటయ్య రాగానే

"ఈమెని కాషియర్ దగ్గరకు తీసుకు వెళ్ళి, ఇవ్వాళవరకూ రావల్సింది లెక్కచూసి ఈమెకు ఇచ్చి పంప మను" అని, బల్లమీది కాగితాలు చూసుకుంటున్నాడు మాధవికి ఏమనాలో, ఏంచెయ్యాలో తెల్సిందికాదు. ఏడుపుని ఆపుగోగల నిబ్బరం తెచ్చుకుంది ఎల్లానో ఆవేదన సూచించే ధ్వనులొస్తున్నాయి, ఆమె కంఠం నుండి.

"మధ్యాహ్నం రెండు దాటాక అవుతే, ఇవాళ జీతం కూడా పూర్తిగా ముడుతుంది అందుకే ఇప్పుడు పిలిపించా" అన్నాడు. ఏమ నాలో తెలియదు మాధవికి మళ్ళా ఆ ప్రశ్నే,'—ఎందుకండీ'—అని అడుగుదామనుకుంది క్షణం క్రితం తెచ్చుకున్న గుండె నిబ్బరం ఇప్పుడు సడలిపోయింది ప్రశ్నలెందుకు? 'నమస్కారం' అని గది లోంచి వెళ్ళిపోయింది మాధవి. ఆమె గది దాటాక ఆయన ఏవిధమైన వీడ్కోలు మాటన్నాడో ఆమెకి వినబడలేదు

ఆ నాటివరకూ రావల్సిన డబ్బు తీసుకుని, రోడ్డు మీది కొచ్చింది రిక్షాలు కనబడ్డంలేదు జట్కాబండి మాటాడుకుని, తన గదికి చేరుకుంది తొందరగా చెవి, తాళంలోకి పోనిచ్చి తిప్పింది. తాళం చటుక్కున రావడంలేదు మళ్ళామళ్ళా తిప్పింది రావడం లేదు ఈ చెవికాదు మరొకటి. ఏదీ కనబడదేం? ఆఫీసులో డ్రాయర్‌లో దిగవిడిచి వుండాలి ఈచెవి,ఆఫీసు డ్రాయర్‌ది కాబోలు. రెండూ వొకరకం తాళాలే మళ్ళా తిప్పింది రావడంలేదు బండి వాణ్ణిపిల్చి, తాళం చూడమంది. వాడు మేకుతో కొట్టి ఇట్టే తీసేశాడు తలుపులు ముయ్యకుండానే, హాలు వెనక గదిలో మంచం మీద వాలిపోయి, దిండులో మొహం దాచుకుని ఏడవడం సాగించింది మాధవి

ఎవరో ముందు గదిలో మెదిలినట్లైంది. రంజిత్ ఏమో అనుకుంది ఓదార్చడాని కొచ్చాడా? లేచి చూసింది; ఎవ్వరూలేరు. టీ పెట్టుగుంది దీనికి కారణం రంజిత్ అనిపిస్తుంది రంజిత్ గంగాధరంగారి చెల్లెలి కొడుకు బి ఎ ఫేలయ్యాడు తన కంపెని లోనే ఉద్యోగమిచ్చాడు మేనల్లుడికి మళా గంగాధరం అంత మంచి వాడు లేడని చెప్పుగుంటారు. నిప్పులాంటివాడుట. శీలం గలవాడుట.

ఏ పనివాడూ, నిమిషం ఆలస్యంగా రావడానికిలేదు. నిమిషం ముందుగా వెళ్ళడానికీ వీల్లేదు.డబ్బు విషయంలో నిక్కచ్చిగలవాడు. ఏమాత్రం తప్పిదం జరిగినా, ఉద్యోగంలోంచి తీసెయ్యడమే. తన అన్న హరికృష్ణని, తీసేశాడు, రెండుమూడొందల లెక్కల కాగితాలు తారుమారైనాయి. ముందు సర్దుకోవొచ్చుననుకుని, అన్న కక్కుర్తిపడ్డాడు. గంగాధరంకి తెలిసింది. నేరం వొప్పేసుకుని, డబ్బు కొద్దిరోజుల్లో సర్దుబాటు చేసేస్తా నన్నాడు. ఆయన వొప్పుగోలేదు. అన్న మతిపోయింది. శ్రీనగర్‌కి వెళ్ళిపోయ్యాడు. శాలువాలు, తివాసీలు తయారీకి నమూనాలు, డిజైన్లు వేసిస్తాడు. నాలుగైదేళ్ళ క్రితం గోదావరి వరదల్లో, తమ ఇల్లు కూలి,సర్వమూ గంగపాలైనప్పటి నుండీ అందరి మతులూ పోయినాయి. నగలు డబ్బు అన్నీ గంగపాలే. అమ్మా, నాన్నా, ఏనాడో వెళ్ళిపోయ్యారు. తను, అన్న, పినతల్లి ఆమె కొడుకూ మిగిలారు. ఫిఫ్త్‌ఫారమ్‌ చదువు నిల్చిపోయింది. ఉద్యోగం చూసుగోమన్నారు. టైపు నేర్చుకోమన్నారు. ఆరుమాసాలు అభ్యాసమయ్యాక, ఎల్లాగో పరిక్షప్యాసైంది. ఏడాది జరిగిన యత్నాలు ఫలించి, పదినెల్ల క్రితం గంగాధరంగారి కంపెనీలో ఉద్యోగం దొరికింది. తను చేరిన, రెండునెలలకే, అన్న ఉద్యోగం వూడింది. ఇప్పుడు తనది.

దీనికి కారణం నీకే తెలుసునన్నాడు గంగాధరం. కారణం, అతని మేనల్లుడు రంజిత్. తనంటె ఎంతో ఇష్టం. రోజూ పలకరిస్తాడు. షేక్‌హాండ్ ఇవ్వడం, ఆధునిక పద్ధతంటూ చెయ్యి నలుపుతాడు, కాస్త గట్టిగా నొక్కడంతో, మొన్న గాజు చిటుక్కుమంది. వారం, వారం, తన కేదో కొనిస్తూ వుంటాడు. ఫ్లాస్క్, హాండ్‌బాగ్, లోషన్‌బుడ్లు, జేబురుమాళ్ళు—ఇట్లాంటివి. ఉత్తరాలు వ్రాయమని చంపుకుతింటాడు. ఒకే ఆఫీసులో పనిచేస్తూ, రోజు కనబడేవారికి ఉత్తరాల అవసరం ఏముంటుంది? ఇంగ్లీషు నవల్స్ ఇచ్చి చదవమంటాడు. తనకి ఇంగ్లీషు అంత బాగారాదు. పుస్తకాలు చదివి ఆనందించగల శక్తిలేదని అతనికి తెలియదు. అదేదో మేరీ కోరెల్లి వ్రాసిన వొక నవల తెచ్చి ఇచ్చాడు. దాని నడుమ పెద్ద ఉత్తరం వ్రాశాడు. ఫలానా చోట సాయంత్రం ఏడింటికి కలవమన్నాడు. తన కా ధైర్యంలేదు. ఉత్తరాలల్లోగాని, మాటల్లోగాని పెండ్లి ప్రస్తావనలేదు. అతన్ని పెండ్లి చేసుకోడం, ఆమెకి ఇష్టమే. జవాబు వ్రాయకపోతే చచ్చిపోతానన్నాడు. జాలేసింది. వ్రాసింది. నాలుగు వాక్యాలు. ఇంకెప్పుడూ ఇట్లాంటివి వ్రాయవద్దని. పాఠశాలలో చదువుకునే రోజుల్లో—నాలుగేండ్ల క్రితం—పోకిరీపిల్లలు ఎందరో ఇట్లాంటి ఉత్తరాలు వ్రాసేవారు. ఆనాడూ వొకరిద్దరికీ, ఇట్లాంటి సమాధానమే యిచ్చింది మాధవి. ఆమె పేరు గోడల మీద వ్రాసేవారు. బల్లల మీద చెక్కేవారు. రోడ్డు మీద వెడుతుంటే, కేకలు, ఈలలు—తానివన్నీ ఎరుగును.

ఇందుకు కారణం, తను రంజిత్‌కి వ్రాసిన జాబు సంగతి గంగాధరంకి తెలిసుండాలి. తెలిస్తే, ఆయన మేనల్లుణ్ణి మందలించి చర్య తీసుకుని వుండాల్సింది. అట్లా చెయ్యక, తన మీద చర్య తీసుకున్నాడు. వాళ్లా అందరూ ఆయన్ని నిప్పులాంటి వాడంటారు. తనపట్ల మోజు కనబరుస్తున్న వ్యక్తి రంజిత్ వక్కడేకాదని కంపెనీలో తనతో పనిచేసే వారిలో యింకా ఎందరో వున్నారని మాధవికి తెలుసు. తను ఆఫీసుకి రాగానే ఏదో వంకని తన గదిలోకి వచ్చి చూసిపోతూ వుంటారు, రాజారావు, చలమయ్య, రంగస్వామి. మధ్యాహ్నం టీకి రమ్మని కాంటీన్‌కి తీసుకువెడుతూ వుంటారు. తనని బిల్లు యివ్వనివ్వరు. సాయంత్రం వెళ్లేటప్పుడు వక్కక్షణం తన కంటే ముందుగానే వెళ్లి గేటు దగ్గర కాచుకుని తనతో కొంత పలుకూ నడుస్తూ తనకి రిక్షా మాట్లాడిపెట్టి పంపుతూ వుంటారు. ఎలా కనుక్కున్నాడో రంజిత్ తన గది ఎక్కడ వుందో కనుక్కుని ఆదివారం సాయంత్రం రోడ్డు మీద యింటి ముందు పచార్లు చేస్తూ వుంటాడు. తను కిటికీలోంచి చూసి నవ్వుకునేది. ఒకరోజు చొరవ చేసుకుని గదిలోకి వచ్చాడు. పిన్ని ఎదురైంది. తను యింట్లో లేనని పంపించి వేసింది. తనతో కలిసి సినిమాకి రమ్మన్నాడు రాకపోతే చచ్చిపోతానన్నాడు. అలా అంటూ వుంటాడు. మర్నాడు ఆఫీసులో ప్రత్యక్షం. ఇప్పుడు పిన్ని వుంటే ఎంత బాగుండును. అబ్బాయికి సుస్తీ చేసిందంటే వెళ్ళింది. తనూ అక్కడికి వెళ్ళాలి. లేచి ముందు గదిలోకి వచ్చింది. వీధి తలుపు జారవేసింది. కిటికీ తలుపు సందులోంచి పోస్టువాడు దూర్చిన ఉత్తరం క్రిందపడి వుంది. ఆత్రతతో కవరు చించి చదివింది. అన్న హరికృష్ణ శ్రీనగర్ నుంచి వ్రాసిన కవరు అది. ఎనిమిది రోజుల క్రితం వ్రాస్తే, యిప్పుడు వచ్చింది. తను పనిచేస్తున్న పరిశ్రమ రోజురోజుకీ అభివృద్ధి చెందుతూ మంచి లాభాలు వస్తున్నాయుట. ఎందరెందరో అమెరికన్లు తివాసీలు, శాలువాలు కొనుక్కుపోతున్నారుట. వేరే మనియార్డరు పంపించాడుట. తృప్తితో నిట్టూర్చింది మాధవి. తనూ అన్నయ్య రెండేళ్ళ క్రితం తీయించుకొన్న ఫోటోని గోడ మీంచి తీసి చూసుకుంది. అన్నయ్యవి పెద్ద కనుబొమ్మలు. దువ్వనకి లొంగని వంకీల జుట్టు. పొడుగ్గా వున్న నాజూకైన ముక్కు. అద్దంలో తన ముఖం చూసుకుంది. తనవి అంత పెద్ద కళ్లుకావు. అన్నయ్య కంటె తన రంగు పసఛాయ ఎక్కువ. నీడలో తేలియాడుతుంటే పడవ తెరచాప దించేసినట్లు దిగులుని లోనికి నెట్టివేసి, నవ్వుతూ పళ్ళవరస చూసుకుంది. చిగుళ్లు కొంచెం కనిపిస్తాయి. అమ్మవి అంతేట. తన కది యిష్టంలేదు. అవి కనపడేటట్లు నవ్వమంటూంటాడు రంజిత్. తనలో ఏదో ఆకర్షణ వున్నట్లు ఆఫీసులో వారి ప్రవర్తనవల్ల తాను గ్రహించినా అద్దంలో చూసుకుంటే ఆ ఆకర్షణ ఎందులో వుందో తనకి అర్థంకాదు. ఏమిటో!

తాను దిగులుపడవలసిన యీ ఘడియలో తన ఆకర్షణని వితర్కించుకోవటం సమంజసంగా తోచదు.

చటుక్కున వొక భావం స్ఫురించింది మాధవికి. సిమెంటు రంగు చీర మడతలన్నీ క్రమంగా తిన్నగా జారినట్లు కుచ్చిళ్ళు పోసి తెల్లసిల్కు జాకట్టు వేసుకుని జడ మెలితిప్పి, మెడవెనక ముడి వేసి చేతిలో బాగ్ తీసుకొని బయుటకు వచ్చి తలుపు తాళం వేసింది. కాని ఆతాళం సరిగ్గా పడటంలేదు. మళ్ళా లోపలికొచ్చి ట్రంకుకి వేసిన పాతతాళం వేసి రోడ్డు మీద కొచ్చి రిక్షాలో బయులు దేరింది. చేతిలో హాండ్‌బాగ్ ఎందుకు? అలవాటు కాబోలు. నవ్వుకుంది. పోస్టాఫీసు ముందు రిక్షాని నిలిపి రవిప్రకాశంగారి యిల్లు ఎక్కడో కనుక్కుని అక్కడికి పోనీయమంది రిక్షావాడిని. బంగళా ముందు నిలిచింది రిక్షా. ముందు గేటు, చుట్టూ గోడ, వెనక పూలమొక్కలు. గేటు తోసుకుని లోపలికి వెళ్ళగానే 'భౌయ్'మంటూ వక ఎత్తుకుక్క మీద పడబోతూ వుంటే తోటమాలి వారించాడు. తను ముందు గదిలోకి వెళ్ళింది. "అమ్మగారి కోసరమా" అది తోటమాలి కంఠం. ఈలోగానే అమ్మగారు బయటికి వచ్చింది ఆమెది ఎత్తైన విగ్రహం. దేనినో చూచి బెదిరిపోతున్నట్టు కలవర పడే కళ్ళు.. అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు. వోపికలేక జెడ సరిదిద్దుకోక వొదిలేసిన ఆ పొట్టి వెంట్రుకలు మెడచుట్టూ తిరిగి భుజాల ముందు పడి పూనకం వచ్చిన స్త్రీని స్మరింప చేసే ఆకృతి ఎవరూ ఎవరి కోసం అన్నట్లు కనుబొమ్మలు చిట్లించింది ఆమె.

"రవిగా రున్నారా అండి" అంది మాధవి.

"లేరు"

కాస్సేపు నిశ్శబ్దం.

"ఎవరి తాలూకు నువ్వు?"

నిశ్శబ్దం.

"ఎప్పుడు వస్తారండి?"

"నువ్వు ఎవరివో చెప్పావుకాదు." -హాలులో గోడ గడియారం కేసి చూసింది మాధవి. పావుతక్కువ ఐదు అయ్యింది.

"నేను మాధవినండి"

"గురునాథం మాధవివా" ఆమె అలా అనడం మాధవికి నచ్చ లేదు. తన అసంతృప్తిని ప్రకటించే ధైర్యం ఆమెకు లేదు.

"అవునండి వారికంపెనీలో........"

"కంపెనీ పనంతాపూర్తయ్యాక ఐదు తర్వాత కాని యిళ్ళకి రారని నీకు తెలియదూ? అయినా ఏం పనో నాకు చెప్పు." బయుట కుక్క మొరుగు వినబడుతోంది. తోటమాలి నీళ్ళు పెడుతున్న చప్పుడు వినబడుతూంది.

"వారిని తరువాత కలుసుకుంటాలెండి" అని గబగబ గేటు దగ్గరకు నడిచింది మాధవి. కుక్కని పట్టుకోమంది తోటమాలిని. గేటు దగ్గిరగామూసి వీధి చివర రిక్షా ఎక్కి తన గదికి చేరుకునే టప్పటికి ఐదున్నర కావస్తోంది. స్నానానికి వేన్నీళ్లు పెట్టుకుంది. పది నిముషాలలో స్నానంపూర్తి చేసుకుని పినతల్లిది పసుపు పచ్చ పట్టుచీర ధరించి జడ అల్లుకుంటూ ముందు గదిలో మంచం మీద కూర్చుంది. పైకి లేచిన మంచం కోడుపై తల ఆనించి జడ క్రిందకి జారుతూ వుండగా విశ్రమించింది మాధవి. ఐదు, పది నిముషాలలో ఆరు దాటిపోయి వుండాలి. పెరట్లో చివరి కిరణాలు వదిలిపోయి చీకటి నీడలని దిగవిడిచాయి. చెట్ల ఆకుల రంగు కరిగిపోతూంది. కిటికీలోంచి పశ్చిమ ఆకాశం చిరిగిన ఎర్రజండా ముక్కవలె ముడుచుకుపోతోంది. గుమ్మం అవతల ఏదో అలజడి అయి మాధవి చటుక్కున లేచి కూర్చుంది. తప్పకుండా రంజితే. తలుపు తీసి చూసింది. తలుపు ప్రక్క నిలబడ్డ వ్యక్తి రంజిత్ కాడు. "నువ్వేగా మాధవివి?"అన్నా డాయన. మరో రెండడుగులు ముందుకి వేసాడు. "నువ్వు నన్ను ఎరగవేమో. నేను రవిప్రకాశంని" అన్నాడాయన.

కాస్తంత భయంతో వొకడుగు వెనక్కి వేసింది మాధవి. ఏవో చాలా చెప్పుకోవాలి ఆయనతో. కాని ఏది ముందుఅనాలో ఏదివెనకఅనాలో తేల్చుకోలేక, ఏమీ అనలేకపోతూంది.

"ఇందాక విన్నాను. గంగాధరం తీసేశాడుటగా.వినగానే వచ్చాను. తిన్నగా కంపెనీనుండి. మా కంపెనీలో ఉండటానికి అభ్యంతరం లేక పోతే రేవుదయం పదకొండుకిరా, కంపెనీకి" అని రవిప్రకాశం గబగబ వీధిలోకెళ్లి కార్లో ఎక్కాడు. ఆ కార్లో ఇంకా ఎవరెవరో ఉన్నారు. మాధవి వీధిగుమ్మం దాటగానే కారు వెళ్లిపోయింది.అందులో ధ్వనులు, వీధిలో దుమ్ము, సంధ్యలో ఊదా—అన్నీ తనని చుట్టుముట్టాయి. లోపలికొచ్చేసింది మాధవి.

పనిమనిషి గంగమ్మ వొచ్చింది. రాత్రి, సాయంగా పడు కుంటుంది. ఆ రాత్రి మాధవికి నిద్రపట్టలేదు తనమీద తనకి కోపం వచ్చింది. రవిప్రకాశంగార్ని లోపలికొచ్చి కూర్చోమనలేదు. మర్యాద చేయలేదు. కృతజ్ఞత వెలిబుచ్చలేదు. తను ఉద్యోగంకోసరం ఏ రవి ప్రకాశంని వెతుక్కుంటూ, వెళ్లిందో అతనే, స్వయంగా తనింటి కొచ్చి, ఉద్యోగం ఇస్తానంటే, లోపలికొచ్చి కూర్చోండి అనైనా అన లేదు తను.

రవి ప్రకాశం, ఆ ఊళ్లోనే, మరో కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్. అమెరికాలో, కంపెనీల నిర్వహణలో శిక్షణపొంది, రెండేళ్లు ఉత్తర హిందూస్తానం కంపెనీలలో పనిచేసి, ఇక్కడ, కంపెనీ డైరెక్టర్గా ఏణ్ణర్థంక్రితం చేరి పని చేస్తున్నాడు ఆయన్ని గురించి వింత వింతగా చెప్పుగుంటూరు. ఆయన్ని గురించి చాలా విన్నా, ఆయన్ని చూడ్డం పడలేదు. రెండు కంపెనీలు ఉమ్మడిగా సమకూర్చుకోవల్సిన వ్యవహార సదుపాయాలున్నాయి; ఇచ్చి పుచ్చు కోవడాలున్నాయి. రవిగారు, గంగాధరం కంపెనీకి చాలామార్లు వొచ్చాడు. వొచ్చినట్లు తెలియగానే తాను, ఆయన్ని చూడ్డానికి బైట కొచ్చేది—ఇప్పుడే వెళ్లిపొయ్యాడు అనేవారు. ఆయన రావ డమేగాని, గంగాధరం వారి కంపెనీకి వెళ్లినట్లు చెప్పుగోరు. రవి నెల జీతం తీసుకునే ఉద్యోగికాని, కంపెనీ వ్యవహారాల నిర్వహణలో ఆయన ప్రతిపత్తిలేదు. ఉద్యోగాలివ్వడం, తీసెయ్యడంలో, సలహా ఇవ్వగలడుకాని, దాన్ని ఆచరణలోకి తెచ్చే అధికారం ఆయనకిలేదు. గంగాధరం అల్లాకాదు. అతను కంపెనీలో యజమాని. భాగస్వామి కూడా. అతనికి అధికారాలెన్నో వున్నాయి. ఎంతో పలుకుబడి, ప్రతిష్ఠ కలవాడు. ఇతర కంపెనీల వ్యవహారాలలోకూడా జోక్యం చేసుగుని, కొన్ని పనులు చేయించుకోగల ప్రజ్ఞ గలవాడు.

యాజమాన్యాన్నీ, మెంబర్లనీ, భాగస్వాముల్నీ సంప్రదించకుండానే, 'రా ఉద్యోగం ఇస్తా' అని ఎల్లా అనగలిగాడో రవి ప్రకాశం—ఈ కిటుకులు, తికమకలు, తనకి అర్థంకావు.

మొర్నాడు పదకొండుగంటలకే, మాధవి, రవిగారి కంపెనీ కెళ్లింది. శుభ్రమైన దుస్తులు ధరించింది. శ్రద్ధగా జుట్టు అమర్చుకుంది. సన్నటి నడుం చుట్టూ, చీర మడతలు తిన్నగా జారు తున్నాయి. ఆ మడతలు, కలిసిపోక, అల్లా తిన్నగా నిలబడ్డం ఆమె కిష్టం. అద్దంలో చూసుగుని 'బాగానే ఉన్నాను' అనుకుంది.

రవిప్రకాశంగారి గదిలో కెళ్లడానికి, అనువైన దుస్తులు, వేషం నిన్న ఆయన్ని ఆ చీకటిలో సరిగ్గా చూడనేలేదు. ఆయన పెద్దవాడిలాగే కనిపించాడు. మీసాలున్నాయా? పాపిటతీసిన క్రాపింగా? ఎగదువ్వా,? పాంట్, బుష్కోట్—జ్ఞాపకం. చామన చాయ. నవ్వు మొహం. ఎందుకు—పది నిమిషాల్లో ఆయన్ని చూడబోతోందిగా. ఎవరో ఒకాయ నొచ్చి 'నాతోరండి' అన్నాడు. వరండాదాటి, బైటకొచ్చి, మరో రేకుషెడ్లోంచివెళ్లి, అవతల వైపు ఆఫీసుకి వెళ్లారు. మూలగదిలో ఒకాయన లేచి బల్ల మీద కూర్చోమని మందహాసం చేశాడు టైప్ కాగితం ఒక టిచ్చాడు. మరో కాగితంపై సంతకం పెట్టమన్నాడు గంగాధరం కంపెనీలో, తన జీతం తొంభై. ఇక్కడ నూటపాతిక. సంతోషంతో సంతకం పెట్టింది.

"రవిగార్ని చూడనక్కరలేదా?" అని అడిగింది. అక్కర్లే దన్నట్లుగా తలపంకించి, నవ్వి, నౌకర్ని వొప్పగించి, రేకుషెడ్ వెనకవున్న నాలుగు గదులలో ఒకదాంట్లోకి తీసుకెళ్లి, బల్ల, కుర్చీ చూపి—ఇదే తను పనిచేసే చోటు—అని చెప్పి, ఏమన్నా కావాల్సి వొస్తే, అడగండి, చేస్తానని, ఆ వ్యక్తి వెళ్లిపొయ్యాడు.

మధ్యాహ్నం పనివాళ్ళంతా టీ కి బైలుదేరారు. దూరంగా షెడ్డులో కాంటీన్‌లో టీ దొరుకుతుంది. ప్రతిఒక్కరూ, ఒక కప్పులాంటిది తీసుకు వెడుతున్నారు. మాధవికి ఇది నచ్చలేదు తనని ఎవ్వరూ రమ్మనలేదు. ఇంతలో నౌక రొచ్చాడు. రెండు కాగితా లిచ్చి, 'అయ్యగారు ఇవి టైపుచేసి పంపమన్నారండి' అన్నాడు. టీ విషయం తరవాత చూద్దామనుకుని, ఆ రెండు కాగితాలు టైపు చేసింది. నౌకరుకోసం అటూ ఇటూ చూసింది. మరోనౌకరు కనబడ్డాడు 'అయ్యగారి రూమ్ ఎక్కడ?' అని అడిగింది. వాడు ఆమెని రవిప్రకాశం గదికి తీసుకువెళ్ళాడు.

'కమిన్' అన్నా డాయన.

వెళ్ళింది

'అట్లా కూర్చో, పేపర్స్ నువ్వు తేనక్కర్లేదు. ప్యూన్‌తో పంపితే సరిపోసుగా'' అన్నాడు. తెల్ల బుష్‌కోట్ — పక్కపాపిడి, వొంకీలజుట్టు, కాస్తంత పొట్టిముక్కు, పై పెదవిసన్నం, అడుగుది గుండ్రంగా, పెద్దగా కనబడింది ముక్కుకి నోరుకీ కాస్తంత దూరం—నవ్వు మొహం, మంచి పళ్ళవరస, పై వరసలో ఒకటి మాత్రం కొంచం వెనకగావుంది సన్నటి పొడుగాటి వేళ్ళు—వెడల్పాటి అరచెయ్యి ఆర్చిలా తీర్చిదిద్దిన కనుబొమ్మలు—మధ్య కొంత లోతుగాదిగి, పైనా, కిందా చదరంగా వొంపు తిరిగిన విశాల మైన నుదురు. ఆ లోతులో రెండు గీట్లు. వయస్సు నలభై పైమాటే.

''ఏవీ కాగితాలు'' అని ఆమెవద్దనుండి కాగితాలు తీసుకుని చదువుతున్నాడు నౌకరొచ్చి, రెండు కప్పుల్లో టీ సిద్ధంచేసి, ఆమెముందు ఒకటుంచాడు.

మరో ప్లేట్లో బిస్కట్స్, సాండ్విచ్‌పెట్టి ఆమెముందు వుంచాడు.

కాగితం చదవడం పూర్తిచేసి, చిన్నగానవ్వాడు రవి

''చాలా తప్పులున్నాయి కాదండీ''అంది మాధవి. ఆమెని పరీక్షగా చూస్తున్నాడు రవి.

''నాకు ఇంగ్లీషు బాగా రాదు''

''ఇక్కడ మిసెస్ జాకబ్‌వుంది. మధ్యాహ్నం ఒక గంట ఆమె దగ్గర నేర్చుకోరాదు మరిచాను టైప్ స్పేసింగ్ బాగానేవుంది. ..దగ్గరలో— ఒక టైప్ ఇన్‌స్టిట్యూట్‌వుంది సాయంత్రం అక్కడ ఒక గంట ట్రైనింగ్‌ఐతే- స్పీడ్ ఇట్టే పికప్ చేస్తావు.. ..ఏం ....?'' అని నవ్వుతున్నాడు.

''ఉ—కాసీ.'' అన్నాడు, కప్పుకేసి చూపుతూ భయపడుతూ తింటోంది. టీ సాసర్‌లోపోసి త్రాగుతోంది. తొణికి కొంత చీరమీద పడింది.

"అయ్యో" అంది మాధవి.

"చీర పాడవదూ మరి!"

మాధవి లేచింది. సాసర్ బల్లమీదపెట్టి, అందులో కప్పు వంకరగా నిలబెట్టింది. రవిప్రకాశంనవ్వి, దాన్ని సరిగ్గా నుంచో బెట్టాడు. లేచి నిలబడ్డాడు. "మరి నీ పని చూసుగో." అన్నాడు ఆమె వెళ్లబోతూంటె, "ఇదిగో కర్చీఫ్ కుర్చీలో విడిచేశావ్" అన్నాడు. రుమాలు తీసుకుంది. "నే నెప్పుడూ ఇంతే—ఇట్లా మరిచిపోతూం టానండి" అని, అతిశయోక్తిగానవ్వి, వెళ్లిపోయింది మాధవి.

నాలుగైదు నెలల్లో మాధవి టైప్ నిపుణత పెరిగింది మిసెస్ జాకబ్‌వద్ద ఇంగ్లీషుపాఠాలు నేర్చుకుంటోంది. ఆఫీస్ వ్యవహారాల్లో తన పనిని బాగా అవగాహన చేసుకుంటోంది రవి కార్యదర్శిగా, అతని గదిపక్కగదిలోకి మార్చాడు, ఆమెబల్ల, కుర్చీ, ట్రేలు, టైప్‌యంత్రం, నోట్‌బుక్స్, ఫైల్స్. వారంలో ఆగదిలో ఒక టెలిఫోన్ కూడా అమర్చారు ఇంటిదగ్గర పినతల్లివుంది— వొండి పెడుతుంది. అన్నయ్య తివాసీల వ్యాపారం లాభిస్తోంది. ప్రతి నెలా, మనియార్డర్ పంపుతూనే ఉన్నాడు. మనస్సు కుదుటపడి, ఆనందంతో నిండుకున్నకొద్దీ, మాధవి సౌందర్యం వికసించి రాణిస్తోంది మంచి మంచి దుస్తులు ధరిస్తోంది. జడ జాగ్రత్తగా వేసుగుంటోంది గులాబి జెడలో ఉంచుతుంది. పాపిడ మరికొంచం పక్కగాతీసి, జుట్టు, చెవలమీదికి లాగుతోంది.— ఒకటి రెండు మార్లు, పిన్ని సణిగినా వినిపించుకోక, "ఇప్పుడంతా మా ఆపీసులో ఇంతే" అంది.

"వాళ్లు పొయ్యే పోకిళ్లన్నీ మనమూ పోతామా ఏమిటీ!" అంది పిన్ని.

"ఇన్ని చేసుగున్నా బాగులేనుగాపిన్నీ—ఎంత బాగున్నావే అమ్మా—అని వొక్కసారన్నా అన్నావా?" అంది దిగులుగా. పిన్ని ఆమె తలని తన వొళ్లో ఉంచుగుని "వెఱ్ఱిపిల్లా—మీ అమ్మవుంటే ఎంత సంతోషించునో. నే నెంత మెచ్చుగున్నా, మీ అమ్మ మెచ్చుగున్న తృప్తి నీ కుండదుగదా" అంది. ఆమె కళ్లంట నీళ్లు తిరిగాయి.

"అదేమిటి పిన్నీ— ఊరికే—అన్నా. అమ్మకీ, పిన్నికీ నాకా తేడాలు తెలియవు." అంది మాధవి.

టైప్ ఇన్‌స్టిట్యూట్‌కి ఎంత ఇవ్వాలో తెలుసుగుని చెల్లించాల్సివుంది మాధవి. అడిగేసరికి, ఇదివరకే కంపెనీవారు బిల్లు ఇచ్చేసారన్నారు. తనలాగే మరో ఇద్దరూ కూడా అక్కడ కంపెనీడబ్బుతో శిక్షణ పొందారుట. అట్లాంటి శిక్షణ ఇచ్చే బాధ్యత కంపెనీదే అని మెంబర్లతో వాదించి, వొప్పించాడుట రవి అమెరికాలో అల్లా చేస్తారుట. నసిగినా చివరికి వొప్పుగున్నారు భాగస్వాములు.

ఆ నెలలోనే మరికొన్ని సదుపాయాలు కల్పించాడు రవి. ప్రతి గదిలోనూ ఒక మూలగా, అందరికీ అందుబాటులోవుండే లాగున, ఒక టెలిఫోన్ పెట్టించాడు ఇదివరకు, ఒక్కటే ఫోనుంటె, పిలుపొచ్చినప్పుడల్లా పక్కగదిలోకి వెళ్లడం మామూలు. వాడి బల్లమీదే ఫోను ఎందుకుండాలని పట్టింపులు, స్పర్ధలు. ఇంక ఇప్పుడవి ఉండవు ప్రతివాడికీ కప్పు, సాసరు, గ్లాస్ ఇప్పించాడు గదుల్లో కోయిర్ చాపలు వేయించారు— పాదాలు నేలమీద కాక, చాపమీద ఆనిస్తే, అలసట చెందక, పనివాండ్ర ఆసక్తి పెరుగుతుందిట మిగత మెంబర్లు ఈ దుబారా నిరసించి, ఈ సదుపాయాలతో కంపెనీ దివాళా తీస్తుందని మొత్తుగున్నారుట ఈ ఒక్కదానికి వొప్పుకోండి అంటూ, ఒక్కటొక్కటే—సౌకర్యాలు ప్రవేశపెడుతూ వొచ్చాడు రవి.

ఎవరికన్నా వొంట్లో బాగాలేక శెలవుచీటిపంపితే,సాయంత్రం వాళ్లింటికివెళ్లి, చూసి వొస్తాడు. కాంటీన్‌లో రేడియోసెట్టు నెలకొల్పారు—టీ సమయంలో. అందరూ ఫిలింసంగీతం విని వినోదిస్తారు. షెడ్ల నడుమ ఖాళీస్థలంలో మొక్కలు, ఫౌంటెన్ వేయించాడు. రామప్పగుడిలోవుండే నాగినీ శిల్పాల, నకలు తయారు చేయించి, గేటుముందు అమర్చారు. ప్రతి గదిలోనూ, అందమైన చిత్రాలు, శిల్పాలు తెప్పించి వుంచాలన్న రవి సంకల్పం కొనసాగడం లేదు. మనకి లాభాలుకావాలిగాని, ఈ తైతక్కబొమ్మలెందుకన్నారు భాగస్వాములు అందమైన బొమ్మలపట్ల అభిరుచి పెరిగితే, మనస్సు తైతక్కలాడి, లాభాలు పెరుగుతాయని రవి వాదం విని నవ్వుతారు. అమెరికాతాలూకు పిచ్చన్నారు.

ఆ ఏడు ముగింపు రోజులొచ్చాయి. రేపో మాపో లాభనష్టాల లెక్కలుకట్టి, బోనస్‌లు ప్రకటిస్తారు. అందరూ దీక్షతో పని చేస్తున్నారు. ఆనాడు శనివారం. కుస్తీల ప్రదర్శన చూడాలంటూ, అనుమతిపొంది, మధ్యాహ్నమే కొందరు వెళ్లిపొయ్యారు మూడైంది. రవిగదిలో ఫోన్ మోగింది ఎవరో మాధవితో మాట్లాడాలని పలకరించారు ఫోన్‌లో మాట్లాడ వల్సిందిగా మాధవికి కబురంపాడు రవి. ఆమె వొచ్చింది. ఫోన్‌లో సుళువుగా, ధీమాగా మాట్లాడే అలవాటు కాలేదు. జంకుతూ, చెవిదగ్గర రిసీవర్ ఆనించి వింటోంది 'ఉ', 'ఆ' 'ఆ'—'అహ'— అన్న శబ్దాలు తప్ప పూర్తిమాటలు చెప్పలేక పోతూంది మాధవి రవి బల్లమీది కలంని ఒక చేతిలో తీసుగుని నలుపుతోంది. వొదిలేసి చీరకు తుడుచుకుంటోంది. గోడమీద వున్న తైలవర్ణచిత్రాన్ని చూస్తోంది.

"సరే—ఊహూ" అని ఫోన్‌పెట్టేసి, ఏదో అపరాధం చేసిన దానికిమల్లే చూసింది మాధవి. మళ్లా ఆ బల్లమీది కలం తీసుగుని చీరకొంగుతో తుడిచి, కాప్‌లో వుంచేసి "నే నెప్పుడూ ఇంతే.. నండీ" అంది. రవి నవ్వుతున్నాడు. ఆమె చీరకొంగు పూర్తిగా జారి

బల్లమీదపడుతోంది. అతను ఆమె వక్షంకేసి చూడ్డం గమనించి, సిగ్గుపడి, కొంగుసర్దుకుని వెళ్లబోయింది. ఫోన్‌లో మాట్లాడింది ఎవరో చెప్పాలా? చెప్పనక్కరలేదా? ఏమో—తనకి తెలీదు. వెళ్లిపోయింది

రవి ఆమెని కేకేశాడు.

"ఇది నీ పని కాదనుకో—మిసెస్ జాకబ్‌ది—ఆమె సెలవు పెట్టింది—ఈ కాగితం కొట్టి పెడతావా—ఇవాళ పంపాలి" అని ఒక కాగితం ఇచ్చాడు.

"పెందరాళే ఇంటికెళ్లాలనుకుంటున్నానండీ!" అంది.

"ఏం, కుస్తీలు చూస్తావా?" అని, నవ్వుతున్నాడు.

"కొంచం హెడేక్‌గా వుందండి"

ఇంకా నవ్వుతున్నాడు

"నవ్వుతున్నారేం?"

"ఏంలేదు. ఈ హెడేక్ అనేది ఆఫీసుల్లో పని చేసే భారతీయుల జబ్బు అందుకే అమృతాంజనానికున్నంత చెలామణి మరే ఔషధానికీలేదు ఇప్పుడు నా దగ్గర అదిలేదు. ఇదుగో యుడికొలోన్—కాస్త కర్చీఫ్‌మీద జల్లుకుని, నుదిటిమీద ఉంచుకో" అని డ్రాయర్‌లోంచి ఒక బుడ్డి తీసిచ్చాడు. బుడ్డి తీసుకుని వెళ్లింది మాధవి. క్షణంలో వెనక్కివొచ్చి, 'థ్యాంక్స్' అని, వెళ్లింది. రవి బిగ్గరగా నవ్వేశాడు.

గదిలోకెళ్లి, ఆ కాగితాలు బల్లమీద పడేసి, గబ గబ గేటు దగ్గరకెళ్లింది. పది నిమిషాలు అటూ ఇటూ చూసింది గేటవతల షెడ్ల నడుమ మొక్కలమధ్య నడుచుకుంటూ వొచ్చాడు రంజిత్!

"రాణిగారి దర్శనం తొందర్లోనే అయిందే"అన్నాడు. ఇద్దరూ, షెడ్లవెనక చెట్టుకింద నీడలో కూర్చున్నారు. అక్కడ పెద్ద పెద్ద రాళ్లు పడిఉన్నాయి. ఆమె వొకరాయిమీద కూర్చుంది. అతనుగడ్డిలో మోకాళ్లమీద చేతులు ఆనించి కూర్చున్నాడు.

"రవి గదిలోకి ఫోన్ చేశావ్. మొదట్లో నీతో మాటాడింది ఆయనే, తెలుసా?" అంది.

"బాగా తెలుసు. ఆయనకి ఫోన్ చేస్తేనే పని సులువుగా జరుగుతుంది."

"ఇంకెప్పుడూ అట్లా చెయ్యమోక. నాకు భయమేసింది—ఆయన ఏమనుకున్నాడో ఏమో."

రంజిత్ ఎండ తగలకుండా నల్లద్దాల కండ్లజోడు తగులుచ్చుకున్నాడు. తీసి అద్దాన్ని తుడుస్తున్నాడు.

"ఏముంది అనుకునేటందుకు. ఈపాటికి నువ్వు గ్రహించే వుండాలి."

"అంటె."

"అందరికి తెలిసిందే ఆడది కనబడితే విడిచిపెట్టడుగా."

"నాకట్లాగనిపించలేదు "

"అంతరంగిక కార్యదర్శివిగా, నీ కెందు కనిపిస్తుందీ....."

"నువ్వట్లాగనడం ఏమీ బాగాలేదు. రంజిత్ ఈమాట లనడానికా నువ్విక్కడికొచ్చింది" అని కోపంతో, కళ్లు పదే పదే చిట్లించింది.

"నువ్వు చాలా మారిపొయ్యావు. అవునుపాపం, రవి ఏం చేస్తాడు భార్యకి హిస్టీరియా. అదో రకం ఉన్మాదం. మొదట్లో ఇద్దరు సంతానం కలిగారు ఇద్దరూ దక్కలేదు అప్పడినుంచి హాస్పిటల్స్, డాక్టర్లు, మందులు—నర్సింగ్‌హోమ్‌లు—ఏంచేస్తాడు—పాపం ఆమెని వదలలేదు. అందుకే బొమ్మలు గీస్తాడుట. శిల్పాలు తయారు చేస్తాడుట సౌందర్యం అంటాడు—కంపెనీ వ్యవహారాలు తన ప్రేమ కలాపాలతో వొకదరికి తెస్తున్నాడు. నీకు తెలియకుండా ఉంటుందీ "

"ఏమిటి నువ్వనేది?"

"చూశావా— నీ ధోరణిలో ఎంత మార్పొచ్చిందో ఆడాళ్ల చిత్తం—డబ్బు, హోదాకి లొంగిపోతారు—ముసిలాడైనా, ముక్కాడైనా..."

మాధవి లేచింది.

"ఇంక చాల్లే రంజిత్. నువ్వు వెళ్లొచ్చు."

"నిజం చెపితే కోపం వచ్చితీరాలి మరి వెడతాను మరి షేక్‌హాండ్ ... ." అని చెయ్యి చాచాడు రంజిత్. ఆమె అందుకోలేదు నడుం వెనకవున్న చేతిని లాక్కున్నాడు గట్టిగానొక్కాడు. ఆమె విదిలించి వేసింది.

"నువ్వు ఇంక ఎప్పుడూ ఇటురావొద్దు. దయచేసి ఫోన్ చెయ్యవద్దు నువ్వు నావెంట బడితే, నేనేదో చేశానని గంగాధరంగారు ఉద్యోగం తీసేశారు. ఇక్కడిల్లా నాతో వొస్తున్నావంటె, ఈ ఉద్యోగం కూడా వూడుతుంది—తెలుసా నీకు వెయ్యి నమస్కారాలు" గబ గబ నడుచుకుంటూ తన గది కెళ్లింది. ముచ్చెమటల్లు పోస్తున్నాయి. చెమటతో, జాకట్ భుజంకింద డాగైంది. మొహం తుడుచుకుంది. రవిగారిచ్చిన యుడికొలోన్ నాలుగు చుక్కలు రుమాలుమీద జల్లుకుని మొహం తుడుచుకుంది. ఐదు కావస్తోంది. కాసేపు కళ్లు మూసుగునికూర్చుంది కంపెని పనివాళ్లు వెళ్లడం సూచిస్తూ సైరన్ మోగింది. చివాలునలేచికూర్చుంది మాధవి. ఇవాళ టపాలో వెళ్లాలంటూ, రవిగారిచ్చిన కాగితాలకోసం బల్లమీద చూసింది. అవి అక్కడలేదు ఆదుర్దాపడింది ఏమైనట్లు? రవి గదిలోకి వెళ్లే ధైర్యం ఆమెకిలేదు. ఎవర్ని అడగడం? డిస్పేచర్ని అడిగి తెలుసుకుంటె!

ఆ వొచ్చింది రవి. తన గదిలోకొచ్చి నిలబడ్డాడు

"ఫరవాలేదు మరొకరిచేత ఆ కాగితాలు టైప్‌చేయించి పంపించాను నీకో విజిటర్ వున్నాడుగా—నాకు తెల్సు—రంజిత్ చాలా చురుకైనవాడు—తెలివైనవాడు ఇంటికి వెళ్లరాదూ—బాగా టైర్డ్‌గా వున్నావు . " ఆమె ఇంకా చెప్పాలనుకుంటుండగానే రవి వెళ్లిపొయ్యాడు తనూ గబ గబ వెనకాలే వెళ్లింది అతను గేటు దగ్గర నిలబడ్డాడు కార్ తెచ్చాడు డ్రైవర్ ఎక్కబోతూ వెనక్కి తిరిగాడు

"ఏమండీ" అంది మాధవి కంఠ.

"ఎస్?"

"ఏమీలేదులెండి" అంది.

"ఇంటిదగ్గర దింపనా?"

ఉ అన్నట్లుగా తలపంకించింది

"డ్రైవర్—ఈమెని వాళ్లింటిదగ్గర దింపిరా" అని తలుపు తీసి ఎక్కమన్నాడు.

"మరి—మీరు......రారా .....?" అంది లోనికెక్కుతూ

నవ్వి తలుపుమూశాడు రవి. కారు కదలగానే పూలమొక్కలు చూడ్డాని కెళ్లాడు

ఆ యేడు లాభ నష్టాలు లెక్కలుకట్టి బాలన్స్‌షీట్ తయారుచేశారు గంగాధరం కంపెనీకి లాభాలొచ్చాయి కొంత బోనస్ ఇస్తున్నామని ప్రకటించారు కాని పెద్ద లాభాలొచ్చినా, అసలు సంఖ్య బైటపెట్టక, యీ కాస్తే వొచ్చింది గావున, ఇంతే బోనస్ ఇవ్వ గలుగుతున్నామన్నారు భాగస్థులు సొమ్ము చేసుగుని పనివాండ్రని దగా చేశారన్న వదంతి బైలుదేరింది ఇది ప్రచారం చేసిన వ్యక్తులెవరో తెలియదు ఈ వివరాలన్నీ నలుగుర్నీ పోగుచేసి, సమ్మె చెయ్యాలని పురిగొల్పాడు, గంగాధరం కంపెనీలో వ్యక్తి ధనంజయం.

"చూడండి రవిగారి కంపెనీకి కానీ లాభం రాలేదు—యీఏడు అయినాసరే, అంత నష్టమూరాలేదు గావున కనీసం ఒక నెల బోనస్సన్నా—కనీసపు మొత్తమే అనుకోండి—ఇచ్చి తీరాలని పట్టుబట్టి, యాజమాన్యాన్ని వొప్పించి, తీర్మానం ఆమోదించేటట్లు చేశాడు అతనూ మనిషంటె. .. " అంటాడు ధనంజయం

"అవునోయ్. మరి రవిగారు ఆ కంపెనీలో భాగస్థుడుకాడు కంపెనీ ఏమైపోతే అతనికేం—ఇమ్మంటాడు అతనికేం—కంపెనీకి కాని లాభం చూపలేకపొయ్యాడు రవిప్రకాశం—ఏం డైరెక్టర్ నా మొహం పైగా అమెరికాలో చదివాట్ట! అదుగో ఆ సెక్రటరీని వేసుగు తిరగడం, షికార్లు, సర్దాలు, ఖామాష్సలు—ఎంత బోనస్సన్నా ఇమ్మంటాడు, తన సొమ్మేంపోయింది!" అని దొరకపుచ్చుగున్నాడు లక్ష్మీకాంతం

"అట్లాగనకుమరి సెక్రటరీతో చనువుగా ఉన్నంతమాత్రాన అతని శీలం మొత్తంగా తుడిచిపెట్టివేస్తే నేనొప్పనుస్మా వర్కర్స్‌కి ఎన్ని సదుపాయాలు సమకూర్చాడు! ఎంత ఆదరణతో, ఆప్యాయతతోచూసాడు అక్కడిపనివాళ్లని! కంపెనీసొమ్ము తన స్వంతానికి కానీ ముట్టడు వాళ్లంతా హాయిగా, తృప్తిగా, సంతోషంగా పని చేస్తారు ఇంక మనయ్య ఉన్నాడు గంగాధరం ఏమిటి ఈయన ఘన [illegible] డబ్బు కానీ ఖర్చుపెట్టనక్కర్లేదు. ప్రతిదీ కంపెనీపేరిటే. లాభాలొస్తే, అసలెంతో బైటపెట్టక, తప్పుడు సంఖ్య బైటపెట్టి, ఏదో కాస్త బోనస్ మన మొహాన పారేసి, ఆయన ఇతర భాగస్థులు, లాభాలు గుటకాయ స్వాహా చేస్తారు వాళ్లా స్వార్థపరులే గావున, కిక్కురుమనరు గంగాధరానికి, వేతనాలు పెంచడం, ప్రమోషన్లు, పలుకుబడి—, ఓ నీ చిత్తం—రేపో మాపో ఎలక్షన్‌కి నుంచోపెడతారు" అని ధనంజయం

"అవునుమరి—మరిచిపోకు—అతనికి అల్లరి చిల్లరి తిరుగుళ్ళు, పోకిళ్ళులేవు ఏకపత్నీవ్రతుడు భార్య అనసూయ మహా ఇల్లాలు ఎన్నో అవకాశాలున్నా, అన్నింటినీ వొదులుకుని ఏ పోకిళ్ళూ పోక, ఆ భార్యతో అలా ఉండగలగడం మాటలా? ఈ రోజుల్లో అది ఎందరికి సాధ్యం? అందుకనే ఆయన వృద్ధిలో కొస్తున్నాడు కంపెనీకి లాభాలు తెస్తున్నాడు కాస్తో కూస్తో బోనస్ అంటూ ఇస్తున్నాడు ఆయనే గనక ఎలక్షన్‌కి నిలబడితే నా వోటు ఆయనిదే మాధవీలత వొకటల్లుకున్నదీ అన్నట్లుగా ఆ రవిప్రకాశం—మాధవి కలిసి కంపెనీని ఒక దరికి తెస్తారుస్మా" అన్నాడు లక్ష్మీకాంతం

కాని జనం,ధనంజయుంమాటే సబబైందన్నారు సెక్రటరీతో కులికితే ఏం మహా ప్రమాదం అన్నారు. అది వ్యక్తిగతమైందన్నారు తమకి కావల్సింది బోనస్. గంగాధరంలో నిజాయితీ లోపించింది అసలు విషయం చెప్పక, దగా చేసి లాభాలు జేబులో వేసుగుని పనివాండ్ర క్షేమం గురించి పట్టించుగోని స్వార్థపరుడు ఆయన ఎన్నితప్పులుచేసినా బైటకిరావు. కిందవాడు కాస్త తప్పుకేస్తే సంజాయిషీ ఏనా అడక్కుండా, ఉద్యోగంలోంచి తీసివేస్తాడు హరికృష్ణని అంతే వాడు మతిపోయి, గతిలేక దూర ప్రాంతానికి పారిపొయ్యాడు ఆమధ్య మాధవిని తీసేశాడు ఈయన తీసేసిన వాళ్ళకి పాపం, రవిప్రకాశం ఆశ్రయమిచ్చాడు అన్నారు. సమ్మె నోటీసివ్వాలని నిర్ణయించారు. నోటీసిచ్చారు రెండు వారాల తరువాత సమ్మె చేశారు. కంపెనీ మూసేశామన్నారు లాకవుటన్నారు.

మూడు రోజుల్లోనే పేచీ పరిష్కారమైంది. మరోనెల బోనస్ ఇవ్వడానికి నిర్ణయించారు ఇది సమ్మతమేనని, సమ్మె విరిపివేశారు. కాని ధనంజయంని ఉద్యోగంనుండి తొలగించారు. ఏవేవో కారణాలు చూపెట్టారు లెక్కలతప్పు అన్నారు డబ్బు కక్కూర్తన్నారు. పైవాళ్ల తీసుకుంటుంటే నేతీసుకుంటే తప్పేమి టన్నాడు ధనంజయం. అది డిఫమేషన్‌కింద వొస్తుంది ఋజువు చెయ్యకపోతే, జైలు కెళ్లాలిసొస్తుందని బెదిరించారు. అతను ఋజువు చెయ్యలేడు. పొగతో జగడం. శాపనార్థాలుపెట్టి ధనం జయం, రవిప్రకాశం దగ్గరకెళ్లి, ఉద్యోగం కావాలన్నాడు.

"నువ్వు క్షమాపణచెబితే, వారు నిన్ను మళ్లా పనిలో ఉంచు కుంటారు" అన్నాడు రవి

"చస్తే ఆపని చెయ్యను లాభాలు గుంజి, మమ్మల్ని వీధిపాలు చేసి వాళ్ళేం బాగుపడతారు మీరెరుగరు గనకనా—నాకు మీదాంట్లో చూడండి" అన్నాడు దీనంగా ధనంజయం

"క్షమించాలి ఆ పని చెయ్యలేను. కంపెనీలు నడిపేవారు, లాభాలకోసం శ్రమించడంలో తప్పేమీలేదు ఏమీ ఆధారం లేకుండా ఏదో గాలి కబురుచ్చుగుని, నువ్వు అనవసరంగా అల్లరి పడుతున్నావు నువ్వు అలా ప్రచారం చెయ్యడం తప్పే. ఋజువు చెయ్యలేవు అట్లాంటప్పుడు ఆవేశంలో దురుసుగా వ్యవహరించినా క్షమాపణ తెల్పితే, తిరిగి వారు నిన్ను పనిలో చేర్చుకునేలాగ వారితో సంప్రదించి నచ్చచెప్పగలను. సరా?" అన్నాడు రవి

"అవుతే, ఇక్కడ లాభం లేదంటారా"

"నీ మనస్సు ఇంకా కుదుటపడలేదు. ఓవారంపాటు, ఎక్కడికన్నా వెళ్లి విశ్రాంతి తీసుకునిరా .. ."

"మాకు వొకటే విశ్రాంతి—చచ్చాక. డబ్బున్నవారికి సాధ్యంగాని, మాకెట్లా వీలవుతాయండి అల్లా షికారెళ్లి విశ్రాంతి తీసుకోడాలు."

నవ్వుతున్నాడు రవి

"నువ్వు ఊ అంటె ఆ ఏర్పాట్లన్నీ నే చేస్తాను సరేనా? నేను చెయ్యడం ఇష్టంలేకపోతే, గంగాధరంగారే, నీ కా సదుపాయం కల్పించే ఏర్పాటు చెయ్యనా . ?"

ధనంజయం కోపంతోవెళ్లిపొయ్యాడు లక్ష్మీకాంతం సలహా పైన, నరసయ్య దగ్గరకెళ్లి ఉద్యోగం అడిగాడు. నరసయ్య డబ్బున్న ఆసామీ. ఆయనకి ఈ రెండు కంపెనీలలో భాగముంది. పాతకాలపు మనిషి. వయస్సు దగ్గర దగ్గర అరవై. వ్యవహార మంతా తమ్ముడు చూస్తూవుంటాడు. నరసయ్య చదువుకున్న వాడు కాడు.

"ఏమంటాడు ప్రకాశం?"

"పెట్టుకోనన్నాడు అది నీలుకాదంట. క్షమాపణచెప్పి, గంగాధరం దగ్గర కెళ్లమన్నాడు"

"తీరిపోతుందిగా. అట్లా చెయ్యి. నాకు రెండూ వొకటె"

"మరి మాధవిని ఎల్లా వేసుగున్నాడండి?"

నరసయ్య నవ్వుతూ మీసాల నడుమ పళ్లు ప్రదర్శించాడు.

"మాధవి ఆడదిగా."

"అదే అంటాడు మా లక్ష్మీకాంతం. మీరెట్లా వొప్పుగున్నా రండి ఆమెకి చేసిన సాయం నాకు చెయ్యకూడదాండి, పిల్లలు గలవాణ్ణి."

"ఎయ్యిచెప్పాడు పిల్ల బాగుంటుంది పైపు కూడా బాగానే చేస్తుంది. చురుకైందేనంటారు ఇంతకీ, ఎందులోనైతే, క్షమాపణ నాకు చెప్పావు—చాల్లే అంటాను. గంగాధరం దగ్గరకే పో"

"మీరూ అంతేనా?"

నరసయ్య బిగ్గరగా నవ్వేశాడు ధనంజయం మళ్లా గంగాధరం కంపెనీలోనే చేరాడు మానేసిన రోజులకి డబ్బు ఇవ్వనని పేచీ పెట్టాడు గంగాధరం నలుగురూ నచ్చచెప్పాక, సరేనన్నాడు.

నెల గడిచాక, రవిశంకరంని కలవరంపెట్టే సంఘటనఒకటి జరిగింది. గంగాధరం బొంబాయి పనిమీద వెడుతుంటె కంపె నీకి కొన్ని సరుకులు కావల్సివచ్చి, మార్కెట్‌ధర అందుబాటులో వుంటె, వాటిని తన తరఫున కొని పంపించే ఏర్పాటు చెయ్య వల్సిందిగా కోరాడు రవిశంకరం గంగాధరం, ఆ సరుకు కొని పంపిం చాడు. కాని ఒక చిత్రం జరిగింది. మార్కెట్‌ధర—కిలోగ్రామ్ ఒక రూపాయుంటె, రెండు రూపాయల చొప్పున కొన్నాడు గంగా ధరం బొంబాయిలోవున్న ఒక స్నేహితుడి ద్వారా, ఆనాటి ధర రూపాయేనని తెలుసుకున్నాడు ఇందువల్ల కంపెనీకి, సగానికి సగం నష్టం—యీ కొనుగోలు వ్యవహారంలో; గంగాధరం అట్లా ఎందుకు చేశాడా అని ఆశ్చర్యపడ్డాడుగాని, ఆయన్ని ఆ విషయం అడగలేడు రవి. మరో చిత్రం ఏమిటంటె, ఆనాటి మార్కెట్‌ధర రెండు రూపాయలనీ, తనకి యీ ధర సమ్మతమైతే కొంటాననీ—ట్రంక్ ఫోన్‌లో రవిని పిల్చి అడిగినట్లు, ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లా డుతూ, రవి 'సరే అల్లాగే కొను' అన్నట్లూ, ఆ పిదపనే, తాను ఆ సరుకు కొన్నట్లూ చెప్తాడు గంగాధరం. తానీ విషయం ట్రంక్ టెలి ఫోన్‌లో మాట్లాడలేదు మార్చి మూడోతేదీని ఫోన్ చేశానన్నాడు గంగాధరం. మార్చి మూడో తేదీని తాను పై వూరెళ్లి సాయంత్రం ఆరు దాటాకకాని, కంపెనీకే రాలేదు. ఆరాత్రి, అతనికి ఫోన్ పిలుపే లేదు ఏం జరిగింది? హెచ్చు ధరకి కొనడమే కాకుండా, యీ అబద్ధం ఎందుకో! కలవరపడ్డాడు రవిశంకరం

రవిశంకరం ఒంట్లో బాగలేక, శలవుపెట్టి ఇంట్లోవున్నాడు. జపాలు చేయిస్తామంటె భార్య పుట్టింటి కెళ్లింది ఇంట్లో వంటామె వుంది. సాయంత్రం ఆరు దాటింది పరీక్షచేసి, మందిచ్చి, డాక్టరప్పుడే వెళ్లాడు. కాస్తంత తేలికగా వుండి, మండువాలోకి

పడకకుర్చీ లాక్కుని, చెట్ల నడుమ, ఆకాశంలోకి చూస్తూ కూర్చు న్నాడు రవిశంకరం. ఎవరో వొచ్చారు నీకోసం అంది వంటావిడ. పంపమన్నాడు. ఆ వచ్చినావె మాధవి. స్నఫ్ కలర్ సిల్కుచీర వేసు గుంది నల్లరంగు జాకెట్. తల్లో పూలు మొర్నాడు పూర్ణిమ చందమామ వెలుగు ఆకుల నీడల నడుమ, సంధ్యాదేవి బంతాటకి మల్లె, ఎగిరెగిరి పడుతోంది మాధవి నుదుటి మీద నీడలు, చెక్కిటి మీదికి జారి, వాటి గుండ్రదనాన్ని ప్రస్ఫుటం చేస్తు న్నాయి పెదవుల ఆకృతి, ముక్కు అమరిక, కనురెప్పల పొడవు, స్వప్నంలో చూసిన చిత్రంలో వ్యక్తికిమల్లె వింతగా కనబడసాగింది మాధవి ఆ ప్రతిమ వెనక మనుషులు, సమాజంలేరు. ఏకాకికి సాధ్యపడే ఒక స్వేచ్ఛతో కూడిన ఆకర్షణ ఆమెలో గమనించాడు. ఇదివరకింత పరీక్షగా చూసిన జ్ఞాపకంలేదు అతనికి. అస్వస్థతచే వ్యాకులపడ్డ శరీరం, అందలి ఇంద్రియాలు, మరింత తీక్షణమై, విశాలమై దేన్నో అన్వేషిస్తూ కొత్త పరిమాణాన్ని తెచ్చుగున్నట్లు, ఆమె మూర్తిని చూడ్డంలో వొక వికాసాన్ని చూరగొంటున్నాడు. అదొక మూగ అనుభవం—కాని నిండైనది. అందులో కోర్కె, తాలూకు జిజ్ఞాసలేదు. వాంఛలేదు. వాంఛ ప్రేరేపించగా వుప్పొంగిన తృష్ణావాహిని కాదది. అది, వుంది, లేదు—తిలకించే మనిషితో ముడిపడ్డ అనుభూతి—

"మండువాలో కుర్చీ తెచ్చుగుని ఇల్లా కూర్చో."

"ఎల్లావున్నారు? మిమ్మల్ని చూడకుండా వుండలేకపొయ్యా నబ్బ!" అంది మాధవి కుర్చీ దగ్గరగా లాక్కుని, కూర్చుని. రవి శంకరం నుదిటి మీద అరచేతిని రాస్తూ.

"ఇప్పుడేంలేదు. అంతా బాగైంది. అదుగో భారతీయుల అభిమాన జాడ్యం తలనొప్పి మినహ " అని నవ్వుతూ, ఆమె చేతిని తన చేతిలో క్షణం పట్టుకుని, విడిచి, తొలిగించాడు.

"యుడికొలోన్ వ్రాయనా?"

"అది పై తలనొప్పికి—నాది లో తలనొప్పి" అన్నాడు నవ్వుతూ.

"మీరన్నీ తమాషాగా అంటారు. లోనెప్పికి, పై పట్టు పనికిరాదాండి ?" అంటూ లేచి, కుర్చీ వెనక్కి వెళ్లి, రెండు చేతులతో అతని నుదుటిని రాస్తూంది మాధవి. ఆమె పమిటి జారి, అతని వక్షంపై పడింది. తలవొంచి, పక్కకి తిప్పి, చెక్కిలిని అతని చెంపకి రాసింది. ఇంకా కిందికి వొంగింది. ఆమె స్తనాలు బింకంగా అతని మొహాన్ని, మెడనీ తాకి, శిఖరాన్ని ఆవహించి పీకుతున్న తెల్లమేఘమల్లె కనబడని బరువు మోపుతున్నాయి. మీద పడ్డ పమిటని తోసేశాడతను. ఆమె రెండుచేతులూ పట్టుకుని, పైకి నిలబెట్టి, కళ్లల్లోకి తీవ్రంగా చూశాడు. చేతులు విడి చేసింది.

"తగ్గిందా?"

ఏమీ మాట్లాడ లేదతను.

"కోపమా?"

"ప్చ్"

"మరోసారి రాయనా?" అని నుదుటిని రాస్తూ అతని గడ్డం కింద పెదవులతో తాకింది. ఆమెని విదల్చుకుని, కుర్చీలో లేచి కూర్చున్నాడు.

"అవుతే నిన్ను ఉద్యోగంలోంచి తీసివెయ్యాలి."

"అమ్మో—ఇంకెప్పుడూ చెయ్యనులెండి. ఒకనెల శెలవు కావాలి. అన్నయ్య వొస్తున్నాడు." అంది లేచి తన కుర్చీలో కూర్చుంటూ.

"దానికోసం ఇక్కడికి రావాలా? అప్లికేషన్ భూషణానికిస్తే సరిపోనుగా"

"మిమ్మల్ని చూద్దామనే వొచ్చాను. లో తలనెప్పి ఏమిటో చెప్పరూ కమలమ్మగారి విషయమూ......?"

"కమలమ్మ ఎవరూ?"

"మీభార్య."

"ఓ. అవును. నీకు పేరు తెలుసే."

"నాకన్నీ తెలుసు. పాపం, హిస్టీరియాతో ఆమె ఎప్పుడూ మంచం పైన నేటగా....."

"అవును. ఇప్పుడు బాగా మెరుగు—నాలుగైదేళ్ళుగా. మరో పదేళ్లలో ఆమెకిపూర్తిగా నయమౌతుంది...."

"అంటే?"

"అప్పడికి నే ముసలాణ్ణి అవుతాగా"

మాధవి నవ్వింది. పెదవులు ఎడంగా వుండి. పళ్ళు కనబడుతూంటే, ఆమె మొహానికి వొక కళానుగుణమైన అపురిక రావడం గమనించాడు. అందరి వొంకరలు, ఎత్తుపల్లాలు,—చిత్రకారుడికి తెలుస్తాయి.—మామూలు కళ్లతో చూసేవారికి తెలియదు. సగం వెలుగు పడ్డప్పుడు, ప్రసరించే సగం నీడ నడుమ ఆమె అవయవాల సౌకుమార్యం,—లయ,—అతన్ని ఆకర్షిస్తున్నాయి. ఆమె వయస్సు ఇరవైరెండు దాటదేమో.

"ఇట్లారా" అని లేచాడు. ఆమె అతని వెనకాలె వెళ్ళింది. మండువా దాటి, హాల్లో లైటువేసి, దాని వెనక గదిలో కొచ్చారు. అందులో రెండు సోఫాలు, వొక దివాన్, కుర్చీలు, వున్నాయి. ఆమె దివాన్‌లో కూర్చుంది. గోడని, నాలుగైదు, వాటర్‌కలర్ చిత్రాలున్నాయి. బరువైన ఫ్రేమ్స్‌లో అమర్చిన, తైలవర్ణ నగ్నస్త్రీ చిత్రాలున్నాయి. మూల బీరువాలో పుస్తకాలు, రంగులు, బ్రష్‌లు, సీసాలు, చిత్రలేఖనం పరికరాలు. పుస్తకాల బీరువా మీద ప్లాస్టర్‌లో తయారు చేసిన నగ్నస్త్రీ శిల్పాలున్నాయి.. రెండింటికి తలలు లేవు. వొకదానికి కళ్ళులేవు మరో దానికి స్తనాలే లేవు. అట్లాంటివి ఆమె ఎప్పుడూ చూడలేదు. వింతగా పరికిస్తోంది.

"ఇవన్నీ మీరు గీసినవేనా?"

"బాగున్నాయా? నీకేది బాగుంది?"

"నాకన్నీ బాగానే వున్నాయి."

"అట్లా కూర్చో, కదలకు."

అని ఆమె చీరమడతలు, వొక క్రమంలో సర్ది, పమిట జడ మీద నుండి బుజాల చుట్టూ కప్పి, కాళ్ళ మడత లేకుండా, ఎడంగా వుంచి, వాటి మీద చీర మడతలు క్రిందికి తిన్నగా జారేలాగు అమర్చి, కదలకుండా కూర్చోమన్నాడు. ఆమె తలపైన గోడకున్న లైట్ వేసి, తను దూరంగా కూర్చుని, చార్‌కోల్ చిత్రం గీస్తున్నాడు. పైభాగంపూర్తి చెయ్యాలని పది నిమిషాలయ్యాక, దగ్గరగా వొచ్చి, ఆమె గడ్డం కింద చెయ్యి పెట్టి పైకి తోసి, తల వెనక్కి పడేటట్లు అమర్చాడు. గట్టిగా అతని మెడని రెండు చేతులతోనూ పట్టుకుని, పైకి వొంగి, ముద్దు పెట్టుకుంది. అతను ఆమె దవడమీద బలంగా కొట్టాడు 'అబ్బ'— అని వెనక్కి పడిపోయింది. మొహం మీద రెండు చేతులూ కప్పుకుని, ఏడుపు సాగించింది మాధవి.

వక్షం నుండి, క్రిందిభాగం చీర మడతలు వున్న చార్‌కోల్ చిత్రంపూర్తి చేశాడు. ఆమె దగ్గరగా వొచ్చాడు.

"కోపమా?" అని ఆమె చేతిని మొహం పైనుండి తొలిగించాడు. చేతిని తన గుప్పెట్లో బిగించాడు. ఆమె ఇంకా సన్నగా ఏడుస్తూనే వుంది. కన్నీటి డాగులతో మొహం, ఫోకస్‌లోలేని వెండితెరపై బొమ్మలా, వొణికిపోతోంది. పల్చటి ఆకుపచ్చ తెర పొరలా—నాళాల చుట్టూ, పల్చగా వ్యాపించే ఆ రంగు, సంధ్య చివరి దశలో ఆకాశంలో నిల్చిపోయిన, ఆకుపచ్చ మేఘమల్లే, ఆమె శరీర ఛాయ నడుమ, కనబడి అదృశ్యమవడం, పరోక్షంగా ఉద్రేకం లేకుండా చూస్తున్నాడు.

"ఏదో వొంట్లో బాగలేక—చిరాకువల్ల—అల్లా చేశాను. కోపం తగ్గిందా?"

మాధవి లేచి కూర్చుంది. ఒక్కసారిగా, అగ్నిగుండం ప్రజ్వరిల్లినట్లు ఏడ్పు సాగించి, అతని తలలో చేతులు పోనిచ్చి క్రాపింగ్ పీకుతూ, అతని మెడ మీద, బుగ్గల మీద, వెన్ను మీద బలంగా, గుద్దడం, మొట్టడం, రక్కడం ప్రారంభించింది.

"మరి ఎందుకు? నన్నెందుకు ఇల్లా ఇక్కడికి?" అంటూ, ఏవేవో ధ్వనులు చేస్తూ భౌతికంగా అతన్ని హింసిస్తోంది అతను లేచి, ఆమె కళ్లల్లోకి బాధగా చూసి, దివాన్ మీదికి తోసేసి,


రేపు ఆఖరి పరీక్ష— ఈ రాత్రి చివరిసారి రివిజన్—
యూనివర్సిటీలో అంతా ఆటాపాటాగా
గడిచిపోయినప్పటికీ బాగా కష్టపడి చదవాలి—,
మొదటి తరగతి రావాలంటే ఈ రాత్రి
ఒక్కపూట కొంచెం కష్టపడితే చాలు.
ఒక్క కప్పు కాఫీ
తిరిగి పుస్తకం పట్టుకోవచ్చు-
రెట్టించిన ఏకాగ్రతతో.
కాఫీ బోర్డు బెంగళూరు
COFFEE BOARD
మంచి కాఫీ కలిగించే చురుకుదనం
మరే పానీయమూ ఇవ్వలేదు.
మందకొడిగా వున్నప్పుడు కాఫీ హుషారు
కలిగిస్తుంది. ఆనందాన్నిస్తుంది.
ఎక్కడేనాసరే...ఎప్పుడేనాసరే...
కాఫీ ఉత్తేజపరుస్తుంది
FDS CB 433 TE

హాలు దాటి, మండువా దాటి, చెట్ల మధ్య కుర్చీలో కూర్చుని, ఆకాశంలో, చందమామ ప్రసరించే వింత నీడల చోద్యం చూస్తో, కళ్లు మూసుకుని, విశ్రాంతి తీసుకుంటున్నాడు. అరగంటైంది. లేచి, గదిలో కొచ్చి చూశాడు. మాధవి అక్కడ లేదు.

మొర్నాడు సాయంత్రం, ఏదో జ్ఞాపకమొచ్చి కంపెనీ కెళ్లాడు. పనివాళ్లకి మరికొన్ని సదుపాయాలు కల్పించాలనుకున్నాడు ఒకటి, అన్ని గదులలోనూ మంచి తివాసీలు వేయించడం. రెండోది ఒక పెద్దహాలు కట్టించి,వారంవారం, సినిమా ప్రదర్శన ఏర్పాటు చేయించడం. పనివాళ్లంతా కుటుంబాలతో వొచ్చి చూసి వినోదించే, ఏర్పాటు. కాని మేనేజిమెంట్ సుముఖంగాలేరు బొంబాయి నుండి గంగాధరం ద్వారా తెప్పించిన సరుకులో కంపెనీ సొమ్ము సగానికి సగం నష్టమైందని అతనికి తెలుసు. వారికి తెలియదు. ఇంకా ఆ సంఘటన తెచ్చిన వ్యాకులత నుండి అతను తేరుకోలేదు. ఏదో చెయ్యాలి. కంట్రాక్టర్‌కి చేరే సొమ్ము, ఆదాయం చెయ్యాలంటె, స్వయంగా కట్టడానికి పూనుకోవాలి. భూషణంకి యిట్లాంటి పనులలో కొంత అనుభవం ఉంది అతన్ని కదలెయ్యాలి. అతన్ని సాయంత్రం ఆఫీసులో ఉండవల్సిందిగా కబురెట్టి ఐదింటికి కంపెనీ కెళ్లాడు రవిశంకరం. కాని కంపెనీలో, వొక రిద్దరు పనివాళ్లుతప్ప, ఎవ్వరూ లేరు. భూషణం లేడు. జ్ఞాపకంవొచ్చింది. గంగాధరంకి వాళ్ళ కంపెనీవాళ్లు పార్టీ యిస్తున్నారు—బోనస్ ఇప్పించినందుకు. వీళ్లు కూడా అక్కడికి వెళ్లి ఉంటారు తనకీ వొచ్చింది ఆహ్వానం. పోనీ వో క్షణం వెడితే నేం ? కారు అటు పట్టించి వెళ్లాడు. ఆరుబైట కుర్చీలు, బెంచీలు--జనం నిండిపొయ్యారు. వేదికపై ఉపన్యాసాలు—గంగాధరంని మెచ్చుగుంటో. ఆ మాట్లాడుతున్నది లక్ష్మీకాంతం కాబోలు. వేదికపై, అనసూయ కూడా ఉంది — గంగాధరం భార్య, వారి ఆదర్శ దాంపత్యాన్ని కొనియాడుతున్నారు.

అతడు ఏకపత్నీవ్రతుడు— ఆమె మహా ఇల్లాలు. వారి అన్యోన్యం, దాంపత్యం, ఆదర్శంగా, మిగతావారంతా నడుచుకోవాలిట. నవ్వుకున్నాడు రవిశంకరం. అనసూయ మంచిది— అతనూ మంచివాడే,---స్వంత సొమ్ము కాని ఖర్చు చెయ్యరు. అనసూయ, మనిషి బాగుండదు ఐనా యాభైయ్యో పడిలో పడ్డాక, అందచందాల జోలెందుకు ? నీతి, నిజాయితీ, దయా దాక్షిణ్యం. —ఇతరులకి మేలు చెయ్యటం—ఇవి కావాలి. మార్కెట్ ధర "రూపాయుంటే, రెండని, సరుకు కొని,' తన కంపెనీకి నష్టం చేసి, ఆ సొమ్ము జేబులో వేసుకున్న గంగాధరం చాకచక్యాన్ని కార్యదీక్షని, వ్యవహార దక్షతను మెచ్చుగుంటోంది సమాజం. ఈ సమాజంలో గంగాధరంలా ఉండటమే మంచిదేమో. సమాజం కంటె, నీతిపరుడుగా ఉండటం మంచిదికాదన్నా రెవరో.

తనని ఎవ్వరూ చూడలేదు. వెనకగా నిలబడి, తిరిగి కంపెనీ కొచ్చేశాడు రవిశంకరం.

మెల్లగా నడుస్తూ, తన గదిలో కొచ్చాడు. లోపల ఎవరో మాట్లాడుకుంటున్నారు నవ్వులు, కేకలు వినబడ్డాయి. ఎవరబ్బా ! ఇప్పుడు తన గదిలోకి వెళ్ళడం మంచిదికాదు మెల్లగా వెనక్కి తిరిగి, పూలమొక్కల నడుమ ఫౌంటెన్ ప్రక్క నిలబడ్డాడు. నియాన్ దీపం చుట్టూ, కీటకాలు మూగి, వింత వింత రీతులలో ఎగురుతూ, వొక డిజైన్ ప్రదర్శించి నాట్యం చేస్తున్నాయి. ఒక వ్యక్తి,—పాంట్, బుష్‌షర్ట్—వేసుకుని వెడుతున్నాడు. గేటు దాటాడు. అతన్ని గుర్తు పట్టాడు రవి. అతను రంజిత్ మరో నాలుగు నిముషాలయ్యాక, బాగ్ వూపుగుంటూ వొస్తోంది మాధవి. అతన్ని చూడగానే నిల్చిపోయింది.

"మీరా ? ఎలా ఉందీపూట—? మీ ఇంటికే బైలుదేరాను. ఏం, ఇలా వొచ్చారేం—? . . అబ్బ, మాట్లాడండి "

"బాగానే ఉంది. పొద్దోయింది. ఇంటికి వెళ్ళరాదూ— కార్లో దింపమన్నా .. ?" అన్నాడు.

"మీతో మాట్లాడాలి—మీ ఇంటికి రావొచ్చా ?"

"ఇప్పుడు నేను ఇంటికి వెళ్ళడంలేదు కాస్తంత పని చూసుకోవాలి " అని రవిశంకరం, తన గదివైపు వెళ్ళాడు. షర్ట్ బటన్స్ తీసేసి, పంకా తిప్పి, రెండు కాళ్ళూ బల్లమీద ఆనించి కళ్ళు మూసుకుని పరున్నాడు ఇదు నిముషాలైంది. మాధవి మెల్లగా వొచ్చి, అతని కుర్చీ పక్కన, బల్ల చివర కూర్చుంది. నుదుటిమీద ఉన్న అతని చేతిని తీసుకుంది. ఉలిక్కిపడి, కళ్ళు తెరిచాడు.

"నన్ను క్షమించరూ ... నిన్న చేసిన దానికి . "

అతనేమీ మాట్లాడలేదు కాళ్ళు దించి, బొత్తాములు తగుల్చుకుని, సర్దుకు కూర్చున్నాడు.

"క్షమించా నంటే కాని వొదల్ను" అంది అతని చేతి మీద రాస్తూ,

"ఏమనాలో తెలీదు "

అన్నాడు.

"అతనే, ఆ రంజిత్, ఏదో కబుర్లు పెడతాడు. రావొద్దంటే వినడు. పొమ్మంటే పోడు సాయంత్రం నుండి కబుర్లు పెట్టాడు. గంగాధరంగారి పార్టీట ఎవరెవరు ఎలా మాట్లాడుతారో, అందర్నీ ఇమిటేట్‌చేసి చూపిస్తాడు—అచ్ఛంగా గంగాధరం కంఠంలాగ పూరించి, ఆయన మాట్లాడినట్లే మాట్లాడతాడు. తను నాటకం యాక్టర్‌ట మిమ్మల్నీ ఇమిటేట్ చేస్తాడు . . నేనేం చెయ్యను చెప్పండి. నా ఉద్యోగం వూడుతుంది. నువ్విలా చేస్తే

అన్నాను పూడితే మా కంపెనీలో ఇప్పిస్తాలే అంటాడు. ఇలా వేధించుకు తింటాడు. మరి క్షమించరూ."

ఆమె నిజం చెప్తున్న కళ్ల వైఖరికి రవి ఆశ్చర్యపడ్డాడు. కళ్లల్లో నిజం, నీలి నీడలు ప్రసరిస్తుంది అది అబద్ధానికి చేతకాదు ఆమె పల్చటిముక్కు, పెదవుల నడుమ తపనతో తిరుగాడే అమాయకత్వం, బుగ్గలపై, మంచు వెనక ఆకుపచ్చ పొద కదిలిన రీతి— ఆకుపచ్చ ఛాయ, కదిలి అదృశ్యమై కంఠం కదలికతో మెడ నాళాలలో దర్శన మివ్వటం, వింతగా గమనిస్తున్నాడు రవి.

"మార్చి మూడో తేదీని, నా కేదన్నా ట్రంక్ టెలిఫోన్ వొచ్చిన గుర్తుందా ?"

"లేదండి—లేదని చెప్పాగా— అప్పుడోమారు అడిగారుగా ." అంది మాధవి కళ్లు చిట్లిస్తూ.

"బాగా జ్ఞాపకం చేసుకో . మధ్యాహ్నం—సాయంత్రం—నాలుగు, ఐదు,—ఆరు లోపు . . బాగా జ్ఞాపకం చేసుకో . ఎక్స్ చేంజ్ ని వాకబు చేశాను. బొంబాయి నుండి ఫోన్‌కాల్ వొచ్చినట్లు వారి చిట్టాలో వుందన్నారు "

"ఎప్పుడబ్బా .... రాలేదే . . ." అని తల దించి, బల్లమీద వేళ్లతో గీస్తోంది మాధవి.

"అమ్మయ్య—అవునండి—ఇప్పుడు గుర్తుకొస్తోంది — ఆరోజు సాయంత్రం— రంజిత్ వొచ్చి, కబుర్లు సాగించాడు. సినిమాకి రమ్మన్నాడు, రానన్నా ఇక్కడే కూర్చుని, వాగడం—అందర్నీ ఇమిటేట్ చెయ్యడం— ఈలోగా టెలిఫోన్ చప్పుడైంది.—మరెక్కడి నుంచో—తనే తీసుకుని, మీరు మాట్లాడే మాదిరి ఆ, ఊ అల్లాగే—కానియ్యండి—మీ రంటూ ఉంటారే అప్పుడప్పుడు—కానియ్యండని—అల్లా—ఏవో నాలుగైదు మాటలు—ఉ, ఆ — అవే జ్ఞాపకం '

అని నిల్చిపోయింది ఏదో ఆలోచనలో పడ్డట్లు పరధ్యానంగా ఉంది.

"ఇది నీకు ఇప్పుడే జ్ఞాపకం వొచ్చిందా—ఇదివరకు తెలిసి మరిచిపోయి, మళ్లా జ్ఞాపకం చేసుగున్నావా ?" అని అడిగాడు.

తటపటాయించింది లేచింది అతని వొళ్లో తల ఆనించి, ఏడ్పు సాగించింది ఆమె మోహాన్ని పైకెత్తి దూరంగా కూర్చోబెట్టి, ఆమె కళ్లల్లోకి చూశాడు.

"నాకు తెలుసు. తర్వాత చెప్పాడు. గంగాధరంగారు ఫోన్ చేశాడుట. మీరు మాట్లాడినట్లే, ఆయన అడిగిన దానికి సరే

అల్లానే కానీయండి—అన్నాడుట—తనూషాకిట తర్వాత చెప్పాడు. మీతో చెప్పేధైర్యంలేక చెప్పలేదు నన్ను క్షమించరూ—.ఇంకెప్పుడూ ఇట్లా చెయ్యను ''

రవిశంకరం లేచాడు ఆమె భుజంపైన చెయ్యివేసి ఓదా రుస్తూ, "నిజం చెప్పావు. నా కది చాలు. నిజం చెప్పినవారు ఎంతో అందంగా కనబడతారు—నువ్వు ఎంతో అందంగా వున్నావు యీ క్షణంలో..." అని ఆమె నుదుటికి తన అధరాలు తగిల్చాడు రవిశంకరం. క్షణం, అదిమి పట్టింది మాధవి ఇద్దరూ బైటికి వొచ్చారు కార్లో వెళ్లమన్నాడు ఎడిచి వెడతా లెండి అని వెళ్లిపోయింది మాధవి.

తను అనవసరంగా అనుమానించాడు గంగాధరంని ఇతరుల చెడ్డతనాన్ని బుజువు చెయ్యడానికి మనిషి ఎంత కుతూహల పడ తాడు ! ఎంత ఆతృత ! పాపం, గంగాధరం, మార్కెట్ ధర ఎంతుందో ఫోన్ చేశాడు సరే కొనమన్నాడు రంజిత్, తన కంఠంతో. అతను కొన్నాడు.

మార్కెట్ ధర రూపాయే నని బొంబాయి స్నేహితుడు పంపిన భోగట్టా సరైంది కాదు తేదీయో, వొస్తువో, ధరో—ఎందులోనో పొరబాటు పడివుండొచ్చు వెళ్లి గంగాధరాన్ని కౌగ లించుగుని తను లోపఏమనుకున్నదీ చెప్పివేసి, మాధవి మల్లే



ఏడ్చేద్దామనిపిస్తోంది అల్లా ఏడ్చివేసి, లోపలి కుళ్లుని, ద్వేషాన్ని కడిగివేస్తే మనుషులు ఎంత అందంగా ఉంటారు ! మాధవి ఎంత అందంగా ఉంది ! ఆమెని ముద్దు పెట్టుకోక తప్పింది కాదు! గంగా ధరాన్ని కౌగలించుకోవాలి అతనికేదో మేలు చెయ్యాలి, కృతజ్ఞత చెప్పుకోవాలి. తన అసూయని, ద్వేషాన్ని గుండెలోంచి బాకు లాగి నట్లు, లాగెయ్యాలి పార్టీలో అందరూ అతన్ని మెచ్చుగుంటు న్నారు తనూ వెళ్లి, మెచ్చుగుంటూ ఉపన్యసిస్తే ! ఏదో చెయ్యాలి-మనస్సు పీకుతోంది కారు గంగాధరం పార్టీ ఆవరణవేపు పోనిమ్మ న్నాడు రవి అక్కడ నిల్చింది కారు పార్టీ ఐపోయింది. అందరూ ఇళ్లకి పోతున్నారు కప్పులు, సాసర్లు తీస్తున్నారు. కుర్చీలు సర్దుతున్నారు

మరో అవకాశం రాదా ? కారు ఇంటికి పోనిమ్మన్నాడు రవి. అంతే జీవితం గుండె పగుల్తుంది వినేవాళ్లేరి !

ఆ అవకాశం, వారంలోనే వొచ్చింది రవి, డాక్టర్ల సలహాపై కంపెనీకి వెళ్లక, ఇంటివద్ద చికిత్స పొంది, విశ్రాంతి తీసు కుంటున్నాడు గంగాధరం, స్టెయిన్‌లెస్ స్టీల్ కొనడానికి బొంబా యెడుతున్నాను, మీ కంపెనీకి కూడా స్టెయిన్‌లెస్ స్టీల్ కావాలి కదా, బొంబాయి రాకూడదా—అని తనే స్వయంగా వొచ్చి అడి గాడు అవును తమ కంపెనీకి కూడా కొంత స్టెయిన్‌లెస్‌స్టీల్ కావాలి. మేనేజిమెంట్ ఏడాది క్రితమే అంగీకరించారు బద్ద కించి తాను దాని విషయం పట్టించుకోలేదు ఇప్పుడు ఆ అవ కాశం వొచ్చింది గంగాధరం రమ్మంటున్నారు అతనితో కలిసి వెడితే బాగుంటుంది. అతనితో కలిసి ఉండడంలో, తృప్తి, శాంతి ఉన్నాయి. గంగాధరాన్ని శంకించాడు ఎంత మంచివాడు అతని ఖర్చు కూడా తనే భరిస్తేనేం ? ఈ విశ్రాంతి చాలు. అస్వస్థత అల్లా ఉంటూనే ఉంటుంది డాక్టర్లు ఉన్నంతకాలం. వెళ్లడానికి నిశ్చయించుగున్నాడు డబ్బు తీసుగుని, ఇద్దరూ మొర్నాడే బొంబాయి ప్రయాణ మయ్యారు

అక్కడ స్టెయిన్‌లెస్‌స్టీల్ కొనేటందుకు ఇద్దరూ చెంబై సెన్సూ కొన్నారు. మార్కెట్ ధర వాకబు చేశారు. కిలో గ్రామ్ ధర మారుతూ ఉంటుందిట రెండు రోజులు గమనిద్దా మన్నాడు గంగాధరం అతను వేరే ఇతర పనులు చూసుకుంటూంటే రవిశంకరం, తన స్నేహితుల్ని కలుసుగుని, వారితో వొకరోజు గడిపాడు హిరాలాల్‌తో కలిసి ఒకరోజు, చిత్రకళా ప్రదర్శనం చూస్తూ గడిపాడు. నైరూప్య చిత్రాలే చాలాభాగం. ఆనాడు నియాన్‌లైట్ చుట్టూ మూగుతూ కీటకాలు ప్రద ర్శించిన డిజైన్‌ల, లాంటి బొమ్మలు కొన్ని—పెద్ద కాన్వాస్‌పై మధ్య నల్ల సున్నా గీసిన బొమ్మ వొకటుంది అంత రంగు వృధా చెయ్యడమే ! మరొకటి గోనిసంచి అతికించి దానిమీద ఇటుక

పొడుం జిగురుతో అతికించిన చిత్రం నగ్న స్త్రీ చిత్రాలు రెండు మూడున్నాయి.

కళ్ళు, ముక్కు, నోరు—ఏదీ స్ఫుటంగా కనబడదు. సినిమాలో ఫోకస్ తప్పిన చిత్రాలవలె కొన్ని ఉన్నాయి ముఖ్యంగా మొహానికి ఆకుపచ్చరంగు ముద్ద పెడుతున్నారు, ముక్కున్నచోట మొహానికి ఆకుపచ్చ ఇప్పుడు ఫాషన్ కాబోలు. మాధవి మొహంలో ఆకుపచ్చ ఛాయ, తళుకు స్ఫురణ కొస్తాయి. ఇట్లాంటి చిత్రాలు చూడడంవల్ల, ఆమె మొహంలో ఆకుపచ్చ కనబడుతోందా ? ఏమో—చిత్రకారుడి కళ ద్వారా చూస్తాం మనం. అతను పర్వతాన్ని ఎలా చిత్రిస్తే, అసలు పర్వతం అలాగే కనబడుతుంది మనకి ఒకటే కన్నుగల మూర్తిని చిత్రిస్తే, నిత్య జీవితంలో, రెండు కళ్ళు రోత పుట్టిస్తాయి కాబోలు ప్రకృతిలో అందం లేదు రంగు లేదు—ఆకృతి లేదు లయ లేదు ఎవరో 'అన్నట్లు, ప్రకృతిలో స్థూలంగా కనబడేది బూడిదరంగు చిత్రకారుడి ప్రకృతినే చూస్తాం మనం ఎర్ర కృష్ణుణ్ణి ఏ గోపిక ప్రేమిస్తుంది ?

రవిశంకరం వొళ్ళు తిరిగినట్లయింది. తల భారంగా ఉంది పాదాలకింద నేల బీటలు తీస్తున్నట్లుంది మిత్రుడు హీరాలాల్ తన గదికి తీసికెళ్ళాడు డాక్టర్ని పిలిచాడు ఆయన మందులిచ్చి బాగా ఒక నెల రోజులపాటు, చల్లటి ప్రాంతానికెళ్ళి విశ్రాంతి తీసుకోమని సలహా యిచ్చాడు ఈ డాక్టర్లంతా యింతే రోగి ఇంత వున్నవాడని తెలియగానే,ఎక్కడికో వెళ్ళి రెస్టు తీసుకోమంటుంటారు అమెరికాలో ఇంతే ఒక్కరోజు కూడా విశ్రాంతి లేకుండా పనిచేస్తారు అక్కడ అంత డబ్బు తాపత్రయం తొందర్లోనే వారి శరీరాలు బీటలువారి, పనికిరాకుండా పోతాయి విశ్రాంతి **తీసుకోమంటారు. ఏం** విశ్రాంతి? చచ్చాక అంతా విశ్రాంతే హీరాలాల్, కాశ్మీర్ రమ్మని ఆహ్వానించాడు అక్కడ అతనికి ప్రచార శాఖలో ఉద్యోగం ఇప్పుడు శ్రీనగర్ రోడ్డు బాగైంది ప్రయాణ సదుపాయాలు నేను చూసుకుంటాను, రావల్సిందిగా పట్టుబట్టాడు హీరాలాల్ మేనేజ్మెంట్‌తో ఫోన్‌లో మాట్లాడి, ఒక నెల శెలవు కోరాడు రవిశంకరం వాళ్ళు సరేనన్నారు.తన పనిని భూషణంకి వప్పగిస్తాం, **నీకు సమ్మతమేనా అన్నారు. సరేనన్నాడు. ఈ విషయం తెలుపుతూ** భార్యకి ఉత్తరం వ్రాశాడు. మొర్నాడు తన గదికి తీసుకొచ్చాడు హిరాలాల్

సాయంత్రం నాలుగైంది. అప్పుడే ముస్తాబై బైటికి వెళ్ళబోతున్నాడు గంగాధరం.

"నిన్నల్లా ఏమయ్యావు ? గుహలో కాగడా వేస్తున్నావా ?" అని అడిగాడు.

"అంటే ?"

"అమ్మాత్రం తెలీనట్లు నటిస్తావేం ? నాలుగురోజు లుండి పొయ్యే బిజినెస్ మెన్‌కోసం, గుహలు కట్టారుగా—లైసెన్స్ పుచ్చుగున్న గుహాలేలే ." అని నవ్వుతూ మీసాల నడుమ పళ్ళు ప్రదర్శించాడు గంగాధరం.

"ఓ అదా—ఈ స్థితిలో, ఈ వయస్సులోనా ?"

"ముఖ్యంగా ఈ వయస్సులోనే ...అహొ,హొ—"అని ఇంకా నవ్వుతునాడు.

రవిశంకరం, తన స్థితి అంతా చెప్పాడు. ఒంట్లో బాగా లేకపోవడం వైద్యం, విశ్రాంతి లీసుకునే సంకల్పం, కాశ్మీర్ ప్రయాణం, హీరాలాల్ ఆహ్వానం, తను శెలవు పొందిన సంగతి —అన్నీ చెప్పాడు.

"వెళ్ళు అవును. నీకు బాగా రెస్టు అవసరం ముఖ్యంగా— మాధవి నుండి రెస్టు కావాలి నీకు."

రవికి కోపం వొచ్చింది అంత పచ్చిగా, దురుసుగా మాట్లాడితే అతను హర్షించడు.

"పోనీ—ఆమెకు నీనుండి రెస్టుకావాలి సరేనా?"—

రవి వొళ్ళు మండిపోయింది. ఈ గంగాధరాన్నా, తాను కౌగలించుకోవాలనుకున్నది ! ఇతనిముందు తన మనసు విప్పి, అంతా చెప్పివేసి, ఏడవాలనిపించిందా ! ఈ బొంబాయి లైసెన్స్ గుహాలలో కాగడావేస్తే, యీ ఏకపత్నీవ్రతుడిపైనా తన ఔదార్యం, కారుణ్యం, పశ్చాత్తాపంతో గుండె బేజారై పగిలినప్పుడు, వినడానికి రమ్మని ఆహ్వానించినది యీ వ్యక్తినా !

"ఎల్లా ఉంది ....?"

"ఇప్పుడు బాగానే ఉంది "

"అది కాదోయ్—మాధవి."

"ఓ."

"మా రంజిత్‌ని చేసుకోమని వెంటబడి చంపుకుతింటోంది. ఏముందని వాళ్లకి... ముష్టి సంబంధం. పాకం ముదరకముందే, పంపించివేశాను .."

తను ఏమనాలో తెలియదు ఏ ఉద్రేకమూ చూపకుండా, సంస్కారంతో వొచ్చే, స్వారస్యం లేకుండా, వొక యంత్రంలా పలుకుతాడు గంగాధరం. అది తనకి సాధ్యమైతే ఎంత బాగుండును ! కంపెనీ వృద్ధిలో కొచ్చును. బోనస్ ఇద్దురు. తనని పొగుడుతూ ఉపన్యాసా లిద్దురు తన పలుకుబడి, హొదా, పెరుగును. తనొక ప్రముఖ వ్యక్తవును. ఈ సమాజానికి శత్రువు సంస్కారం

కాని సంస్కారం ఎముకలలో జీర్ణించిపోయింది. దాన్ని వొదుల్చుకో లేడు. అస్థిపంజరం నుండి పారిపోలేడు.

"బై దివే—కాశ్మీర్‌లో మాధవి అన్నగారున్నాడుగా తెలుసుగా. వాకో డజను కాశ్మీర్ శాలవలు తెచ్చిపెట్టేం ...."

డజను కావాలి వొకటి, రెండు చాలవు. ఎంత స్వార్థం, ఎంత ఆశ !

"తరవాత అడ్జెస్ట్ చేసుకుందాం....!"

"చూడు, ఆ కోటుజేబులో, లోపల, పాకెట్‌లో లైసెన్స్, చెక్ ఉన్నాయి. తీసుగుని, మా సరుకు కూడా కొని పంపించు," అన్నాడు రవిశంకరం.

గదిలోమూలగా ఉన్న కోటులో చెయ్యి పెట్టి కెలుకు తుండగా గంగాధరం, అటు తిరిగి రవిశంకరం కళ్లు మూసుగుని పరున్నాడు. కాసేపటికి, తేరుకుని లేచాడు. మొహాన నీళ్లు జల్లు కున్నాడు సామాను సర్దుకుని చిత్రలేఖనం పరికరాలు, పోస్టర్లు శిల్పం సామాన్లు కొనుక్కుని, హీరాలాల్ గదికెళ్లి, ఆ మొర్నాడు పఠాన్‌కోట్‌కు, హీరాలాల్‌తో కలిసి ప్రయాణ మయ్యాడు స్టేషనులో వీడ్కోలివ్వడానికి గంగాధరంకి తీరక, అతనితో కలి సొచ్చిన సోమయ్యని పంపాడు. రైలు కదుల్తుంటే చెప్పాడు సోమయ్యా స్టెయిన్‌లెస్ స్టీల్ టన్ను పదివే లన్నట్లు !

పఠాన్‌కోట నుండి జమ్మూ పట్నానికి అరవైఏడు మైళ్ల దూరం. బస్సులో సాయంత్రానికి జమ్మూ చేరుకుని ఆ రాత్రి హోటల్‌లో గడిపి మర్నాడు ఉదయం తొమ్మిదింటికి బస్సులో శ్రీనగర్‌కి బయలుదేరారు,రవిశంకరం, హీరాలాల్. అది రెండువందల మైళ్ల ప్రయాణం. బాట అంతా కొండలపైననే. వకొక్క చోట ఐదువేల అడుగుల ఎత్తు గల కొండ బాటలో నడు స్తుంది బస్సు. కుడివైపున మరొక ఎత్తయిన కొండ గోడ. వర్షపునీరు వృద్ధ కొండదేవత నెరిసిన జుట్టు విప్పి ఆరవేసి నట్లుగా సన్న ధారగా పైనుంచి జారుతూ ఉంటుంది ఎడమ వైపుకి తల తిప్పి వంగి చూస్తే అడుగున జీలం నది రాళ్ల మధ్యగా రంగు రంగులతో మెరుస్తూ కదిలిపోతూ ఉంటుంది. దాని బాట బ్రహ్మదేవుడి రక్తనాళం. దాని ధ్వని శివుడిని కామించిన పార్వతి పిలుపు ప్రతిధ్వని. రాని ప్రియుడికోసం పరితపించి రవిక విప్పేసి ఆకాశం క్రింద విరహబాధతో రోదిస్తున్న విశ్వకన్యల స్తనాలు ఆ కొండ శిఖరాలు. ఏనాడో సిగ్గుపడి కాముడు మంచు తెర తెల్ల చీరగా వాటి వక్షాలని కప్పుతాడు. తపనతో వాటిని

తొలగించి గుండెలు బాదుకొనే పిడుగులు పడగా చీర మడత నదిలో పారేసి నగ్నంగా పడిఉంటారు విశ్వకన్యలు. బహిష్ఠు కాగానే విడిచి పారేసిన ఆ చీర ద్రౌపదికి కృష్ణుడిచ్చిన చీరకి మల్లే అనంతంగా కొండ నడుంని చుట్టబెట్టే అనంతమైన చీరగా సాగిపోతుంది ఆ జీలంనది. ఇక్కడ పిఱుదపై ఎఱుపు రంగు; అక్కడ అదృశ్యం, అక్కడ బొడ్డుపై చిరుగు; అదొక సుడిగుండం; మళ్ళా అదృశ్యం. అక్కడ వక్షాన్ని పట్టి, పీకి చుట్టూ తిరుగుతూ పట్టు విడిచేసి వేగానికి క్రిందికి పడిపోయిన దృశ్యం; అదృశ్యం కొంతదూరం వెళ్ళాక పీకచుట్టూ ముడిపడి పీక నులివినట్లు 'అమ్మో' అన్న కేక ప్రతిధ్వని చెవలకి సోక కుండా అఘాతంలోకి, దూకిన దృశ్యం; అదృశ్యం. ఎక్కడెక్కడో– మరొక్కచోట తోటికన్యతో చట్టా పట్టాలు— రెండు చీరలు ఆరవేసిన దృశ్యం, అదృశ్యం, రెంటినీ కుట్టి తనే ధరించి సైజు పెద్దదై తానందులో కూరుకొని మరికనబడక లుంగగా దొర్లుకుంటూ సాగారిన దృశ్యం; అదృశ్యం. విసుగెత్తి ఉక్కబోసి వూపిరి ఆడక నాచుతో పచ్చబడిన వస్త్రాన్ని కొండ గట్టు మీద పారేసి నిశ్చేచీగా, నగ్నంగా రాళ్లను మంచి చేసుకుంటూ చదును నేలను బుజ్జగిస్తూ మరి కదలక ప్రశాంతంగా ప్రవహించిన ఆ జీలంనది వైవిధ్య సౌందర్యము చూడ గలిగిన మానవుడి నేత్రాలు ఎంతటి సౌందర్యాన్ని దాచుకొన్న కళ్లని మూసుకొని ఒక్కసారి చూడగలిగాడు రవిశంకరం. దోవలో చాటోట్ అనే చోట రొట్టెలు; రాంబాణ్ అనే చోట టీ, ఆ రాత్రి బనిహాల్ బంగళాలో మకాం మరునాడు ఉదయం సుమారు ఆరువేల అడుగుల ఎత్తు గల కొండపై జవహర్ సొరంగం గుండా పోతుంది బస్సు అక్కడ తొమ్మిదివేల అడుగులఎత్తు ఆరు వందలయాభై అడుగుల పొడుగు గల సొరంగం లోపల పసుపు పచ్చ దీపాలు, ఆకుపచ్చ ఎరుపు రంగులు మొహాన్న వెదజల్లి నట్లు మనిషి రక్తంలో రంగు కలిపినట్లు విశ్వంలో తిరుగాడి చచ్చి శిథిలమైన ప్రాచీన తారకల కళేబరాలు ఆ సొరంగంలో కుదించినట్లు వింత వింత రంగుల దృశ్యాలు నైరాశ్య కళ చరమదశ. చిత్రకారుడి గుండె పగిలే చోటది. గుండె పగిలిన శబ్దం ప్రతిధ్వనిని శ్వాసగా పీలుస్తూ సజీవమైన కొండ గుహ. సాయంత్రానికి శ్రీనగర్ చేరుకొన్నారు థామస్ మూర్ రచించిన 'లల్లా రూఖ్' అనే కావ్యంలో భాగం ఎప్పుడో చదువుకొన్నది జ్ఞాపకం వచ్చింది రవిశంకరంకి ఆ కావ్యంలో బుఖారియా రాజు 'ఆలీ రిస్' కథానాయకుడు. ఇల్లా అంటాడు.

"కాశ్మీర్ లోయను గురించి విన్నానుగా
భూదేవి తెచ్చిన గులాబులు
ఆలయాలు, ఊటలు, చలమలు

వాటి అలలపై ప్రేమతో మెరిసి
పొంచి చూసే నేత్రాలు వేదజల్లే
చల్లదనపు నీడల నడుమ వర్ధిల్లే
కాశ్మీర్ లోయని ఎరుగున్నానుగా నేను."

శ్రీనగర్ చేరుకున్నారు. ఆ రాత్రి వక పడవని కుదిర్చిపెట్టి ఇంగ్లీషు మాట్లాడే 'కాదిర్' అనే వ్యక్తిని సహాయంగా పెట్టి హీరాలాల్ తన పనిలోకి వెళ్లిపోయాడు. ఆ రాత్రి విశ్రమించి మర్నాడు కాదిర్‌ని తీసుకొని కాశ్మీర్ దృశ్యాలను చూడటానికి బయలుదేరాడు రవి.

బారాముల్లా ప్రాంతంలో వక కొండ ఉండేది. అక్కడ వక రాక్షసుడు ఉండేవాడు. వాడిని సంహరించి ఆ కొండ నడుమ ఖాళీచేసి దానిగుండా వక పెద్ద చెరువులో నీటిని ప్రవహింపజేసి ఆ లోయ నివాసయోగ్యంగా చేశాడుట కశ్యపుడు అందుకనే ఆ లోయని 'కశ్యప్‌మార్' అని వ్యవహరించేవారు. రాను రాను అది కాశ్మీర్ ఐంది. అనాదిగా భారతదేశంలో వక భాగం కాశ్మీర్. క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దంలో కాశ్మీరులో అశోకుడు బౌద్ధాన్ని నెలకొల్పాడు ఎన్నో యుగాలుగా హిందూ, బౌద్ధ సాంప్రదాయాలు వర్ధిల్లాయి ఎనిమిదవ శతాబ్దంలో లలితాదిత్య చక్రవర్తి మార్తాండ ఆలయాన్ని కట్టించాడు. పదిహేను వందల ఎనభై ఆరులో కాశ్మీరాన్ని జయించాడు అక్బరు చక్రవర్తి. మొఘల్ చక్రవర్తులు, జహంగీర్, షాజహాన్‌లు, డాల్ సరస్సు చుట్టూ ఎన్నో ఉద్యానవనాలు నిర్మించారు. నీ చివరి కోర్కె ఏమిటి ? అని జహంగీర్‌ని అంతిమ ఘడియల్లో అడిగినప్పుడు "నా క్కావల్సింది కాశ్మీరమే, ఇంకేమీ అక్కర్లేదు.'' అన్నాడుట.

కాశ్మీర్ ప్రచార శాఖవారు ప్రచురించిన పుస్తకాలలో కాశ్మీరును గురించి చదువుకున్నాడు రవిశంకరం. వెయ్యి అడుగుల ఎత్తయిన శంకరాచార్యుని కొండ ఎక్కాడు. ఇక్కడ శివాలయం ఉంది అశోకుని కుమారుడు జాలకుడు కట్టించాడు. శిధిలమైన దానిని లలితాదిత్యుడు బాగుచేయించాడు. దూరంగా మరొక కొండ హరిపర్వతం. ఈ రెంటినీ చుట్టుకొంటూ ప్రవహిస్తుంది జీలంనది దానిపైన తొమ్మిది వంతెనలు. ఇంకా దూరంగా మొఘల్ ఉద్యానవనాలు, డాల్ సరస్సుపై తేలియాడే తోటలు.

ఒకరోజు పహల్‌గావ్‌లో గడిపాడు రవి. శ్రీనగర్‌కి అరవై మైళ్ల దూరంలో, లిద్దర్‌లోయలో ఉంది పహల్‌గావ్.

దోవలో అనంతనాగ్‌లో ఉదక జలాలు, మార్తాండ్‌లో ప్రాచీన శిధిలాలు చూశాడు. పహల్‌గావ్ దగ్గరలో పర్వతాలపై సంచారం చేశాడు. చుట్టూ హిమవత్పర్వతాలే—తెల్ల టోపీలు మొహంమీదికి లాక్కున్న అనుచరులకి మల్లే. మనిషి తాకిడి ఎరగని పవిత్రతని శాలువాలుగా కప్పుకున్న కన్యలు, చెయ్యిచెయ్యి పట్టుగుని ఆటలాడుతూ, నిలిచిపోయిన భంగిమంకి మల్లే, శేషనాగ్, అమరనాథ గుహ, కోలాహోయ్‌లో క్రిందికి జారే మంచు నదులు—ఇవీ తనూ ఒకే లోకంలోవాళ్లమా అనుకున్నాడు రవిశంకరం. అంతటా మంచు,—మంచు— ఇంకా మంచు— మంచు శిఖరం — తెల్లవి, పచ్చవి, నీలంవి, ఎర్రవి, ఊదావి—సూర్యరశ్మితో చలగాటం ఆడే రంగుల నీడల వొయ్యారపు హొయలు. అక్కడి మనుషులు సముద్రం ఎట్లా ఉంటుందో వర్ణించమన్నారు. వారు సముద్రం చూడ లేదట ఇక్కడివారు మంచు శిఖరం ఎరుగరు. ఒకనాడు—ఆదిలో—ఈ శిఖరాలే సముద్రం—సముద్రమే శిఖరాలు.

తన పడవగృహాని కొచ్చేశాడు రవిశంకరం అందులో మూడు గదులు. ముందుది డ్రాయింగ్ రూమ్. సోఫాసెట్, రెండు కుర్చీలు, ఉన్నాయి. వెనక గది భోజనాలకి. చివరిది పడకగది. పడవవాడు ప్రేమ్‌చంద్. అతను, భార్య, పిల్లలు, వెనక పడవలో ఉంటారు కావల్సిన పదార్థాలు వండి, ఇందులోకి తెచ్చి వడ్డిస్తారు. ప్రేమ్‌చంద్ టోపీ ధరిస్తాడు.—సగం సగం ఎదిగిన మీసకట్టు నాలుగైదు బనీన్లపై కోటు, పైన వెడల్పుగా, లుంగీలా చుట్టి, కింద సన్నంగా మడమని అంటిపెట్టుగునే లాగు. మనిషి నలుపు. చిన్ని కళ్లు—రంగురంగుల పళ్ల వరుస. భార్య కనబడదు. ఎప్పుడన్నా పడవ వెనక నిలబడ్డప్పుడే దర్శనం. ఎర్ర జుట్టు—చిన్నికళ్లు, వెడల్పు దవడలు, చదరంగా కనపడే గడ్డం—పైనుండి పాదాల వరకూ, రంగురంగుల గుడ్డలతో కుట్టిన గౌను. ఎరుపు ప్రధానమైన రంగు. చెవులకు బరువైన లోలాకులు—చేతులకు వెడల్పైన గాజులు.—నవ్వు మొహం. భాషా భావాలూ లేవు.—ఉద్రేకంలేని ప్రాణులు.

ఆ ఉదయం షికారాలో వెడుతుంటే, ఎవరో పేరెట్టి పిల్చారు. పలకరించారు. చూశాడు. ఆ షికారా నిల్చింది. అందులో వ్యక్తి హరికృష్ణ—మాధవి అన్నగారు. గుర్తు పట్టాడు. రండి మా అక్కయ్యని చూద్దాం అన్నాడు. షికారా తిప్పారు. రెండు ఫర్లాంగులు వెళ్లాక వొడ్డున దిగారు. అక్కడ మరో కాలవ మలుపు తిరిగింది. ఆ చిన్న కాలవ మలుపులో వొక పడవ గృహం ఉంది. అందులో కెళ్లారు. అప్పుడే స్నానంచేసి, జడల్లుకుంటూ, సోఫాలో అద్దంముందు కూర్చుని వుంది మాధవి. పడవ వాడితో ఏదో అన్నారు. వాడు టీ, బ్రెడ్ తెచ్చాడు.

"మీా రెప్పు డొచ్చారు ....??"

"నాలుగైదు రోజులైంది."

"నే నొచ్చి వారమైంది. హరి వొచ్చి తీసుకొచ్చాడు. ఎరుగుదురా హరిని"...

"అవునవును."

"మీరు బాగా చిక్కిపోయ్యారు. మా దగ్గిరే ఉండాలి. అన్నీ మేం చూస్తాం. అన్నయ్యకి కాశ్మీర్ కొట్టిన పిండే....." అంది మాధవి.

అతన్ని అక్కడే ఉండిపొమ్మన్నారు ఆ పడవగృహం ఇక్కడికే పట్టిస్తా మన్నారు అక్కడే భోజనా లయ్యాయి. ఆ మధ్యాహ్నము నిషాట్‌బాగ్ తోట కెళ్ళారు. నూర్‌జహాన్ సోదరుడు అసఫ్‌ఖాన్ వేయించిన తోట అది. పది మెట్ల కింద, పర్వతంనుండి జారే ఉద్యానవనం. పైనుంచి చూస్తే డాల్ సరస్సు కనబడుతుంది. నడుమ జలం, పాయలు పాయలుగా, చిన్న జలపాతాలుగా జారుతూ ఉంటుంది. ఎందరో జనం. నల్ల బురఖాలు, తెల్ల బురఖాలు—అందులో చూచేందుకు రెండు కంతలు. అకు పచ్చరంగు ఫిరానా ధరించినవారు, కాబూల్‌నుంచి వొచ్చారు. తల చుట్టూ పాగా ధరించిన పిల్ల కాశ్మీరంది. పాష్మీనా శాలువలు కప్పుగున్నవారు అఫ్‌గన్లు. టీ త్రాగి, మొక్కల నడుమ ఒక మూలగా కూర్చున్నారు. మాధవి ప్రశ్నలకి సమాధానంగా, హరికృష్ణ తన కథ చెప్పడం సాగించాడు. అతనివి పెద్ద కళ్ళు. మంచి పళ్ళ వరస, సన్నటి పొడగాటి ముక్కు, చివరలో కొంచం వంకర తిరిగింది. ఎగదువ్విన క్రాపింగ్‌పైన, ఫర్ టోపీ. ఊదారంగు కాశ్మీరం కోటు, పిజామా—వింతగా ఆ వాతావరణంలో ఇమిడిపోయి, తెలుగువాడిలా కనబడడు. మాధవి కూడా, అక్కడ వారి దుస్తులు ధరించింది మోచేతిమీదకి దిగిన జుబ్బా చేతుల—చివర నగిషీ-లేసు. త్రికోణం కట్టింగ్ మెడ—చుట్టూ జిగిణి—జాకెట్ నడుం మీదికి దిగింది. పైన పావడా; జుట్టుమీద తిప్పి దిగ విడిచిన శాలువ—తెల్ల సిల్కు పిజామా—పాదాల దగ్గర పడ్డ మడతలమీద నగిషీ జాల్తారు. పాపిట నడుమ కుంకుమ—పుష్ప విశేషం, వంగపండు, ఇంద్ర ధనుస్సు—కలువ, తుప్పపండు జల్దరుపండు ఆ ప్రాంతంలో కనబడే వాటిల్లో కలిసిపోయి, మాధవి వొక పుష్పంగా, ఫలంగా మారిపోయింది వెనక, పైకి లేచిన శిఖరం అంచుల్లో పెద్ద పెద్ద దేవదారు వృక్షాలు. దూరంగా చూస్తే మంచు శిఖరాలు—అక్కడ పాదాల దగ్గర, అల్పమైన మనుషులు—పుష్పంగా మారిపోయిన మాధవి. రవి మనస్సు ఎలాగో ఐపోయింది. తన వ్యక్తిత్వపు స్వరూపాన్ని మరిచిపోతున్నాడు. హరికృష్ణ కథ వినలేకపోతున్నాడు. తనూ, కంపెనీ, గంగాధరం. స్టెయిన్‌లెస్ స్టీల్ అన్నీ దూరమై పోతున్నాయి. అవి గతంలో నీడలు. ఇక్కడ ఇది వెలుగు. అన్ని ఇంద్రియాలూ ఒక్కసారి సజీవమై తారతమ్యం, విచక్షణ, ద్వంద్వాల విభిన్నత ఎరగక, సౌందర్యాన్ని అన్వేషించి తెలుసుగుని, పట్టుగుని, గుండెకి హత్తుగుని రాళ్ళుగా మారిపోయిన మనుషులు. ఇంక హరికృష్ణ కథ.

స్మితిజోరా, మామయ్య, దేశ విభజన జరిగిన రోజుల్లో పాకిస్తాన్ ప్రాంతం నుండి వొచ్చేసి, కొంతకాలం బారామూలాలోనూ, మరికొంతకాలం లదక్‌లోనూ ఉండి, తుదకు శ్రీనగర్‌లో శికారా పడవలు కట్టుగుని, అద్దెల కిచ్చి తిప్పుతూ గడుపుకుంటున్నారు. కొన్నాళ్ళకి మామయ్య చనిపొయ్యాడు. స్నేహితురాండ్ర సహాయంతో పడవలోనే ఉంటూ, పడవల్ని అద్దెలకిచ్చి ఉంటున్న సమయంలో అమరనారాయణ అనే తివాసీల పనివాడితో స్నేహం ఏర్పడింది. అతనే ఆమెను ఆదుకున్నాడు. అప్పుడే హరికృష్ణ, అమరనారాయణ కలిసి, తివాసీలు, శాలువలు తయారుచేసే పరిశ్రమ నిర్వహించి మంచి లాభాలు పొందారు. స్మితిజోరా, హరికృష్ణని ఆప్యాయతతో చూసేది. అతన్నే ప్రేమించింది. అమరనారాయణకి, ఇతనికి అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి. ఒకరాత్రి, సరుకంతా లారీలమీద కెక్కించి లదక్ ప్రాంతానికి వెళ్ళిపొయ్యాడు. దానితో హరికృష్ణకి ఏమీ మిగలకుండా పోయింది హరికృష్ణ, స్మితిజోరా, ఆరాలు తీసి, వెదకి వెదకి అమరనారాయణ్ ఎక్కడున్నదీ తెలుసుకున్నారు. బెదిరించి, జగడమాడక, తిరిగి శ్రీనగర్ రావల్సిందిగా బతిమలాడారు. అతను సరే నన్నాడు. మళ్ళా కలుసుగున్నందుకు వినోదించాలన్నాడు. ఊలార్ సరస్సులో శికారాలో వెడదా మన్నాడు. డజను బుడ్లు, జిన్, విస్కీ—తెచ్చాడు జీలమ్‌నది—ఊలార్ సరస్సులోకి ప్రవహిస్తుంది. పదిహేను మైళ్ళ పొడవైన విశాలమైన సరస్సు. మధ్యాహ్నానికి సరస్సులోకి చేరుకున్నారు. గట్టుకి, రెండు ఫర్లాంగుల దూరంలో పడవ నిలిపారు స్మితిజోరా ఏ పానీయమూ ముట్టలేదు.

అమరనారాయణ్ ని తృప్తిపరచడానికి, సీసా చేతులో తీసుకుని, అటూ యిటూ చూసి నీళ్ళల్లో పారబోసేది. స్నేహితులిరువురూ బాగా త్రాగేశారు. అమరనారాయణ్ పాటలు మొదలెట్టాడు. స్మితిజోరా, వెనుక గదిలో వెన్ను వాల్చింది. హరికృష్ణ మైకంతో కళ్ళు మూశాడు.

అమరనారాయణ్ పడవకి బెజ్జం పెట్టాడు. పడవ నడవడం సాగించాడు. ఆ సరస్సులో మధ్యాహ్న సమయంలో పెద్ద పెద్ద గాలులు వీస్తాయి. చిన్న పడవలు తట్టుకోలేవు. పెద్ద గాలి ప్రారంభమైంది. సరస్సు మధ్యకి వెళ్లవల్సిన పడవ, వొడ్డుకి వెడుతోంది. బెజ్జంగుండా పడవలోకి నీళ్ళొస్తున్నాయి. అమరనారాయణ దూకేశాడు. అతను మంచి ఈతగాడు. ఒడ్డుకి చేరుకున్నాడు. స్మితిజోరా, నీళ్ళు రావడం, గాలి వీయడం గమనించింది. బెజ్జాంని ముయ్యడానికి చెయ్యి పోనిచ్చి, నీటిని రానీకుండా ఆపుజేస్తూ, హరికృష్ణని కేకేసింది.

జిజ్ఞాసతో, సందర్భం తెలుసుకున్న హరికృష్ణకు బేజారెత్తి, పొయ్యాడు. గాలి పడవని తోసేస్తోంది. పక్కకి వొరిగినప్పుడల్లా, మరికొంత నీరు లోపలికొచ్చి పడుతోంది. వొడ్డు ఎంతో దూరం

లేదు. పడవ మునిగిపోయింది. స్మితిజోరా నీళ్లల్లో పడిపోయింది. ఆమెని పట్టుగోడం కోసం, హరికృష్ణ మునిగి తేలుతూ, ఎంతో నీరు త్రాగి, తన్నుకులాడి, ఆమె శరీరాన్ని పట్టుగుని పావుగంటలో ఒడ్డుకి చేరాడు. ఆమె తెలివిరాక పడిపోయింది. ఇద్దరు ముగ్గురు పడవవాళ్ల సహాయంతో ఆమెని ఒక గుహలోకి చేరనేశాడు. సపర్యలు చేశాడు. మూడో నాడు ఆమె చనిపోయింది. ఆమె పడవ గృహంలో, ఎన్నెన్నో తివాసీలు, శాలువలు భద్రంగా పెట్టెల్లో దాచింది. ఆ వస్తువులతో తాను మళ్లా వ్యాపారం కొనసాగించాలి.

ఈ వృత్తాంతం చెప్పి కంట తడిబెట్టుకున్నాడు హరి కృష్ణ. ఈ వ్యక్తిలో ఇంతటి ఉద్రేకం ఉండి, ఇన్ని విచిత్ర మైన అనుభవాలకు గురైనందుకు ఆశ్చర్యపడ్డాడు రవిశంకరం.

"ఇంటికొచ్చెయ్యి—అక్కడ ఏదన్నా చూడొచ్చు" అన్నాడు

"ఇక్కడ అలవాటైంది. ఆమె చాలా దూరదృష్టి గలది వందకి పైగా పెద్ద తివాసీలు స్నేహితుల గోడౌన్స్‌లో పెట్టించింది—ఆమె ఎరుగును కాబోలు అమరనారాయణ స్వభావం. తన పడవలో రెండు మూడు పెట్టెలలో శాలువ లున్నాయి. లెక్కలు తెమలక ఆమధ్య నేనూ అతనూ చచ్చాం. అవన్నీ నేనే తస్కరించా ననుకున్నాడు నారాయణ, అతని ప్రేయసితోబాటు సరుకుని కూడా. అందుకే అంత దురంతానికి వొడిగట్టాడు"

సాయంత్రం ఇంటికొచ్చారు. తర్వాత కనిపిస్తానని, తన పడవ కొచ్చేశాడు రవిశంకరం.

ఆరోనాడు, అందరూ గుల్‌మార్గ్ బైలుదేరారు—కాదిర్, హీరాలాల్, మాధవి, హరికృష్ణ, స్మితిజోరా స్నేహితురాలు — పడవ యజమాని చెల్లెలు—'ప్రీతమ్' అనే ఆమె—రవి, అందరూ. కారు దిగాక, గుఱ్ఱాలు అమర్చుకున్నారు గుఱ్ఱం నడిపించేవాడు ముందు నిలబడతాడు. స్త్రీలెక్కిన గుఱ్ఱంకి, ఇద్దరుంటారు, ముందొకడు, వెనకొకడు. గుల్‌మార్గ్, మెరిసే ఆకు పచ్చ బయళ్లతో, దూరంగా వొంకరగా దిగిపొయ్యే కొండలతో పెద్ద పెద్ద చీనార్ చెట్లతో—స్టడీ ఇన్ ఎమరల్డ్—(study in—Emerald) లాగ ఉంటుంది. చిత్రకారుడి స్వర్గం రవి, రెండు మూడు, కలర్ స్కెచెస్ వేశాడు. గుర్రాలమీద, అందరూ ఫొటోలు తీసుగున్నారు. పచ్చికబైలులో, కుర్చీలు వేసుగుని టీలు త్రాగారు. ప్రీతమ్, హరికృష్ణ ప్రక్కనే కూర్చుంటుంది. అతనితోనే మాట్లాడుతుంది.

"ఈమె డోగ్రి జనపద గీతాలు పాడుతుంది—పడవ పాటలు—" అని హరికృష్ణ ఆమెతో ఏదో అన్నాడు. ఆమె పాడడం ప్రారంభించింది. పల్చటి మనిషి—ఆ వింత దుస్తుల్లో స్థూలంగా కనబడుతుంది. బాగా పసిమి—డల్‌గోల్డ్, పెద్ద బుగ్గలు—కళ్లు సన్నమైనా, పొడుగ్గా, చేపలల్లె ఉన్నాయి. వెల్‌వెట్ కోటు లోపల వక్షం చదునుగా కనబడుతోంది. ముక్కుకి ఏదో గుండ్రటి అలంకారం. బొట్టు లేదు. నుదిటిమీద జుట్టు వెనక్కి తోసేసి, చుట్టూ, వెడల్పాటి రిబ్బన్ కట్టింది. పళ్లు రెండు మూడు వంకర. ముక్కు రంధ్రాలు కనబడే వొంగ్రడ కాసే పయ్యాక హరికృష్ణ ఆ పాటకి లయగా ఎగరడం మొదలెట్టాడు ఫొటోలు తీశారు. వింతగా ఉంది. బుడ్లు తీసి అందరూ తాగుతున్నారు.

"మీరూ తాగండి" అంటోంది మాధవి, తాను త్రాగుతూ. రవి ఆశ్చర్యపడ్డాడు భయపడుతూ మతిమరపుతో ఏమి మాట్లాడాలో తెలియని, అమాయకురాలు మాధవి ఈ రెండు మూడు నెలల్లోనూ ఎంత మారిపోయింది! త్రాగేస్తోంది చురుకుగా మాట్లాడగలుగుతోంది. ఆనాటి సిగ్గు, మందగొండితనం—అన్నీ పొయ్యాయి. కొత్త చలాకీ, హుషారు. ఆరిందాతనం అబ్బాయి. వాతావరణమా ? తాను ఏదుగుతోందా ? కొత్త అనుభవం పొందిందా ? లేక తాను అస్వస్థతగా ఉండడంవల్ల ఆమె అలా కనబడుతోందా ?

మళ్లా గుఱ్ఱాలు నడుపుకుంటూ పైకి, ఖిలన్‌మార్గ్ వైపు వెడుతున్నారు ఎందరెందరో, వింత దుస్తుల్లో, దొరలు, పార్శీవారు, ఇరాన్ దేశస్థులు, సింహళులు, తమిళులు కేరళవారు గుజరాతీలు, కాబగాలీలు, ముస్లిమ్‌లు, నేపాళీయులు, బౌద్ధులు—తామొక్కరే ఆంధ్రులు. గుఱ్ఱంపిల్లలపై పిన్నలు. ఇద్దరేసినడిపిసూ వృద్ధులు.ఆమె—ఎంతలావో—మదర్ సుపీరియర్—నవ్వుతూ నడుపుతోంది గుఱ్ఱాన్ని అంత లావుంటె అదినడవగలదా అని తనే ఆశ్చర్యపడ్డట్లు. మంచు, నేలమీద తుట్టలల్లే పడింది. చెట్లమొదళ్లల్లో,పొదలపైనా, రాళ్లపైనా—మంచు—కోసిన కలప ముక్కలల్లే ప్రారంభమై పైకి పోను పోను ఎక్కువవుతూవొచ్చింది. చలి మొదలెట్టింది. ఖిలన్‌మార్గ్ శిఖరంపై చేరుకునేసరికి, అంతటా మంచే.అక్కడ రెండు మూడు టెంట్స్ ఉన్నాయి.సిక్కులు టీ పెట్టి అమ్ముతారు కేక్స్, టీ.

దూరంగా అన్నివేపులా మంచుకొండలే—హిమవత్‌శిఖరాలు. వొక్కొక్కటి వొక మంచి ముత్యం. అన్నీ ఒక ముత్యాల హారం. మేఘం విడినప్పుడు కాంతిపడి, మెడతిప్పి, హారం అందం చూడ మన్నట్లు అవి మెరుస్తాయి. ఏ మనిషీ అడుగుపెట్టని స్థలం—"ఈ ముత్యం ఎంత బాగుందో!" అని వేళ్లతో కదపని హారం. మేఘాలు కమ్మివేశాయి—హారం చూసి దిప్పి కొడతారేమో, మాయ మనుషులన్నట్లు. మేఘాలు, తెల్ల శాలువలు: కామక్రీడతో మైమరిచిన శిఖరాలు, చలికి కప్పుకోవాలని తెలియదుగావున, మే మే కప్పుతాం—అని మేఘాలు మూసివేస్తాయి. ఆ శిఖరాల అందం

చూడకండి. ఎండకి కరిగి, ఆ ప్రకృతి స్థనాలమీద మంచు జారుతుందా పాలు కారినట్లు! మనకి కనబడదు.

"అదేనండి—అటుచూడండి—అదేట నంగా పర్వతం—మహా శిఖరం......" అంది మాధవి. నీలం వెల్వెట్ జాకెట్పై, ఫర్కోట్, కాళ్లదాకా పడేది—వేసుగుంది. నల్లద్దాలజోడు పెట్టుకుంది. అడుగున రబ్బర్, పైన ఫర్వున్న కాలిజోడు. జడ ముడిచేసి, పైకి చుట్టి, దానిపై ఫర్టోపి ధరించి పరదేశ స్త్రీలా వుంది మాధవి. నంగా పర్వత శిఖరం—దూరంగా పారావేస్తోంది దాని నడుం నీలం—మొఖం ఎరుపు, చుట్టూ పసుపు. మూడు రంగుల ప్రకృతిచిత్రం. విర్రవీగి శిఖరంతో ఆకాశం కొయ్యడంలేదు. నమ్రతతో, భక్తితో చేతులు జోడించిన శిఖరం.

"మీరు చలితో వొణికి పోతున్నారు ఈ కోటు వేసుగోండి" అంది మాధవి. అవును. అది మే నెల. అంత చలిగా ఉండదన్నారు. చలి నివారించే దుస్తులు తను తెచ్చుకోలేదు. కాని ఇక్కడ చలిగావుంది. పదివేల అడుగుల ఎత్తు ఆమె కోటువిప్పి, అతని భుజాలపై కప్పింది. బొత్తాములు పట్టవు. ప్రీతమ్ తన షాల్ని తెచ్చి, అతని నెత్తికి చుట్టింది. "తన బొమ్మ గియ్యమంటోంది. ప్రీతమ్" అన్నాడు హరికృష్ణ. టెంట్లోకెళ్లి అక్కడివారితో ఏదో మాట్లాడి, టెంట్ వెనక నీడలో బల్లలు, కుర్చీలు వేయించాడు హరికృష్ణ. దానిమీద కూర్చుంది ప్రీతమ్. మరోబల్ల మీద కూర్చుని ఆమె బొమ్మ గీశాడు రవిశంకరం. మొహం పోలిక లేదుగాని, మనిషి కూర్చున్న ఆకృతి వొచ్చింది. వెనకాల, దూరంగా కొండలు. గబ గబ ముగించాడు.

"మరినాదో?" అంది మాధవి.

"చలికి వేళ్లు పని చెయ్యడంలేదు" అన్నాడు. అందరూ, క్రపేట బండ్లమీద పీట మంచులో జారుతూ, కొండపైకి వెళ్లారు. ఆ బండి అరడుగుఎత్తు—రెండు చక్రాలుంటాయి. వాళ్లు లాగుతుంటె, మంచు పొడుమై, నీరై ఇరువైపులా పాయలై మీద పడుతూవుంటుంది. పైకి వెళ్లారు. అక్కడ చిన్న కొలను. బంగారం రంగు. సూర్యబింబం సిగ్గుతో తల వంచుగునే మెరుపు. మేఘాలు దూరంగావెళ్లి చోద్యం చూస్తూ, వాటి వంకర అందాన్ని ఆనీళ్లలో చూసుగుంటాయి! రవి శంకరం చలితో వొణికిపోతున్నాడు. మొహం వల్లబడుతూంది. వేళ్లు కదలడంలేదు. శ్వాస సుళువుగా రావడం లేదు. కోటు తీసేసిన మాధవి కూడా వొణికిపోతోంది. పసుపు, ఆకుపచ్చ, చాకలెట్రంగు. కాస్తంత నలుపు—వెండికి తుప్పు పుట్టినట్లు—ఆమె మొహం వైఖరి మారిపోతోంది. బొత్తాములున్న చోట ఫర్కోటు ఎడంచేసి, తన మొహం అందులో దాచుకుని, రవి శంకరం నడుంపైవాలింది మాధవి మెడమీదికి చేతులు పోనిచ్చి మొహాన్ని తనమీదికిలాక్కుంది. ఆమె అధరాలు చలికి బీటలువారి, గట్టిపడి, గరుకుగా అయ్యాయి. ఆయాసంతో వెనక్కి వాలిపొయ్యాడు. అతన్ని బండిమీదకి ఎక్కించి, ఇద్దరు పట్టుగుని టెంట్లోకి తీసికెళ్లారు. నిప్పు ముందు కూర్చోబెట్టి, చేతులు, కాళ్లు, వేడికోసం రుద్దుతున్నారు.

టీ త్రాగాడు. క్రిందికి దిగుదామన్నారు గుఱ్ఱాలు సిద్ధం చేశారు అక్కడ కాకులు, టెంట్ చుట్టూ తిరుగుతున్నాయి. మంచు కొండ గోడనీడుగా కాకులు చిత్రం--ఖలిన్మార్గ్లో కాకి. తెల్లటి బట్టమీద నల్ల కాకి నేసినట్లుగా—ఆ తిండికోసం ఇంత దూరమొచ్చాయి.

ఖలిన్మార్గ్ అంటె గొఱ్ఱెల ప్రాంతం. అక్కడ ఏ ఇతర ప్రాణిలేదు. కాకి వొక్కటె అది కాకి మార్గం. ఎంత దూరంనుండో, ఎంత ఎత్తుకో—ఆ చలికితగ్గ ఈకలు, అవయవాలు లేకపోయినా మనుష్యుల్ని వెన్నాడుతూ వచ్చింది కాకి. ప్రాణికోటిలో అదొక్కటే మనిషికి మిత్రుడు. తోడుండే ప్రాణి. దిగుతున్నారు గుఱ్ఱాల మీద. దిగడం కష్టం. ముందుకి వొరిగిపోతారు. వెనక్కిడెక్కించి కూర్చోవాలి. వెన్ను, కాళ్లు, పిరుదులు హూనమై పోతాయి. రెండు గంటలలో దిగి, కారుమీద బసకి చేరుకున్నారు. మళ్లా వొస్తానని రవి తన పడవకి వెళ్లిపొయ్యాడు.

మొర్నాడు రవి లేవలేకపొయ్యాడు హీరాలాల్ డాక్టర్ని పిలిపించి చికిత్స చేయించాడు. వొళ్ళుపట్టే క్షురాడిని ఏర్పాటు చేశాడు. ఆమొర్నాడు ఏకాంతంగా వుండేచోటులో గడపాలన్నాడు రవి. మానసబల్ సరస్సు ప్రశాంతంగా, మారుమూలగా ఉంటుందన్నాడు కాదిర్. అక్కడికి వెడదామన్నాడు.

మానసబల్ సరస్సు శ్రీనగర్కి పదునెనిమిది మైళ్ళదూరం. హీరాలాల్ ఒక జీపు, క్షురవాడిని వప్పగించాడు. మధ్యాహ్నం వొంటి గంటకి బైలుదేరడానికి నిశ్చయమైంది. పెందరాళే భోజనం చేసి, పరున్నాడు రవిశంకరం. పన్నెండుదాటింది. ఎవరో గదిలో కొచ్చిన అలికిడైంది. మంచంప్రక్కనే నిలబడింది మాధవి. పడవ గది కిటికీలన్నీ మూసివున్నాయి. ఒకదానిమీద కర్టెన్ లాగివుంది. చీకటిగా, చల్లగావుంది.

"నువ్వా......" అని లేవబొయ్యాడు.

"లేవకండి. ఎలా ఉన్నారో చూద్దామనొచ్చా. చూడకుండా ఉండలేకపొయ్యానబ్బా......" అతను ఎక్కడికి వెళ్ళదల్చుకున్నదీ చెప్పాడు.

"నేనూ రావొచ్చా—రానీండి. మీరొక్కరూ—అమ్మో. ఎలా ఉండగల్రు. నేనేమనుకున్నారో!...... కోపమా?"

"ఎందుకు?"

"లేకపోతే ఫరవాలేదు." పిక్నిక్ పరికరాలు, సంచీలో సిద్ధం చేసింది మాధవి. పడవవాడు, టీ, బిస్కట్లు తెచ్చాడు. ఫ్లాస్కర్

ముద్ద చిత్రలేఖనం పరికరాలు, ఒక పెట్టెలోవుంచి, అన్నీ జీప్‌లోకి లోడ్‌చేశారు. ఒంటి గంటన్నరకు కదిలింది జీప్. ఓపిగ లేక, ఆరోజు రవిశంకరం గడ్డం చేసుకోలేదు. అక్కడక్కడ తెల వెంట్రుకలున్నాయి. తైలంలేక, జుట్టంతా, రేగి చిందర వంద రగా వుంది. పైజామా, లాల్చీ, దానిమీద కాశ్మీరం వేస్టుకోటూ ఒక ఫర్‌టోపీ వేసుగున్నాడు. చేతులో కఱ్ఱ. జీప్ మధ్యలో నిల్చింది. కుఱ్ఱవాడు టాంగా మాట్లాడాడు. జీప్ అక్కడ నిల్చి పోతుందిట. టాంగాలో కచ్చాబాటలో రెండు మైళ్లు వెళ్లారు. ముగ్గురూ టాంగాలో, రెండు మైళ్లు వెళ్లాక, టాంగా నిలిచి పోయింది. అక్కడే ఉండిపోతుందిట. అక్కడనుండి మరోమైలు నడిచి వెళ్లాల్సిందే. సామాను, కఱ్ఱవాడు మోస్తున్నాడు రవిశంకరం మాధవి నడుస్తూ వెడుతున్నారు. అన్నీ ఆకుపచ్చ కొండలు—అంత ఎత్తైనవికావు గొఱ్ఱెల మందలు—కాపరులు తెల్లటోపీలు, తెల్లగడ్డాలు, పొడుగాటి లాల్చీలు—చేతిలో కఱ్ఱలు—దూరంగా మంచుకొండల శిఖరాలు

సెలయేళ్లు పచ్చ కొండల నడుమనుంచి జారి, ఎఱ్ఱరాళ్ల నేలమీదుగా, అడుగులోతున, ప్రవహిస్తున్నాయి. ఒకటే రెండు మానసబల్ సరస్సులో కలుస్తున్నాయి. వాటిలోంచి నడుస్తున్నారు. పాదాలకింద, నీళ్లలో పట్టులాంటి ఇసుక, చిన్న రంగురంగుల రాళ్లు—సన్నగా గానంచేస్తూ కదుల్తోంది నీరు. కొండలకింద చీనార్ చెట్లు. కొన్ని కొండచెట్లు—తెల్లటి మ్రానులు—వెండి తొడుగులా, సన్నగా, పొడుగ్గా మెరుస్తున్నాయి దూరంగా ఆ చెట్లనడుమ కస్తూరి మృగం, కనబడి, వింతగాచూసి పరుగెత్తింది. దిగువున తప్పవండ్లు సెలయేటి గట్లమీద వంగ, జల్దరుపండ్లు—కొమ్మలమీద మామిడి పిట్ట. మరో ఫర్లాంగు నడిచాక, 'హట్'కి చేరుకున్నారు. కుఱ్ఱవాడూ, సామాను అక్కడవుండి పొయ్యాడు.ఒక సంచీమాత్రం తీసుకుని వారిద్దరూ సరస్సుకేసి నడుస్తున్నారు. ఫర్లాంగు నడిచాక, మానసబల్ సరస్సు చేరుకున్నారు. నిర్జన ప్రదేశ మది అంతటి ఏకాంతం మరెక్కడా కనబడదు. చిన్న చిన్న పొదలు గట్ల వెనక. రంగు రంగుల పూల మొక్కలు. గుబురు చెట్లు. వెండి మ్రానులు. ఆ అందానికి తట్టుకోలేక, పిట్టలు కూడా రెక్కలు ముడుచుకుని నిద్రిస్తున్నాయి.

అంతా చల్లటి నీడ—ఏకాంతం విప్పి పారేసిన వస్త్రం—తడిపి ఎండబెట్టినట్లు. చుట్టూ మ్రానులు, ఆకులు, సర్వాంత ర్యామిగా గడ్డి—పచ్చ తివాసీలా పరిచిఉంది కాగితం తీశాడు. రంగులు కలుపుతున్నాడు రవి పచ్చకొండ, పచ్చ చీర ధరించినట్టుంది. దాని మధ్యగా కొన్నిచోట్ల ఎఱ్ఱరాతిని దొల్చి, చెక్కేసినచోట్ల చీర మడతల్లా అమరి ఉన్నాయి. అతను వెయ్యదల్చుకున్న చిత్రం చీర మడతలు. ఆధునిక శైలిలో—గీతలు, కోణాలు—చదరాలు—వొంపు లుండవు. స్కెచి గీశాడు. మాధవి చేతులపై తల ఆనించి చూస్తోంది.

"కాసేపు రెస్టుతీసుకోరా ఏం?" అని దగ్గరగావొచ్చి అతని వొళ్ళో తల ఆనించింది.

"వేడిగావుంది. స్నానం చేద్దామా?" గబ గబ హట్ దగ్గరికి పరుగెత్తి, సంచీలో బట్టలు, ఫ్లాస్క్ తెచ్చింది. నాలుగవు తోంది. పైజామా, పొట్టికోటుతో, జడ మెలితిప్పి, మెడకింద బిగించి, నీళ్ళలోకి దిగింది మాధవి. గట్టున కూర్చున్న అతని చెయ్యి పుచ్చుగుని నీళ్ళలోకి లాగింది. గట్టున నడుంలోతు అతని మొహాన నీళ్ళు జల్లుతూ, నడుం పట్టుగుని ముంచింది.వెన్నుమీద వాలి, అతని మెడచుట్టూ చేతులు బిగించి, శరీరం రాస్తోంది. ఉక్కిరి బిక్కిరై విదల్చుకుని, దూరంగా వెళ్ళాడు.

"ఎందుకట్లా చేస్తావు?"

జుట్టురేగి ఆమె నుదిటిమీద పడుతోంది. జాకెట్టు మెడదగ్గర స్తనాల నడుమ గీతమీద నీడ వెలుగుపడి కదుల్తోంది.

"మీ కిష్టంగా......"

"నీతో అన్నానా?"

"అమాత్రం తెలీదా ఏమిటి? మీ కళ్లే చెప్తాయి" అని దగ్గరగావచ్చి, అతన్ని మీదకి లాక్కుని, నోట్లో నీళ్లుపోస్తోంది.

"సర్దాలేదా?"

"నీకంటె ఎంతో పెద్దవాడిని. నువ్వు పెండ్లి కావల్సిన దానవు" అన్నాడు.

ఆమె చెక్కిలి అతని గడ్డానికి రాస్తూంది.

"షేవ్ చేసుకోరాదూ..."

"నా ప్రశ్న వినబడలేదా?"

"దానికీ దీనికీ ఏం సంబంధం?

"నాకా తేడాలు లేవు."

ఆధునిక స్త్రీ—కొత్తతరంది. మారిన దృక్పథంగల నేటి కాలపు స్త్రీలకు ఈమె ప్రతినిధి కాబోలు ననుకున్నాడు.

"నీకు లేకపోవచ్చు—" ఇతరులకి వుండొచ్చుగా."

"ఓ యబ్బ, నాకు చెప్పకండి మొగాడికి అసలే లేవు. నే నెరగనా ....."

"బాగా అనుభవం ఉన్నదానల్లె చెప్తున్నావే?"

"నేనూ చూస్తున్నాగా."

గట్టుకి చేరారు. ఆమె దూరంగా వెళ్లి, చీర ధరించింది. తెల్లపట్టు—కాశ్మీరంది—అంచులేదు. నల్ల జాకెట్ వేసుగుంది జడ సర్దుకుని, దగ్గరగావొచ్చి రాతి బండమీద కూర్చుంది. రవిశంకరం ఆమె దగ్గరకెళ్లి, చీరమడతలు, సరిగ్గా, తిన్నగా, గీతల్లా జారే

టుట్ను సర్దాడు. కొంత భాగం చీర పక్కకి తొలిగించి, అందులోంచి, తొడ, మోకాలు, మడమ కనబడేటట్లు అమర్చి కదలకుండా కూర్చోపెట్టాడు. రెండు గజాలదూరంలో, గడ్డి చదునుచేసి, పెట్టిమీద ప్లాస్టర్‌ముద్ద అమర్చాడు. సంచిలోంచి రెండు తీగలు తీసి, వాటిని ఒక ఆకారంలోకి వొంచి, ఆ రెంటి చుట్టూ ప్లాస్టర్‌ని మెత్తి, అడుగెత్తున, ఒక ఆకృతిని తయారు చేశాడు.

"నా బొమ్మ మొన్న గియ్యనన్నారుగా—"

"మాట్లాడకు. కదలకు."

తొడ పక్కకి కదిల్చింది.

"సీతాకోకచిలుక—మరి చూడండి ఎల్లా!" అంది అమాయకంగా. సీతాకోక చిలుకని తోసేశాడు. మళ్లాకాలు అమురుస్తుండగా, ఆమె అతన్ని గట్టిగా కౌగలించుకుంది. అతని తల తిరిగింది. బండ మీదనుండి కిందకిజారిపోయింది పట్టు విడవక, అతన్ని కిందికిలాగి, దొర్లించి, నిలిపి, వక్షంపై వాలింది. ఆమె స్తనాలు తగులుతున్నాయి. చేతులు పీకుతున్నాయి. ఆమె నోరు, కళ్లు కనురెప్పలు, చెక్కిళ్లు, చెవి, జారి ఊడిన తల వెండ్రుకలు, ఎర్రటి శక్తి, ఏదో ఆవహించి, అతన్ని ఆమెవేపు లాగేస్తోంది. అస్వస్థత లోంచి, కడసారి బలం ప్రజ్వరిల్లి కాలుస్తోంది. నాళాలన్నీ లయతో కొట్టుకుంటున్నాయి. వ్యక్తిలో సంఘం అమర్చిన పొరలన్నీ ఊడిపోతున్నాయి. తార్కిక దశ దాటేశాడు—తర్కం, బుద్ధి, నైతిక జిజ్ఞాస ఆ సరస్సులో మునిగాయి ఆధ్యాత్మిక వెలుగు ముద్దగా గడ్డకట్టి ద్రవించని శరీరంలో 'అహం లేదు—వ్యక్తి లేడు, ఫలానా మనిషిలేడు. సృష్టి ప్రేరేపించిన తృష్ణ గోళంగా మారి శూన్యంలో తిరుగాడుతున్నాడు. రంగులులేవు. అంతా చీకటై శూన్యం తృష్ణగోళాలు—ఎక్కడో ఢీకొని, ప్రేలి, బద్దలై, నుశ్శై, గాలై—అంతమొందే ఆవేదన—భరించడం ఎరుగున్న ఆగడ్డి, ఆ చెట్టు, ఆ సరస్సు, కన్ను గీటినా, పలకని ఆకాశం —ఆది సృష్టిలో ప్రాణి కదలిక—అంతమయ్యేటప్పుడు మిగిలే ఏకాంతం, ప్రశాంతం.

"ఇప్పుడన్నా సరిగ్గా కూర్చో" అని చీర మడతలు, మోకాలు అమర్చి, దూరంగావుండి ఆ శిల్పం ముగించాడు. ఎందరో సృష్టికర్తల శరీరాలలో దాగిన శక్తులకు లొంగిన శిల్పం అది. దాని వెనక చరిత్రలో భగ్న హృదయులైన స్త్రీలు, యుద్ధంలో ఓడి చచ్చిన చక్రవర్తులు, ఓడలు నడిపిన బానిసలు, భూకంపానికి తట్టుగుని నేలలో పడని వీరులు, ఎన్నెన్నో హృదయాలు పగిలినప్పుడు పటాపంచలైన అణువులు—వాటినుండి కాలవాహినిలో ప్రవహించి అతని చేతుల్లో ఆ ప్లాస్టర్ ముద్దపైకి ఉప్పొంగి కల్పించిన ఆకృతి —సిద్ధంగావుంది. అవతల తలుపుతీస్తే ప్రవాహం వచ్చి పడుతుంది ఆ తలుపు తీసింది మాధవి.

ఊరు దాటింది. ఫ్లాస్క్‌లో టీ తాగాడు—గడ్డిలోవాలి కళ్ళు మూశాడు. సంధ్య విప్పిపారేసిన ఎఱ్ఱబట్ట సరస్సులో తడుపు తున్నారెవరో. తెల్లగ్రామాలు నల్లబడుతున్నాయి. వలువు శాలువ కప్పుతున్నారు.

"మరి వెడదాం పదండి"

అని సామాను సంచిలోసర్ది, అతన్ని లేవనెత్తింది మాధవి. ఒక మహా సత్యాన్ని, గొప్ప సౌందర్యాన్ని సందర్శించిన యోగికిమల్లె తన్మయుడై లేవలేకపోతున్నాడు.

ఎక్కడికి వెళ్ళటం? ఎక్కడనుండి వొచ్చాము? తానెవరు? ఆమెవరు. అంతా మాయ. ఆనందంతో విఱ్ఱవీగే శరీరానికి ప్రశ్నలు లేవు. అన్నీ సమాధానాలే. టాంగాలో, జీప్‌కు చేరేసరికి ఎనిమిదైంది

ఆమొర్నాడు ప్రయాణమై ఇంటి కొచ్చేశాడు రవిశంకరం. మరోవారం అయ్యాక వొస్తానంది మాధవి ఉన్న సరుకుతో ఇంటి కొచ్చెయ్యి. అక్కడేదన్నా వ్యాపారం పెట్టుకోవచ్చునని, హరికృష్ణ కి సలహాయిచ్చి, తివాసీలు, శాలువలు, పట్టుకురమ్మని స్నేహితుడి దగ్గర సెలవు తీసుకుని బైలు దేరాడు రవి. 'చీర మడతలు'— శిల్పం కళాఖండాల పోటీ ప్రదర్శనకై పాక్ చేయించి, తన స్నేహి తుడి పేరిటపంపి, అతన్ని ప్రదర్శనకర్తలకు అందచెయ్యమన్నాడు. రెండోది—'చీర మడతలు' అన్నది వాటర్‌కలర్ చిత్రం. మెడకింద భాగం మాత్రం కనబడే చిత్రం—ఆధునిక శైలిలో గీసినది,— దాన్ని మరో ప్రదర్శనకి పంపించాడు.

ఇంటికెళ్లి మరోవారం గడిపి భార్యతో కలిసి స్వగ్రామాని కొచ్చాడు.

కంపెనీ వ్యవహారాలలో పెద్ద మార్పు లేవీ లేవు. తను సప్లై చేసిన కప్పులు, సాసర్లు, చాలవరకు పగిలాయట. తాను తెప్పిస్తున్న స్టైన్‌లెస్‌స్టీల్ కొంత కప్పులు, సాసర్లకీ వాడి, వాటిని పనివాండ్ర కందచెయ్యడానికి సంకల్పించాడు. హరికృష్ణ తెచ్చే తివాసీలని గదులలో వేయించాలి.

పది రోజుల్లో మాధవి పనిలో చేరింది. రవి, హరికృష్ణ్కి కొంత పెట్టుబడిపెట్టి, రెండు గదులు అద్దెకి తీసుకుని తివాసీలు, శాలువలు వ్యాపారం నడుపుగునే ఏర్పాటు చేయించాడు. కంపెనీ డబ్బుతో. డజను తివాసీలకి ఆర్డర్ ఇప్పించాడుకాని, మానేజ్ మెంట్ దానికి సమ్మతించలేదు. టెండర్లు కొటేషను కావా లన్నారు పెద్దలు. అసలు తివాసీలు వొద్దే వద్దన్నారు. బురద కాళ్ళతోతొక్కే యీ అలగా జనానికి తివాసీలేమిటి. తమ స్వంత పనివాళ్ళు అలగా జనమా? ఇంతేనా వీరి అభిమానం, ఆదరణ!

"ఏదయ్యా, స్టైన్‌లెస్‌స్టీల్— ఐదారువేలు తీసికెళి బొంబాయి, కాశ్మీరం తిరిగొచ్చావు. ఇంతవరకూ సరకు కనబడదేం?" అని ప్రశ్నించాడు నరసయ్య. అవును, స్టీల్‌షీట్లు ఏనాడో వొచ్చి ఉండాలి. బొంబాయినుంచి. గంగాధరం కొన్న స్టీల్‌షీట్స్ ఎప్పుడో ఒచ్చాయట. వాటితో అవసరమైన మర మేకులు కూడా తయారు చేయించారుట.

"చూడు, ఈ మర మేకు—ఎంత పసందుగావుందో. నీ సరు కేదీ?" అన్నాడు నరసయ్య. రెండు స్టీల్ మరమేకుల్ని బల్లమీద తిప్పుతూ తెలగా, నున్నగా, మెరుస్తున్నాయి మేకులు. దిగువున అంగుళంన్నర మర తిరుగుడు—తీగ. చాలా ఉపయోగంట. నాణ్య మైందిట. ఆ తిరుగుడులో, లయ, క్రమం చూస్తున్నాడు రవి. ఒక డజను మరమేకుల్ని, కాన్వాస్‌లోగుచ్చి, వాటిని ఆధారంగా ఒక డిజైన్ తైలవర్ణంలో తయారుచేస్తే, ఆధునిక నైరూప్యచిత్రం అవుతుంది. పారిస్‌లో కళా విమర్శకులు మెచ్చుగుంటారు రాక్ ఫెల్లర్, పీర్‌పాయింట్ మార్గన్ కుటుంబాలవారు కొన్ని వేల డాలర్లకి కొంటారు.

ఇక్కడ మర మేకు షీట్లకు దిగేస్తారు.ఎక్కడికోపంపుతారు. వారు వాటిని మరోదానికి ఉపయోగిస్తారు. పై దేశాలకి పంపుతా తారు. లక్షలమీద వ్యాపారం. చీర ముఖ్యంగాని, చీరమడత ఎవరి క్కావాలి? మరమేకు, చీరమడత!

గంగాధరంకి టెలిఫోన్ చేశాడు—

"ఏమో నాకేం తెలుసు?"

"లైసెన్స్ తీసుకుని పంపమన్నానుగా."

"తీసుకోమన్నావు—కాని ఇవ్వందే."

"అదేమిటి, కోటులోపల జేబులోవుంది తీసుకోమన్నా—తీసు కున్నావు. లైసెన్స్ చెక్కు......"

"అన్నావు.తీసుకోందే. ఇస్తావనుకున్నా. సోమయ్యని స్టేషన్‌కి కూడా పంపాగా?" అన్నాడు గంగాధరం.

"నిజం? నువ్వు తియ్యడం చూశాను. చూపినట్లు జ్ఞాపకం......"

"అంతేలే—నీ వన్నీ జ్ఞాపకాలు, స్వప్నాలు నీ వొంటో బాగా లేదు. మైకంలో పడుకుని వున్నావు. అలా భ్రమించివుంటావు. అంతె."

"అంతె?"

"అంతంతె."

ఫోన్ దించేశాడు. చెక్కు, లైసెన్స్, గంగాధరం తన జేబు పాకెట్‌లోంచి తియ్యడం తను చూశాడు. సందేహంలేదు. ఏదీ, చెక్కేదీ—తియ్యకపోతే తన దగ్గరే వుండాలిగా. ఇంటికెళ్ళి తను కాశ్మీర్ తీసుకెళ్ళిన దుస్తులు గాలించాడు. అవి చాకలి తెచ్చినవి. ఏనాడో రాళ్ళకివూడి, నీళ్ళలో కలిసిపోయివుంటాయి. గంగాధరం అంత అబద్ధం ఆడతాడా? తనే పారబడివుండాలి. మొత్తంమీద లైసెన్సు, డబ్బు పొయ్యాయి. అరటన్ను స్టీల్ షీట్స్—ఐదువేలు, అమ్మితే లాభం రెండు వేలు—మొత్తం ఏడు వేలు. తన ఖర్చులు

వెయ్యి. గంగాధరం అంతటి దారుణానికి వొడి కడతాడా? ఇది వరలోకూడా తను, అతన్ని అనవసరంగా సందేహించాడు— టెలిఫోన్ చేసిన సందర్భంలో. రూపాయిది, రెండు రూపాయలకి కొన్నాడని సంశయించాడు. ఇదంతా గంద్రగోళంగావుంది. తన వొళ్ళు, మనస్సు బాగున్నాయా? డాక్టర్ని మళ్ళా చెకప్ చెయ్యమన్నాడు. ఏ దోషమూ లేదన్నాడు ఫిట్‌గా వున్నావన్నాడు.

భూషణం ద్వారా కబురంపారు. వారం రోజుల్లో సరకు రాకపోతే చర్య తీసుకుంటామని. బొంబాయిలో ఒక రిద్దరి స్నేహితులకి వ్రాశాడు. లైసెన్స్ విషయం. దాని నంబరు, వివరాలూ వ్రాసుకోనందుకు తనపై తాను ఆగ్రహించాడు. ఆరోజున అతని వొంట్లో బాగాలేదు.—గంగాధరాన్ని పూర్తిగా నమ్మాడు. లైసెన్స్ అతను తీసుకున్నాడు. మళ్ళా అదే గొడవా? తన పొరబాటే. తన అజాగ్రత్తకి తగిన శాస్తి జరిగింది.

ఆరోజు శనివారం. సాయంత్రం కంపెనీ ఆవరణలో భజనలు పెట్టాడుట గంగాధరం. పనివాళ్ళు వారి కుటుంబాలు అక్కడికి పోతున్నారు. భజన కీర్తనలు పాడుకుంటున్నారు. పనివాళ్ళు అణిగి మణిగి ఉండేటందుకు ఇదొకటి పెట్టాడు గంగాధరం. ఇంతలో కలకత్తాలో మరో బ్రాంచ్ పెట్టడం, ప్రమోషను పెద్దజీతంయిచ్చి గంగాధరాన్ని దానికి డైరెక్టర్‌గా వెయ్యడం జరిగాయి. ఆరోజు గంగాధరాన్ని అభినందిస్తూ, సభ ఏర్పాటు చేశారు. సాయంత్రం ఆరింటికి సభ. ఐదున్నరకి తన పని ముగించుకున్నాడు రవిశంకరం. ఇంక ఒక్క రోజు గడువుంది. సరుకు సిద్ధం కాకపోతే, వారు చర్య తీసుకుంటారు. ఏం చర్య? సస్పెండ్ చేస్తారా? దర్యాప్తు జరుపుతారా? కోర్టు కెడతారా? ఏం చెయ్యడం?

"ఇంకా ఇక్కడే ఉన్నారా? పార్టీకి వెళ్ళడంలేదా?" అంది మాధవి.

"అవును. వెళ్ళాలి." అవులింత నిలుపుగున్నాడు రవిశంకరం.

"ఏం దిగులుగా ఉన్నారేం......మీకొక రహస్యం చెప్పనా?"

"ఏమిటది?"

"మనసులో వుంచుగోవాలి. తెలిస్తే కొంపలు మునుగుతాయి"

"నాతో చెప్పదగ్గదైతే చెప్పు."

"మీకు సంబంధించినదే......" తలుపు దగ్గరగావేసి, రవి దగ్గరకొచ్చి, రహస్యంగా చెప్పింది.

"నా కెటా తెల్సిందని అడక్కండి.......మీ లైసెన్స్ గంగాధరం అమ్మివేశాట్ట!"

"అ. అ!" ఆశ్చర్యంతో లేచి నిలబడ్డాడు. ఇంతలో రంజిత్ వొచ్చాడు. నమస్కారం పెట్టాడు. మాధవిని, రా వెడదాం అన్నాడు.

"మరి వెడతా" అని, ఇద్దరూ బైటకెళ్ళారు.

రవిశంకరం క్షణంలో నిర్ణయించుకున్నాడు. గంగాధరం చేసినపని అపచారం. ఆపనికి జైలుకి పంపాలి అతన్ని! ఈ విషయం, వారి మేనేజ్‌మెంట్ వారికి తెలిపితే వారే చర్య తీసుకుంటారు. తన నిజాయితీ ఋజువవుతుంది. ముందు నరసయ్యకి చెప్పాలి. గంగాధరం క్రిమినల్.

కాని దానికి ఆధారం ఏముంది? కాగితాలా? సాక్ష్యులా? ఏమీలేదు. మాధవిమాట. అది చెప్పడానికి వీల్లేదు. మాధవికి నానుండి విశ్రాంతి కావాలన్నాడు గంగాధరం. మాధవీలత ఒక టల్లుకొంది అని ఎవరో పాడుతూ అతన్ని ఎగతాళి చేసిన సంగతి గుర్తుకొచ్చింది. కమిటీ సభ్యులకి, ఒకటి రెండు ఆకాశ రామన్న ఉత్తరాలు పంపించారు—"మామిడి కొమ్మ ఎవరు?" అని అందులో ప్రశ్న. మాధవి మాట నమ్మాలా? కాని మాధవి ఈ సారి నిజం చెప్పిందని నమ్ముతున్నాడు రవి. అందుకు కారణం లేదు. ఆ సందర్భంలో ఆమెని నమ్మి నమ్మితీరాలి. ఆమె ధోరణిలో, కంఠంలో ఏదో సత్యం పలికినట్లైంది. ఆమె కెట్లా తెలిసింది? సోమయ్య రహస్యంగా రంజిత్‌తో అనుండాలి. రంజిత్ మాధవితో చెప్పి ఉండాలి.

దీనికొకటేమార్గం. డ్రాయర్‌లోంచి తాను శ్రీనగర్‌లో కొన్న వరలో బాకు తీశాడు. వాల్‌నట్ కర్ర—నగిషీపని—స్టైన్‌లెస్‌స్టీల్ డిజైన్‌తో పొదిగిన వర— ఆరంగుళాలది—అందంగా వొంపు తిరిగింది. అందులో బాకు. క్లిప్‌తీసి కత్తిని పైకిలాగాడు. అది తళతళ మెరుస్తోంది. రెండంగుళాలు సుళువుగా దిగుతుంది—మంచి వొంపు, మొన. అందమైనకళాఖండం—హత్యాకాండకి. లోపల పెట్టి, క్లిప్పునొక్కి పాంట్ జేబులో వేసుగుని, కార్లో గంగాధరం కంపెనీ కెళ్ళాడు. ఏడైంది. అన్నీ దీపాలు. జనం కిట కిట లాడుతున్నారు. కుర్చీలు నిండిపోయ్యాయి. బెంచీలమీద ఎక్కి నిలబడ్డారు. ముందు చాపలమీద పిల్లలు, స్త్రీలు. టీ కప్పులు అందిస్తున్నారు. లవుడ్‌స్పీకర్ ఏర్పాటు చేశారు. వేదికపై షామియానా—పూలదండలు. కమిటీ మెంబర్లు—ఊళ్లో పెద్దలు. కలెక్టర్. గంగాధరం, భార్య అనసూయ. అతను ఖద్దరుకోటు ధరించాడు. ఖద్దరు పంచి; అనసూయ ఖాదీ సిల్కు చీర వేసుగుంది. ఉపన్యాసాలు సాగుతున్నాయి. అనసూయ మహ ఇల్లాలు. గంగాధరం మహానుభావుడు. ఏకపత్నీవ్రతుడు—వారు ఆదర్శ దంపతులు. గనకనే కంపెనీ వర్ధిల్లుతోంది. కొత్తచోట వారికి మేలు కలగాలి—కలుగుతుంది. శీలం మన జాతి ప్రతిభకి వెన్నెముక. యంత్రంకాదు. ఆత్మ. మరలుకావు మనస్సులు. సీత, అనసూయ, సావిత్రి, శ్రీరాముడు.....

చప్పట్లు. ఎవరో ఏదో బహుమతి అందించారు. వెండిలో చెక్కిన సీతారామ లక్ష్మణుల విగ్రహం—పైన అద్దం. గిల్టు ఫ్రేమ్. గంగాధరం భక్తుడు. భజనలంటూ పెట్టి, దైవభక్తి, పాపభీతి, పరమార్థ చింతన పెంపొందిస్తున్నాడు. కొత్తచోట్ల

కూడా ఇల్లాంటి భజన మందిరం కట్టించాలని మా ఆశయం.

మళ్లా చప్పట్లు. కాశ్మీర్ తివాసి బహుమతి—ఎవరో అంద జేశారు. వారు నడిచేటందుకు అనువైన తివాసి.

"కంపెనీ కోటాలోనిదేటగా" అన్నాడు ఎవరో పక్కన. రవిశంకరం నవ్వుకున్నాడు ఏకపత్నీవ్రతుడా—బొంబాయి రాత్రి గుహల్లో కాగడా వేసిన యీ గంగాధరం! శీలం అంటే అదొక్క టేనా? రూపాయిది, రెండుకు కొని లాభం పొంది, తనని దగా చేసిన వీడు నిజాయితీ గల వ్యక్తా? లైసెన్స్ దొంగిలించి, తన కంపెనీని మోసంచేసి, తన పతనానికి కారకుడైన వీడు మహాను భావుడా! వీడికి ప్రొమోషన్. అభినందనలు. బహుమానాలు. వెనక నుండి వెళ్లి వేదికపైన కూర్చుని అంతా చప్పట్లు కొడుతున్న సమయంలో పొక్కపోటు—ఆఖరు కథ సమాప్తం. ఈ సమా జంలో న్యాయానికి మరో మార్గంలేదు. మాధవి బెంచీ పక్కన కూర్చుంది. మరో కుర్చీమీద రంజిత్. ముందు బెంచీలమీద ధనం జయం. అతనిపక్కన లక్ష్మీకాంతం. వేదికపై నరసయ్య, సోమి రెడ్డి—ఒక్కపోటు! వేదికవైపు వెడుతున్నాడు రవిశంకరం. పాంట్ జేబులో చెయ్యి పెట్టుగుని కత్తిని అదిమిపడుతూ. సభలో కలకలం. ఉపన్యాసాలు ముగిసినట్లున్నాయి పెద్దగా చప్పట్లు. గంగాధరంలేచి సమాధానం చెప్తున్నాడు. కృతజ్ఞత తెలియబరుస్తున్నాడు కంపెనీ సంక్షేమం, తద్వారా దేశసేవ, తప్ప వేరే పరమార్థం లేదన్నాడు. గీతలో ఏదో వాక్యం చదివాడు. ఇహం, పరం అన్నారు గావున, భజన కాలక్షేపం,ఏదో ఉడతా భక్తి...... మళ్లా చప్పట్లు.అనసూయ కళ్లు తడితో మెరుస్తున్నాయి. భజనగీతం పాడదాం అన్నాడు గంగా ధరం. తనే అందుకున్నాడు. అందరూ కలిసి పాడడంమొదలెట్టారు. ఆ సమయంలో పొడిస్తే గంగాధరంకి స్వర్గం తప్పదు. ఇక్కడే స్వర్గం అనుభవిస్తున్నాడు. చంపి మరో స్వర్గానికి—శాశ్వతంగా అను భవించే స్వర్గానికి పంపనా! ఎంత అవివేకం! అనసూయ మహా ఇల్లాలు—తన భార్య లా. వీణ్ణి చంపి ఆమెకి వైధవ్యమా? ఐనా గంగాధరం ఎందుకు చావాలి? తనకున్న వాంఛలన్నీ అతనికీ ఉన్నాయి. గుహలో కాగడా అతనూ వేస్తాడు—ఎటొచ్చీ, రహస్యంగా, ఎవరికీ తెలియకుండా. అదే అతని చాకచక్యం. కార్యదక్షత. సమాజంలో పలుకుబడికి ప్రమోషన్‌కి అదే కారణం. దొరికిపోని దొర. గంగాధరం మనిషి—కాని ఉద్రేకం చూపడు. ఆ ఉద్రేకాన్ని మరమేకులో జొనుపు తాడు. అతనూ సృష్టిస్తాడు—మరమేకుల్ని. తాను చీరమడతల్ని సరిదిద్దితే,అతను మరమేకుల్లో అంచుల్ని తీర్చిదిద్దుతాడు మరమేకుకి మ్రాలజగత్తులో ప్రయోజనంవుంది. చీరమడత చిత్రం నిష్ప్ర యోజనం. మానవుడు గంగాధరం. తోటి మానవుడు. కలిసి చావడానికే తోటి మానవుడి ప్రయోజనం. ముందెందుకు చావాలి?

గబ గబ బైటకెళ్ళాడు రవిశంకరం. డ్రైవర్‌ని ఇంటికెళ్ళ మన్నాడు. తాను, వొక్కడూ నడుచుకుంటూ వెళ్ళాడు.

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. మేఘాలు పైకి వెళ్ళలేక, భూమి అంచుల్ని పట్టుగుని పాకుతున్నాయి. రోడ్డు మీద దీపాలమధ్య చీకటి, నిద్రనించి లేచిన దానికిమల్లే ఎఱ్ఱి కన్ను మీటుతోంది. మనుషులు నడుస్తున్నారు. అస్తిపంజరాలు—ఉద్రేకంతో, అన్వేషణతో, వాంఛతో, ఆహంలో కదిలే అస్తి పంజరాలు—మెల్లగా నడవడంలో ఏదో ఆనందం పొందుతున్నాడు రవి.

నరసయ్య మేడ దగ్గరకు చేర్చేటప్పటికి తొమ్మిదైంది. గేటు దాటాడు. వరండాలో కొచ్చాడు. పనివాడున్నాడు.

"అయ్యగారింకా రాలేదండి—మీటింగండి" అన్నాడు.

"తెలుసు" అన్నాడు రవి.

"అల్లా కూకోండి—మంచి తీర్థం తెప్పించేదాండి—ఒంటా యనతో సెప్పి"

"వొద్దులే."

"నడిసొచ్చారేంటండి......?"

"ఆ—ఏమిటి?"

"కారులేదాండి?"

"ఓ. అదా. రిపేర్ కెళ్ళిందిలే"

"ఇంకనుండి రంజిత్‌గారేనంటండి పెద్దయ్య—కంపెనీలో."

"ఓ —అల్లాగా... .."

పదవుతోంది. పనివాడు గేటుతీశాడు. కార్లోంచి దిగాడు నరసయ్య.

"ఎవరది—రవా?".

లోపలి కెళ్ళాడు.

"రంజిత్ మాధవిని చేసుకుంటాడుట. తన కభ్యంతరంలేదన్నాడు గంగాధరం" అన్నాడు నరసయ్య.

"మంచిదే"

"ఇంక ఆ పిల్లని కూడా, ఆ కంపెనీలో జేర్పిస్తే నయం ఏం?"

"మరీ మంచిది"

"సమస్య తీరిపోయింది"

"ఏం ఇట్లా వొచ్చావు."

"మీతో చెప్తామని—అదే. ఆ లైసెన్సు పోయింది. నేనే పారేశాను. రేపు ఆరు వేలు కట్టేస్తాను."

"అట్టాచెప్పు. ఏంటబ్బా సరుకురాదు అనుకుంటున్నా. మతిమరుపుగామాను—ఆ బొంబాయిపట్నంపోతే అంతే. నాకూ వోపాలి అట్టాగైందిలే..... డబ్బు కడితే పేచీ ఉండదుగా.....ఏముందిలే—జీతంలో పట్టొచ్చుగా....."

సెలవు తీసుకుని బైలుదేరాడు. నాకార్లో వెళ్ళమన్నాడు నరసయ్య. కార్లో ఇంటి కెళ్ళాడు రవిశంకరం. ఇంత పొద్దు యిందేం అంటూ భార్య కమలమ్మ పలకరించి, లోపలికి తీసికెళ్ళింది మంచి నీళ్ళిచ్చింది.

"ఇదుగో కవరు. ఇందాక వొచ్చింది." అన్నది భార్య. చించి చదివాడు. స్నేహితుడు వ్రాసింది. చిత్ర కళా ప్రదర్శనలో తన చీర మడతలు ప్రతిమని ఉత్తమమైందిగా ఎన్నిక చేశారనీ, అయినా ఏ కారణం తనో బహుమతి ప్రకటించలేదనీ వ్రాశాడు. జేబులో రుమాలుకోసం చెయ్యిపెట్టాడు. రుమాలుతో పాటు, స్టెయిన్‌లెస్‌స్టీల్ మరమేకు కూడా చేతిలో కొచ్చింది. దాన్ని అర చేతిలో పెట్టుకుని చూశాడు. భోజనం ఏర్పాట్లకి లోపలి కెళ్ళింది భార్య. బహుమానం రాకపోయినా, ఉత్తమమైందిగా ఎన్నికైనందుకు ఒక్క క్షణం, ఆనందంతో వూగిపోయింది అతని మనస్సు ఆ శిఖరాల నడుమ, ఆ చెట్ల మధ్య, ఆ నీడల్లో, ఆ సరస్సులో దర్శించిన ఆనందం, ఒక్క కన్నీటి బిందువుగా జారి, మరమేకుని తడిపింది.

---

# స్వాగతము

### శ్రీ జీయశ్శాస్త్రి

చటులతర విజయధాటీ
పటుపటహ ఘోషసన్నినాద పరికంపిత ది
క్తట కుటిలారి బలుడవై
యిటు దయచేయుము 'పరాభవే'ంద్ర సమానా!

క్రొన్నెలకన్నను బున్నమ
వెన్నెల కన్నను శరాళి వెన్నెల కన్నన్
వన్నెల జెన్నలరారం
మన్నన దయసేయరమ్మ! మాన్యాబ్దమ్మా!

రంగదహార్యశృంగ నల
రాగవిభాగతరంగవై వి య
ద్గంగ తరంగపంక్తి దవు
దవ్వులమింట ననంతకాంతి లీ
లం గడు చిత్రలీల గగ
నేందిర దాల్చిన యుంగలికపుం
రంగు తెరంగునం గడు హొ
రంగుగ రమ్మ! 'పరాభవా'బ్దమా!

భావానవకాముడవై
కామాహిత నయన శిఖి శిఖాతేజమవై
భీమాయుత 'ప్రాభవ' యు
ద్దాముడవై జగతి బ్రోవ ధరణి వరయుమా!

# అభిజ్ఞాన శాకుంతలము: నాందీశ్లోకము

శ్రీ సూరి రామసుబ్రహ్మణ్య శాస్త్రి

యాసృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యాహవిర్యాచహోత్రీ।
యద్వేకాలం విధత్తః శ్రుతి విషయ గుణా యాస్థితావ్యాప్యవిశ్వం॥
యామాహుస్సర్వభూతప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవంతః।
ప్రత్యక్షాభిః ప్రసన్నః తనుభి రవతువః తాభిరష్టాభిరీశః॥

జలము, అగ్ని, యష్ట, సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, వాయువు, పృథివి అను నీ ప్రత్యక్షము లగు నష్టతనువులచే ప్రసన్నుడైన యీశుడు మిమ్ముల రక్షించుగాతయని అభిజ్ఞాన శాకుంతలమునందు శ్రీ కాళిదాసకృత నాందీముఖ స్తోత్రము. ఈశ్వరు నష్టమూర్తి వివేకము —

సూర్యో జలం మహోవాయుః వహ్ని రాకాశ మేవచ।
యాయజూకశ్చ సోమశ్చ రుద్రాదీనాం తు మూర్తయః॥

ఇచట "రుద్రాదీనాంతు మూర్తయః" అనుటచే ప్రకృతియొక్క తామస, రాజస,సాత్త్విక గుణములందు ప్రతిబింబితుడయిన యీశ్వరుని సువ్యక్త స్వరూపమగు సృష్టి యొక్క వివరణమని యర్థము

"దేవా వైకారికాజ్జాతాః—తైజసాదింద్రియాణ్యపి
తామసాచ్చైవ భూతాని ఖాదీని స్వస్వశక్తిభిః"

ఇట్లు సాత్త్విక రాజతామస ప్రాధాన్యమున బరాశరహోరయందు వివరింపబడియున్నది.

## యాసృష్టిః స్రష్టురాద్యాః

పరమేష్ఠియొక్క ప్రథమసృష్టి యనగా జలమను నర్థమును సోపపత్తికముగా వివరించుచున్నాను

యత్రబ్రహ్మపదం సాక్షాద వ్యక్తం నిర్గుణం చితిః
వాసుదేవ స్స పురుషః పంచవింశాత్పరోఽవ్యయః॥

(వృద్ధ వసిష్ఠ సిద్ధాంతము)

సృష్టికిబూర్వము సంధతమసావృతమై యుండ పరమేశ్వరుడు శుద్ధ సత్త్వ స్వరూపంబగు తపస్సమాధి యందుండెను అట్టి పరమేశ్వరుడు పరంబ్రహ్మ, పరమపురుష, పురుషోత్తమాది నామంబుల బిలుచుచున్నాడు అవ్యక్తుండును,నిర్గుణుడుచిత్స్వరూపుడుననగునారాయణుడుపరమాత్మయనగుట నవ్యయుండునై పంచవింశతి తత్త్వాత్మక ప్రపంచముకంటె బరుడగు వాసుదేవుడన చొప్పుచున్నాడు.

వాసుదేవ శబ్ద నిర్వచనము :—

సర్వత్రాసౌ సమస్తంచ వసత్యత్రేతి వై యతః
అతోసౌ వాసుదేవేతి విద్వద్భి పరిగీయతే॥

ఈ పరంబ్రహ్మము సర్వత్ర వసియించి యుండుటచేతను, అవ్యక్తమున నీ పరంబ్రహ్మమునందే సర్వమును బీజరూపమున వసియించియుండుటచేతను, "వాసుదేవు"డని విద్వాంసులచే గానము చేయబడుచున్నాడు.

"ఈశావాస్య మిదం సర్వం" ఈశునిచే నీ జగమంతయు వాసస్థమై యున్నదనియును, ఈశునియందు నీ జగమంతయు వసియించియున్నదనియును నీ యుపనిషదర్థమై యున్నది.

ప్రకృత్యనాది సంయోగాత్ — కదాచిజ్జాతకల్పనః
బహుస్యామి త్యతోః జాత ప్రకృత్యావిష్ట చేతనః"

వాసుదేవుడగు పరమేశ్వరుడు ప్రకృతియొక్క అనాది సంయోగముచే నాకృష్టమైన చేతనముకలవాడై తాను బహువిధంబుల సృష్టియొక్క ప్రజననార్థము కాగలనని తలంచెను "తదీక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అని శ్రుతి వచనము పురుషుడు ప్రకృతికంటె బరుడని వ్యవహారార్థము వర్ణింపబడుచున్నను శక్తి శక్తిమత్తుల కభేదమగుటచే పురుషుని హృదయాంతరాళస్థమగు నిజతపశ్శక్తియే ప్రకృతియని యెంచదగియున్నది శుద్ధ నిర్గుణ స్వరూపుడగు పురుషుడు నిజహృదయాంతరాళమున నుద్దీపితమై యున్న రజశ్శక్తి కార్యముచే దపస్సునుండి యుత్థానము కలుగ దాను సర్జనముజేయ సంకల్పించెనని భావము శక్తిప్రకృతి శబ్దములు సంస్కృతమున స్త్రీత్వములు పరమేశ్వరుడు నిజతపశ్శక్తియగు ప్రకృతికి స్త్రీత్వము గల్పించి, తత్సన్నిధానముచే విమోహితుడై సృష్టికి గారణుడయ్యెను సమాధికాలమున నిర్వికల్పమై సమత్వము నొంది (Balanced State)యున్న గుణత్రితయమునకు సంక్షోభము (Disturbance) కలుగ నీశ్వరుడు సృష్టినిజేయ సంకల్పించెనని యర్థము. ఇట్లేకత్వమున నద్వితీయుడైయున్న పరమేష్ఠికి ద్వైతమగు సంసార కారణముచే సృష్టియొక్క బహుత్వము సిద్ధించెను

సంకర్షణోఽయం సృష్ట్వాదౌ వస్తాసు వీర్యమవాసృజత్
తదండమభవ ద్ధైమం సర్వత్ర తమసావృతం"

(సూర్య సిద్ధాంతము)

ఇట్లు స్వశక్తియగు ప్రకృతిచే నాకర్షింపబడిన పరమేశ్వరుడు సంకర్షణుడనబడుచున్నాడు ఆదియందు నప్పరమేశ్వరుడు జలమును సృజియించి యందున నిజ వీర్యమునుంచెను కృశానురేతస్కుండగు పరమేశ్వరుడు సృష్ట్యారంభమున సర్వత్ర వ్యాపించియున్న యంధతమసాత్మకమగు జలమునందు దృఙ్మాత్రముచే నిజ తేజంబగు నగ్నిని బ్రసరింపగ నది యంధతమసాత్మకమైన హేమాండమయ్యెను ఆ సువర్ణాండమునందు వ్యక్తీభూతుడైన పరమేష్ఠియు హిరణ్యగర్భుడనబడుచున్నాడు

సృష్టికిబూర్వము శుద్ధ సత్త్వస్వరూపుడగు పరమేశ్వరుని తపస్సమాధి కాలమున సర్వమునంధతమసావృతమై యుండెను ఆ యంధకారము జలము యొక్క ప్రథమావస్థ యనదగియున్నది. "జలముల నగ్ని మాన్పదగు" అను వచనముచే, గాంత్యుష్ణములు ప్రధాన ధర్మములుగాగల్గిన యగ్ని తద్విపరీతములగు నంధకారశైత్యములు స్వభావములుగాగల జలముచే జల్లార్పబడుచున్నది. కాని రాత్రులందు వ్యాపించియుండు నంధతమసమువలన దివాకాలమున వ్యాపించియున్న యుష్ణ ముపశమించుటయేగాక శైత్యముకూడ గలుగుచున్నది కావున నీ శీతితయు నంధకారము యొక్క సహజ స్వభావమై యున్నది ఈ శైత్యాంధకారములు రెండును నగ్నియొక్క సహజ గుణములగు నుష్ణకాంతులకు (Heat and Light) విపరీతములగు ధర్మములగుటచే నంధకారము జలముయొక్క

ప్రప్రథమావస్థ (Pre-Hydrogenic state of water) యనియు విశ్వయమగుచున్నది. ఇంతియకాక వర్షా సమయమున జలముచే నిబిడీకృతమైయున్న మేఘము నైల్యమునొందియుండి సూర్యతేజః ప్రసరణమును సహిత మరికట్ట సమర్థమైయున్నది. అట్టి జలదము యొక్క నైల్య మందునున్న జలము యొక్క యంధకార స్వరూపమె యగును అట్లుగాక శరత్కాల మేఘము జలవిహీనమగుటచే శుభ్రవర్ణమునుండి రాత్రులందున చంద్రకాంతిని సంపూర్ణముగా ప్రతిబింబింపజేయుచున్నది

తపస్సమాధియందున శుద్ధసత్వాకృతినున్న పరమేశ్వరునకు నుత్థానము గలుగజేసిన రజశ్శక్తి కార్యముచే సర్వత్ర వ్యాపించియున్న యంధతమసము నందును జల స్వభావములగు శైత్యాంధతమసముల కార్యము సహితము విశదమయ్యెనని యర్థము. ఇట్టి గుణత్రితయ సంక్షోభముచే ప్రకృతియొక్క ప్రథమ కార్య ప్రసక్తియు గలిగెనని యర్థము కావుననే—

"త్రిభ్యస్తేజోభిన్నాదిభ్యః పురాభూతా త్రిపురా తేజో భిన్నాదిభ్యః
పూర్వ సత్త్వమేవహి సర్వతత్వాతిక్రాంతత్వం బ్రహ్మణః"

లోహిత శుక్ల కృష్ణాత్మకములను గుణత్రయము యొక్క కార్యమునకు పూర్వమునందును పరమేశ్వరునందు నవ్యక్తమున దత్ప్రకృతి రూపమున మున్నదగుటచేత పరమేశ్వరి "త్రిపురా" యనబడుచున్నది. అట్టి ప్రకృతివలన మహదహంకార తన్మాత్రాది పంచవింశతి తత్వాత్మక ప్రపంచము వ్యక్తమగుటచే నీ వ్యక్తమగు ప్రపంచముకంటెను ప్రకృతి పురాభూతయె యనబడుచున్నది. ఇట్టి ప్రకృతికంటె పురుషుడును పరుండనబడుచున్నాడు.

ఇట్లు తపస్సమాధినుండి యుత్థానమునొంది పరమేశ్వరుడు నిజ వీర్యంబగు నగ్నితేజమును (విద్యుత్తేజమును) సర్వత్ర వ్యాపించియున్న యంధతమసాత్మక జలమునందు ప్రసరింపగా సువర్ణాత్మకమగు బ్రహ్మాండము నిర్మితంబయ్యెకాని మధ్యయందంతటను నంధతమసావృతంబై యుండెను. అట్టి సువర్ణాండగర్భుడగు పరమేశ్వరుడు "హిరణ్య గర్భుడ"న నొప్పుచున్నాడు

సువర్ణ నిర్మాణ చరిత్రము బుక్కులందును నిట్లు వర్ణింపబడినది—

"ఆపో వరుణస్య పత్న్యయ ఆసన్—తా అగ్ని రభ్యధ్యాయత—
తా స్సమభవన్ తస్య రేతః పరాపతత్ — తత్సువర్ణ మభవత్"

వరుణదేవుని పత్నులు జలములు, అగ్నిదేవుడు వారలజూచి వివాహితుడయ్యెను అగ్నిజలములు పరస్పర విపరీత ధర్మములు గలవి యగుటచే వీని పరస్పరాకర్షణమె సర్వదా ప్రచలితమై సృష్టికి కారణమగుచున్నది. ఇదియే ఆకర్షణశక్తి (Magnatism)లేక బ్రహ్మశక్తి యనియు శాస్త్రమున ప్రసిద్ధమైయున్నది. అంత జలములగ్నిదేవుని కోర్కెకీ కొనగావారిసంగమమున నగ్నిదేవుని వీర్యముజలములందు గలసి సువర్ణమయ్యెను. ఇట్లగ్నిదేవుడు 'హిరణ్యరేతస్కుండ'న బడుచున్నాడు. కావున జలము యొక్క నైల్యమున నగ్ని ప్రసరణముచే గలుగు విద్యుత్తు సౌవర్ణాత్మకతను విశదమైయున్నది ఇట్లు జలమున విద్యుత్ప్రయోగముచే సువర్ణముత్పన్నమగుచున్నది. (Madam Curie) సల్పిన (Darkroom exeriment)చీకటిగది ప్రయోగ ఫలితమునబడు Radium సహిత మీ బుక్కునందు వివర్ణితమె యనియెంచదగియున్నది. ఇంకను నీ ప్రయోగమును సర్వవిధముల నభివృద్ధి గావింపదగియున్నది జంబ్వాది ఫలముల నైల్యము సహితమీ సువర్ణాత్మకత కాధిభూతమనియు యెరుగదగియున్నది.

సృష్టిక్రమమునందు నంధకారమున నీశ్వరతేజః ప్రాచుర్యముచే నేర్పడిన పంచభూత నిర్మాణమునందును జలమునుండి భూమి సముద్భూతమైనదని చెప్పబడినది. జలమునందు పరమేశ్వర తేజంబగు నగ్నియొక్క ప్రసారము వలన ప్రథమమున పాదరసముగా పరిణామమునొందె. కావుననే పాదరసమునకు "శివ వీర్య" మనియు పేరు కల్గినది. అందున పునస్తేజః ప్రసరణముచే సువర్ణము నిర్మాణమయ్యెను. అట్టి పరిణామమున గేవల మలము భూమ్యుపల

భాగముకాగా గర్భమునందంతటను సువర్ణమయమగుటచే భూమి "వసుమతి" లేక "స్వర్ణగర్భ" యనియు జెప్పబడుచున్నది. ఇట్లే ప్రథమమున నాకాశమందు సర్వవ్యాపకముననున్న యంధతమసమునందు బరమేశ్వర తేజః ప్రసార్యముచే సౌవర్ణాత్మకతయు సిద్ధింపగా నా బ్రహ్మాండమంతయు హిరణ్మయాండమయ్యెను. తన్మధ్యమందున్న పరమేశ్వరుడు సహితము 'హిరణ్యగర్భు"డన నొప్పెను. "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే — భూతస్య జాతః పతిరేక ఆసీత్" ఇత్యాది శ్రుతి వచనముచే హిరణ్యాండగర్భమున నున్నవాడగుటచేతను హిరణ్యాండమును నిజగర్భమున గల్గియున్నవా డగుటచేతను "హిరణ్యగర్భు" డనబడుచున్నాడు. అట్టి హిరణ్యగర్భుడు ప్రథమమున సమస్త భూతములకు నధిపతియగుచున్నాడని. అట్లు సర్వభూతోత్పత్తికి నాదిభూతుడగుటచే "నాదిత్యు"డనియు బరగుచున్నాడు

"ఆదిత్యవర్ణం తమసస్తు పారే". అంధకార విరామమునందు నాదిత్యవర్ణుడైన శ్రీమన్నారాయణుడు సవితృ మండల మధ్యవర్తియనియు గాయత్రీ మంత్ర ప్రచోదితమునైయున్నది.

౨

సూర్యస్య వివిధవర్ణాః — పవనేనవిఘట్టితాః కరాస్స్వభ్రే
వియతి ధనుస్సంస్థానాః — యేదృశ్యంతే తదింద్ర ధనుః"

సూర్యకిరణములందలి వివిధ వర్ణములు వాయువునందలి జలకణములచే విఘట్టితములై మేఘావృతమైన ఆకాశమునందు నింద్రధనురాకృతిని గన్పట్టుచున్నవని శ్రీవరాహమిహిరాచార్యులచే బృహత్సంహితయందు వర్ణింపబడినది ఇట్లే సృష్ట్యారంభ క్రియ యందును సర్వవ్యాపకముననున్న జడాత్మకమగు నంధతమసమున బ్రసరించిన పరమేశ్వరుని తేజోగ్ని సహితము విఘట్టితమైన భిన్నములగు సప్తవర్ణ ప్రసారముల నొందెననియు జెప్పఁదగియున్నది.

"సప్తహస్త శ్చతు శ్శృంగః సప్తజిహ్వాద్విశీర్షికః"

అగ్నిదేవుడు సహితము సప్తహస్తములు అనగా సప్త వర్ణ కిరణములను సప్త జిహ్వలు ననగా సప్తవిధ తేజంబులుగల జ్వాలలును గల్గియున్నాఁడని శ్రుతి వచనమై యున్నది అట్టి పరమేశ్వర తేజంబగు నగ్నియొక్క ప్రసార్యము సర్వవ్యాపకముననున్న ప్రకృతియొక్క యంధకారమునఁ గలుఁగగా (Vibgyr) సప్తవర్ణములలో ముందుఁగా జలాత్మకమగు నైల్యమునుండి సువర్ణ వర్ణము (Yellow) ఆకాశమునందు వ్యాప్తమయ్యెనని యర్థము. అట్టి కార్యమును బరమేశ్వరి "భాసుర హేమా భరణాం" ప్రకాశించుచున్న స్వర్ణాభరణాలంకృత యని శ్రీ కావ్యకంఠ గణపతిముని వర్ణించెను

క్రమముగా దదనంతర వర్ణములు నొకదాని పిమ్మట నొకటి విస్పష్టము కాగా ననంతరముగల్గు ప్రసరణముచే నీ సప్తవర్ణైక్యతవలన శుద్ధశ్వేత వర్ణాత్మకమగు ప్రభ ఆకాశమునందుప లబ్ధమయ్యెననియు నర్థము ఇట్లు ప్రత్యహము సూర్యోదయమునకు బూర్వ మీ విధమున నంధకార నైల్యమునందగ్నీ సప్తవర్ణ ప్రసరణములును గలుగగా బిమ్మట నా సప్తవర్ణైక్యతచే గలు శ్వేతప్రభ ననుదినము మనము బొందఁగల్గుచున్నాము విలద్విలోమముగా సూర్యాస్తమయానంతర మీ వర్ణ ప్రసరణ మాకాశమున గల్గుచున్నది ఇట్లంధకారము యొక్క నైల్యమును, తదితర సప్తవర్ణములందును ప్రాధాన్యతనొప్పు అరుణ కాంతియు, నీ సప్తవర్ణైక్యముచే నేర్పడు శ్వేతవర్ణమును గవసి గుణత్రయముగా వర్ణింపబడుచున్నవి. కాని యథార్థమున నివి సప్త వర్ణములగుట విశదమై యున్నది. నీలారుణ శ్వేతంబులను నీ గుణత్రయము యొక్క త్రిత్రిభాగములచే నీ నవవర్ణములు సిద్ధమగుచున్నవనియు జెప్పదగియున్నది. అందును హిరణ్మయతయె పరమేశ్వరుని తేజోగ్నియొక్క ప్రథమావిర్భూతియనియు దెలియదగియున్నది. ఇట్లు బ్రహ్మాండమునందేకాక, గర్భాండములందును గుక్కుటాద్యండములందును సహిత మారంభమున నీ స్వర్ణాత్మకతయె కలుగుచున్నది. పరమేశ్వరుడు మనల నెల్లర దన బంగారు బొమ్మలగా నిర్మింపదలచెను కాని మన వివిధ ప్రారబ్ధ కారణములచే నిట్లుభిన్నరూపముల బ్రపన్నులమై కాన్పించుచున్నాము. కాని యెట్లైన మన స్వర్ణాత్మక కర్మలచే మరల నప్పరమేశ్వరు నందైక్యతను సంపాదించుకొనుటకై సర్వథా యత్నింపవలసియున్నది.

ఈ పూర్వోక్తక్రమమునందున సౌవర్ణానంతర నారంగ వర్ణమును బిమ్మట నారుణ్యమును నుపలబ్ధమగుచుండును. ఈ యారుణ్యము సహితము సప్తవర్ణములతో ప్రబలమైన దగుటచే నరుణోదయమును మన మెక్కువ కాలము చూచుచున్నాము. ఈ తృతీయ తేజః ప్రసరణముచే నరుణకాంతి కలుగగా నంధతమసమునుండి జలజని (Hydrogen) వాయువుత్పన్నమయ్యెను. జలజనివాయునందు నగ్ని ప్రసరణముచే నది యరుణకాంతిని బొంది విస్పష్టమగు ధ్వని సహితము కలుగుచుండుట (Laboratory Equipment) వలన దెలియుచున్నది కావున దత్పూర్వ మవ్యక్తమధురమై యున్న జలజని వాయు శబ్దము బ్రహ్మాండమునందు "అకార, ఉకార, మకార" సన్నివేశముచే "ఓం" అని విస్పష్టమయ్యెనని యర్థము ఇట్లు జలజనివాయుప్రథమ స్వరూపంబగు నంధతమసమున బరమేశ్వర తేజముయొక్క తృతీయ ప్రసరణముచే శబ్దోత్పత్తియును గలుగ నందుండి పాంచభౌతికమగు నీ సమస్త ప్రపంచ సర్జనము కలిగెనని యర్థము.

"ఈక్షతేర్నాఽశబ్దం" (బ్రహ్మసూత్రము.)

"తదీక్షత బహుస్యాం ప్రజాయే యేతి" అను శ్రుతి వచనమునందును నట్టి పరమేశ్వర సంకల్పాత్మక దృష్టి సహితము శబ్దాత్మక తేజమే యనియు నెరుగదగియున్నది. కావున "తేజోమయీవాక్" అను నుపనిషద్వచనమున దేజస్స్వరూపమందు శబ్దము సృష్టికాదిభూతమనియు నర్థము

ఈ సృష్టికి బూర్వ మీ శబ్ద స్వరూప మేమి? అది యెచ్చటనున్నది?

"ప్రళయపయోధిజలే ధృతవానసివేదం!
విహిత వహిత్ర చరిత్ర మఖేదం
కేశవ ధృతమీన స్వరూప! జయ జగదీశహరే!" (జయదేవుడు.)

సృష్టికిబూర్వము సర్వము జలప్లవమై యుండగా ననగా నంధతమసావృతమై యుండగా "ఓం" కారాత్మక శబ్దతేజము పరమేశ్వరుని హృదయాంతరాళముననే విలీనమై యుండెను "వేదము"న సృష్టికి నాదిభూతమగు శబ్దమని యర్థము ఆదికవియగు నప్పరమేష్ఠి హృత్కమలమున విలీనమై యున్న తపశ్శక్తియె తన్ముఖమునుండి బహిర్గతమై వేదమనబడి సప్త ఛందస్సులనబడు సప్త వర్ణాత్మకముగా బ్రకటితమైనది

"ఛందాంస్యశ్వాస్సప్తయుక్తాః" అను సూర్యసిద్ధాంత వచనమున వేదముయొక్క సప్తఛందస్సునే సప్తవర్ణాత్మకమగు నశ్వములనియు వర్ణింపబడి యున్నది. కావున నిట్టి శబ్ద రూపకమగు సృష్టియొక్క వివరణమున వేదము తెల్పుచున్నది.

శబ్దధారణ యోగస్తు వీన ఇత్యుచ్యతే బుధైః" (శ్రీదేవీ విలాసము)

సృష్టికిఁ బూర్వము పరమేశ్వరుఁడు తపస్సమాధి యందుండగా నెట్టి హృదయస్పందాత్మక శబ్దమైన నుండ-జాలదు కాని యీ భౌతిక ప్రపంచమున జీవరాసులందు నిట్టి హృదయస్పందమె సంపూర్ణారోగ్య (sound health) లక్షణమై యున్నది. అట్టి స్పందము లేకుండిన వానిని జనన సంఖ్య పట్టికనుండి తొలగింపవలయునని డాక్టర్లు నిర్ణయింతురు. కావున నిట్టి జాగ్రత్తయందు హృదయస్పందము లేకుండుట మన మూహింపజాలము

1944 సంవత్సరమున నొక యోగాభ్యాసకుడు ఏలూరుపట్టణమున బహిరంగసభయందున నుపన్యసించుచు డాక్టరు లెవ్వరైననువచ్చి తన హృదయస్పందమునుబరిశీలింపుమని తెలిపెనట అనేకమంది ప్రవీణులతమ Stethascope తో పరీక్షింప మొదలిడిరి ఎవ్వరికిని ఆ యోగియొక్క హృదయస్పందము కానరాదయ్యె. ఏమనగలరు! తుద కొక్క Militery Doctor పరిశీలించి చూచి "Nonsense ఇది ఏమాత్రము సహింపతగినదికాదు. ఇదియొ Military Camp అయిన మొదల సిపాయికి Cross తో గుర్తించి ఈయనను బైటకులాగి వేయించవ డనే" అనినాడట.

కాని పరమేశ్వరునకు సహితము మనవలె హృత్కోశముగాని దాని స్పందము గాని యుండవలయునో లేదో మనమూహింపజాలము. పరమేశ్వరుడు సృష్టికి బూర్వమెట్టి హృదయ స్పందాదితేజః పచాలనమును లేకుండునట్టి మీనయోగ మున నుండెనని వర్ణింపబడినది. ప్రాణులందు మీనమునకు హృదయకోశము గాని దాని సంచలనముగాని దానిచే ప్రాణవాయువులఁ బీల్చుటగాని యుండ జాలదు దాని శరీరమునసుండు 'Gills' అనబడు నాళముల ద్వారమున జలము వందున ప్రాణవాయువును గ్రహియింప సమర్థమై యున్నది. ఇట్టి యోగిక ప్రవృత్తి ద్యోతకముగా నీశ్వరసృష్టి యందున మీనము సృజియింపబడినది. కావున బరమేశ్వరుడు సృష్టి కింబూర్వము సమస్త శబ్దతేజము హృదయాంతరాళమున విస్తంద్రితమై యుండు యోగసమాధి యందుండెనని తెలియుబడియున్నది. తపస్సమాధినుండి యుత్థానము కలుగగా సృష్టికార్యమునకై సంకల్పింపగా తత్తేజము సమస్త బ్రహ్మాండమునందును వ్యాపించి క్రమముగా బంచవింశతి తత్త్వాత్మక ప్రపంచమంతయు నుపపన్నమయ్యె. ఇట్లే ప్రపంచమంతయును బంచభూతములయొక్కయు, భిన్న భిన్న ప్రమాణముల సన్నికర్షాదులచే నేర్పడి నది. ఇది సృష్ట్యాదియందున శబ్దోత్పత్తి విధానము ఇట్లీశ్వరతేజంబగు నగ్నియే శబ్దాత్మకమగు ప్రపంచరూపమునొందియున్న కారణమున నగ్నితేజముయొక్క నప్తవర్ణములందు నప్త విభాగములచే అకారాది నలువదితొమ్మిదివర్ణ ములు నేర్పడినవి. పాంచభౌతికమగు ప్రాపంచకవస్తుజాలమెల్ల గుణత్రయము యొక్క భిన్న భిన్న తేజముచే నుపజీవ్యమగుచున్న కారణమున వర్ణమాలయందు సహితము పాంచభౌతికవిభాగములగు వ్యంజనాక్షరములు గుణత్రితయ స్వరూ పములగు స్వరములచే నుపజీవ్యములగుచు దద్వస్తునామములనెల్ల దెలుపుచున్న వనియు నర్థము. ఇట్లు సంస్కృత భాషయందున వర్ణమనగా వన్నెయనియు నక్షరమనియు నర్థములై యున్నది.

ఈ ప్రసంగవశమున మరొక విశేషము సహితము మన మెరుగవలసి యున్నది.

"ఈక్షణాదేవమీనస్తు సంకల్పాదపి కచ్ఛపః" (శ్రీదేవీ విలాసము)

మీనము దృష్టిమాత్రముచేతను, గచ్ఛపము సంకల్పమాత్రముచేతను ప్రజనన సామర్థ్యము కలవియై యున్నవి. కావున సృష్టికి, బూర్వము జలాత్మక మగు నంధతమసమునం దపస్సమాధియందున మీనాకృతినున్న పరమేశ్వరుడు ఉత్థానమునొంది కేవల దృఙ్మాత్ర ప్రసార్యముచేతనే సృష్టికార్యమునకు గారక డయ్యెననియు నెఱుగదగియున్నది. కావుననే "తదీక్షత బహుస్యాం ప్రజా యేయేతి". పరమేశ్వరుడు బహువిధముల ప్రజననార్థము కాగలనని వీక్షించెనని శ్రుతివచనమునై యున్నది. ఇట్టి ప్రమాణములింకను బురాణ ప్రథితములునై యున్నవి. "వసిష్ఠః కుంభ సంభవః" పరాశరుడు మత్స్యగంధిని విమోహితుడై చూచినంతమాత్రమున నామె వహియించియున్నజలకుంభమునందు వసిష్ఠుండుద్భ వించెనని తెలుపబడినది. ఇట్లే "అగస్త్యః కుంభ సంభవః" అనియును ప్రమా ణమై యున్నది. ఇట్లు తపస్సంపన్నుల దృష్టి జలమునందు ప్రజనన సామ ర్థ్యము గల్గియున్నదనియు దెలియుచున్నది

ఈ ప్రమాణములవలన సృష్టికి బూర్వము సర్వవ్యాపకతమున్న యంధ కారమునందు బరమేశ్వర దృగ్రూపమగు తేజః ప్రాచుర్యముచే ముందుగా నా యంధతమసమునకు జలాత్మకత సిద్ధించెనని విస్పష్టమగుచున్నది. అందుండి క్రమ క్రమముగా హిరణ్మయాది వర్ణ ప్రాచుర్యముచే సృష్టి కలాపమెల్లయు నిర్వహింపబడినదనియు దెలియదగియున్నది. కావుననే శ్రుతి ప్రమాణము సహిత మిట్లుగా ప్రథితమై యున్నది —

"ఆపోవా ఇదగ్ం సర్వం — విశ్వాభూతాన్యాపః
ప్రాణావా ఆపః పశవ ఆపో౽న్న మాపో౽మృతమాపః
సంరాడాపో — విరాడాపః స్వరాడాపః
చందాగ్ స్యాపో — జ్యోతీగ్ ష్యాపో యజూగ్ష్యాపః
సత్యమాప స్సర్వా దేవతా ఆపో — భూర్భువ స్సువరాప ఓం"

"యాసృష్టిః స్రష్టురాద్యా"— అనగా బరమేశ్వరు నాది సృష్టియైన జలమనియె యెంచదగియున్నదని ఈశ్వరు నష్టమూర్తుల దెలుపునట్టి యీ క్రింది శ్లోకమును కొంద రుదహరించిరి —

జలంవహ్ని స్తథాయష్టా సూర్యా చంద్రమసౌతథా
ఆకాశం వాయురవనిః మూర్తయో౽ష్టౌ పినాకినః"

కాని యిందుదహరింపబడిన క్రమమునకును శ్రీ కాళిదాసోక్తమూర్తి క్రమమునకును నిషద్వైషమ్యము కానుపించుచున్నదనిరి ఇందు "వాయురవనిః" అని యుండగా శ్రీ కాళిదాసక్రమమున యామాహుస్సర్వభూత ప్రకృతిరితి" అనియును "యయాప్రాణినః ప్రాణవంతః" అనియును ముందుగా భూమియు బిమ్మట వాయువు గ్రహియింపబడినవనిరి ఇంకను,

భూరంభాంస్యనలో౽నిలో౽౦బరమహర్నాథో హిమాంశుః పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవమూర్త్యష్టకం"

ఇట్లు శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునందు నష్టమూర్తుల క్రమము "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః" ఇత్యాది శ్రుత్యుక్తక్రమమున నుండగా, బై శ్లోకములందు వ్యత్యస్తముగా నుండుటకు దగిన కారణములు లేవనిరి ఇంతియ కాక, "అయంపూర్వ మపస్సృష్ట్వా తాసువీర్య మవాసృజత్" అను ప్రమాణ మును, శ్రీ మల్లినాథసూరి వ్యాఖ్యనుండి యుదహరించిరి ఇవను నిందులకగు ప్రమాణములు క్వాచిత్కములగుటచే స్రష్టయొక్క ఆదిసృష్టి జలమను నర్థము పొసగదనిరి. కావున ఆదిసృష్టి యనగా నాదిశక్తియగు నప్పరమేశ్వరియే యనవలసియున్నదని నిర్ణయించిరి ఇది యంతయు భ్రమాదికము ఇట్టి యన్యయమువలన "ప్రత్యక్షాభిస్తనుభిః" అనగా సామాన్యముగా బాహ్యేంద్రియ గోచరమగు బ్రాపంచక స్వరూపమునున్న యష్టమూర్తులందు జలమున కెట్టి ప్రసక్తియు లేకుండుటయేగాక "యతోవాచో నివర్తంతే, అప్రాప్య మనసాసహ" అను శ్రుతి వచన విరుద్ధముగా బరమేశ్వరుని ప్రత్యక్ష తనువులుగా నెంచబడు పృథివ్యాదులతో దుల్యముగా నప్పరమేశ్వరిని బరిగణించుటయు నను దోషద్వయమాపాదించుచున్నది.

ఇంతియు గాక ఈ నాందీ శ్లోకమునం దష్ట తనువులం దెల్పు "యాది" పూర్వక విశేషణములు తెల్పు విశేషార్థములు లక్షణములుగా గల్గినట్టియు "యాది" శబ్దాన్వయమున కనువై, "ఈశ" శబ్ద లక్షితవస్తువునకువలెనే అష్టతనువులు గల్గినట్టి వస్తువై స్త్రీలింగ లక్షితమై యున్న పరాభట్టారిక యగు త్రిపురసుందరియే యనిరి ఇట్టి యష్టతత్త్వాత్మకస్సృష్టియంతయు శక్తిమయమె యగుట శివ శక్తుల కభిన్నతయు లింగరాహిత్యమును శ్రుత్యాది ప్రథితమై యున్నదనియు దెల్పిరి. అట్టి యెడ బరమేశ్వరి ఈశ్వరు నాద్య సృష్టియై యష్టమూర్తులలో మొదటిదిగా నిర్ణయించునెడల నవశిష్టమగు మూర్తి సప్తకమే పరమేశ్వరి తనువులని నెంచవలసి వచ్చుచున్నదిగదా! కావున బర మేశ్వరు నాద్య సృష్టియైన జలము సహితము నిజమూర్త్యష్టమున ప్రథ మముగా గల్గియున్న పరమేశ్వరియని సమన్వయించిన నెంతయు సామరస్యముగా దోచెడిని.

"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం,బహ్వీః ప్రజాస్సృజమానాంసమామః!
అజాయేతాం జుషమాణాం భజన్తే, జహాత్యేనాం భుక్తభోగాం నుమన్యే న్!!

ప్రకృతి పురుషులు ననాది దంపతులయ్యె యున్న కారణమున గుణత్ర యాత్మికయగు ప్రకృతియు "అజామేకాం" అని స్తుతింపబడుచున్నది.

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం. పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం!
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం—నమో నమశ్శంకర పార్వతీభ్యాం!!

అర్ధనారీశ్వరులగుట పార్వతీ శంకరులు పరస్పరాశ్లిష్ట శరీరధరులైన పురాణ దంపతులైనను నవయౌవనులేయనియు వర్ణింపబడినది.

"వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ"

జగన్మాతా పితరులైన పార్వతీ పరమేశ్వరులు శబ్దార్థ స్వరూపులగుట వామరూపముల బ్రపన్నమై యున్న సమస్త జగత్స్వరూపులు నగుచున్నారనియు వివరింపబడినది.

భగవద్గీతయందును —

"ప్రకృతిం పురుషంచైన విద్ధ్యనాదీ ఉభావపి"
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్"

ప్రకృతియు బురుషుండును నుభయులును ననాది సంభవులు. పంచ వింశతి తత్వాత్మకమగు సృష్టి రూప వికారములును గుణత్రితయమును బ్రకృతి సంభవము లేయని యెఱుంగదగియున్నది. ఇట్టి కారణమున బ్రకృతిసహితము పురుషునితోబాటు ననాది సంసిద్ధమై యున్నదియేగాని ప్రత్యేకముగా నీశ్వర సృష్టియని యెంచదగదు.

నశివేన వినానారీ దేవ్యాచ నవినా శివః
ఏతయో రంతరం నాస్తి చంద్ర చంద్రిక యోరివ"

చంద్రీ చంద్రికలవలె శివ శక్తుల పరస్పరావినాభావ సంబంధ మనాది సిద్ధమై యున్న కారణమున నీ యుభయుల యందంతరమైన నుండజాలదు. శక్తి శక్తిమత్తులగుట బ్రకృతి పరమేశ్వరున కనపాయినియై యుండుటచే నీ యుభయులు ననాది సంభూతులేయని యెంచదగియున్నది. కావున "ఆది శక్తి", "ఆది శంకరులు" అనుపదములందు "ఆది" శబ్దమువలన సృష్టికి బూర్వముననున్న వారలగుటచే ననాది సంస్థితులనియె యర్థమగునుగాని సృష్టి యందున వీరలు ప్రథమమున సృజియింపబడిన వారలని యెంచదగదు కావుననే సృష్టికిబూర్వము సర్వము నంధతమసావృతమై యుండ బరమేశ్వరుడు శుద్ధ సత్వ రూపంబగు తపస్సమాధియందుండె. పిమ్మట నిజ హృదయాంతరాళ మున నుద్దీపించియున్న రజశ్శక్తి కార్యముచే నుత్థానమునొంది సృష్టిజేయ సంకల్పించి ముందుగా నంధతమసమునుండి జలజని వాయువును నిర్మించి యందు నిజ వీర్యంబగు నగ్నితేజము బ్రసరింపగా సృష్టి కలాపము ప్రసక్తమయ్యె ఇది ప్రకృతి పురుషుల పరస్పర దాంపత్య సంబంధము అటుపైని సమస్త సృష్టి కార్య నిర్వహణమునందును స్త్రీరూపిణియగు పరమేశ్వరియే యధినేత్రియయ్యె నని యెరుగదగియున్నది. కావుననే "పురుష విమోక్ష నిమిత్తం తథాప్రవృత్తిః ప్రధానస్య" ఈశ్వరుని సంకల్పిత కార్య నిర్వహణముచే విమోక్షమునులేక విరామమును గల్పించుటకై ప్రకృతియే యీ సృష్టి కార్యమును నిర్వర్తించు చున్నదని సాంఖ్య శాస్త్ర ప్రమాణము.

ఇట్టి శాస్త్ర సాంప్రదాయమును బురస్కరించుకొనియె మన మన్య శాస్త్ర విషయములను సమన్వయింపవలసియున్నది కావు కళా విలాసమున ద్వితీయ శ్లోకము .—

సాజయతి శక్తి రాద్యా నిజ సుఖమయ రూప నిత్య నిరుపమాకారా!
భావి చరాచర బీజం శివరూప విమర్శ నిర్మలాదర్శః॥

ఇందును "శక్తిరాద్యా" అనుటచే సృష్టికిబూర్వము పరమేశ్వరునందు నవ్యక్తమై యున్న ప్రకృతి స్వరూపిణియని యర్థము కావుననే "నిత్య నిరుపమాకారా" అనియును "నిత్య సత్యత్వము" వర్ణింపబడినది అట్టిప్రకృతి స్వరూపిణి పరమేశ్వరుని దనయందు బ్రతిబింబింప సమర్థయై యటుపైని గాదగియున్న చరాచర సృష్టికి బీజ స్వరూపిణియై యున్నదని భావము.

"త్రిపురా పరమాశక్తిః ఆద్యాజాతా మహేశ్వరీ" అనేడు వామకేశ్వర తంత్రీయ శ్లోక వ్యాఖ్యయందున "త్రిభ్యస్తేజో భిన్నాదిభ్యః పురాజాతా త్రిపురా— తేజో భిన్నాదిభ్యః పూర్వ సత్వమేవ కా సర్వ తత్వాతి క్రాంతత్వం బ్రహ్మణః" గుణత్రయాత్మక తేజస్సులకంటె బూర్వముననున్నదగుటచే బరమేశ్వరి "త్రిపురా" అనబడుచున్నది. అనగా సృష్టికిబూర్వము ప్రకృతి సహితము పరమేశ్వరు నందవ్యక్తముననుండ నా ప్రకృతియొక్క గుణత్రయ కార్యమున కెట్టి ప్రసక్తియులేక నిర్వికల్ప స్వరూపిణియై యున్నదని యర్థము పిమ్మట సృష్టియందు గుణత్రయముయొక్క కార్యమువలన సంభవించిన పంచవింశతి తత్త్వములకంటెను బ్రహ్మము పరుడనియు నిర్దేశింపబడినది "వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్" అని చెప్పబడుటచే బరమేశ్వరియొక్క గుణత్రయ కార్యమై యొప్పు సృష్టి కలాపముకంటెను నా సృష్టి స్వరూపిణి యగు పరమేశ్వరికంటెను బ్రహ్మము పరుడని యర్థము. ఇట్లనాదియగు ప్రకృతికంటెను బురుషుడు పరుఁడగుటచేతనే ప్రకృతి పురుషు లుభయులు ననాది సంసిద్ధులేయనియు తెలుపబడినది.

ఈ ప్రకరణమున "ఆద్యాజాతా మహేశ్వరీ" అనియును, "త్రిభ్యస్తేజో భిన్నాదిభ్యః పురాభూతా త్రిపురా" అనియును వివరింపబడిన వాక్యము లందు "భూతా, జాతా" అను పదములవలన నీశ్వర సృష్టయైన పరమేశ్వరి యనదగునని కొందరనిరి. ఇది యంతయు నయుక్తికము. "భూ— సత్తాయాం" అనునట్లుగా "భూతా, జాతా" అను పదములు బ్రకృతి ఆది యందుననే సంస్థితయై యున్నదను నర్థము నిచ్చునుగాని, పదమునందున బరమేశ్వర వినిర్మితయనుట యసమంజసము.

"ఇంద్రియేభ్యః పరాహ్యరాః అర్థేభ్యశ్చ పరం మనః।
మనసశ్చ పరాబుద్ధిః బుద్ధేః పరతరం మహః॥
మహతః పరమవ్యక్తం — అవ్యక్తాత్పురుషః పరః।
పురుషా న్న పరంకించిత్ — సాకాష్ఠా సాపరాగతిః॥

ఈ కఠోపనిషద్వచనమునందును "అవ్యక్తాత్ పురుషః పరః"॥ అని యుండుటచే బురుషుడు ప్రకృతికంటెను బరుడే యనియు వ్యక్తమగు చున్నది. కావుననే "ప్రకృతిం పురుషం చైవవిద్ధ్యనాదీ ఉభావపి" ప్రకృతి పురుషు లుభయులును ననాదులేయని ప్రత్యేకముగా వివరించి చెప్పబడినది.

సాంఖ్యశాస్త్రమునందును :—

మూల ప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృత యస్సప్త
షోడశవస్తు వికారః — నప్రకృతి ర్న వికృతిః పురుషః"

మూలప్రకృతి ఆద్య ప్రకృతి అనగా నన్యమగు నే ప్రకృతినుండి యుత్పన్నమైన వికృతియు గానేరదు. మహదాది సప్తకము ప్రకృతులును వికృతులును నగుచున్నవి. అనగా దత్పూర్వ ప్రకృతినుండి కలిగిన కారణమున నవి వికృతులగు చున్నవి వానినుండి తదనంతర ప్రకృతి యుత్పన్నమగుటచే నవి ప్రకృతులును నగుచున్నవి. మహాభూతములు నేకాదశేంద్రియములు కేవలము వికృతు లగుచున్నవి పురుషుడు ప్రకృతిగాని వికృతిగాని కానేరడు అట్లుగాక ప్రకృతి పరమేశ్వరనిర్మితమనునెడల ప్రకృతియే వికృతియునగునవలసి యుండును. పురుషుడు మూలప్రకృతియనవలయును కావున నిట్టి వికల్పమునకు శాస్త్రమున నెట్టి యవకాశములేదని ధృవమగుచున్నది.

## వహతివిధిహుతంయాహవిః, యాచహోత్రీ :

సృష్ట్యారంభమున దపస్సమాధియందున శుద్ధ నిర్గుణ సత్వాకృతినున్న పరమేశ్వరుడు నిజ హృదయాంతరాళమున నుద్దీపితమై యున్న రజశ్శక్తిచే నుత్థానమునొంది ప్రజనముఁజేయ నంకల్పించి సర్వత్ర వ్యాపించియున్నయంధ తమసమునందు నిజవీర్యంబగు నగ్నితేజమును విడువగా నది హిరణ్మయాండ మయ్యె. ఇట్టి ప్రథమ కార్యముచే నంధతమసాత్మకమగు ప్రకృతి పరమేశ్వరుని వీర్యంబగు నగ్నిని నిజగర్భమున వహియించి పాంచభౌతికమను సృష్టిని బ్రస వించెను "వహతి విధిహుతంయా హవిః" అని యర్థము. ఇట్టి కారణమున నగ్ని కృపీటయోనియయ్యె. కుమారుడు "అగ్నిభవుడ"య్యెను

"ఆత్మానంద్వేధా విభజ్య స్త్రీ పుంభావ మాపన్నః" అని బృహదారణ్యకోపనిషత్ప్రమాణము కల్గినది ఇట్టి విభజనమున జరాచరమగు విశ్వప్రపంచ మున ద్వంద్వంబులు నిర్మింపబడియుండుటచే నిజ ప్రారబ్ధ కర్మవిభాగమున నిర్మింపబడిన మానవ ద్వంద్వముల ప్రవృత్తియందున నెట్టి విచ్ఛిత్తియు గలుగకుండగ మోక్షప్రాప్తికై సర్వథా మెలగవలసియున్నది.

"పురుష విమోక్ష నిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య"
అను ప్రమాణమున స్వోపార్జిత కర్మఫల విభాగముచే నిజస్త్రీయందు సంతానము గని ముక్తి నొందవలసియున్నది.

ప్రకృతి పరమేశ్వరుని దపస్సమాధినుండి 'యుత్థానము గలుగజేసి యాకృష్ట చైతన్యమున దద్వీర్యంబగు వహ్నితేజమును నిజాత్మ రూపంబగు జలమున హోమ మొనరించునట్లుగా సృష్టికర్మయందుః ప్రచోదన మొనర్చిన కారణమున దానే యీ యజ్ఞకార్యమున యజమానినియయ్యె గావున దానే హోత్రియు నయ్యెనని యర్థము. ఇట్లు యజన, యజమాన, యాజక, యాగములు యయ్యెను. ఇట్లే ధ్యాతృ, ధ్యాన, ధ్యేయాది త్రిపుటి స్వరూపమును బ్రకృతియే యగుటచే స్వయముగా గర్తృత్వభోక్తృత్వముల కధికారిణియు నగుచున్నది. ప్రకృతార్థమున—"అగ్ని ముఖావై దేవాః" అనుటచే నింద్రాది దేవతల ప్రీత్యర్థము క్రతుక్రియయందు నొసగబడు హవిస్సునెల్ల గ్రహియించు వహ్ని హోత్రుడని యర్థము.

వాచమధి తిష్ఠత్ — జ్యోతిరపిభౌమం
కించిదపిద్వైవం — గేయమవిరామం॥
స క్రతుషు హోతా విప్రముఖవాసీ
అత్తిచ స హవ్యం వేదితలభాసీ॥

"తేజోమయీవాక్" అను నుపనిషద్వచనము ననుసరించి సర్వ జంతుజాలమున బరమ పవిత్రమై యాయజ్ఞాకుని ముఖమున వెలుగుచున్నదని శ్రీ కావ్య కంఠ గణపతిమునిచే నగ్నిగీతమునందు వర్ణింపబడి యున్నది. ఆ అగ్నియే వేదితలమున భాసించుచు హవిస్సును హుతము సేయుచున్నది. ఆ హవిస్సు సహిత మగ్నితేజః ప్రదీపనమున సహకరించు కారణమున హవిస్సు సహిత మగ్నిరూపమె యగుటచే హోమము, హోత, హవిస్సు నను నీత్రితయము నగ్నిరూపమై యొప్పుచున్నది.

ఇంతియగాక, "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అను శ్రుతిప్రమాణముచే నింద్రాగ్నుల పరస్పర సంబంధ మత్యంతము పుష్టికరమై యున్నకారణమున గతువున నగ్ని ముఖంబున నొసగబడు హవ్యమెల్ల నింద్ర ప్రీతికరమై యొప్పుచున్నది గావున నింద్రుడు క్రతుభుక్కగుచున్నాడు. ఇట్టి యింద్రుడు శత క్రతుయాజి యగుటచే యష్టకెల్లరు నింద్రునంశమె యగుట నీ యజ్ఞకార్యమెల్ల ప్రజాసృష్టి హేతువగుచున్నది. కావున "యష్ట" యనుటకు సామాన్యమున "పుమాన్" అను పదమె పూర్వోదాహృత శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమున వ్యవహరింపబడియున్నది. ఇట్లు పురుషుని వీర్యమును నిజపత్నియందు హుత మొనర్చుటచే సృష్టి కార్య నిర్వహణమును నగుచున్నదని యర్థము.

## యేద్వేకాలం విధత్తః

కాలమును విధించు సూర్యచంద్రు లిరువురును బరమేశ్వరుని మూర్తులనియు జెప్పబడినది.

తేజోఽస్య మండలం సామాన్యస్రా మూర్తిర్యజూంషిచ
త్రయీమయోఽయం పురుషః కాలాత్మా కాలకృద్విభుః"
(సూర్యసిద్ధాంతము)

తేజోమూర్తియైన సూర్యభగవానుడే దేవత్రయ స్వరూపుండును నగుచున్నాడు. సూర్యమండలను ఋగ్వేదను. కిరణములు సామబృంహితములు. మూర్తి యజస్సు. ఇట్లు వేదమయుడైనసూర్యుడే కాలాత్మయును గాలకారణుడును నగుచున్నాడు. "ఆపోమయః ప్రాణః". కాలము సహితము ఆపోమయమగు ప్రాణాది రూపమున నెఱుంగబడుచుండుటచే "కాలాప్సునివిశంతే—అపస్సూర్యే ప్రతిష్ఠితాః" కాలము జలములందును, జలము సూర్యునందును బ్రతిష్ఠితమునై యున్నవి. "యాభి రాదిత్య స్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి" ఆదిత్యుడు నిజరశ్మలచే జలాశయములం దపియించి మేఘాత్మకతను వర్షించుచున్నాడు. ఇట్లు సృష్టియంతయు వహ్ని జలముల పరస్పర సంబంధముచే నెరుగదగియున్నది.

సూర్యుని యుదయాస్తమయములచే నహోరాత్రములు కలుగుచున్నవి. అట్టి సూర్యుని ద్వాదశరాశి సంచారకాలమగు సంవత్సరము కాలమున ప్రమాణమై యొప్పుచున్నది. "సంవత్సరోవా అపామాయతనం" ఈ సంవత్సరము జలమునకు నివాసమై యున్నదని శ్రుతివచనము. ఇట్టి సంవత్సరముచే యుగ కల్పమానములు సిద్ధించుచున్నది "యదతి దూరగతో ద్రుహిణఃక్షితేః— సతత మా ప్రళయం రవి మీక్షతే." భూమినుండి బహుదూరమున నుండుటచే బరమేష్ఠి, సృష్టికాలమంతయును రవిని జూచుచునే యుండును గావున నొక కల్పము బ్రహ్మకొకయహస్సగుచున్నదని సిద్ధాంత శిరోమణియందు దెలుపబడియున్నది. ఇట్టి కల్పాంతమునందు సూర్య చంద్రాదుల సంస్థితియు నుండజాలదు.

మాసేన స్యాదహో రాత్రః పైత్రః వర్షేణ దైవతః॥

మనల కొక్క సౌరవత్సర కాలమైన, దేవతల కొక్క యహోరాత్రమగుచున్నది సూర్యుడు ద్వాదశరాశి సంచార కాలమగు సంవత్సరమున నారు మాసములు విషువద్వృత్తమునకు నుత్తరమునను నారుమాసములు దక్షిణమునను జనించుచుండుటచే నిందు విషువదుత్తర సంచలన కాలమగు నారుమాసములును నుత్తర మేరువాసులగు దేవతలకు గాన్పించుచునే యుండును గావున వారల కది దివా కాలమగుచున్నది. తదితరమగు నర్ధ సంవత్సరము రాత్రికాలమగుచున్నది.

మనల కొక్క చాంద్రమాసముచే జంద్రమండలోపరిస్థితులగు పితరుల కొక్క యహోరాత్రమగుచున్నది దర్శయందున సూర్య చంద్రు లేకరాశ్యంశ గతులగుటచే బితృదేవతల కాకసమధ్యమున సూర్యుడు కానబడును గావున వారల కపుడు మధ్యాహ్నమగుచున్నది అట్టి దినమున బితృప్రీత్యర్థము శ్రాద్ధ తర్పణము లొసగబడుచున్నవి సూర్యునికంటెః బ్రాగ్గతియందు నధికుడగు చంద్రుడు సూర్యు నతిక్రమించి చాంద్రతిథిచే ద్వాదశ భాగలంతరముగ గడచుచుండును. ఇట్లు పదునైదు తిథులచే సూర్య చంద్రాంతరము ౧౮౦ భాగలనుట సూర్యాస్తమయకాలమున జంద్రుడు ప్రాగ్దిశయందుదయమగుచుండును అది పూర్ణిమ యగును అట్టి సమయమున జంద్ర మండలము కుపరిభాగముననున్న పితృదేవతలకు రవి గ్రిందుగా నుండుటచే నది వారల కర్ధరాత్రమగుచున్నది ఇట్లే కృష్ణాష్టమియందున సూర్యోదయంబును శుక్లాష్టమియందు సూర్యాస్తమయమును నగుచుండును. కావున నొక చాంద్రమాసముచే బితృలోకమున కొక యహోరాత్రమగుచున్నది.

శ్రీ కాళిదాస విరచిత విక్రమోర్వశీయమునందును జంద్రుడిట్లు స్తుతియింపబడుచున్నాడు.

రవిమావిశతే సతాంక్రియాయై
సుధయాతర్పయసే పితౄన్ సురాంశ్చ।
తమసాం నిశి మూర్ఛితాం నిహంత్రే
హరచూడాభరణాత్మనే నమస్తే॥

దేవర్షి పితృప్రీత్యర్థము జపహోమ తర్పణాదు లొసఁగఁబడుటకై దర్శయందు రవిని చేరుచున్నావు అమృతముచే బితరులను సురలను దృప్తుల జేయుచున్నావు. రాత్రులందు వ్యాపించియుండు నంధతమసమును హరియించుచున్నావు. హరునకు జూడాభరణమై వెలుగుచున్నావు. అట్టి మహాత్మునకు నమస్కారము.

## శ్రుతివిషయగుణాయాస్థితావ్యాప్యవిశ్వం

శ్రుతి విషయమగు శబ్దము, గుణముగా గల్గిన ఆకాశము సర్వవ్యాప్తియందునున్న పరమేశ్వరునిమూర్తియేయని భావము.

ఇచ్చట శ్రుతియనగా వేదమనియు నర్థమగుటచే వేదచోదితమైన గుణాశయముచే విలాసితయగు పరమేశ్వరియనియు —ంచవచ్చును వేద మాది శబ్దమగుటచే నదియె శ్రవణమునకును విషయమగుట విషయీ విషయాభేదముచే శ్రుతి యనగా వేదమనియును శ్రవణమనియును నర్థద్వితయము కల్గినది.

ఇట్లు శబ్దాది సూక్ష్మభూతములనుండి ఆకాశాది మహాభూతములును నుత్పన్నములైన కారణమున "దిశః శ్రోత్రాత్" శబ్దాదులనగా ఆకాశాది స్థూల భూతములనియును గ్రహియింపబడుచున్నది కావున స్థూలసూక్ష్మభేదములచే మనమెట్లు గ్రహియించినను నీ ప్రకరణవశమున శబ్దగుణమగు నాకాశమని గ్రహియించినపుడే యది యీశ్వరు నష్టమూర్త్యంతరమగునని మన మెన్నవలసి యున్నది. అట్టి మూర్తిని ప్రకృతి పురుషులలో నేరికి బరముగా మనము సమన్వయించినను భేదముండజాలదు

### యామాహుః సర్వభూత ప్రకృతిరితి :

శబ్దాదులు గుణములుగా గల్గిన పంచభూతములయొక్క సాంద్రతమ ప్రకృతియగు పృథివి యని యర్థము. శబ్దస్పర్శాదు లుత్తరోత్తరము బలవత్తరములు. స్పర్శమనగా శబ్దస్పర్శములు రూపమున శబ్ద స్పర్శ రూపములు. రసమనగా శబ్ద స్పర్శ రూప రసముల సన్నివేశము. "గంధవతీ పృథివీ" అనగా పృథివి శబ్ద స్పర్శరూప రస గంధములనెడునైదు తన్మాత్రల ప్రకృతి రూపమనియర్థము. ఇట్టి పృథివియు ప్రత్యక్షమై యున్న పరమేశ్వరు నష్టమూర్తి రూపమున నొప్పుచున్నది.

### యయా ప్రాణినః ప్రాణవంతః

దేనిచే ప్రాణులందఱు ప్రాణవంతులగుచున్నారో అట్టి ప్రాణ వాయురూపమూర్తి యని యర్థము. "ప్రాణాద్వాయురజాయత" ఈశ్వరుని ప్రాణమునుండి యుత్పన్నమైన వాయువు సమస్త జగంబులకును ప్రాణ స్వరూపమై యొప్పుచున్నది. ఇట్టి యష్టమూర్తి విషయము "చంద్రమామనసోజాతః — చక్షోస్సూర్యో అజాయత" అను శ్రుత్యర్థమును బురస్కరించుకొనియున్నట్లు విశదమగుచున్నది. అట్టి కారణముననే పరమేశ్వరిసహితము "ప్రాణదాత్ర్యై నమః — ప్రాణస్వరూపిణ్యై నమః" అనియుస్తుతియింపబడుచున్నది. "ఆపోమయః ప్రాణః" అనుటచే నిట్టి ప్రాణము సహితము జల స్వరూపమని యుపనిషదర్థమై యున్నది.

> మనస్త్వం వ్యోమత్వం మరుదసి మరుత్సారధి రసి
> త్వమాపస్త్వం భూమిస్త్వయి పరిణతాయాం నహిపరం।
> త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా
> చిదానందాకారం శివయువతి భావేన బిభృషే॥

నీవే మనస్సువు. నీవే ఆకాశమువు. నీవే వాయువువు. నీవే అగ్నివి. నీవే జలమువు. నీవే భూమివి. సృష్టియందు సర్వమును నీ పరిణతియై యున్నది. నీవే ప్రపంచ స్వరూపిణివై స్వాత్మను చిదానందాకారమున బరిణమింపజేయుటకై పరమేశ్వర పత్నీ భావమును భరియించుచున్నావని సౌందర్యలహరియందు బరమేశ్వరి స్తుతియింపబడుచున్నది ఇట్టి కారణమున బరమేశ్వరు నష్టమూర్తులుగా వర్ణింపబడుచున్న ప్రత్యక్ష తత్త్వములు సహితము పరమేశ్వరీ తనువులే యనుటయేగాక ఆ యష్ట తనువుల ప్రత్యంగమును బరమేశ్వరి స్వరూపమె యనియు నిశ్చయమై యున్నది.

సృష్టికిబూర్వము పరమేశ్వరుని తపస్సమాధి కాలమునందు సర్వమును వ్యాపించియున్న యంధతమసము సహితము పరమేశ్వరి తేజమేయై యున్న కారణమున నిజరజశ్శక్తిచే నీశ్వరున కుత్సాహము గలుగజేసె. అట్టి రజఃప్రాచుర్యముచే నంధతమసమునకు జల స్వభావమును శైత్యాంధతమసముల కార్యము కలిగె. అట్టి సంస్థితినుండి క్రమముగా జలజవాయువును బిమ్మట బంచభూతములును నిర్మితంబులయ్యె. ఇట్టి సృష్టి క్రియాకలాపమున సర్వ వ్యాపకతనున్న యంధతమసమునందలి నర్ధభాగము పాంచ భౌతిక పరిణామమునొంద దదితరమగు నర్ధభాగము రాత్రులందునను వ్యక్తమగుచుండుటచే బరమేశ్వరి ఈశ్వరున కనపాయినియగు నర్ధాంగియనియు దెలుపబడియున్నది. ఇట్లు సర్వప్రపంచము పరమేశ్వరీ స్వరూపమె యగుట యష్టమూర్తులును బరమేశ్వరి తనువులే యనియు విశదమగుచున్నది ఇట్టి సృష్టి కలాపమెల్ల ప్రథమంబున జలాత్మకమగు నంధతమసమునుండియే సముద్భూతమైనదని తెలియదగియున్నది. ఇట్లే శ్రుతియందును —

"యోఽపాం పుష్పం వేద — పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి"

ఈ సృష్టియంతయు జలమునుండి యావిర్భూతమై యున్న పద్మమును నెరింగినవాడు, ఆ పుష్పమున కధినేతయగును సర్వ సృష్టి ప్రజనాథుడగును. సమస్త జీవకోటికి నాదిభూతుడగును. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మయే యగుననియు శ్రుతి వచనము ఇట్లగ్నియు, చంద్రుడును, పర్జన్యుడును, నక్షత్రములును, వాయువును సంవత్సరమునుగాక ప్రత్యక్షముగా దపియించుచున్న సూర్యుడుసహితము జలమునుండియుత్పన్నమై యున్న కారణమున వారలు జలమునకు నివాసము యనియు వివరింపబడి యున్నది. తుట్టతుదకు—

"యోఽప్సు నావం ప్రతిష్ఠితాం వేద—ప్రత్యేవతిష్ఠతి"

ప్రథమమున "అపాం పుష్పం" అని వర్ణింపబడిన యీ సృష్టియంతయును జలమున బ్రతిష్ఠింపంబడిన నావనుగా నెరిగినవాడు స్వయముగనే పరమేష్ఠియందును బ్రతిష్ఠితుడగుచున్నాడనియు వర్ణింపబడినది.

# ప్రాణాన్ని గురించి

## శ్రీ 'ఆంగిరస్'

భారతదేశంలో బ్రహ్మవిద్యాన్ని గురించి కర్మకాండను గురించి మీమాంస చేసినంతగా ప్రాణాన్ని గురించి మీమాంసించినట్లు కన్పించదు. ఉపనిషత్తులలోను, ఆయుర్వేద గ్రంథాలలోను ఇందుకు సంబంధించి కొన్ని కొన్ని విషయాలువుంటే ఉండవచ్చును గాని, అవి ప్రాణిజాతం కల్గినతర్వాత సంగతులనుగూర్చి చెబుతాయి గాని, అసలు ప్రాణం ఎట్లా సముద్భవం చెందిందో చెప్పవు. బృహదారణ్యకోపనిషత్తులో "త్రీణ్యాత్మనేకురుతేతి మనోవాచం ప్రాణం" మొదలైన మంత్రంలో ఈ ప్రాణ ప్రసక్తి వస్తుంది. అంతకుముందు బ్రహ్మ నిర్మితమైన సప్తాన్నముల సంగతినిచెప్పి, ఈ మనో వాక్ప్రాణములను గురించి వివరిస్తుంది. ఇవి గూడా ఆత్మకు అన్నములైనట్లే చెబుతుంది. మనో వాగ్వివరణం సంగతి ఎట్లావున్నా ఇక్కడ ప్రాణ వివరణం ఎట్లా ఉన్నదో చూడటం అవసరం. మంత్రం ఇట్లా వుంది. "ఏషాహ్యన్త మాయత్తే ఏషాహిప్రాణోఽపానోవ్యాన ఉదాన స్సమానోఽన ఇత్యేతత్ సర్వం ప్రాణ ఏవైతన్మయోవా అయమాత్మా వాఙ్మయో మనోమయః ప్రాణమయః"

ఈపైన పేర్కొన్న మంత్రం అర్థం ఇది ప్రాణము ముఖ నాసికములద్వారా సంచరించుచు హృదయ పర్యంతముప్రవర్తించుచున్నది ఇది ఊర్ధ్వగమనమువలన ప్రాణమనియు, మూత్ర పురీషాదికమును పోగొట్టుటవలన అపానమనియు అనబడుతున్నది. ఈ అపానము నాభి పర్యంతమునుండి క్రింద సంచరించుచు అధోగమనము చేయుటవలన అపానమనబడుచున్నది. సమస్త శరీరమును పొందియుండునది వ్యానము. ఇది ప్రాణాపానములయొక్క సంధియై సామర్థ్యముగల కర్మకు కారణమైనది. ఆపాదతలమస్తక పర్యంతము వుండి పూర్ధ్వమునందు సంచరించుచున్నది ఉదానము. ఇది ఊర్ధ్వలోక గమనాదులకు కారణమైనది. ఉదరమునందుండు అన్నమును పచనము చేయునది, తినబడిన అన్నాదికమును త్రాగబడిన పానాదికమును సమానముగా పొందించునది సమానము ప్రాణాది వృత్తి సమూహమగు నీ సమస్తమును ప్రాణ స్వరూపమే అని ఉపనిషత్తు అంటున్నది. ప్రాణోపానవ్యానోదానసమానములు యీసర్వమును ప్రాణము. "ప్రాణోఽపానోవ్యాన ఉదానస్సమానోఽన ఇత్యే తత్సర్వం ప్రాణఏవ."

ఇంకొకతావున ఇదే ఉపనిషత్తులో ప్రాణము శిశువుతో పోల్చబడినది. అక్కడ మంత్రం ఇట్లా వుంది.

"యోహ వై శిశుగ్ం సాధానగ్ం
సప్రత్యాధానగ్ం సస్థూణగ్ం
సదామం వేద సప్తహ
ద్విషతో భ్రాతృవ్యానవరుణద్ధి
అయం వావ శిశుర్యోయం
మధ్యమః ప్రాణస్తస్యేద
మేవాధానమిదం ప్రత్యాధానం
ప్రాణఃస్థూణాన్నందామ"

ఈ మంత్రమునకు వివరణ మిట్లున్నది: "ఐదు విధములుగా ఈ దేహము నందుండెడి యీ ప్రాణము శిశువువలెనే, శబ్దాది విషయంములయందు ఒక ఇంద్రియము ఇంకొక ఇంద్రియ విషయమునందువలెనే అసమర్థమగుటవలన శిశువుగాను, ఇట్లు ప్రాణమను శిశువునకు అధిష్ఠానమగుటవలన శరీరము ఆధానమనియును, ఇట్టి ఆధానమగు శరీరముతో గూడికొనుటవలన దేహమధ్యమునందలి ప్రాణమను శిశువును సాధ్యముగాను, ఈ ప్రాణమను శిశువును పొందియున్న విజ్ఞాన మయాత్మ నిద్రవలన జాగ్రత్కాలమునందుశిరస్సునందున్న చక్షుశ్శ్రోత్ర నాసికములయొక్క రంధ్రముల నారింటిని, ముఖబిలమును యీ యేడింటిని తిరిగి పొందియుండుటవలన ప్రత్యాధానమనియు, ఇట్టి ప్రత్యాధానముతో గూడుకొనుటవలన శిశువును సప్రత్యాధానమునుగాను, ప్రాణమనుశిశువు ఈ శరీరమునందు స్తంభము ఆధారముగాగల శిశువువలెనే అన్నపానములవలన పుట్టిన బలము. ఆధారముగా కలవాడగుటవలన స్థూణమునుగాను, నెరుగవలసియున్నది బక్షింపబడినఅన్నము, స్థూల మధ్యమ అణిష ములని మూడు విధములైనది. అందు స్థూలరూపమైన రసము మూత్ర పురీషముగా బయలు వెడలుచున్నది. మధ్యమరూపమగురసము క్రమముగా రక్తముమొదలైన వాని రూపముతో స్వకార్యములగు త్వక్కు, రక్తము, మాంసము, మేధస్సు, మజ్జ, ఎముక, రేతస్సు—యీ యేడింటివలన బుట్టిన శరీరమును వృద్ధి పొందించుచున్నది. అణిష్ఠరూపమగురసము అమృతమనీ, ఊర్జమని, ప్రధానమని చెప్పబడుచున్నది. అది బొడ్డునకుమీదనున్న హృదయదేశమునుపొంది హృదయము నుండి బయలువెడలి విశేషముగా దేహమునందంతటను వ్యాపించియున్న డెబ్బదిరెండువేల నాడులయందు ప్రవేశించి ఇంద్రియ సమూహమే రూపముగా గలిగిన సూక్ష్మరూపమగు ప్రాణమగు ప్రాణ

మను శిశువును శరీరమందుంచుటకు కారణమైన స్థూణమనుపేరు గల శక్తిని కలుగజేయుచు శరీర ప్రాణములను పలుపువలెనే బంధించుటవలన ఆ ప్రాణమను శిశువును సదామమునుగాను, ఈ ప్రకారము దేహమధ్యమునందున్న ప్రాణమనుశిశువును సాధానమును గాను, స్రప్రత్యాధానమునుగాను, సస్థూణమునుగాను సాధనమునుగాను తెలిసికొనువాడు, అట్టి విషయరాగములను నశింపజేయుచున్నాడు."

ఇట్లు బృహదారణ్యకంలో ప్రాణాన్నిగూర్చి మంత్రాలుకొన్ని ఉన్నాయి. ఈ మంత్రములయందు ప్రాణం అనేక విధాలుగా వర్ణింప బడివుంది. ఒక మంత్రంలో ప్రాణం స్వర్లోకం అని చెప్పబడివుంది ఇంకోమంత్రంలో ప్రాణం సామవేదమని, మరోమంత్రంలో ప్రాణము మనుష్యులని ఉపనిషత్తు చెబుతున్నది. మనోవాక్ప్రాణములనుమూడిం టిని గురించిన్నీ చెబుతూ ఒక మంత్రం—"పితామాతాప్రజైత ఏవ మన ఏవపితా, వాఙ్మాతా, ప్రాణః ప్రజా" అన్నది. మనస్సు తండ్రియట. వాక్ తల్లియట. ప్రాణము సంతానమట మరియు ప్రాణం స్వరూపం ఏమిటి? ఈ విషయం ఇంకో మంత్రంలో ఇట్లా వుంది.

"యత్కించావిజ్ఞాతం ప్రాణస్య
తద్రూపం, ప్రాణోహ్యవిజ్ఞాతః
ప్రాణ ఏనం తద్భూత్వా వతి"

ఇంద్రియ గోచర స్వరూపము ఏదియో, అది ప్రాణము యొక్క స్వరూపము. ప్రాణమే అవిజ్ఞాతము. అనగా ఇంద్రియము లకు కనబడనిది. ప్రాణమిట్లు అయి, ప్రాణ విభూతిని తెలిసినవానిని రక్షిస్తూవున్నది.

ఈ ఉపనిషత్తులో ప్రాణం ప్రజాపతికి అన్నముగా చెప్పబడి నది. దాని విభూతియు వివరించబడినది. "అథైతస్య ప్రాణస్యాప శ్శరీరం జ్యోతీ రూప మసౌ చంద్రస్తద్యావానేవ ప్రాణాస్తావత్య ఆపస్తావానసౌ చంద్రస్త ఏతేసర్వఏవ సమాస్సర్వేనన్తాఃసయోహైతా నన్తవత ఉపాస్తే ఉన్త వన్తఁగ్ం సలోకం జయత్యథయో హైతానన్తానుపాస్తే ఉనన్తగ్ం సలోకం జయతి". ఈ ప్రాణము నకు ఉదకములు దేహము; జ్యోతిరూపము—అనగా ప్రకాశరూప మైన కరణము చంద్రుడు. దానియందు—ఆధార ఆధేయములగు జలచంద్రస్వరూపమైన దానియందు—ప్రాణము ఎంత పరిమితి కలది యగుచున్నదో, ఉదకములు అంత పరిమితి కలవియగు చున్నవి. చంద్రుడును అంతే పరిమాణము గలవాడగుచున్నాడు. ఈ వాఙ్మనః ప్రాణములన్నియు సమానములైనవి." అన్నియు అంతములేనివి......"

ఇట్లా ఉపనిషత్ ఋషులు ప్రాణాన్ని గురించి యోచిం చారు. ఈ ప్రాణం అంతంలేనిది. ఇది ఐదువాయువులుగా శరీరంలో ఉంటున్నది. ఈ ఐదు వాయువులున్నూ ఐదు వృత్తులులేక లక్ష ణాలు కలిపి అయిఉన్నాయి. లోకంలో పంచ ప్రాణాలన్నమాటకు అర్థం ఇదే అయివుంటుంది. ఈ ప్రాణం శిశువు. ఆ శిశువునకు యీ శరీరము ఆధానము. ఎందుచేతననగా కార్యాత్మకమైన శరీ రమునందు ప్రాణము ఉంచబడుచున్నది గనుక. ఇచ్చట ప్రత్యా ధానము కూడా వున్నది. ఈ ప్రత్యాధానమనగా నేమి? శరీరము నందు ఇంద్రియములు వానివాని రూపమునుపొంది శబ్దాది విష యములను పొందుటకు ద్వారములవుతూవున్నాయి అయితే ఈ ఇంద్రి యములు ప్రాణమాత్రమునందు చేరివున్నపక్షంలో విషయములను పొందుటకు ద్వారములు కాజాలవు. ఇచ్చట ఉపనిషత్ భాష్య కర్తలు ఒక ఉదాహరణం చెబుతున్నారు. అజాత శత్రువు కాశీ రాజు. ఆయన నిద్రించుచున్న ఒకనిని తన హస్తముతో అటు నిటు పొర్లించి లేపును. అనగా నిద్రించిన వానిని లేపి వానిని తిరిగి జాగ్ర దవస్థకు తెచ్చుటవంటిది యీ ప్రత్యాధానమని అర్థము. విజ్ఞాన మయాత్మ జాగ్రదవస్థయందు శిరఃప్రదేశమునందలి చక్షుశ్శ్రో త్రములు మొదలైన విశేష ప్రదేశములయందు తిరిగి ఉంచబడు తున్నది. ఈ తిరిగి ఉంచబడటము ప్రత్యాధానము మరియు ఈ ప్రాణమునకు అన్నము బలము ఇదే ఉపనిషత్తులో మరియొకచోట "కొందరు ప్రాణమును పరబ్రహ్మమని చెప్పిరి. ఆ ప్రకారము సరికాదు. ఏలన, అన్నము లేకుండ ప్రాణము శోషించి పోవుచున్నది" అనియున్నది మరియు నీ అన్నము, లేక బలము స్థూణముగా చెప్పబడినది. స్థూణమనగా స్తంభము స్తంభము ఆధారముగాగల శిశువువలెనే, ఈ శరీరమునందు ప్రాణమను శిశువు అన్నపానముల వలన పుట్టిన బలము ఆధారముగా గలవాడై యుండుచున్నాడు. ఆ కారణమువలననే ఇచ్చట బలము ప్రాణమని ఉపనిషత్ మంత్రంలో వుంది స్తంభముగా వర్ణితమైనది. మరియు పై మంత్రము నందు అన్నము పలుపు (దామ) క్రింద పేర్కొనబడినది. ఎందువలన? బక్షింపబడిన అన్నము మూడువిధములుగా పరిణమించి ఇంద్రియ సమూహమేరూపముగా కలిగిన శిశువను పేరుగల లింగశరీరమును శరీరమందుంచుటకు కారణమైన స్థూణమను పేరుగల బలమును పుట్టిస్తూవుంది. ఇట్లుగా ఈ అన్నము రెండు విధములుగా పలుపు వలె, ప్రాణశరీరములను మిక్కిలిగా బంధించునది అవుతున్నది. కనుకనే అన్నము "దామ"మని చెప్పబడుతూవుంది.

ఇచ్చట యీ ప్రత్యేక మంత్రమువలనను, దానిపై వ్యాఖ్యాతలు చేసివున్న వివరణమువలనను, లింగశరీరమే ప్రాణమనునదిగా భావించ బడినట్లు తేలుతూవుంది. ఈ లింగ శరీరమునకు ఇంద్రియ సమూ హమే రూపమని ఇచ్చట అర్థప్రతీతి కల్గుతున్నది.

## 2

బృహదారణ్యకంలో ఉద్గీథ బ్రాహ్మణం అని ఒకభాగం వుంది అందులో ఒక విచిత్రమైన కథ చెప్పబడివుంది. అది యీ మంత్రంతో ప్రారంభం అవుతున్నది.

ద్వయాహ ప్రాజాపత్యా
దేవాశ్చాసురాశ్చ తతః
కానీయసా ఏవదేవా
జ్యాయసా అసురాః ; త
ఏషులోకేష్వస్పర్ధన్త ;
తేహ దేవా ఊచు ర్హన్తాసురాన్యజ్ఞ
ఉద్గీథే నాత్యయామేతి''

దేవతలును, రాక్షసులును ప్రజాపతి సంబంధమైనవారు—దేవతలు అల్పమైనవారు. రాక్షసులు అధికమైనవారు. ఈ దేవతలును, ఈ రాక్షసులును లోకముల విషయమై కలహించిరి. ఆ దేతలు ఇప్పుడు యజ్ఞమునందు ఉద్గీథమును అనగా ముఖ్యప్రాణమును స్తోత్రము చేయుటచేత రాక్షసులను అక్రమిద్దామని అనుకున్నారు.

ఆ దేవతలు వాగభిమాన దేవతనుగూర్చి ''నువ్వు మాకొరకు గానము చేయవలసింది'' అని పలికారు. ఆ వాక్కు ''తథేతి'' యని ఆ దేవతలకొరకు మిక్కిలిగా గానం చేసింది. వాక్కునందు ఏది భోగమూ, ఆ భోగమును దేవతలకొరకు గానం చేసింది. తనకొరకు కూడా గానం చేసింది రాక్షసు లిది ఎరిగి, యీ గానముచేతనే, దేవతలు తమ్ము అతిక్రమించగలరని తెలిసి పరుగెత్తుకొనిపోయి, పాపముచేత దానిని కొట్టిరి అది పాపమైనది.

ఆ తరువాత దేవతలు ప్రాణమును గూర్చి ''నీవు మాకొరకు గానము చేయవలసింది'' అన్నారు. ప్రాణము ఆ దేవతల భోగము కొరకు, తన కొరకు గానం చేసింది. రాక్షసులు ఇదియు తెలిసి కొన్నారు. పురుగెత్తుకొనిపోయినారు. పాపముతో దానిని కొట్టి నారు ఏది ఆఘ్రాణించుచున్నదో దానిని కొట్టినారు. అది పాపమైనది.

ఇచ్చట ఒక విషయమున్నది. ఇచ్చట దేవతలు ప్రాణమును ప్రార్థించిరని యున్నది. మంత్రము చివర రాక్షసులు ఘ్రాణమును కొట్టినట్లున్నది. అనగా ఈ మంత్రమునందు దేవతలు ప్రార్థించిన ప్రాణము ఘ్రాణములేక ఘ్రాణదేవతయని అర్థము చేసుకొనవలసి వున్నది.

అనంతరము దేవతలు నేత్రమును గూర్చి తమ కొరకు గానం చేయవలసినదిగా కోరారు. నేత్రము సరేనన్నది. వారి కొరకు, తన కొరకు గానం చేసింది. రాక్షసులిది తెలిసి, ఆ నేత్రమును పాపముతో కొట్టిరి. అది పాపమైనది.

ఇట్లే దేవతలు శ్రోత్రమును, మనస్సును ప్రార్థించిరి. ఆ శ్రోత్రము, ఆమనసు ఆ దేవతల కొరకు, తమ కొరకు గానం చేశాయి. రాక్షసులు వానిని పాపము వలన కొట్టటము అయింది. పాపము వచ్చుటయు జరిగింది. దేవతలు ఇప్పుడు ఆస్యమును ప్రార్థించారు. ప్రాణమును గూర్చి తమ కొరకు గానం చేయవలసింది అన్నారు. ఆస్యమైన ప్రాణము అందుకు అంగీకరించింది. గానం చేసింది. రాక్షసులిది ఎరిగి, ఆస్యమన్న ప్రాణమును గూర్చి పరు గెత్తుకు వచ్చారు. పాపముతో ఆ ఆస్యమును కూడ కొట్టడానికి నిశ్చయించారు. కాని కొట్టలేకపోయారు. పాషాణమునుపొంది మట్టిబెడ్డ ఏవిధంగా అయితే నాశనం అయిపోతుందో, అవిధంగా రాక్షసులు నాశనమైపోయారు. అందుచేత తిరిగిపూర్వము పాపము చేత కొట్టబడిన వాగాదీంద్రియములు దేవతలుగా అయినాయి. అసురులకు పరాభవమైంది.

ఇచ్చట ఒక విశేషంవుంది. పైన చెప్పిన ఉదంతంలో అసురులు ఇంద్రియముల నన్నింటికి పాపముతో కొట్టడం, అవి పాపముతో అపరిశుద్ధం అయిపోవడం వుంది. ఒక్క ఆస్యం మాత్రమే ఇందుకు అపవాదు. ఇచ్చట రాక్షసులు ఆస్యగుహ యందుండెడి ప్రాణమును పాపముతో కొట్టుటకు యత్నం చేశారు. కాని యీ ప్రాణము అసం గము. అందువలన దానిని కొట్టలేకపోయినారు. నిషిద్ధములైన పాపములతో కూడా రాక్షసులు నశించుటవలన వాగాదీంద్రియములు పిండ మాత్రమైన దేహమునందలి ఇంద్రియ గోళముల యందు స్వాభిమానమును వదిలి అగ్న్యాది స్వరూపముగా నుండెడి దేవత్వాన్ని పొందాయి. ఇచ్చట యీ కథలో సర్వేంద్రియములకు ముఖ్య ప్రాణమునకు వున్న సంబంధం ఎట్లా వుంటుందని బృహదారణ్యకంలో ఉహించబడిందో తెలుస్తున్నది. అంతేగాక ముఖ్య ప్రాణం అనే దానికి అసంగత్వం అనే లక్షణం కూడా ఒకటి వున్నట్లు ఇచ్చట నిగమనం చేయబడింది.

ఈకథ ఇంకా ఇట్లా కొనసాగించబడి వుంది. ఇప్పుడు తిరిగి దేవత్వమును పొందిన ఇంద్రియములు ముఖ్య ప్రాణము గురించి ఆలోచన చేశాయి. తమకు యీ దేవత్వాన్ని ఇచ్చింది ఆప్రాణమే కదా? ఆ ప్రాణం స్వరూపం ఏమిటి? అది ఎచ్చట వున్నది? ఇట్లా విచారణ. ఈ ఇంద్రియము లన్నియు ముఖ మధ్య మందున్న ప్రాణమును పొందాయి. అందువలన ఈ ప్రాణానికి ''ఆయస్య''మని, కార్యకారణాలైన సర్వావయవాలలో శ్రేష్ఠమైన ఆత్మ అవడం వలన ఆంగిరసమని ప్రసిద్ధికి ఎక్కింది. ఈ అంగిరసమన్న విష యాన్ని ఉపనిషత్తుఇట్లా చెప్పింది. ''ఆంగిరసః అంగానాంహి రసం''

ఇంకో మంత్రంలో ముఖ్యప్రాణం వాయువు ఎట్లా అయిందో బృహదారణ్యకం వివరిస్తున్నది. ''అథప్రాణమత్యవహత్సయదా మృత్యుమత్యవముచ్యత స వాయురభవత్సోయంవాయుఃపరేణ మృత్యు మతిక్రాన్తః పవతే''. ప్రాణము అనంతరము మృత్యువును అతి క్రమించి ప్రాణవాయువును వహించెను. ఆప్రాణవాయువు అప్పుడు వాయువు ఆయెను. ప్రసిద్ధమగు వాయువు మృత్యువు లేకనే అతిక్ర మించినదై వీచుచున్నది. ఈ ప్రాణము దేహేంద్రియాది సముదాయ మును ధరించుచున్నట్లు కూడా ఋషులు ఊహ చేశారు. వారి ఊహా ప్రపంచం ఇక్కడ యీవిధంగా నడిచింది. ప్రాణులు అనగా ప్రాణ

ములు గలవారు అన్నం తింటున్నారు. అనగా ఆ అన్నము ప్రాణము చేతనే తినబడుచున్నది. ఈ వాదం ఇంతటితో ఆగలేదు. బృహదారణ్యకం యీ వాదాన్ని ఇంకా ఇట్లా కొనసాగించింది ప్రాణులు తినుచున్న అన్నాన్ని ప్రాణమే తింటున్నది గనుక, ఆప్రాణం శరీరాకారముగా పరిణమించిన అన్నాద్యమునందు ప్రతిష్ఠను పొందుతూ వుంది. ఈ అన్నము కోసము ముఖ్యప్రాణము ఉపాసన చేయుటను గమనించిన వాగాది ఇంద్రియములు అనగా వాగింద్రియము మొదలైన దేవతలు ప్రాణమును సమీపించి ఇట్లా అన్నాయి:

"ఓ ప్రాణమా! ఏది అన్నమో, ఆ అన్నమును గూర్చి నీకొరకు గానం చేసుకున్నావు. మిక్కిలి గానముచే అన్నమును స్వాధీనపరచుకున్నావు. ఇప్పుడు మమ్ములను కూడా అన్నము నందు పొందింపచెయ్యి."

అప్పుడు ప్రాణం వారితో ఇట్లా అన్నది· "మీరు నన్ను అన్నమును కోరుతున్నారు. మీరు అన్నమును కోరిన వారైతే, నన్ను అంతటను అభిముఖముగా ప్రవేశించండి"

ప్రాణము అనిన ఈ మాటలు విని వాగాది ఇంద్రియ దేవతలు ఆప్రాణమును గూర్చి పరిసమన్తంగా ప్రవేశించాయి. ఇట్లా లోకము ప్రాణముచేత యే అన్నాన్ని తింటున్నదో, ఆ అన్నమే ఇంద్రియములకు కూడా అన్నం అవుతున్నది.

ఈ కథలో ప్రాణానికి, ఇంద్రియాలకు వున్నట్లు వారు భావించిన సంబంధాన్ని బృహదారణ్యకం చెప్పిన తాత్వికులు విశదీకరించారు. ఇన్ని రకాలైన కారణాలను పురస్కరించుకొని ఈతాత్వికులు ప్రాణాన్ని అంగిరసంగా స్థాపించారు. "సః ఆయాస్యః ఆఙ్గిరసః అఙ్గానాం హి రసః, ప్రాణవా అఙ్గానాం రసః కథం ;ప్రాణో హివాఙ్గానాం రసః తస్మాత్ యస్మాత్ కస్మాత్ అఙ్గాత్ ప్రాణః ఉత్క్రామతి తత్ ఏవతత్ శుష్యతి, ఏషః వా అఙ్గానం రసః"

ఇచ్చట ప్రాణమున కాంగిరసత్వము చెప్పబడినది. ప్రాణము సమస్త అవయవములకు రస స్వరూపముగా నున్నది. ఏ అవయవము వల్లనైనను ప్రాణము పోయెనేని, అక్కడనే ఆ అవయవము ఎండిపోతున్నది. ఆ కారణము నుండియే ప్రాణము అవయవములకు రస స్వరూపమైనది. అందుచేతనే ప్రాణము అంగములకు అంగిరసమని చెప్పబడుతున్నది.

ఇట్లా ప్రాణాన్ని గూర్చిన విచారం యీ ఉపనిషత్తులో మరికొంత కూడా వుంది. అయితే అది అంతా ఉపాసనాభాగం. అంతా 'Mysticism'. కాని ఇంతవరకు జరిగిన విచారణలో ప్రాణం యొక్క గుణ విజ్ఞాన ఫలములు వివరింపబడినాయి. బృహదాణ్యకము నాటికి మన మేధావులు ప్రాణాన్ని గూర్చి చేసిన మీమాంస, విజిజ్ఞాస ఇందులో కన్పిస్తుంది. ఇదేవిధంగా తైత్తిరీయము, ముండకము మొదలైన ఉపనిషత్తులలో కూడా యీ ప్రాణాన్ని గురించిన మీమాంస కొంత జరిగి వుంది తైత్తిరీయం ఆనందవల్లిలో ప్రాణానికి సంబంధించిన కొన్ని మంత్రాలు వున్నాయి. 'అన్నాద్వై ప్రజాః' అని ప్రారంభమైన మంత్రంలో "అన్యోంతర...ప్రాణమయః" మొదలైన వాక్యాలలో యీ ప్రాణ మీమాంస జరిగింది. ఆవాక్యాలు ఇట్లా వున్నాయి:

"అన్యోంతర ఆత్మాప్రాణమయః, తేనైషపూర్ణః, సవాఏష పురుషవిధః, ఏవ; తస్యపురుషవిధతాం; అన్వయం పురుషవిధః; తస్యప్రాణ ఏవశిరః; వ్యానోదక్షిణః పక్షః; అపాన ఉత్తరఃపక్షః; ఆకాశఆత్మా; పృధివీపుచ్ఛం ప్రతిష్ఠా ; తదప్యేషశ్లోకో భవతి.".

అన్నమయ ప్రాణమయ కోశాది వివరణ జరుగుతున్న సందర్భంలో ఈ ప్రాణం ప్రసక్తి వస్తుంది. ఈ మంత్రం అర్థం ఇది: "అట్టి అన్నరసమయమైన దేహముకంటె ఇతరమైన ప్రాణమైన ఆత్మగలదు అది అన్తరఆత్మ. అనగా అన్నమయకోశములోనిది ప్రాణమయకోశమని అర్థము ఈ ప్రాణమయముచేత అన్నమయము వ్యాపింపబడినది. ఆ యీ ప్రాణమయము కూడా పురుషాకృతి కలదే. ఈ అన్నమయముయొక్క పురుషాకారత్వమును అనుకరించి ప్రాణమయముకూడ పురుషాకారము కలదియే అయినది ఈ ప్రాణమునకు ప్రాణవాయువే శిరస్సు. వ్యానవాయువే దక్షిణ పక్షము; అపానమే ఉత్తరపక్షము. ఆకాశమే ఆత్మ. అనగా ధారకమైనది. పృధివి పుచ్ఛము; ప్రతిష్ఠము; అనగా ఆధారస్థానము. ఈ అర్థమునందు ఈ ఋక్కు అగుచున్నది."

ఈ మంత్రాన్ని ఆచార్య శంకరులు ఇట్లా వ్యాఖ్యానించారు· (శ్రీ ఎస్. సీతారామశాస్త్రిగారి ఇంగ్లీషు అనువాదం ఇస్తున్నాను.)

"From such, the soul made of the essense of food" etc.-different from this soul above discribed, there is an inner Atman made of Prana — also falsely imagined like the body to be the Atman. Prana is Vayu. Pranamaya made of Vayu. The soul made of food is full of the soul made of Vayu, just as bellows full of air The soul made of Vayu is of the form of man with the head, hands etc. Is it so of itself? The answer is 'no' It is well known that the soul made of the essence of food, is of the human form The soul made of Vayu is of the form of man, after the shape of that made food, just as the image formed by pouring (the melted metal) into the Crucible. It is not of that form by itself Thus the form of the inner one is the human form, after the form of the outer one, and each outer one is full of that which is within; of it is asked "how then is it of the human form" this is the answer Of this soul made of Vayu, Prana the gas expired through the mouth and nose is made to be the head, on the strength of this




# యూనిట్లు

## ఒక అద్వితీయమైన పెట్టుబడి విధానం

తెలివైన పెట్టుబడిదారులుగా మీరు, వీలయినంత తక్కువ ప్రమాదంతో, మీ పొదుపులమీద వీలయినంత అధికమైన రాబడిని సంపాదించాలని కోరుతారు.

యూనిట్లలో పెట్టుబడి పెట్టడం వల్లనే మీరు యీ విధంగా చేయగలుగుతారు.

★ యూనిట్లు కేవలము భద్రమైనవే కాక, మీ పొదుపులు పెరగడానికి కూడా సహాయపడ్తాయి.

★ యూనిట్లు మీకు మంచి లాభాలను తెస్తాయి (క్రితం సంవత్సరం 6.1%) ఇతర విధములయిన కొన్ని పెట్టుబడులలాగ కాక, వీటివల్ల మీకు అమూల్యమయిన పన్ను మినహాయింపులు లభిస్తాయి.

★ మీకు సొమ్ము అవసరమయితే, యూనిట్లను మీరు సులభంగా నగదుగా మార్చుకోవచ్చును.

***యూనిట్లులో పెట్టుబడి చేయండి! ఈ సంవత్సరం హెచ్చు రాబడి వచ్చే అవకాశాలువున్నాయి!***

పెద్ద పెద్ద బ్యాంకుల బ్రాంచి లన్నింటిలోను, మీరు యూనిట్లను కొనవచ్చును.

ఉత్తమమైన దానిలో పెట్టుబడి పెట్టండి-యూనిట్ ట్రస్ట్‌లో పెట్టుబడి పెట్టండి

# యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

45, వీర్ నారిమాన్ రోడ్, బొంబాయి-1.

రిజర్వు బ్యాంకు బిల్డింగ్, ఫోర్టు గ్లాసిస్,
నార్త్ బీచ్ రోడ్,
మద్రాసు-1.

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎనెక్స్,
13, నేతాజీ సుభాష్ రోడ్,
కలకత్తా-1.

DA-65/663

**Hymn. The sides etc are also fancied on the strength of the Text Vyana, the gas that pervades the whole body, is the right side, Apana is the left side A gas in Akasa with a peculiar function called samana is the trunk. It is said to be the trunk in relation to the other gases around, becasuse it is in their midst. It is well known in the Vedas that the middle is Atman "Atman is in the middle of these limbs" The earth is the supporting tail. The Earth is the supporting deity presiding over the earth, the supporter of the life of the body, because it is the cause of its existance Because another text says "This (Earth) supporting the Apana of the man". otherwise, by the action of Udana, man will have to go up or by his weight the body will have to fall down Therefore the earth is the supporting tail of the soul made of Prana. To the same effect in the matter of the soul made of Prana is said in this Hymn"**

ఇక్కడ గూడా ప్రాణము వాయువుగానే సంభావించబడింది. ఇదే "వల్లి"లో ఇంకో వాక్యంలో సర్వులైన దేవతలున్నూ—ఆచార్య శంకరులు-ఈ దేవతలనగా ఇంద్రియములనితమ తైత్తిరీయభాష్యంలో అర్థంచెప్పారు—ప్రాణవాయువునుఅనుసరించిజీవిస్తున్నారు అనివుంది. మనుష్యులు, పశువులు కూడా అంతే సమస్తభూతములకు ప్రాణమే ఆయుస్సు. అందుచేతనే తైత్తిరీయఋషులు ప్రాణాన్ని "సర్వాయుషం" అన్నారు అనగా సర్వభూతములకు 'ఆయుసు' అని అర్థం.

ఈ మంత్రాన్ని వ్యాఖ్యానిస్తూ శంకరులు ఇట్లు వ్రాశారు. (పైన ఇచ్చిన ఇంగ్లీషు తర్జుమా గ్రంథంనుంచే ఈ భాగం కూడా ఉట్టంకిస్తున్నాను )

**"The Gods live after Prana The Gods......do the act of breathing,.. after Prana which is of the nature of air and which has the power of breathing, that is, becoming themselves Prana Or since the chapter deals with soul, the Devas, that is, the senses are endowed with life, by the life of Prana"**

దీనినిబట్టి గూడా ప్రాణము వాయువే అని తెలుచున్నది. అందుకే గాలిని పీల్చి బిగపడట్టడం, నియమించడం మొదలైన హఠయోగ ప్రక్రియలకు ప్రాణాయామం అని పేరు వచ్చింది. పంచప్రాణాలన్ను ప్రాణాదికమ్మైన పంచవాయువులనే అర్థం.

## 3

ఐతిరేయ ఉపనిషత్తులో గూడా ప్రాణాన్నిగూర్చిన ప్రసక్తి కొంత వుంది. కాని ఈ విషయాన్ని బృహదారణ్యకం తర్వాత, కొంత ఎక్కువగా ప్రశ్నోపనిషత్తులో చెప్పబడివుంది భరద్వాజుడైన సుకేశుడు, శిబికొడుకైన సత్యకాముడు, గార్గ్యుడైన సౌర్యాయణి, అశ్వలాయణుని కుమారుడు కౌసల్యుడు, వైదర్భుడైన భార్గవుడు, కాత్యాయనకబంధుడు, వీరు ప్రసిద్ధులు. బ్రహ్మపరులు. బ్రహ్మనిష్ఠులు. పరబ్రహ్మముకొరకు అన్వేషిస్తూ భగవంతుడైన పిప్పిలాదుని దగ్గరకు వచ్చారు. ఆయన వారిని ఒక్క సంవత్సరం గురు శుశ్రూష చేయమన్నాడు. ఆ తర్వాత మీాయిష్టం వచ్చిన ప్రశ్న అడగవచ్చునన్నాడు. సంవత్సరం గడిచింది. కబంధుడు గురువును సమీపించి ఈ ప్రజలెట్లు పుడుతున్నారు—అని ప్రశ్నించాడు. ఇక్కడ ప్రజలనగా జగత్తని అర్థం. ఈ ప్రశ్నకు పిప్పిలాదుడు ఇట్లా సమాధానం చెప్పాడు. "ప్రజాపతి జగత్తును ఉత్పత్తి చేయవలెనని సంకల్పించాడు. అట్లు సంకల్పించి "రయి"ని, 'ప్రాణా'న్ని పుట్టించాడు. ఈ మిధునమువలన జగత్తు అనేక విధములుగా కల్గినదట

వైదర్భుడైన భార్గవుని రెండవ ప్రశ్నము. ఆయన అడిగిన ప్రశ్నమిది. "ఎందరు దేవతలు దేహమును ధరిస్తున్నారు? ఎందరు దీనిని ప్రకాశింపచేస్తున్నారు? ఎవ్వడు వారిలో శ్రేష్ఠుడు?"

పిప్పిలాదుని సమాధానమిది· ఆకాశము, వాయువు, అగ్ని జలము, పృధివి, వాఙ్మయనశ్చక్షు శ్రోత్రములు—మేము ఈ శరీరమును భరిస్తున్నాము అని స్పష్టంగా చెప్పుకున్నాయి. అయితే ఇట్లా చెప్పిన దేవతలకు వరిష్ఠమ్మైన ప్రాణం ఇట్లా చెప్పింది. మీారు మోహాన్ని పొందవద్దు. ఈ శరీరాన్ని పట్టుకొని, నన్ను పంచధా విభజించుకొని ధరిస్తున్నాను. ప్రాణం ఇట్లా అనగా దేవతలు నమ్మలేకపోయారు. అప్పుడు ప్రాణం పైకి ఎగురబోగా ఇతరులు సర్వులున్నూ కూడా అట్లాగే లేచారు. ప్రాణము ప్రతిష్ఠమానముకాగా, వారు ప్రతిష్ఠితులైనారు. మధుకరరాజు ననుసరించి మక్షికములు ఎగిరిపోతూవుంటాయి. ఆరాజు ప్రతిష్ఠితుడుకాగా, అవియు ప్రతిష్ఠితములవుతాయి. అనగా నిలిచి ఉంటాయి ఇక్కడ అదే విధముగా జరిగింది అప్పుడు వాఙ్మనశ్చక్షు శ్రోత్రాలు ప్రాణాన్ని స్తుతించాయి.

ఇప్పుడు ఈ స్తుతిలో "త్వం మాతరిశ్వ"అని ప్రాణము చెప్పబడియున్నది.

ఈ ఉపనిషత్తునందు మూడవ ప్రశ్నమున కౌసల్యుడు పిప్పిలాదుని ఇట్లా ప్రశ్నించాడు "భగవన్! కుత ఏష ప్రాణో జాయతే? కధ మాయాత్యస్మిన్ శరీరం? ఆత్మానం ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే? కేన ఉత్క్రమతే? కథం బాహ్యం అభిధత్తే? కథం అధ్యాత్మమితి?" ఈ ప్రశ్నములనుబట్టి ప్రాణ విజిజ్ఞాసను ఏవిధంగా పూర్వులు జరిపిఉన్నదీ తెలుస్తుంది దేనివలన యీ ప్రాణం పుడుతున్నది? ఎట్లు యీ శరీరమును ప్రవేశించుచున్నది? తనను విభజించుకొని ఎట్లు ప్రతిష్ఠితమవుతున్నది? దేనినుండి ఉత్క్రమణం చేస్తున్నది?—ఈ మొదలైన ప్రశ్నములు ఇప్పుడు కూడా శాస్త్రవేత్తలను వేధిస్తూనే ఉన్నాయి. కౌసల్యుని యీ ప్రశ్నమును

పిప్పిలాదుడే అతిప్రశ్నలన్నాడు. అతిప్రశ్న యనగా మిక్కిలి వేర్పు గల ప్రశ్నలని అర్థం. ఈ ప్రశ్నలకు పిప్పిలాదు డిచ్చిన సమాధానం ఇట్లా వుంది: పరమాత్మవలన ప్రాణం పుడుతోంది. పురుషుణ్ణి అనుసరించి నీడ ఏవిధంగా ఉంటున్నదో, జీవుణ్ణి మనస్సు ఏవిధంగా అప్రయత్నంగా చేరుతున్నదో అదేవిధంగా ప్రాణం శరీరాన్ని పొందు తున్నది. ఈ ప్రాణము తక్కిన ప్రాణములను స్వామాట్టు అధికృతు లనువలె, అట్లా వేరు వేరుగా నియమిస్తున్నది. పాయూపస్థముల యందు ఉదానం వర్తిస్తున్నది. ప్రాణవాయువు స్వయముగా నేత్ర ములయందు, చెవులయందు, ముఖనాసికములయందు ప్రతిష్ఠను పొందియున్నది. మధ్యమున.సమాన వాయువువుంటున్నది. సమానము అన్నమును హుతముచేసి, సమముగా పొందిస్తున్నది. హృదయము నుండి ఏకశతముల్లైన నాడులు బయల్వెడలుతున్నాయి. ప్రతి ఒక నాడియు వంద వంద నాడులవుతున్నది. ప్రతి ఒక్క ఇట్టి నాడికిని ద్వాసప్తర్ద్వాసప్తతినాడులు కల్గుతున్నాయి. వ్యానమన్నవాయువు ఈ నాడులలో సంచరిస్తూవున్నది. ఉదానము సుషుమ్నానాడి ద్వారమున ఊర్ధ్వ సంచారం చేస్తున్నది. బాహ్యప్రాణము సూర్యుడై ఉద యుస్తున్నది. ఈ బాహ్య వాయువు వ్యానము. తేజస్సే ఉదానము.''

ఇట్లా ఎంత సేపు చెప్పినా, ఉపనిషత్తులలో ప్రాణపానాది వాయుప్రపంచమే ప్రాణము, దానియొక్క విభజనము క్రింద చెప్పబడుతూ వచ్చాయి.

ఉత్పత్తి మాయతిం స్థానం విభత్వం చైవ పంచధా
అన్న చోట కూడ ప్రాణమునకు పంచరూప ప్రసక్తియే వుంది.

ప్రశ్నోపనిషత్తులోని నాల్గవ ప్రశ్నలో ప్రాణములు అగ్ను లుగ కూడ చెప్పబడినాయి. ''ప్రాణాగ్నయ ఏవై తస్మిన్పురే జాగ్రతి''. దేహంఅనే పురంలో ప్రాణాలనే అగ్నులు జాగరితం అవుతున్నాయి. షష్ఠప్రశ్నమునందు భారద్వాజుడైన సుకేశుని ప్రశ్నకు సమాధా నంగా పిప్పిలాదు డిట్లా చెబుతాడు: ''స ప్రాణం అసృజత, ప్రాణాత్ శ్రద్ధాం, ఖం, వాయుః, జ్యోతిః, ఆపః, పృథివీ, ఇంద్రియం, మనః అన్నం, అన్నాత్ వీర్యం, తపః మంత్రాః కర్మ, లోకాః, లోకేషుచ నామచ. ఇవి పదునారు కళలుగా చెప్పబడినాయి. దాదాపు యీ అన్నింటికి ప్రాణం కారణంగా చెప్పబడింది. జగత్తంతా ప్రాణమునకు అధీనమై వుంది. ప్రాణంయొక్క వశమై వుంది. జగత్తునందు స్వర్గమునందు ఏది ప్రతిష్ఠితమై వున్నదో ఆ అంతయు ప్రాణంవశం.

ప్రాణాన్నిగూర్చి ఉపనిషత్తులలో చెప్పినదంతా ఇట్లా వుంది. దీనివలన ప్రాణం ఎట్లా పుట్టిందో, ఆ ప్రాణాన్నిపొంది ప్రాణిజాతం ఎట్లా సముద్భవం చెందిందో ఇక్కడ సోపపత్తికం విరూపణంకాదు. ఋషుల ఊహాబలము, అనుభవబలము, శబ్ద బలము మాత్రం గోచరిస్తాయి. నిజానికి ఆ కాలానికి ప్రాణవిర్భావ వ్యవహారాన్నిగూర్చి శాస్త్రీకట్టుగా ఆలోచించడానికి తగిన ప్రయోగాదికాలు జరిగివుండలేదు. దాదాపు డార్విన్ అనే ఆయన పుట్టి తన సిద్ధాంతాన్ని ప్రపంచీకరించేటంతవరకు, ప్రాణానికి సంబంధించిన ఆలోచనలు, సృష్టిక్రమాన్ని గురించిన ఆలోచనలు వేదాంతంతోను, ఇతరముల్లైన తత్వాలతోను ముడివడివుండేవి. ఇప్పుడు ఉపనిషత్తులలో చెప్పినట్లుగానే ఏవో కథలు యీ ప్రాణావిర్భావాన్ని గురించి చెబుతూ ఉండేవాళ్ళు. కానైతే, యీ ఉపనిషత్తులలో ప్రాణాన్ని గురించినమీమాంస ఆకాలంనాటికి జరగవలసినతీరులో జరిగింది. ఉన్నత మనస్కుడైన మానవుని ఆలోచన యొక్క విషయాన్ని మీమాంసిస్తు న్నప్పుడు, వున్న విజ్ఞాన పరిధులలో ఎంతవరకుపోవచ్చునో అంత వరకుపోయింది. మరి ఇంకోచోట ప్రాణాన్ని గురించి ఇంతగా మీమాంసించిన జాడ అప్పటికి కన్పించదు. ఐతే ఇక్కడ కూడా ప్రకృతికి అతీతమైన శక్తులు ఏవో ఉన్నాయని, ఆ శక్తులవలన యీప్రాణం అన్నది సముత్పన్నం అయిందని చెప్పడమే ఇక్కడావుంది. కొందరు సత్పదార్థంలోంచి సృష్టి ఆరంభమైందంటే, కొందరు అసత్ప దార్థంలోంచి సృష్టి ఆరంభమైనదంటూ వచ్చారు. ఇచ్చట అసత్ అంటే Non Living పదార్థంఅని అర్థం. అజీవద్రవ్యం అని అర్థం. అదేవిధంగా ప్రాణావిర్భావాన్ని గూర్చిగూడా భావిస్తూవచ్చారు. ఈ అసత్తునుంచి ప్రాణం అవిర్భావం చెందింది అనడానికి వీరు కొన్ని ఉపపత్తులను కూడా చూపి, అది ప్రమేయ రహితంగా ఆవిర్భ వించిందని అంటూ వచ్చారు. ఈ ఆలోచనలు, యీ విజిజ్ఞాస ప్రారంభం అయ్యేనాటికి అధునాతన విజ్ఞాన యుగావతరణం జరుగుతున్నది. Natural Philosophy ఆవిర్భవిస్తున్నది.

ఇది ఇట్లావుంచి అసత్తునుంచి ప్రాణా విర్భావము, ప్రాణ్యా విర్భావము జరిగివుంటుందని వాదించిన సిద్ధాంతుల పద్ధతిని చూద్దాము. వీరు ఇట్లా అంటారు. రొట్టెలు పాసిపోయి బూజు పడుతున్నాయి. మాంసంచెడి పురుగులు పడుతున్నది. నీరు నిల్వవుండి పోయినప్పుడు కూడా పురుగులు పడుతుంది. ఇవి అన్నీ ప్రాణిజాతాలే గదా. ఇవి ప్రమేయ రహితంగా, వాటి అంతట అవి సముద్భవిస్తు న్నవి. గ్రీకు తాత్వికులలో ప్రాచీనుల్లైన కొందరు అనాగ్జగోరస్, ఎంపిడికిల్స్, ఎపిక్యురస్, అరిస్టాటిల్ మొదల్లైన మహాపురుషులే యీ రకమైన ప్రాణావిర్భావ సిద్ధాంతాన్ని ఆకాలంలో విశ్వసించారు. మధ్యయుగాల అప్పుడు బాతుచెట్టును Goose tree గురించి, విజిటబుల్లాంబ్‌ను గురించి, హెూమూన్క్యూలస్‌ను గురించి మాట్లాడుతూ వుండేవారు. అలగ్జాండర్నెక్కాం అనే ఆయన 12 వ శతాబ్దంలో ఒక కొత్త సిద్ధాంతం లేవదీశారు. అది పక్షుల ఆవిర్భావానికి సంబంధించింది. ఆ పక్షులు చెట్లనుంచి పుట్టా యని ఆయన అన్నారు. సముద్రపుజలం ఉప్పగా ఉంటుందిగనుక, ఆ ఉప్పనితనం వచ్చి చెట్లకు తగలగానే, పక్షులు ఆ చెట్లలోంచి పుట్టుకు వచ్చాయి అన్నారు. మాంసం వున్నదంటే దానికి జవి

ప్రానం కాయగూరలే నన్న నమ్మకం ఒకప్పుడు మహా ప్రచారంలో వుండేది. ఆ నమ్మకం ఎంతవరకు పోయిందంటే, ఐరోపాలో జనం ఉపవాస దినాలలో కూడా మాంసాన్ని స్వీకరించడం ఆరంభం చేశారు. పోపు కల్పించుకొని, ఒక శ్రీముఖాన్ని జారీచేస్తేనేగాని, ఆ అలవాటు తప్పిపోలేదు.

ఈ ప్రాణావిర్భావ ఉదంతాలలో 'హోమూన్‌క్యులస్'కు సంబంధించిన సంగతి చాలా విచిత్రమైనది. హోమూన్‌క్యూలస్ అనగా పొట్టిమనిషి, లేక వామనుడు అని అర్థము. ఈ రకం మనిషి సృష్టిని గురించిన రహస్యాన్ని పారసెల్సస్ బయటపెట్టివేశాడు. ఇతను పదిహేనవ శతాబ్దికి చెందిన వ్యక్తి. రసవాది. అతను యీ "పొట్టి మనిషి"ని సృష్టించడం ఎట్లాగో తెల్పిఉన్నాడు. అందుకు ఒక చిట్కావుంది. మనుష్యుడు ఉన్నాడు. అతని వీర్యము వున్నది. ఆ వీర్యమును తీసుకొని, ఒక ప్రత్యేకమైన పాత్రలోవుంచి, కొన్ని కొన్ని ప్రక్రియలు జరిపితే, ఆ పాత్రలో ఒక "చిట్టిమనిషి" ఉద్భవిస్తాడు. ఈ ప్రక్రియలకు ఒక పద్ధతి, ఒక కాల వ్యవధి కూడా ఉన్నాయి. ఈ అన్ని విషయాలను పదిహేనవ శతాబ్దపు ఆ రసవాది పేర్కొని ఉన్నాడు.

16 వ శతాబ్దంలో ఫాన్ హెల్‌మాంట్ అనే శాస్త్రజ్ఞుడు ఇంకో సిద్ధాంతం లేవదీశాడు. ఆయన బెల్జియంవాడు. ఆయన తెచ్చిపెట్టిన సిద్ధాంతం విచిత్రంగా వుంటుంది. అయినా చెప్పక తప్పదు. గోధుమలు ఉన్నాయి. అవి మొలకలు వేస్తాయి. ఆ మొలకలలోంచి ఎలుకలు జన్మిస్తున్నాయని హెల్మాంట్ సిద్ధాంతీకరించాడు. ఇక్కడ సృష్టి శక్తి మానవుని స్వేదజలావిది. ఎట్లాగంటేను, మనుష్యుడు తొడిగి విడిచిన చొక్కావుంది. ఇటువంటి చొక్కాను తీసుకొని, గోధుమ విత్తులతోవున్న ఒక పాత్రలో పడవెయ్యాలి. అట్లా 21 రోజులు ఆ పాత్రను అట్టే పెట్టాలి. అప్పుడు అక్కడ ఆ గోధుమ, మలినకంచుక సంయోగం వలన ఎలుకలు, అవి చిట్టి ఎలుకలే అందాము, పుట్టుకు వస్తాయి.

ప్రమేయరహితమైన ఇట్టిసృష్టిక్రమాన్ని ఆరోజుల్లో వట్టి మామూలువాళ్ళేకాదు, శాస్త్రవేత్తలలో హేమా హేమీలు గూడా విశ్వసించేవాళ్లు. తాత్వికులుకూడా నమ్మేవాళ్లు హోర్వేవున్నారు. ఆయన రక్త ప్రసరణ రహస్యాలను తెలుసుకున్న విజ్ఞానశాస్త్రవేత్త. డికార్ట్ ఉన్నారు. ఆయన అర్వాచిన పాశ్చాత్య తాత్విక ప్రపంచానికి సృష్టికర్తవంటివాడు. న్యూటన్ వున్నారు. ఆయన లోక ప్రఖ్యాతిగాంచిన భౌతిక విజ్ఞానవేత్త. వీరందరుగూడా ప్రమేయ రహితంగా ప్రాణిసర్గం జరుగుతున్నదని గట్టిగా విశ్వసించారు.

ప్రమేయరహితమైన ఇట్టి స్వయంసృష్టి సిద్ధాంతం మొట్ట మొదటిసారిగా ఒక ఇటాలియన్ శాస్త్రవేత్త చేతులలో గట్టి దెబ్బ తిన్నది. ఆయన పేరు ఫ్రాన్సిస్కోరేది. పదిహేడవ శతాబ్దానికి చెందినవాడు. అసత్తు అయిన అనగా జీవద్రవ్యముగాని పదార్థమునుంచి ప్రాణిజాతం ఆవిర్భావం చెందుతున్నదనే యీ అసత్‌స్వయం సృష్టివాదాన్ని రేది పూర్వపక్షం చేశాడు. నాశనం చేశాడు. అందుకు తగు దృష్టాంతాలు చూపించాడు కూడాను. మాంసము ముక్కను తీసుకొని, ఈగలు చొరబడి గుడ్లు పెట్టడానికి వీలులేనిచోట పెట్టినట్లయితే అది క్రిమికుల సంకులం కావడంలేదు.

మాంసమువేసి కాచిన చారు ఉన్నది. దీనిని ఇంగ్లీషులో soup అంటారు. అట్టి చారును గనుక, అది మరుగుతూవుండగా గాలి దూరకుండా సీలువేసినట్లయితే, అది పురుగు పట్టకుండా ఎప్పుడూ పరిశుభ్రంగా ఉంటుంది. ఈ విషయాన్ని 18 వ శతాబ్దంలో స్పెల్లాంజని అనే శాస్త్రవేత్త నిదర్శన పూర్వకంగా సిద్ధాంతీకరించాడు.

ఈ స్వయంసృష్టి వాదానికి అంతటితో నిధనం సంప్రాప్తం కాలేదు. దానికి అంత్యక్రియలు చేసినవాడు లూయీ పాశ్చర్. ఫ్రెంచి శాస్త్రవేత్త. 1862 లో ఆయన కొన్ని వ్యాసాలు ప్రకటించారు. ఆ వ్యాసాలు ఆయన చేసివున్న ప్రయోగాలకు సంబంధించినవి. వాటివలన తేలిన విషయం ఇది. గాలిచేత కలుషితముకాని ద్రావకమునందుగాని, కషాయములలోగాని అల్ప ప్రాణిజాతం ఆవిర్భవించడంలేదు. ఆ కషాయములు, ఆ ద్రావకములు వాయువుచేత కలుషితములైనప్పుడు మాత్రమే వానిలో అల్ప ప్రాణిజాతం సముత్పన్నం అవుతున్నది. దీనిని నిరూపించడానికి పాశ్చర్ ఒకపని చేశారు. ఒక గొట్టమునిండా గంధకపు దూదినికూర్చి, దానిని నోటియందు పెట్టుకొని, ఆ నోటితో గాలిని ఎగపీల్చారు. తరువాత ఆ గంధకపు దూదిని ఈథర్, ఆల్కహోల్ మిశ్రమములో వేశారు. అది ఆ మిశ్రమములో కరిగిపోయింది. కొత్తగా ఏర్పడిన ద్రావకమును సూక్ష్మదర్శిని సహాయముతో పరిశీలన చేయగా అందులో అల్పప్రాణిజాతం అగుపించింది.

ఇట్లా యీ అసత్‌స్వయంసృష్టివాదం ధూతమైపోయింది. అప్పుడు తిరిగి ప్రాణావిర్భావ రహస్య వేదనములైన కొత్త యుక్తులు, సిద్ధాంతాలు అవసరమైనాయి. పాశ్చర్ చేసిన ప్రయోగాలు చాలామందిని ఆకర్షించాయి. వారు ఒక అభిప్రాయానికి వచ్చారు. ప్రాణం అన్నది ఎక్కడినుంచోరాదు. ఎప్పుడు వుంటూనే వుంటుంది. ఇట్టి భావనతో వీరు ప్రాణావిర్భావానికి సంబంధించి ఒక విధమైన సాంతత్యవాదాన్ని ఆరంభం చేశారు. ఈ వాదం సారాంశం ఇది. పదార్థంలాగానే ప్రాణం కూడా శాశ్వతమైంది. అనంతము. దానికి ఆకృతిభేదంచేతవచ్చే మార్పుతప్ప అసలు మార్పుఅంటూ ఏమీలేదు. బ్రిటిష్ శాస్త్రవేత్త లార్డ్ కాల్విన్ (1871) ఈ సిద్ధాంతాన్ని నమ్మినవారిలో అత్యంతము ప్రసిద్ధులు.

ఆ తర్వాత కొన్ని కొత్త విషయాలు తెలిశాయి. భూమి ఉన్నదంటే, అది పూర్వం ఎప్పుడో ఆదిలో ఉన్నట్లు ఇప్పుడులేదు. అందులో ఎన్నో మార్పులు జరిగాయి. నిజం చెప్పాలంటే ఇప్పటి భూమికి, అప్పటి భూమికి పొత్తేలేదు. అది అగ్నిద్రవాన్ని పోతపోసిన విధంగా ఉండేది. ఇది ఇట్లా అని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. అప్పుడు ప్రాణావిర్భావాన్ని గురించిన సిద్ధాంతాలలో కూడామార్పు వచ్చింది. "Cosmozoa" సిద్ధాంతం ప్రతిపాదించబడింది. దీని సారాంశం ఇది. వేడిగావున్న భూమి రాను రాను చల్లబడింది ఎంత చల్లబడినదంటే ప్రాణ్యుత్పత్తి జరగడానికి వీలు ఏర్పడే అంతగా చల్లబడింది. అప్పుడు, అటువంటి స్థితి యీ భూమికి సంప్రాప్తమైనప్పుడు నక్షత్ర మండలాంతర్గతదేశంనుంచి ప్రాణం అన్నది భూమిమీదకు అవతరణం చెందింది. దీనిని మనం ప్రాణావతరణ సిద్ధాంతం అనవచ్చు.

ఈ సిద్ధాంతాన్ని జర్మన్ శాస్త్రజ్ఞులు 'రిచర్', ఫాన్ హెల్మ్ హోల్ట్జ్‌లు, స్వీడిష్ శాస్త్రవేత్త యస్. ఆర్రేనియస్ గట్టిగా విశ్వసించారు. వీరిలో ఆర్రేనియస్ నమ్మకం చాలాదూరందాకా పోయింది.

అగ్ని పర్వతాలు పగిలడంవలన జరిగే క్రియాకలాపంలో సూక్ష్మప్రాణికాయాలు (Spores) అంతరిక్షంలో ప్రవేశించడం జరుగుతున్నది. ఆర్రేనియస్ ఏమి చేశారంటే, ఈ సూక్ష్మ ప్రాణిజాతం అంతరిక్షంలో ఏ పద్ధతిలో సంచారం చేస్తున్నది, భూమియొక్క ఆకర్షణశక్తి అతిక్రమించిపోవడానికి వాటికి ఎంత కాలం పట్టేది, భూమికి అతి సమీపంలోవున్న నక్షత్రాన్ని అవి చేరడానికి ఎన్ని సంవత్సరాలు తీసుకుంటున్నదీ—మొదలైన విషయాలన్నీ లెక్కవేశారు. ఈ Spores భూమ్యాకర్షణ శక్తిని అతిక్రమించడానికి 14 నెలలు పడుతుంది. భూమికి దగ్గరలో వున్న నక్షత్రాన్ని చేరడానికి 9 వేల సంవత్సరాలు పడుతుంది.

ఈ Spore లు సూక్ష్మప్రాణులు. వీటిని ప్రాణపు క్రిములు అనవచ్చు. ఇవి అంతర్గ్రహదేశాలలో ప్రయాణంచేస్తూ ఉన్నప్పుడు, వాటికి రక్ష అంటూ ఏమి ఉన్నది? ఏమీ లేదు. అందువల్ల జీవ కిరణాల (Cosmic rays) కాంతియొక్క వేడిమిలో చిక్కి నిధనం చెందుతాయి. ఎన్నో మార్పులనుగూడా పొందుతాయి. వానియొక్క రసాయనిక వ్యవస్థ పూర్తిగా మారిపోతుంది. అందువల్ల అవతల అంతరిక్షంలో ఎక్కడోవున్న గ్రహ గోళాలలోనుంచి అగ్ని పర్వత క్రియా కలాపంచేత సముద్భూతాలైన సూక్ష్మప్రాణి కాయాలు జీవకిరణ సంవలితమైన ఆకాశావకాశంలో సంచరిస్తూ, ఇంకా తమలోని అల్పప్రాణ శక్తిని మిగుల్చుకొని మన భూమి మీదకు వచ్చాయి, అనడం మూర్ఖంగా కన్పిస్తుంది. అయితే అవతలి గ్రహగోళాలలో జీవజాతంలేదనిమాత్రం ఇందుమూలంగా అనలేము. ఉన్నదనే విశ్వసిద్దాము.

## 5

ఇప్పుడు మనం చూడవలసింది ఈ భూగోళం సంగతి. ఈ భూమిమీద ప్రాణావిర్భావం ఎట్లా జరిగింది అన్న సంగతిని. ఈ సంగతులను పురస్కరించుకొని మొట్ట మొదట కృషి చేసిన వాడు ఏ. ఐ. ఓపెరిన్. ఆయన ప్రాణావిర్భావాన్ని గురించి తనకు ముందు ప్రచారంలోవున్న సర్వ సిద్ధాంతాలను చేర్చి అవలోడనం చేసి, ప్రాణావిర్భావ పరిణామాన్ని గురించి బ్రహ్మాండమైన సిద్ధాంతాన్ని ఇంకోదాన్ని ప్రతిపాదించారు.

ఆ సిద్ధాంతం సారాంశం ఇది . ఆదికాలంలో ప్రాణిలక్షణం ఇప్పటిలాగాలేదు. అప్పటి జీవజాతానికి, ఇప్పటి జీవజాతానికి ఎందులోనూ పోలికేలేదు అప్పుడు ఆ అనాదికాలంలో ప్రాణి స్వరూపం జీవత్ ద్రవ్యరూపంలో మాత్రమే ఉండేది. ఉదాహరణకు ప్రోటీన్‌లను పేర్కొనవచ్చు. ఆ అనాది జీవత్‌ద్రవ్యములేక సత్‌పదార్థమునుంచి ఇప్పటి జీవలోకం అంతా నిర్మాణం చెందింది. ఈ అనాది జీవత్ పదార్థాలు ఆ ఆదికాలంలో ప్రళయ పయోధులలో (Primival seas) సంభవం చెందుతూ వుండేవి అవి అసత్పదార్థాలైన (In-organic elements) కార్బన్, ఆక్సిజన్, నైట్రొజన్, హైడ్రోజన్ మొదలైనవి ఇది ఇట్లా జరగడానికి కొన్ని కోట్ల సంవత్సరాలు పట్టివుంటుంది. ప్రోటీన్ కణసంహతి (Protein-Molecule) నుంచి ఆదిలో ప్రాణం ఆవిర్భవించింది. అది యే అదృష్టముచేతనో పెరుగుదలకు, స్వయంప్రజననమునకు సంబంధించిన శక్తులను పెంపొందించుకొనివుంటుంది. ఇది జరిగిన అనంతరం ఆదిమప్రాణి పరిణమానికి ఉన్నత ప్రాణ్యుత్పత్తికి పూర్వరంగం ఏర్పడిపోయింది.

అయితే ప్రోటీన్‌ల కణసంహతినుంచి ప్రాణ్యావిర్భావం జరిగి ఉంటుందన్న ప్రతిపాదనను మొట్టమొదటిసారిగా ప్రపంచం ముందు ఉంచినవాడు హాకెల్ (Hackel). ఈయన, మరో జర్మన్ జీవశాస్త్రవేత్త ఫ్లూగర్ (Pfluger), ఇది ఇట్లా జరిగి వుండవచ్చునని అన్నారు. ఈలోగా సజీవకణములను సృష్టి చేయడానికి, వానిని ప్రదర్శించడానికి ప్రయత్నాలు ఆరంభమైనాయి. ట్రుయూల్ మొదలైనవారు ఇటువంటి ప్రయోగాల వెంట పడినవారిలో చెప్పుకోతగినవారు. ఆయన ఇటువంటి ప్రయోగం చేశారు. పొటాసియమ్ ఫెర్రో సైనైడ్ (Potassium Ferro—cynide) ను తీసుకొని, దానిని ఒక పరిమాణంలో నీటిలో కలిపారు. అట్లా దాని ద్రావకం తయారైనది. అప్పుడు అందులో ఆయన కాపర్‌సల్ఫేట్ పెల్లు ఒకటి వేశారు అట్లా ఆ పెల్లును అందులో వేసినప్పుడు, ఆ ద్రావకముపైన ఒక పొరవంటిది ఏర్పడింది. అది

కాపర్ ఫెర్రోసైనైడ్ (Copper Ferro cynide). ఈ కాపర్ ఫెర్రో సైనైడు నీళ్లలో కరిగే లక్షణం కలదికాదు. అయితే ద్రావకముపైన ఏర్పడిన పొర ఎట్లా ఉన్నదంటే అందులో వేసిన కాపర్ సల్ఫేట్‌చుట్టూ కొంతకు కొంతకు దారిని వదిలే పద్ధతిగల సంచిలాగా ఏర్పడివుంటుంది. ఇప్పుడు ఆ ద్రావకములో వేయబడిన కాపర్ సల్ఫేట్ క్రమ క్రమంగా కరుగుతూవున్నకొద్దీ ఆ ఏర్పడిన సంచిలో ఒత్తిడి అధికమై అది నీటి బుడగవలె పగిలిపోతుంది. ఈ ఒత్తిడి విచిత్రమైనది.దీనిని ఇంగ్లీషులో(Osnotic Pressure) అన్నారు. వేరు వేరు ద్రావకములు ఒక దానిలో ఒకటి ప్రవేశించునప్పుడు, మిశ్రమము చెందుతున్నప్పుడు, అందలి బెజ్జములు మూలమున యీ క్రియ జరుగుతుంది. అది జరుగుతున్నప్పుడు ఒత్తిడి సముద్భవం అవుతుంది. ఇప్పుడు ఇటువంటి ఒత్తిడి వలననే యీ ఏర్పడిన పొర చిట్లిపోయింది. ఇక కాపర్ సల్ఫేట్ ద్రావకము ఆ సంచివంటి పొరలో ఏర్పడిన చిల్లుల ద్వారమున బయటికి వస్తున్నకొద్దీ తిరిగి అటువంటి పొరలే ఏర్పడటము, చిట్లటము ఈవిధంగా జరుగుతుంది. ఈ ప్రయోగమును దృష్టాంతముగా ట్రయూల్ (Traule) ఆదిలో జీవకణము ఇదే విధంగా ఏర్పడివుంటుందని దార్ష్టాంతికము చేశారు.

మొట్టమొదట జీవద్రవ్యాలు పరమ అక్లిష్టముగా ఉండేవి. అవి ఎట్లా ఏర్పడినాయి? ఇప్పుడు ఇది ఎట్లా జరిగిందో నిర్ధారణ చెయ్యాలి. అంతేగాక ఏ పరిసరములు అనుకూలించడమువలన అట్లా జరిగిందో కూడా నిరూపించవలసివుంది కార్బన్, నైట్రోజన్, ఆక్సిజన్, హైడ్రోజన్ మొదలైన అక్లిష్ట ద్రవ్యాలు (Elements) ఎట్లా సమ్మిశ్రమము చెందడమువలన అదేవిధమైన సూక్ష్మ ప్రాణి సంహతులు, అనగా, కార్బోహైడ్రేట్లు(Carbo-Hydrotes) క్రొవ్వు పదార్థాలు, Amino-acid లు, ఎట్టకేలకు ప్రొటీనులు, ఆ ప్రోటీనులనుంచి ఇప్పటి జీవజాలములు నిర్మిలిని చెందాయి—ఇది అంతా ఎట్లా జరిగిందో కూడా ఇంకా విశదంగా తేలలేదు. ఇది పూర్తిగా తెలియాలి అంటే భూమిమీద సృష్టిక్రమం ఎట్లా ఆరంభమైంది, జీవ జగత్తు ఎట్లా ఉద్భవించింది, ఆ జగత్తు యొక్క అలవాట్లు, జీవిత పద్ధతులు ఎట్టివి, పరిసరములతో ఆ జగత్సంబంధము ఏమి లక్షణము కల్గింది—మొదలైన ప్రశ్నములకు సమాధానము ఏమో పరిశీలించాలి.

ఈ శాస్త్రాన్ని (Palacoecology) అంటున్నారు. (palaco) అనగా పురాతనము. (Ecology) అనగా జీవ ద్రవ్యములయొక్కగాని, జీవులయొక్కగాని నడవడిక, అలవాట్లు మొదలైనవానిని తెలుపుడుచేసే శాస్త్రము.

ఇంతవరకు శాస్త్ర ప్రక్రియలద్వారా తేలిన అంశాలు ఇట్లా ఉన్నాయి. జీవద్రవ్యాలు ఉన్నట్లు చెప్పడానికి తగిన ఆధారాలువున్న కాలం ఇప్పటికి దాదాపు 50—80 కోట్ల సంవత్సరాల వెనుకకు పోతుంది. అక్కడినుంచి ఇంకా ఎంతో వెనక్కుపోతే, అది దాదాపు 100 కోట్ల సంవత్సరాలు అయినా కావచ్చు. అంతకన్నా ఇంకా ఎక్కువ కాలమే కావచ్చు—కొంతవరకు జటిలమైన సజీవ మిశ్రణములు (organic compounds) ఏర్పడిన కాలం యొక్క చరిత్ర అవగతం కావచ్చు ఆ మిశ్రణములు కార్బన్, నైట్రోజన్, హైడ్రోజన్, ఆక్సిజన్‌లు సన్నిహితం కావడంవలన—కలియడమువలన ఏర్పడుతున్నది. ఈ ఏర్పడడానికికూడా కాలము, స్థలముకూడా కలిసిరావాలి. సరియైనకాలమున, సరియైన ప్రదేశమునందు మాత్రమే ఇది సంభవించి ఉంటుంది. అనగా ఈ మిశ్రణముల సంభూతికి అవసరమైన పరిస్థితులు పరిసరములు ఇక్కడ ఆ కాలమున యీ భూమండలమునందు ఉపలబ్ధములైనచో, అక్కడ అవి ఏర్పడివుంటాయి. ఇక్కడ గూడా ఏదీ స్పష్టంగా చెప్పడానికిలేదు. ఇట్లాగే జరిగింది అని అనడమునకుగాని, జరగలేదని అనడమునకుగాని ఆస్కారం లేని స్థితి ఇది. ఎప్పుడో ఒకప్పుడు ఇట్లా జరిగి ఉన్నదని మాత్రమే ఇక్కడ చెప్పడము సాధ్యము.

జీవకణ సంహతులను ప్రకృతిలో ఏర్పరించడం సాధ్యమా? 1808లో ఫ్రెడిరిక్ వోహ్లర్ కృత్రిమంగా ఉరియాను సృష్టించారు. ఇది సహజముగా జంతువుల అల్పాచమానములలో ఉంటుంది. దానిని దానిసహాయము లేకుండా, కృత్రిమము, శాస్త్రీయము, అయిన పద్ధతులలో సృష్టించి వోహ్లర్ ఒక్క విషయాన్ని రుజూ చేశారు జీవ కణ సంహతుల సృష్టికి ప్రాణిజాతము అవసరములేదు. ఇటీవల జరిగిన మరికొన్ని పరిశోధనలలో కూడా ఇది ఇట్లా అని నిరూపించబడింది. ఎస్. ఎల్. మిల్లర్ అన్న శాస్త్రవేత్త పరిశోధన చేసి aminoacid ల మిశ్రమాన్ని సృష్టి చేశాడు. ఆ మిశ్రణములో అన్ని రకాల ప్రోటీన్‌లలోను వుండే సాధారణ వస్తువులు గ్లైసైన్ (Glycine) ఎలనైన్ (alanine) లు వున్నాయి. అందువల్ల ప్రకృతిలో amino acid లు ఏర్పడవచ్చునని అంగీకరించవలసి ఉన్నది. పూర్వం అవి ఏర్పడి ఉండవచ్చునన్న విషయం కాదనలేము. అవి అట్లా ఒకసారి గనుక ఏర్పడినట్లయితే, అప్పుడు ప్రోటీన్‌లు రూపు దాల్చడం క్లిష్టమైన విషయముగాని, అసంభావ్యముకానికాదు. మానవుని శరీరంలో లక్ష రకముల ప్రోటీన్‌లు ఉన్నవని అంటున్నారు. వీనిలో కొన్ని కృచ్ఛ్ర రచనా విశేషకములు. పెద్దవి. భౌమికలలోవుండే Collagean రక్తములోవుండే hamoglobin కేశములయందుండే Hevatin కండరములలోవుండే Myosin లు ఇటువంటివి.

ఒకసారి ప్రోటీన్‌లోని కణ సంహతిని కృత్రిమంగా సమన్వయ పరచగల్గితే అప్పుడు కార్యభారం చాలావరకు తీరినట్లే చెప్పవచ్చు. ఏలన, ఇక అప్పుడు మిగిలేది—ప్రోటీనుల అభివృద్ధి, విభజనములను గూర్చి తెలుసుకొనడము మాత్రమే. ఇంతకీ ప్రోటీనులలోవున్న గొప్ప

విశేషం ఏమిటంటే, అవి ప్రాణశక్తికి వాహకాలుగా పని చేస్తాయి. అందుకు తగిన హంగులన్నీ ఆ ప్రొటీన్‌లలో ఉన్నాయి. అయితే ఇప్పుడు—ఇంత పరిశోధన జరిగిన అనంతరం—ఇంకో పెద్ద సమస్య ఎదురవుతున్నది. ప్రొటీన్ కణ సంహతులు—అనగా Protein molecule లు ఏర్పడిన అనంతరం అవి దీర్ఘ కాలం ఆవిధంగా ఉండగల్గాలి. అవి అట్లా ఉండక, అక్లిష్టమైన, సామాన్యమైన, వేరైన, కణసంహతులుగామారే అవకాశాలు ఇక్కడ అధికంగా ఉన్నాయి.

కార్బన్‌తో కూడిన జీవమిశ్రణములు (Organic Compounds) నిధనం చెందగల మార్గాలు రెండు ఉన్నాయి. ఒకటి అవి జీర్ణతను భజించి నాశనం కావడం; రెండు ఆక్సిజన్. ఇందులో జీర్ణత్వం అన్నది ప్రాణిజాతానికికాని తదితరమైన వానికి ఉండదు. ఇక ఆక్సిజన్ విషయం అంటే, అందుకు ఒక సంగతి చెబుతున్నారు. ఆదికాలంలో వాతావరణంలో ఆక్సిజన్‌గానీ, నైట్రోజన్ గానీ స్వతంత్రమైన వాయు దశా స్థితిలో వున్న జాడ కన్పించదు. అదీగాక ఈ వాయువులు కార్బన్‌తో కూడిన ద్రవ్యకణ సంహతి యొక్క క్రియా కలాపం ఫలితంగానే ఏర్పడినట్లు భావించబడుతున్నది.

పోతే, ఆక్సిజన్ అంటూ ఏమాత్రమున్నూలేని వాయువ స్థితిలో (Atmosphere) సమవాయమును చెందిన ప్రొటీన్ కణ సంహతులకు ఎటువంటి అపాయముగాని లేని స్థితి ఏర్పడి పోయింది. వాటికి జీర్ణదశ పట్టడముగాని, అవి ప్రవిలీయమును చెందడముగాని జరగలేదు అవి అట్లా దీర్ఘకాలం స్థితినికొని ఉండగల్గినాయి. వీనికి ఉద్భవస్థానము ఆదిలో సముద్రము అవడముచేత అవి అచ్చట వినూత్న మిశ్రణములకు ఆకరములై, తుట్టతుదకు ప్రాణావిర్భావ కారణము కాగల సరియైన ప్రొటీన్ మిశ్రణములుగా ఆవిర్భావం చెందిఉంటాయి. ప్రాణ్యుద్భవ పూర్వ దశా విశేషం యీవిధంగా కొనసాగివుంటుంది.

కణ సంహతులకు (Molecules) ఒక లక్షణం వుంది. అవి Colloid aggregate ల నిర్మాణానికి కారణం అవుతాయి. అవి అట్లా ఏర్పడటం ప్రారంభమైనప్పుడు వాటి ప్రవృత్తి విచిత్రంగా ఉంటుంది అది బహురకములైన, వేరువేరైన Aggregate లను నిర్మాణం చేస్తాయి. ఈ నిర్మాణం అనంతంగా సాగుతూ వుంటుంది. ఆ ప్రవృత్తి తృప్తి ఎరుగనిదిగా వుంటుంది. ఇట్లా తిరిగి బృహత్‌కణసంహతులుగూడా సమవాయము చెందుతూ వుంటాయి. ఇట్లా జరుగుతూ వుండటమువలన వానికి ఉపచయ స్థితిలేక వృద్ధి సన్నిధత్తం అవుతున్నది. ఒక కణ సంహతి(Molecule) ఇట్లా పరిమాణములో వృద్ధిని పొందినప్పుడు, అది Mechanical laws కు గురియై విచ్ఛిత్తి చెందుతుంది. అప్పుడు ఏకాత్మకమైన, ఏకవిధమైన, అసంకీర్ణము, అమిశ్రము, కేవలము శుద్ధమునైన విభజనము లేక పరికల్పనము జరుగుతుంది. ఆ పరికల్పనము (Division) నుండి ప్రజననము ఆరంభం అవుతున్నది.

ఇప్పుడు ఇక్కడ ఇంకో ప్రశ్న ఉత్పన్నము అవుతున్నది. పెద్ద పెద్ద కణ సంహతులు లేక Molecule లు ఏర్పడి, విభజనము చెంది, ప్రజనన క్రియా దక్షాలు అయినవిగదా! అవి ఇట్లా పరివర్తనముచెంది, జీవాధారములైన ద్రవ్య విశేషాలను ఆర్జనము చేసుకొనగల్గుటకు కారణమైన, అందుకు అవసరమైన సామర్థ్యాన్ని శక్తిని ఎచ్చటనుంచి పొందాయి? ఆదిలో జీవం లేక ప్రాణం అన్నది జీవ కణ సంహతుల సముద్రపు వేడియైన దట్టపు ద్రవ్యములో నుండి సముద్భవం చెందింది గనుక, యీ బృహత్ కణ సంహతి ఆ దట్టపు ద్రవ్యమునే భుజించి వృద్ధి చెందింది అని చెప్పవలసి వుంటుంది. ఇందుకు అంతఃక్షోభములేక ఉత్సేకము మార్గము. పద్ధతి. మధుద్రవ్యంమీద (Yeast) పనిచేసినప్పుడు, శక్తి ఉద్భవం అవుతున్నట్లు.

ఇంకో పద్ధతి (Photosynthesis) అనగా కిరణజన్య సంయోగ క్రియ ఇక్కడ సూర్యుని శక్తియే స్వయంగా పని చేస్తున్నది. ఇక్కడే Photosythesis ఆరంభం అవుతున్నది. అనగా ఎవరి భుజిక్రియకు వారే భోజన పదార్థమును చేసుకొనుట. వలయు నాహారమును ఇతరముగాగాక తనయందే సమకూర్చుకొనుట. ఇందువలన ప్రాణిజాతమునకు పూర్వము కూడబెట్టుకొనిన జీవత్ ద్రవ్య భుజిక్రియా విధి తప్పి పోతున్నది. అవి స్వతంత్రములుగా నుండుచుండ అట్టి సామర్థ్యము వానికి లభ్యమవుతున్నది. ఇట్టి శక్తి వానియందు నిలీనమైవున్న కారణముచేత అది Autotrophy లు మొదలైన జీవత్ ద్రవ్య మిశ్రమములను లేక సావయవ మిశ్రమ ద్రవ్యములను (Compounds) నిర్మాణం చేయగల్గుతున్నాయి. ఇందువల్లనే అనధీనము, అబద్ధము, ఆత్మతంత్రమునై ఆక్సిజన్ కూడా ఉద్భవించి వాతావరణం (Almosphere) లో, జలములో కలుస్తున్నది.

పదార్థ ప్రపంచంలో ఆక్సిజన్ ఉనికి కొంటున్నందువల్ల రెండు లాభాలు కల్గుతున్నాయి వాతావరణంలో చేరిన ఆక్సిజన్ Ozone గా కూడా పరివర్తనం చెందుతున్నది అందువల్ల ప్రాణిజాతానికి Ultraviolet Radiation వలన బాధ కల్గని స్థితి ఏర్పడుతుంది. ఈ Ozone ఇక్కడ ప్రాణిజాతానికి కనచముక్రింద పని చేస్తున్నది. అట్లా ఉపయోగపడుతున్నది. ఇది జరిగినప్పుడు ప్రాణిజాతం సముద్రంలోనుంచి భూమికి చేరగల్గుతున్నది. భూమిని చేరడానికి వానికి వీలు ఏర్పడుతున్నది.

ఆక్సిజన్ అంటూ ఉన్నందువలన ప్రాణిజాతం ఇంకోవిధమైన లాభాన్ని గడించుకోగల్గుతున్నది. ప్రాణిజాతానికి కావలయు శక్తిని అవి మరో విధముగా కూడా ఇప్పుడు పొందగల్గుతున్నాయి. ఉచ్ఛ్వాసక్రియ ఇప్పుడు ప్రాణిజాతానికి ఏర్పడుతున్నది. దీనిని Cold combustion Method అన్నారు. ఈ పద్ధతిని అనుసరించి 180 గ్రాముల మధుద్రవ్యము లేక పంచదార 7 లక్షల calory ల శక్తిని ఇస్తున్నది. ఇట్లాకాక ఉత్సేక పద్ధతిని (fermentation) అయితే 2 లక్షల Calory ల శక్తిమాత్రమే సముత్పన్నం అవుతుంది.

ఇట్లా యీ పద్ధతుల ప్రకారము ప్రాణిజాతము'(organism) అధిక శక్తిని, తనకు కావలసిన దానికన్నా మిక్కుటమైన శక్తిని సముపార్జనము చేసుకో గల్గుతున్నది. ఇందువలన ఎక్కువ ద్రవ్య జాతాన్ని అవి ఆహరించగల్గి, అభివృద్ధికి ఆవశ్యకమైన ఎక్కువ ద్రవ్య జాతమును సమకూర్చుకోగల్గుతున్నవి. Photosynthasis లేక కిరణజన్య సంయోగక్రియవలన ఆదిమ ప్రాణిజాతం బ్రతుకుమాత్రపు స్థితిని పొందగల్గాయి. ఉచ్ఛ్వాసమువలన వానికి అభివృద్ధికి వలయు పెట్టుబడి ఉపలబ్ధమైనది. ఈ పెట్టుబడిని వినియోగించుకొనే ఈ ఆదిమ పాణిజాతం క్రమ పరిణామం అనే మహా వ్యవహారాన్ని నడిపించుకున్నది.

సహజ ప్రాకృతిక పరిస్థితులలో మన యీ భూమిమీద ప్రాణ్యుత్పాదనం యీవిధంగా జరిగి ఉంటుంది.మన ఒక్క Galaxy లేక నక్షత్ర వీధిలోనే మన భూమివంటి గ్రహాలు ఒక లక్షదాకా ఉన్నాయంటున్నారు.మరి ఇటువంటి నక్షత్రవీధులులేకGalaxy లు కోట్లవరకు ఉన్నట్లు ఇప్పటికి శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. వీనిలో కొన్నింటిలో కూడా జీవజాలం అంటూ ఉంటే వుండివుండవచ్చు. ఆ ప్రాణులను మనం కలుసుకో గల్గాము అనుకోండి, లేదా రేడియో టెలిఫోను ద్వారా వారితో మాట్లాడగల్గాము అనుకోండి, అది అద్భుతాలలో అద్భుతము.

ప్రాణాన్ని లేక Life ను గురించి ఇప్పటికి దాదాపు 80, 90సంవత్సరాలక్రిందట ఫ్రెడరిక్ఎంగిల్స్ తన Anti-Duhring లో ఇట్లా వ్రాశారు.

"Life is the mode of existance of albuminous substances, and this mode of existance essentially consists in the constant self—renewal of the Chemical constituents of these substances."

ఇచ్చట albuminous substance అన్నమాట అధునాతన రసాయన శాస్త్ర పరిభాష ప్రకారము ఉపయోగించబడినదని, ఈ పరిభాషలో 'గ్రుడ్డు' లోని తెల్ల పదార్థమునందు గల సర్వ ద్రవ్యములు ఉండినట్లు అర్థము చేసుకో వలయునని ఎంగిల్స్ వ్రాశాడు. ఈ పదార్థాలను protein substances అని కూడా అంటారు. అయితే ఇక్కడ "White of the egg" ను ఉదహరించడం సరికాదని, అయితే albuminous పదార్థముల యొక్క రసాయనిక సంహతిని గురించి ఇంకా పూర్తిగా తెలియదు గనుక, సాధారణమైన ఉదాహరణక్రింద దీన్ని ప్రదర్శించానని గూడా ఆయన అన్నాడు.

"ప్రపంచంలో ఎక్కడ ప్రాణం వుంటే, ఎక్కడ ప్రాణిజాతం అన్నదివుంటే, అది విధిగా ఆల్బ్యుమిన్‌కాయంతో (albumin-body) సంపర్కంకలిగే ఉంటున్నది. ఎక్కడ ప్రవిలీయేతర స్థితియందువున్న ఆల్బ్యుమిన్ కాయం ఉన్నదో అక్కడ ప్రాణిజాతము గోచరం అవుతూవుంది. 'జీవి' అన్న దానిలో ఇంతకన్నను అధికతరమైన రసాయనిక సంహతుల, మిశ్రణముల ఉనికి అవసరం అవుతుంది. అయితే అచ్చమైన ప్రాణంయొక్క, నిరవయవమైన ప్రాణంయొక్క ఆవిర్భావానికి, ఉనికికి ఇంత అవసరంలేదు. దానికి యీ రసాయన సంహతులు ఆహారంగా అవుతూ, ఆల్బ్యుమిన్‌గా మారుతూవుంటే చాలు."

ఇంతచెప్పి చివరికి ఆయన ఇట్లా తేల్చాడు.

"Life, the mode of existance of albuminous substance, therefore consists primarily in the fact that each moment it is itself, and at the same time something else. And this does not take place as a result of process to which it is subjected from without; Life, the exchange of matter which takes place through nutrition and excretion is a self completing process which is inherent in and native to its bearer, albumen, without which it can not exist."

# పురాచరిత్ర: కొత్త దృక్పథం

శ్రీ హా. శి.

ఏదేశం చరిత్ర అయినా విచిత్రంగా ఉంటుంది. ఎందుకంటే అది బ్రహ్మ పదార్థం లాంటిది. దానికి ఎవరు ఎట్లా అర్థం చెప్పినా చెప్పవచ్చు. ఎట్లా భాష్యాలు వ్రాసినా వ్రాయవచ్చు. Statistics మోస్తరు. అయితే చరిత్ర కూడా Statistics లాగానే యదార్థ విషయాలతో కూడింది గనుక, ఈ సర్వమైన భాష్యాల వెనుకనున్నా, ఆ యదార్థాలు, లేక Facts నిల్చిఉంటాయి. వాటికి చెరుపు లేదు. ఉదాహరణకు— ఒక విషయం ఉంది. అలగ్జాండరు మన దేశంమీదకు దండు వచ్చాడు. ఆ వచ్చింది ఎప్పుడు, ఎవరి కాలంలో అన్న విషయంపై తగాదాలు నడపవచ్చు. అంతేగాని ఎప్పుడో ఒకప్పుడు అలగ్జాండరు మన దేశంమీద దాడీ నడిపాడు అన్న విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. అనడం కష్టం.

ఎందుచేత? చరిత్రలో అటువంటి ఆధారాలు ఉన్నాయి. భారతదేశంలో కన్పించిన కొన్ని కొన్ని శాసనాలలో అతని పేరు సంస్కృతీకరించబడో, ప్రాకృతీకరించబడో కనబడుతున్నది. అతని వెంట య్యా దాడిలో వచ్చినవారు కొన్ని గ్రంథాలు వ్రాశారు. ఇవి అన్నీ ఆ అలగ్జాండరు మన దేశం వచ్చి దాడి చేసి వెళ్లాడనటానికి ఆధారాలు.

అదేవిధంగా పురాతన చరిత్రకు సంబంధించి ప్రతిదేశం చరిత్రకు ఇటువంటి ఆధారాలే ఉన్నాయి. రాజులు, ఇంకా ఇతరులు వేసిన శాసనాలు, కవులు, తదితరులు వ్రాసిన గ్రంథాలు, ఆ రాజుల కాలంలో ఉపయోగింపబడిన నాణెములు—ఇట్లా గత చరిత్రను పునర్నిర్మించడానికి ఆధారాలు ఉన్నాయి.

ఆయా దేశాల గత చరిత్రలను తెలుసుకోడానికి మరికొన్ని ఆధారాలు కూడా ఉన్నాయి. ఒక దేశం నుంచి ఒక దేశానికి ఏదో ఒక కారణంచేత యాత్రలు సాగించినవారు వుంటారు. వారు తమ ఆ యాత్రలను గురించి గ్రంథాలు వ్రాశారు. అవి గూడా పురా చరిత్ర పునర్నిర్మితికి ఆధారాలే అవుతున్నాయి.

అయితే ఇటువంటి ఆధారాలవలన రాజుల చరిత్ర, దేశ విభాగాల చరిత్ర తెలుస్తుంది. పట్టణాల పేర్లు కూడా తెలియవచ్చు. కొన్ని సందర్భాలలో ప్రజల ఆచార వ్యవహారాలు కూడా తెలియడం సాధ్యం అవుతుంది. అంతేగాని, ఒక దేశం అంటూ ఏర్పడిన దగ్గర నుంచి ఆ దేశంలో ఏమి జరిగింది, ఆ ప్రజల అభివృద్ధి ఎట్లా కొనసాగింది, ఒక దేశంలో వివిధ తెగల, జాతుల ప్రజలు ఉన్నప్పుడు, వారు ఎట్లా ఏవిధంగా నడుచుకున్నారు, వారు వారికి అవసరమైన వస్తుచయాన్ని ఎట్లా సృష్టించుకున్నారు మొదలైన విషయాలు ఇటువంటి ఆధారాల వలన అట్టే తెలియవు. ఇందుకు వేరువేరు విజ్ఞాన శాఖల అభివృద్ధి ఆవశ్యకమైంది. ఆంత్రోపోలజీ, ఆర్కియాలజీ మొదలైన విజ్ఞాన శాఖలు ఈవిధంగా పెంపొందినవే. అందువల్ల వేదాలలోంచి, పురాణాలలోంచి, కట్టుకథలలోంచి చరిత్రను నిర్మిస్తామంటే అది సాధ్యమయ్యే పనికాదు. సాధ్యంకాగల దనుకొనడం కూడా భ్రమ.

ముఖ్యంగా శాసనాలు, పురాణాదికాలు, పూర్వులు వ్రాసిన చరిత్రాదికాలు ఉన్నాయంటే, వానిలో ఎంత విశ్వసించతగిందో, ఎంత కాదో తెలియదు. శాసనాలను బట్టి ఫలానా రాజు, ఫలానా కాలంలో ఉన్నాడని నిశ్చయింపవచ్చు. అంతేగాని, ఆ శాసనాలలో చెప్పిన అన్ని విషయాలు, ఇతరత్రా ఉన్న ఆధారముల చేత నిరూపణము లైనప్పుడుగాని నిజములని అనలేము. ప్రతి శాసనాన్ని ఆరాజు కొలువులోని ఏ ఆశ్రితుడో వ్రాస్తాడు. అన్నీ అతిశయోక్తులు. చిన్న రాజును గూడా చతుస్సముద్ర ముద్రిత ధరావలయాన్ని ఏలుతున్నట్లే శాసనకవి వ్రాస్తాడు. ఈ శాసనాలను బట్టి చూస్తే ప్రతి రాజు సజ్జనుడే. గొప్పవాడే. కాని ఒక రాజు చేసిన శాసనంలో ఇంకోరాజు న్యూనంగా వర్ణించడం కూడా ఉంటుంది. కొందరు రాజులు, తాము జయించిన రాజులచేత, తాము రథములు ఎక్కి తిరిగే వీధులను ఊడ్పిస్తూ, అది గొప్ప విషయంగా చెప్పుకున్నారు. మరి యీ యివతలి రాజుల శాసనాలలో ఆ రాజులను గూర్చిన దూషణ ఉంటుంది. మరి ఒకరాజు వేయించుకున్న శాసనంలో ఆ రాజు సాక్షాత్తు పరమేశ్వరుడే. ఇటువంటి కవిత్వాల్లోంచి యదార్థమైన చరిత్రను విడదీయటానికి చరిత్ర పరిశోధకులు డెటెక్టివ్‌లు చేసినంత పని చేయాలి.

మామూలుగా కాకతీయులను గురించిన చరిత్రల్లో కాకతిప్రోలుణ్ణి, అతని కొడుకు రుద్రుడు చంపాడని ఉంటుంది. కొందరు చరిత్రకారులకు ఇది ఎబ్బెట్టుగా తోచింది. అందుచేత ఒకానొక శాసనంలో "కాకతి ప్రోలాటవీ నిర్దహన" అన్నమాట ఉండటమును బట్టి కాకతిప్రోలుణ్ణి యుద్ధంలో అవతలి రాజులు చంపారుగాని, కొడుకు చంపలేదని చరిత్రకు భాష్యం చెప్పారు.

కాని ఆ మాటలను తీసుకునే ఇంకో భాష్యం చెప్పవచ్చు. ఇక్కడ ఉన్నది "కాకతి ప్రోలాటవీ నిర్దహన" అని గదా ! దీనికి కాకతి ప్రోలుని అడవులను దహించారని చెప్పవచ్చు. లేదా అరణ్యాన్ని పోలిన కాకతిప్రోలుని సైన్యాన్ని నిర్దహించారని చెప్పవచ్చు. ప్రోలుని సైన్యాన్ని అడవితో పోల్చా రనవచ్చు. ఇక్కడ ఉన్నది రూపకం. అప్పుడు గూడా సైన్యానికి పడుతుంది. కాకతిప్రోలుడనే అడవిని దహించారన్న అర్థంలో, అంత స్వారస్యం కన్పించదు.

ఇంతకీ ఏమిటంటే శాసన రచనలో గూడా ఇట్లా అలంకార ప్రియత్వం బలిసి, వాటి అడుగున చరిత్ర మునిగిపోయింది. దాన్ని పైకి తేల్చడానికి చారిత్రకులు నానా అవస్థలే గాక, వాచా యుద్ధాలు గూడా సాగించవలసి వచ్చింది. ఇంకా సాగిస్తున్నారు కూడా. ఇటువంటి యుద్ధాలలో రాజులు, యుద్ధాలు, శకాలు, సంవత్సరాలు గొడవలు తప్ప పైన చెప్పిన విధంగా ప్రజల చరిత్ర, ప్రజల అభివృద్ధియొక్క వికసనపు చరిత్ర తెలియవు. పూర్వము యీ శాసనాదికములు, లేక చరిత్రము లనబడే గ్రంథాలు వ్రాసిన వారికి ఇటువంటి ఇంగితమే లేదు. వారికి ఉన్నది రాజులు, యుద్ధములు. సంవత్సరములు, శకములు. అందువల్లనే కొన్ని కొన్ని సందర్భాలలో ఆ శాసనముల కన్నను, చరిత్రలనబడే గ్రంథములకన్నను, అవి ఆధారముగా వ్రాసిన గ్రంథములు మరియు కవిత్వములై భాసించడం జరుగుతోంది.

## 2

గ్రీకులు చరిత్రను ఒకవిధంగా శాస్త్రంగా భావించిన జాడలు కన్పిస్తాయి. హెరోడోటస్ ప్రభృతులు చరిత్రను సాహిత్యంగాను, కళగాను, శాస్త్రంగాను భావించారు. మనదేశంలో కల్హణుని రాజతరంగిణి మొదలైన కొన్ని గ్రంథాలు గూడా ఇట్టివే అనవచ్చునేమో ! పురాణములలో చరిత్ర విషయాలు వంశాను చరితం పేరను వర్ణితాలై ఉన్నాయి. కాని, వానిలో రాజుల పేర్లు, ఒకటి అర విషయాలు తప్ప వేరే విశేషం ఏమీ ఉండదు. అందువల్ల అవి వంశాను చరితాలుగానే మిగిలిపోయి వాయి కాని చరిత్రలు కాలేదు. మన దేశంలో కొందరు అవే చరిత్రలని, తక్కినవి కావని పిడివాదాలు చేసేవాళ్లు ఉన్నారు. ఇట్టివారికి ముఖ్యముగా పాశ్చాత్యులు వ్రాసిన మనదేశ చరిత్రలంటే గిట్టదు. నిజమునకు ఈ పాశ్చాత్య పరిశోధకులకు, చరిత్ర రచయితలకు ముందు మనకు సరియైన చరిత్ర గ్రంథమంటూ ఉన్నదా? శాసన పరిశోధనము, చరిత్రకు సంబంధించిన సిద్ధాంతములు ఉన్నవా ? ఇప్పుడు గూడా మన చారిత్రకులు చరిత్రకు సంబంధించిన అధ్యయన పరిశోధనములలో పాశ్చాత్యుల మార్గములను గాక నూతన మార్గముల ననుసరించుచున్నారా ? నూతనమైన ఆలోచనాధారను ప్రవహింపచు చున్నారా ? ఇది యంతము వేరు విషయము. ఇప్పుడు చెప్పవచ్చిన విషయ మేమనగా 19 వ శతాబ్దమున చరిత్ర యనెడి శాస్త్రమున నూతన అధ్యాయ మారంభమైనది. చరిత్ర పరిశీలనమే విప్లవాత్మకమైన పద్ధతిని అవలంబించినది. పరిశోధనకు వలయు సామగ్రి పుష్కలమైనది.. కొందరు తమ జీవితములకు జీవితములను చరిత్ర రచనను, శాస్త్రమును విస్పష్టము చేయుటకై ధారపోసిరి. భాషా చరిత్రము, లిపి చరిత్రము, వ్యవహారపత్ర పరిశీలనము ఉత్తీర్ణమైన మార్గములందు పడి చరిత్ర రచనమునకు గాఢతను, బాఢతను చేకూర్చినవి.

ఈ కాలమున జరిగిన గొప్ప పని యున్నది. మనకు అందని చరిత్ర ఎంతయో కాలగర్భమున లీనమై పోయినది. చారిత్రకులిప్పుడు దానిని పైకి నెత్తుచు వచ్చిరి. గతమును అవగతము చేసుకొనుటకు వలయు మార్గములను, సిద్ధాంతములను సిద్ధము చేసిరి. భూమినుంచి, గ్రంథముల నుండి, పత్రముల నుండి, రాతి కట్టడముల నుండి, రాళ్ల నుంచి చరిత్రను త్రవ్వి పోయుటకు వలయు సాధనములు కనుగొనబడినవి. ఈ కాలము ననే రాంకే (Ranke) ఉన్నత పరిశీలనా సూత్రములను ప్రపంచించుటయు జరిగినది. బూసో రచించిన "Histoire—universelle" ను 18 వ శతాబ్దంలో Voltaire సమాధానం వ్రాశాడు. ఇట్లా చరిత్రపై వాదోపవాదాలు తగాదాలు గూడా పెరిగాయి. ఇక్కడ పిడివాదానికి చోటులేదు. అంతా అన్వేషణమే. 19 వ శతాబ్దంలో హెగెల్, మార్క్స్ మొదలైన జర్మన్ మేధావులు చరిత్రకు భాష్యముల చెప్పుటలో కొత్త మార్గములను త్రొక్కిరి. హెగెల్ ఆత్మప్రత్యయ వాదాన్ని, మతాన్ని ఆధారం చేసుకుని చరిత్రను వ్యాఖ్యానించగా, మార్క్స్ సత్పదార్థ వాదాన్ని (Materialism), ద్వితీయ పురుషార్థాన్ని ఆధారంగా తీసుకొని చరిత్రకు భాష్యం చెప్పాడు. ఆ తర్వాత నుంచి ఈ రెండు మార్గాలు చరిత్రను వ్యాఖ్యానించే సందర్భాలలో, చరిత్రను నిర్మించే పద్ధతులలో అనుసంధితాలు అవుతూ వస్తున్నాయి.

## 3

వర్తమాన కాలం మేధావి వర్గాన్ని మార్క్సు ప్రభావితం చేసినట్లుగా మరి యే ప్రతిభావంతుడు ప్రభావితం చెయ్యలేక పోయాడు. అయితే మార్క్సుని కాదనడమో, లేకపోతే, అవు ననడమో, అదీ కాకపోతే ఆయన చెప్పిన దాంట్లో కూడా ఏదో ఉన్నదనడమో పద్ధతి అయిపోయింది. మార్క్సు అర్థ జగత్తుకే గాక, చరిత్రకు కూడా భాష్యం వ్రాశాడు. Materialist పద్ధతిలో చరిత్రను వ్యాఖ్యానించాడు. ఈ పద్ధతి చాలామంది

# K. ORR & COMPANY

## Indenting Agents, Importers & Paper Merchants

**16, STRINGERS STREET, MADRAS-1.**

*FROM STOCK:*
Paper, Printing Inks 'COATES'
Printers' Sundries,
"INSTA" Brand
Hand Numbering Machines
Adding Machine Rolls,
Teleprinter Paper Rolls and
other Paper and Allied Products,
Garage Equipments (Polish Make)

*INDENTS:*
Paper, Process Zinc &
Copper Sheets
Printing Machines,
Hardware,
Match Chemicals
Acrylic Plastic Sheets,
Stainless Steel
"K.G." Brand Zip Fasteners

**ALSO AVAILABLE**

POLYTHENE LAYFLAT TUBES, BAGS, SHEETS ETC.

PHONE 23019 & 23526

GRAMS: "PRESUNDRY"

---

We manufacture and supply layflat Polythene Tubing, Bags and Sheetings in any gauge and sizes at competitive prices.

★

*For your requirements, contact*

# R. K. INDUSTRIES

16, Stringers Street,

MADRAS-1.

Phone
Care · 23019 & 23526

మేధావులను ఆకర్షించింది. మన దేశంలో కూడా ఆ పద్ధతిని అనుసరించి పురాచరిత్ర పునర్నిర్మాణానికి పూనిక వహిస్తున్న చారిత్రకులు ఉన్నారు. వీరు పూర్తిగా మార్క్సు పద్ధతిని అనుసరించకపోవచ్చు. అనుసరిస్తున్నామని చెప్పకను కూడ పోవచ్చు. కాని మార్క్సు అనుసరించిన సిద్ధాంతాల ద్వారానే భారత పురాచరిత్రను వ్యాఖ్యానిస్తూ ఉండటం ఈ నవ్య విచారధారలో విద్యమానం అవుతున్నది. ఇటువంటి వారిలో శ్రీ డి. డి. కోశాంబి ఒకరు. పండిత రాహుల్ సాంకృత్యాయన్ మరి ఒకరు. సాంకృత్యాయనులు ఇటీవలనే చనిపోయారు.

ప్రొఫెసర్ కోశాంబి మన చరిత్రను పునర్నిర్మించడానికి అనుసరించిన పద్ధతులను గూర్చి పరిశీలన చేసేముందు చరిత్ర పద్ధతికి మార్క్సు, ఎంగిల్సులు దిద్దిన పద్ధతియేమో దిఙ్మాత్రంగా చూడవలసి ఉంటుంది.

చరిత్రకు వ్యాఖ్యానం చెప్పడంలో మార్క్సు, ఎంగిల్సులు కొంతవరకు మోర్గన్‌ను అనుసరించారు. మోర్గన్ అమెరికన్. ఆయన చాలాకాలం మిసిసిపి ప్రాంతంలో ఉన్న ఇండియన్ జాతి తెగలలో ఉండి, వారి ఆచార వ్యవహారాలను, జీవన పద్ధతులను పరిశీలించి పురా చరిత్రలో చిక్కువడకుండా ఉన్న కొన్ని సమస్యలకు పరిష్కారాలు సమకూర్చాడు. చరిత్ర పద్ధతికి అర్థాన్ని చేకూర్చాడు ఈ విషయాన్ని ఏంగిల్సు తన 'The origin of the family, private property and the state'అన్న గ్రంధములో ఇట్లా పేర్కొన్నాడు :

"Morgan was the first person with expert knowledge to attempt to introduce difinite order in to the prehistory of man; unless important additional matirial, necessiates alterations, his classification may be expected to remain in force."

ఈ మానవ చరిత్రలో ఆ ఆదికాలంలో మూడు ప్రధానమైన అధ్యాయాలు ఉన్నాయి—**Savagery, Barbarism, and Civilisation**—అని. ఇందులో మొదటి రెండు అధ్యాయాలనే మోర్గన్ ముఖ్యంగా ఎత్తుకున్నాడు. మూడవ అధ్యాయం అవతరణకు అయిన సంధికాలాన్ని కూడా ఆయన వివరించాడు. ఆయన విచార ధారను ఎంగిల్సు ఇట్లా వివరించాడు :

Of these main epochs, savagery, barbarisn, and civilisation, he is naturally concerned only with the first two, and with transition to the third. He subdivides each of these two epochs into a lower, middle and upper stage, according to the progress made in the production of the means of subsistence, for, he (Morgan) says "upon thier skill in this direction, the whole question of human supremacy on the earth depended."

ప్రపంచంలో ఉన్న అఖండ జీవరాశిలో మానవుడు ఒక్కడే ఆహారం ఉత్పత్తిని కొనసాగించడానికి సమర్థుడైనాడు. మానవునకే ఆ ఉత్పత్తిపై ఆధిపత్యము లేక కంట్రోలు లభించి ఉంది. మానవుని ప్రగతిలో యుగాలుగా, ముఖ్యమైన అధ్యాయాలుగా చెప్పదగినవి ఈ భోజనవస్తు జాతంయొక్క ఆధారాలను విస్తరించుకొనడంతో లగింపు పడి ఉంది.

ఈ సూత్రాన్ని మార్క్సు, ఎంగిల్సులు తాము చెప్పిన భాష్యానికి ఆధారం చేసుకున్నారు. ఆ తర్వాత వర్గాలు లేక Classes, పాలకవర్గము మొదలైన పదాల జాలం గూడా మార్క్సు, ఎంగిల్సుల వ్యాఖ్యానంలో కన్పిస్తుంది. బూర్జ్వా, ప్రోలిటారియట్ మొదలైన పదజాలం గూడా ఈ ఇద్దరి రచనలతోనే అధికంగా ప్రాచుర్యంలోనికి వచ్చాయి. ఇప్పుడు మన దేశం పురాచరిత్రను తన దృక్పథంతో పరిశీలన చేస్తున్న వారు మోర్గన్ చేత చెప్పబడి, మార్క్సు, ఎంగిల్సులచేత అనుసరింపబడిన చారిత్రక సిద్ధాంతాన్ని ప్రధానంగా అనుసరిస్తున్నారు. అట్టివారిలో ప్రొఫెసర్ డి. డి. కోశాంబి ఒకరు.

## 4

ప్రొఫెసర్ కోశాంబి "The Culture and Civilisation of Ancient India in the Historical Out-line" అన్న గ్రంధాన్ని వ్రాశారు. అందులో ఆయన చరిత్రాత్ పూర్వపు కాలం నుంచి భారతదేశంలో భూస్వామ్య వ్యవస్థ ఏర్పడబోతున్న సంధికాలం వరకు చరిత్రను వ్యాఖ్యానించారు. పురాణాలలోను, ఇంకా ఇతరమైన రచనలలోను మన దేశంలో చరిత్ర కలియుగాదిగా విభజించబడి ఉంది. కాలానికి గూడా ఆ పూర్వులు ఇదే విభాగాన్ని పట్టించారు. ఈ యుగాలలో కృతయుగం మొదటిది. తర్వాత ద్వాపరం, దాని తర్వాత... కలి—ఇట్లా ఈ యుగాలు ఉన్నాయి. ఇప్పుడు కలియుగం నడుస్తున్నది. ఈ యుగ విభాగంలో ఒక విచిత్రం ఉంది. మొదటి యుగం చాలా గొప్పది. అది సత్యయుగం. రానురాను తక్కిన యుగాలలో ధర్మం పల్చబడిపోతూ ఉంటుంది. మనుష్యులు పాపులై పోతూవుంటారు. ఇప్పుడు మనం అనుభవిస్తున్న కలియుగం వట్టి నాసిది. అనగా యిక్కడ ముందు ఏదో ధర్మం, గొప్పతనం ఉండి, రానురాను అది భ్రష్టమై పోతోంది. ఎందుచేత అంటే, అందుకు సరియైన సమాధానం కుదరదు పైగా ఇందులో ప్రపంచ దృష్టి లేదు.

ఈ ఆలోచనా పద్ధతిని నవ్య చారిత్రకులు ఒప్పుకోరు అది సహజం కూడాను. ఈ యుగ విభాగాన్ని నిర్ధారించి చెప్పేందుకు పురాణాది గ్రంధాలు తప్ప వేరే ఆధారాలు ఏవీ లేవు. పైగా ఆదిలో మానవునకు వీరు చెప్పే గొప్పతనం ఏమీ ఉండేందుకు వీలులేదు. మన దేశం చరిత్ర ఒక్కటే గాక, తక్కిన అన్ని

దేశాల చరిత్ర కూడా ఇందుకు విరుద్ధంగా ఉంది. మానవుడు పశుత్వదశ నుంచి అభ్యుదయం చెందుతూ వస్తున్నాడు. ఈ అభివృద్ధిని ఎట్లా సాధించుకుంటూ, ఎట్లా పేర్చుకుంటూ వచ్చాడన్నదే చరిత్రలో ఆదిమ భాగం అవుతున్నది. ఇచ్చటనే మోర్గన్ పరిశోధనలు ఉపకరిస్తున్నాయి.

ఇప్పుడు ప్రొఫెసర్ కోశాంబి కూడా యీ నవ్య చారిత్రక పద్ధతిలో చరిత్రను రచించారు. అయితే యీ పురా చరిత్రను ఆర్జవంతో పునర్నిర్మించాలి అంటే అనేక ప్రతిబంధకాలు ఎదురౌతున్నాయి. ఒకటి పైన వివరింపబడింది. ఈ కష్టంతోపాటు తక్కిన కష్టాలను శ్రీ కోశాంబియే ఇట్లా వివరించారు :

"At the outest we are faced with what appears to be an insuperable difficulty. India has virtually no historical records worth the name ... In India there is only Vague popular tradition, with very little documentation above the level of myth and legend. We cannot reconstruct anything like complete list of kings Sometimes whole dynasties have been forgotten What little left is so nebulous that virtually no dates can be determined for any Indian personalities till the Muslim period."

ఇటువంటి కష్టం ఉన్నందువల్లనే పాశ్చాత్యులు వ్రాసిన చరిత్రలలో విజేతలను గురించి, రాజులను గురించి మాత్రమే అధికంగా కన్పిస్తుంది. అసలు కొందరు యీ దేశానికి చరిత్ర అంటూ ఒకటి ఉన్నదా ? అని కూడా అన్నారు. అయితే యీ వాదాన్ని ప్రొఫెసర్ కోశాంబి ఆమోదించరు. "రోము, గ్రీసు చరిత్రలకు వలె స్పష్టమైన పురా చరిత్ర భారతదేశానికి సంబంధించినంతవరకు అంతుపట్టక పోవచ్చు. చరిత్ర అంటే ఏమిటి ? క్రూరులైన రాజులు, వారి యుద్ధాలు ఇవే చరిత్ర అయితే, అప్పుడు భారతదేశం చరిత్రను వ్రాయడం కష్టమే. అట్లుగాక ప్రజలకు భూమి దున్నుకునేందుకు నాగలి మొదలైన పరికరాలు ఉన్నాయా?—ఇట్లా ఆలోచిస్తే భారతదేశానికి చరిత్ర ఉంది." అన్నారు.

అందువల్లనే ప్రొఫెసర్ కోశాంబీ భారత పురా చరిత్రను పునర్నిర్మించడంలో కొత్త పద్ధతిని అనుసరించారు. ఆ పద్ధతిని ఆయన ఇట్లా నిర్వచించారు : "History is the prescutation in a chronological order of successive changes in the means of relations of production "

ఈ రకమైన నిర్వచనంలో ఉన్న ఉపయోగితను కూడా ఆయన యిట్లా పేర్కొన్నారు : "ఈ నిర్వచనంలో ఒక సౌలభ్యం వుంది. చరిత్రను చారిత్రక దశలవారీగా, ప్రకరణములవారీగా, వ్రాయవచ్చు. ఇక్కడ సంస్కృతి అన్న దానిని ఎత్నోగ్రాఫర్ దృష్టితో (మనుష్యులు వేరువేరు తెగలకు సంబంధించిన దృష్టితో) అవగాహన చేసుకోవలసి వుంటుంది. అప్పుడే దేశమునందున్న అందరి జనుల జీవిత పద్ధతియున్నూ విశదం అవుతుంది."

## 5

ఈ దృష్టితో శ్రీ కోశాంబీ పురాచరిత్రను నిర్మించారు. ఇక్కడ భారతదేశంలో వివిధ జాతులవారు వున్నారు. తెగలవారు వున్నారు. ఒక ప్రాంతం శీతోష్ణ పరిస్థితులకు ఇంకో ప్రాంతం శీతోష్ణ పరిస్థితులకు సంబంధం వుండదు. కట్టులో, బొట్టులో తేడాలు వున్నాయి. కొందరికి గోధుమలు ప్రధానమైన ఆహారమైతే కొందరికి వరిబియ్యం ఆహారం అవుతున్నది. ఇట్లా ఈదేశంలో ఎంతో వైవిధ్యం వుంది. అయినా ఇందులో ఏకత్వం లేకపోలేదు. అదే భారత చరిత్రలో వున్న విచిత్రం వేషభాషాదికాలలో ఎంత వైవిధ్యం వున్నదో, మతాలలోను అంతే. అయితే వీటిని బంధిస్తున్న సూత్రం వున్నది. ఈ విషయాన్ని ప్రొఫెసర్ కోశాంబీ తమ చరిత్ర మొదటి అధ్యాయంలోనే పేర్కొన్నారు.

అయితే యీ చరిత్ర ఎట్లా ప్రారంభమైంది? ఎట్లా అభ్యుదయ పథం త్రొక్కుతూ వచ్చింది. ఈ విషయాలు తేలవలసి వుంది. ఆ తేలిన దానికి సూత్రాన్ని అగించవలసి వుంది. ఇక్కడే శ్రీ కోశాంబీ మోర్గన్ సిద్ధాంతాన్ని మార్క్సు, ఎంగిల్సుల సిద్ధాంతాలను చేబట్టారు.

ఆదిలో మానవుడు ఎట్లా వున్నదీ చెప్పడానికి కొన్ని ఆధారాలు ఇప్పుడు వున్నాయి. పాత రాతియుగమని, కొత్త రాతియుగమని ఇట్లా మానవాభ్యుదయం కొన్ని దశలలో ఉత్తీర్ణతను పొందుతూ వచ్చింది. తర్వాత తర్వాత లోహ సాధనాలను జనం వాడుతూ వచ్చారు. జంతువులను వేటాడి క్రవ్యాదనవ్యాదన భోక్తలై సంచరించారు. తర్వాత తర్వాత వ్యవసాయం వచ్చింది. ఈ వ్యవసాయంతో పాటు భారతదేశంలో మానవుని సభ్యత ఆ పూర్వపు కాలము కన్నా ఒక మెట్టు పైకి ఎక్కింది.

తగిన సాక్ష్యాధారాలు లేకుండా వున్న చరిత్ర—అనగా చరిత్రాత్ పూర్వచరిత్ర Pre-History అన్ని దేశాలకు వుంది. భారతదేశానికీ వుంది. ఈ చరిత్రను తెలియడానికి అనేక పద్ధతులు ఉపయుక్తాలవుతున్నాయి. త్రవ్వకాలు, నాణెములు, శిల్పాలు, శాసనాలు—ఇట్లా. అయితే భారతదేశం ఈ చరిత్ర సంబంధమైన త్రవ్వకాల వలన త్రవ్వి పైకెత్త వలసిన చరిత్ర ఎంతో వుంది. మొహంజోదారో, హరప్పా నర్మదా లోయ మొదలైన ప్రాంతాలలో జరిగిన త్రవ్వకాలలో ఎన్నో విషయాలు బయటపడినాయి. ఇప్పుడు ఇక్కడ ఇది విషయంకాదు. విషయం ప్రొఫెసర్ కోశాంబీ యొక్క చారిత్రక దృక్పథం ఎటువంటిది? అని.

ఇప్పుడు భారతదేశంలో మనకు కులాలు కన్పిస్తున్నాయి. ఇవి ఇప్పటివి కాదు. ఎప్పుడో ఏర్పడ్డాయి. ఏర్పడిన కొంత కాలానికి

ఎప్పుడో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మొదలైనవి స్థిర పడ్డాయి. ఇప్పుడు క్షత్రియులన్నవారే అట్టే మంది కన్పించరు. ఈ కులాల సంగతి ఏమిటి? వీరిని బ్రహ్మ ఆపళంగా సృష్టించాడా. "బ్రాహ్మణోముఖ మాసేత్" మొదలైన వేదమంత్రాలలో వున్నట్లు బ్రాహ్మణుడు బ్రహ్మముఖంనుంచి క్షత్రియుడు బాహుల నుండి ఇట్లా జన్మించారా? ఇది Myth. దీనికి అర్థం ఎట్లా కుదర్చడం.

ప్రొఫెసర్ కోశాంబీ ఇట్లా వ్రాశారు.

"In theory there are only four castes... this theoritical system is roughly that of classes, where as the observed castes and sub-cates derive clearly from tribal groups of ethnic origin."

అందువల్లనే భారతదేశం పురాచరిత్ర సంగతి ఏమో తెలియాలి అంటే ఈ వివిధ జాతుల, తెగల వ్యవహారాలను పరిశీలన చేయవలసి వుంది. అంతే. పురాణ పరిశీలన వల్ల ఏమీ జరగదు. అదృష్టవశాత్తూ ఆ తెగలవారు ఇంకా దేశంలో మిగిలి వున్నారు. వాళ్ళ ఇంకా ఆహార సంచయన స్థితిలోనే వున్నారు. ఇది అడుగు తరగతి. అక్కడి నుంచి మెట్లుగా పైతరగతుల జనం కూడా ఇప్పుడు దేశంలో వున్నారు ముందు జంతువులను వేటాడి తిని బ్రతికిన జనం, అంతకన్నా తేలికయైన ఫలాదుల సంచయనమునకు, తర్వాత తర్వాత నాగలితో దుక్కిదున్ని వ్యవసాయం చేసుకోగల స్థితికి వచ్చారు. ఈ దేశంలో మానవుడు ఆదిమ స్థితి నుంచి మెట్టుమెట్టుగా పైకి వచ్చాడు. ఒకస్థితిలో యీ అభ్యున్నతి ఆగిపోయి ఆ వివిధ అభ్యుదయ దశా విశేషాలు ఇంకా మిగిలి వున్నాయి. ఎంత మిగిలినా అధిక ప్రజానీకం 'నాగలి వ్యవసాయం సభ్యతను' దాటిపోలేదు. ఇట్లా అని, దేశంలో అధునాతనమని చెప్పతగిన బూర్జువావర్గం ఏర్పడలేదని కాదు. అవర్గంకూడా ఏర్పడింది. అయితే ఇది సహజంగా పెంపొంద లేదని పరప్రమేయం వలన ఏర్పడిందని ప్రొఫెసర్ కోశాంబీ అంటారు. అసలు భారతదేశపు బూర్జువా పద్ధతి లక్షణమే అటువంటిదన్నారు. "The fact is that the entire bourgeoisie mode in India is a forced extraneous groweth."

## 6

భారతదేశం చరిత్రను ఎంత వెనుక నుంచీ సోపపత్తికంగా, చారిత్రకమైన ఆధారాలతో నిర్ణయించడానికి వీలు కల్గుతుందో చెప్పలేము. ఎందుచేతనంటే, ఆ పురాచరిత్ర ఇట్లావున్నదని చెప్పడానికి వున్న ఆధారాలు అల్పము. అయితే మొహంజదారో ప్రత్నకాల నాటి నుంచి ఒక ఆధారం లభించింది. ఆ త్రవ్వకాలలో కొన్ని కంకాళాలుకూడా బయటపడ్డాయి. వాటిని బట్టి అవి దీర్ఘశిరస్కము లైనవిగా వున్నాయి. ఈరకం మనుష్య జాతిని dolichocephalic ప్రజ అన్నారు. సర్ జాన్ మార్షల్ వీరు దక్షిణ ఆసియా, ఐరోపా ప్రాంతాలలోని పురామనుష్య జాతికి చెందినవారినిగా పరిగణించి వున్నారు. అయితే ఇతరమైన మార్గాల వలన కూడా యీ దేశంలో చారిత్రక సాక్ష్యాల రీత్యా మానవుడు మెసలినట్లు చెప్ప దగిన ఆదిమ కాలాన్ని నిర్ణయించవచ్చు. అయినా ఇక్కడ కూడా ఇతమిద్ధమన్న విధంగా కాలనిర్ణయం చేయడం కష్టమే. ఇప్పుడు పశ్చిమపాకిస్తాన్‌లో 'సోన్'లోయ వుంది. కొన్నిరకాల పరికరాలను చేసిన మనుష్యులు ఆ ప్రాంతంలో నివసించి వున్న ఆధారాలు లభించాయి. అయితే ఆ పరికరాలను చెయ్యడానికి ఉపయోగించిన పద్ధతి అత్యంత పురాతనమైనదని చెప్పడానికిలేదు. అంతకుముందు ఒక రకమైన పద్ధతి వుండేదిట. దీనిని రెండో పద్ధతి అనవచ్చునని శ్రీ కోశాంబీ అంటారు. ఈ పద్ధతి చెల్లిన కాలం క్రీస్తుకు పూర్వం 50 వేలు—100వేలు సంవత్సరాల నడిమి కాలం అయి వుండవచ్చునని కూడా ఆయన ఊహ.

ఇట్లా సవ్యమైన సాక్ష్యాధారాల ద్వారా చూస్తూ చరిత్రను నిర్మించుకుంటూ వస్తే మనం గొప్ప చెప్పుకునే కృతయుగాదిక చరిత్రలన్నీ వట్టి కల్పనలని తేలుతుంది. అవి అట్లా ఎందుకు కల్పన చేయబడినాయి అంటే, అది వేరే విషయం. కాని చరిత్ర అంటూ త్రవ్వబడి దాని యదార్థ స్వరూపం ఏమిటో, మానవ జాతి ఆదిమ స్థితినుండి ఉన్నతస్థితికి ఎట్లా నడుస్తున్నదో గమనించక,వేదాలలోనే ప్రపంచం ప్రారంభం అయినట్లు భావించడం ఎట్లా వుంటుందంటే, బ్రహ్మ నాల్గుముఖాలను తెరిచి పాడగా వేదాలు పుట్టాయని నమ్మడం లాగే వుంటుంది.

వేదాలు గొప్పవే కావచ్చు. కాని అవి ఈ దేశం చరిత్రలో ఒకానొక కాలము నాటి లేక కొన్ని కాలముల నాటి సంగతులను మాత్రమే చెబుతాయి. అవి గూడా అందులో చెప్పిన విషయాలను విడమరచి అర్థం చేసుకున్నప్పుడే సాధ్యం అవుతుంది. వేదంలో ఆదిమ వేదమైన ఋగ్వేదంలోనే ఋషులు ఇంద్రుడికి అయిన కాడికి సోమరసాన్ని పోస్తామని, తమకు సంపత్తిని ఇవ్వవలసిందని, తమ విరోధులను నాశనం చేయవలసిందని కోరడం వుంది.ఋగ్వేదం తొమ్మిదో మండలంలో ఇటువంటి మంత్రాలు చాలా వున్నాయి. ఇది మానవుని ఉన్నత స్థితిని చెబుతున్నదా? లేక Tribal mind ను వ్యక్తం చేస్తున్నదా? ఉన్నదానిపై ఏదో ఆరోపించి, అంతకన్నా ఔన్నత్యం లేదని భావించడం అధ్యారోపమే అవుతుంది. అది అసలు విషయంకాదు. అసలు విషయం తెలియాలంటే ఆ అధ్యారోపాన్ని పగలగొట్టాలి.అందుకు యీ పుర్వగంధాలను నూతన దృక్పథంతో వ్యాఖ్యానించాలి. అందులో చెప్పబడివున్న విషయాలను నిర్ధారించగల సాక్ష్యాలు దొరికినప్పుడు నమ్మాలి. అంతేగాని అందులో చెప్పిందే నాగరికత తక్కినకాదు అనడం ఆత్మవంచనమే అవుతుంది.

వేదాలలో అగ్ని, ఇంద్రుడు మొదలైన దేవతలు చాలామంది కన్పిస్తారు. పురాణాలలో కూడా ఇంద్రాది దేవతల ప్రసక్తివుంది.

వేదాలలోవున్న ఇంద్రునికి, పురాణాలలోవున్న ఇంద్రునికి ఏమన్నా సంబంధం ఉన్నదా? వేదాలలో కన్పించే ఇంద్రుడు అసలు నిజమైన మనిషే అయివుండి, తర్వాత తర్వాత వేదకాలపుజనముచేత దేవతగా భావించబడినాడేమో! ఇటువంటి సంగతులు ఇప్పుడు గూడా మన దేశంలో జరుగుతూనే ఉన్నాయి. కాని ఇట్లా వూహ చేయడం పాపంగా గణించేవారు మనదేశంలో ఉన్నారు. వేదంలో చెప్పిందే సత్యం; కావచ్చు. కాని ఆ చెప్పినది సత్యమని నిర్ధరించడం ఎట్లా?

ఆ పనినే అధునాతన పురాశాస్త్ర నిర్మాతలు చేస్తున్నారు. ఆ పురాచరిత్ర పునర్నిర్మాణం కావాలన్నా, లేక తదనంతరం నడిచిన చరిత్రకు అర్థం చెప్పాలన్నా, అంటే ఈదేశంలో మానవుడన్న జీవి తలఎత్తిన దగ్గరనుంచి అతని అభ్యుదయాభివృద్ధులు ఎట్లా కొనసాగాయి అన్న విషయాన్ని తేల్చాలన్నా, తత్తత్కాలములయందు ప్రచారమునందున్న ఉత్పత్తి సాధనములు, వస్తూత్పత్తిమార్గము, వస్తువినిమయ పద్ధతులు ఏమిటో, ఎట్లా ఉన్నవో పరిశీలించి, నిర్ధారించి ఇది ఇట్లా అని చెప్పడంకన్నా వేరుమార్గంలేదు. తక్కిన మార్గాలువున్నా అవి గౌణాలు మాత్రమే అవుతాయి. ఈ పద్ధతిలోనే శ్రీ కోశాంబి తన చరిత్ర రచించారు.

చరిత్రకుముందు చూపు ఉండాలిగాని వెనుక చూపు పనికిరాదు. అట్లా అని ఆ వెనక జరిగినదానిని కాదనలేము. ఎందుచేత? ఆ వెనుక జరిగిన దానినుండి వర్తమానము, యీ వర్తమానమునుండి భవిష్యత్తు ప్రవర్తిల్లుతున్నాయి. ఇవి ఎట్లా ప్రవర్తిల్లుతున్నవో చెప్పేది చరిత్ర. ఈ చరిత్ర ఎప్పుడు ఏక దేశ మాత్రంగా ఉండేందుకు వీలులేదు. అది బహుముఖీనమైనది. చరిత్రయొక్క యీ సర్వముఖముల ప్రవృత్తికిన్నీ, తత్తత్కాల వస్తూత్పత్తి వస్తు వినిమయ పద్ధతులకున్నూ సన్నిహితసంబంధం వుంది. ధర్మార్థ కామమోక్షములని అన్న ఆదిమ మానవుడు ఎవరోగాని, అతనికి యీ విషయం స్పష్టంగా తెలుసు. అయితే ఆ మాటలకు అధ్యారోపితమైన అర్థాలనుగాక సరియైన అర్థాలను చెప్పుకోవలసివుంటుంది. ఇచ్చట ధర్మమనగా social order అని అర్థం. అది అర్థ ఉత్పత్తికి పద్ధతి. అర్థము ఉన్నప్పుడే కామతృప్తి. అనగా వస్తుభోగము ఆర్థికశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే Satisfying the wants మనుష్యుని కోరికలు సమముగా తీరినప్పుడు బంధములేదు బంధములేని స్థితి మోక్షము. Emancipation. Liberation. ఇట్లా చెప్పుకుంటే పురుషార్థ విభక్తికి చక్కని అర్థం కుదురుతుంది.

చరిత్రను వ్యాఖ్యానించేప్పుడు ఇదే పద్ధతిలో వ్యాఖ్యానించాలి. Idealism పనికిరాదు. Materialist పద్ధతి ఒక్కటే చరిత్రకు సరియైన భాష్యాన్ని చెప్పడానికి సమర్థమైనదని శ్రీ కోశాంబి సిద్ధాంతం ఈ సిద్ధాంతం కూడా కొత్తదికాదు. పరమ ప్రాకృతమైన పరిస్థితులలోతప్ప, ప్రపంచ చరిత్ర అంతా వస్తూత్పత్తి, ఉత్పత్తి పద్ధతుల మధ్య సంబంధాలు, వస్తువుల వినిమయములేక Exchange వీనివలన జరిగింది. యుద్ధాలకు, విప్లవాలకు, ఉత్పాతాలకు ఇవే కారణం అవుతున్నాయి. అనగా ఏకాలమునందు ఏ రకమైన ఆర్థిక పద్ధతి చెల్లిఉన్నదో, ఏ విధమైన ఆర్థిక సంబంధములు చెల్లి ఉన్నవో, అవే ఆకాలమునకు సంబంధించిన సర్వమైన సభ్యతకు, విజ్ఞాన విశేషానికి, తాత్విక చింతనకు, కళలకు, ధర్మానుశాసనములకు ఆధారం అవుతున్నాయి. మను ధర్మం ఉన్నది. అది ఒక కాలమునాటి ధర్మము. అది ఎల్లకాలము చెల్లదు. ఎందుచేతననగా, చరిత్రలో ఏ కాలమున, ఏవిధమైన సమాజమును, ఏ విధమైన అర్థ పద్ధతిని శాసించడానికి ఆ అనుశాసనం చెప్పబడినదో, ఆ సమాజము, ఆ అర్థ పద్ధతి, ఇప్పుడులేవు. అందువలన అది ఇప్పుడు వట్టి పరిశోధనకు మాత్రము పనికివచ్చు గ్రంథం మాత్రమే అయిపోయింది..

అందుచేత నూతన ఆర్థిక పద్ధతులు ఏర్పడి, నూతన సమాజము పరిణతమవుతున్నప్పుడు, నూతన ధర్మములు అవసరం అవుతున్నాయి. అందువల్లనే ప్రపంచంలో ఎక్కడైనాసరే, ఒకానొక సమాజముయొక్క ఆర్థిక వ్యవస్థా స్వరూపమునుబట్టి ఆ సమాజమునకు సంబంధించి ఏర్పడిన సర్వమైన అధిధర్మాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది. మతము, తత్వశాస్త్రము, రాజకీయ వ్యవస్థలు, శిక్షాస్మృతులు, ఇంకా ఇతరమైన సర్వ భావ ప్రత్యయము ఆ సమాజ ధర్మాన్నిబట్టి ఏర్పడుతూ వుంటాయి.

వేదాంతాన్ని, దేవుణ్ణి జోడుచేసి చరిత్రను వ్యాఖ్యానిస్తామంటే కుదరదు. చరిత్రనుబట్టి దేముడు గూడా మారుతూ వుంటాడు. ఇది వేదాలలోనే కనిపిస్తుంది. ఋగ్వేదంలోవున్న ఇంద్రుడు, రాను రాను తక్కువవాడైపోయినాడు. ఆ ఇంద్రుడు పురాణకాలం సంప్రాప్తమైననాటికి వట్టిలంపటడు, పరతపోభంగకారి, పరస్త్రీలోలుడు అయిపోయినాడు. ముందు అంతగా ప్రసక్తుడుకాని విష్ణువు ఎక్కువవాడైపోయినాడు. ముందు బహూమంది దేవతల చింతనమువున్న పరిస్థితి "ఏకం విప్రా బహుధా వదంతి" అన్న పద్ధతి దగ్గరకు వచ్చింది ముందు ఈ దేవత లందరూ వేరు వేరుగా భావింపబడి ఉండకపోయినట్లయితే, ఈ మాటుకు అర్థమేలేదు. అనగా వేదకాలమునాటి వివిధ తెగలమధ్య ఏకాకారభావస్థితి అవసరమైనది గనుక, యీ "ఏకం విప్రా బహుధా వదంతి" అన్న ఆలోచనము అవసరమైనది. దీనినిబట్టే అరణ్య వ్యవస్థలో మార్పువచ్చినప్పుడు, రాజకీయ వ్యవస్థయందుసామాజిక వ్యవస్థయందు కూడా మార్పు పరిణమితము అవుతున్నది.

ఇట్లా అర్థం చెప్పుకోని పక్షంలో చరిత్రకు అర్థం కుదరదు. అది పిడివాదం అవుతుంది. పిడివాదం అనగా వితండవాదం. అభివృద్ధికి బంధము. తక్కిన అన్ని బంధాలకన్నను ఈ బంధము జాతి వికాసానికి ప్రతిబంధకారి.

ఇట్లా ఉత్పత్తి పద్ధతులను ఆధారంగా చేసుకొని, పురా చరిత్రను పునర్నిర్మించడం పద్ధతే అయినా, ఇక్కడ ఒక్క విషయాన్ని గమనించాలి పాశ్చాత్య చరిత్రకు ఈ పద్ధతిని అనుసరించి వ్యాఖ్యానం చెప్పినవారు ముందు primitive communism వున్నదని, ఆతర్వాత slave society ఏర్పడిందని, దాని తర్వాత భూస్వామ్య పద్ధతి సమాజధర్మం వచ్చిందని, దాని తర్వాత బూర్జువా పద్ధతి ఆర్థిక ధర్మం వచ్చిందని ఇట్లా చరిత్రకు ఒక విధమైన యుగ విభజన చేశారు ఈ రకమైన యుగ విభాగం భారతదేశ చరిత్రకు పడుతుందా? కొంతవరకు పడుతుంది. కొంతవరకు పట్టదు. ఆయా దేశాల చరిత్రగతే ఇందుకు కారణం. భారతదేశంలో primitive communism చెల్లినట్లు మార్క్స్ భావించాడు. పురాతన గ్రామ వ్యవస్థ అటువంటిదే నన్నాడు. నిజంకావచ్చు. కాకపోవచ్చు. ఒకవిధంగా చూస్తే ఆయన అన్న ఆ మాట నిజమే. కాని తక్కిన వస్తూత్పాదన పద్ధతుల తోడి సమాజ ధర్మాలు భారతదేశంలో చెల్లుతూవుంటే అక్కడ కూడా కొన్ని మినహాయింపులు చెప్పవలసివుంటుంది. ఈ విషయాన్ని శ్రీ కోశాంబి తమ Ancient India లో వివరించారు. ముఖ్యంగా ఐరోపాలో చెల్లిన slave society వంటిది భారతదేశంలో చెల్లలేదని నిరూపించారు. ఆయన ఇట్లా అన్నారు: "భారతదేశం చరిత్ర ఇటువంటి పిడి విభాగాలకు లొంగదు. ఎందుచేతనంటే, భారతదేశంలో అన్ని భాగాలు ఏకాకారంగా అభివృద్ధి చెందలేదు. చరిత్రగతిలో ప్రతి దశలోను ఏవో అధివ్యవస్థలు, ఏదో ఒక ప్రాంతంలో మిగిలిపోతూ వచ్చాయి. గడిచిన వస్తూత్పత్తి దశావరణం నుంచి నూతన దశలో ప్రవేశించినప్పుడు, ఆ పాత పద్ధతిని అంటిపెట్టుకొనివుండేవాళ్లు ఆ తర్వాత వచ్చిన నూతన దశలో గూడా ఉంటూనే వున్నారు. ముఖ్యంగా ఐరోపాలో చెల్లిన పద్ధతిలో పురా భారతదేశంలో బానిసల పద్ధతి చెల్లినట్లు చెప్పడానికి లేదు. కొంతమంది భారతీయులు ఆ కాలంలో స్వేచ్ఛ తక్కువైన వాళ్లు వున్నమాట నిజమే. కాని వస్తూత్పాదన సందర్భాలలో ఈ పద్ధతి అంత ప్రాముఖ్యాన్ని పొందింది ఎప్పుడూలేదు."

ఇదేవిధంగా ఐరోపీయ భూస్వామ్య పద్ధతి సమాజానికి, భారతదేశంలోని భూస్వామ్య పద్ధతి సమాజానికి తేడాలు ఉన్నాయి. భారతదేశం చరిత్రను పరిశీలన చేసేప్పుడు ఈ అన్ని విషయాలను కూడా అవగాహన చేసుకోవలసివుంటుంది. అట్లా చేయనిపక్షంలో చరిత్రకు సంబంధించిన యదార్థం బోధపడదు. గతాన్ని అర్థం చేసుకుంటేనేగాని వర్తమానం అర్థంకాదు. వర్తమానాన్ని పట్టించుకొనని పక్షంలో భవిష్యత్తుకు ఒకమార్గం అంటూ ఏర్పడదు. అందుచేత ప్రపంచ చరిత్రగతిని దృష్టిలో పెట్టుకొని ఏదేశం చరిత్రనైనా సంభావన చేయవలసివుంటుంది. కానిపక్షంలో ఆ ఆలోచన ఏకదేశస్థితి చేత బాధితం అవుతుంది.

అదేవిధంగా చరిత్ర పునర్నిర్మాణం చేస్తున్నప్పుడు వైయక్తిక ఇష్టానిష్టాలను ప్రాచుర్యానికి రానీయకూడదు. దేశం అందలి వృథాప్రేమతో చరిత్ర పరిశీలన విక్షేపం చెందేట్లు చేసుకోకూడదు. జాతి మత దేశాదికమైన దురభిమానాలతో, స్వీయ సంస్కృతి యందు వల్లమాలిన ప్రేమతో చారిత్రక విచారధారను కొనసాగనీయకూడదు. ఒకదేశంలో బహుమతాలు ఉన్నప్పుడు, ఆ మతాలు చరిత్రతో సంవలనం చెంది ఉన్నప్పుడు, చరిత్ర రచయిత తన అభిమానానికి వచ్చిన మతం దృష్టిని అవలంబించి, తక్కినవానిని తెగడకూడదు. ఒక దేశంలో ఒక మతం అంతరించి, ఇంకోమతం నిలిచివున్నప్పుడు, ఆ మతం అంతరించడానికి, కారణాలు ఏమిటో జాగ్రత్తగాఆలోచించవలసివుంటుంది. అట్లా ఆలోచిస్తే భారతదేశంలో బౌద్ధం క్షీణదశకు రావడానికి, దాదాపు అంతరించిపోవడానికి, ఇతర దేశాలకు ఎక్కడానికి కారణాలు ఏమిటో మనస్సుకు ఒదిగివస్తాయి. వస్తూత్పాదన పద్ధతుల సంబంధ విశేషాలే చరిత్రగతికి కారణం అయినప్పుడు మతం అన్నది కూడా ఆ సంబంధాల అధిస్వరూపమే అయినప్పుడు, ఒక మతం అంతరించడం, ఒకమతం నిల్చివుండటం మొదలైనవాటికి కూడా ఆ వస్తూత్పత్తి సంబంధాలకు సంబంధించిన విశేషాలే కారణాలు అవుతాయి. బౌద్ధం అంతరించడానికి విధిగా అదే కారణం కావాలి. అయితే ఈ విషయాన్ని శ్రీ కోశాంబీ ప్రభృతి ఆధునిక చరిత్రకారులెవ్వరూ సరిగ్గా వివరించలేదు.

---

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరి పరశివాభ్యాం నమః

# శ్రీ పరాభవ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్యసిద్ధాన్తినః ద్వితీయ పుత్రేణ సుబ్రహ్మణ్యశాస్త్రిణా ప్రణీతమ్


సహరచయితారౌ, తత్తనయౌ చినకృష్ణమూర్తిశాస్త్రీ, సుబ్రహ్మణ్యశాస్త్రీచ


నిస్సీమ నిశీహార్తండ చంద్రేంద్రోపేంద్ర వందిత। నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.

వేదమయీం నాదమయీం పరపదోద్యద్బిందుమయీం

మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## గమనిక

ఈ సంవత్సరమున రాజు, మంత్రియు గూడ బుధుడు సరసస్యన సముదాయమగు ౧౬ పీసములలో ౭ పీసముల పంట ఫలించును బలి రాముడు పశుపాలకుడు. మధ్య ప్రదేశ మందు సువృష్టి, గోవులకు ఆరోగ్యము కలిగినను క్షీర సమృద్ధి సామాన్యముగ నుండును రాత్రియందార్ద్రా ప్రవేశము. మూడుకుంచముల వర్షము వైశాఖ బ 30 శుక్రవారమున పాదాల్పగ్రాస (1/6) సూర్యగ్రహణము సంభవించును. చైత్ర శు ౨ (24—3—66) సరస్వతీ నదీ పుష్కర ప్రారంభము విజ శ్రావణ శు ౬ (21—8—66) యమునా నదీ పుష్కర ప్రవేశము. పౌష బ 30 (8—2—1967) మహోదయ పుణ్య కాలము సంభవించును. దేవ మాతృక భూముల కంటె నదీ మాతృక భూములే ఎక్కువ ఫలించును ఒకటవ పంట కంటె రెండవ పంటకే ఎక్కువ నిష్పత్తి కలుగును.



## మౌఢ్యములు

ఆషాఢ శు 3 మంగళవారం 21—6—1966 లగాయతు శ్రావణ శు ౧ మంగళవారము (19—7—66) వరకు గురుమౌఢ్యము భాద్రపద బ ౧౦ ఆదివారము (9—10—1966) లగాయతు కార్తీక బ ౧౩ శనివారము (10—12—1966) వరకు శుక్ర మౌఢ్యము.

| | |
|---|---|
| కల్యబ్దాః | ౫౦౬౭ |
| శాలివాహనశకః | ౧౮౮౮ |
| ఫసలీసన్ | ౧౩౭౫,౭౬ |
| హిజరీసన్ | ౧౩౮౫,౮౬ |
| క్రీస్తుశకము | 1966,67 |
| భారతస్వాతంత్ర్య శకము | 17,18 |


ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు-1.


## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగ విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్రప్రదేశ మధ్య భాగమునకు చూపబడినది. తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి భారతప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫారమ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు—అందు నాటికల్ ఆల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన వేధకాలయందు కనుగొనబడిన భూ కేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాదికము, గ్రహసంచారము ఇందు ప్రాధాన్యముగ చూపబడినవి ఈ తిథ్యాది గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకాశమున సరిపడుచున్నవి న్యాయముగ లోకము తెలుసుకొనుట కొరకు భేదమును గుర్తించగలందులకు పూర్వ పద్ధతి పంచాంగం కూడ ఇందు సంగ్రహముగ చూపబడినది. ఇందు చూపబడిన పూర్ణ శాస్త్రీయ పద్ధతియే శాస్త్రీయమని గ్రహించవలెనని మా విశ్వాసాభిప్రాయము ఇందు తిథ్యాది ఘటికలు, ఉదయాస్తమయములు, శుభముహూర్తములు, విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి ఇందు లగ్నాంత కాలములు, వివాహ గ్రహస్ఫుటములును చూపబడినవి దేశాంతర చక్రములును చూపబడినవి ఇందు వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేయుచున్నాము—గావున వైదికముగు మాసనామము గూడ యిచ్చుచున్నది. 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశవరకు లగ్న ప్రమాణములు ఇవ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమైయున్న ఈ పంచాంగమును గ్రహించి గౌరవ్యాభిమానముగా ఆదరించ గోరుచున్నాము.

